సాహిత్య

# ప్రస్థానం

వెల రూ. 40

అక్టోబర్ • నవంబర్ • డిసెంబర్ 2016

## స్వేచ్ఛా స్వరం

ప్రత్యేక సంచిక

సాహితీస్రవంతి

# 39.59 లక్షలు

## SARA'SWATI' NAMASTHUBHYAM

SARA'SWATI' దేవిలో SWATI వుంది.
సరస్వతీతనయ గనుకే 'సరస్వతీ మానసపుత్రిక స్వాతి' అయ్యింది
అక్షర తపస్సు నుంచి ఉద్భవించిన సాహితీ సరస్వతే స్వాతి
సరస్వతీదేవి చతుర్భుజాలలోని ఓ చేతిలో వుండే పుస్తకమే స్వాతి

'సీరియల్స్'ను పుష్పాలుగా, 'కథల'ను దీపతోరణంగా
'స్పెషల్ ఫీచర్స్' ధూపంగా, రెగ్యులర్ శీర్షికలలోని
'ఒక చిన్నమాట'ను నృత్యంగా, 'అనిల్'ని గీతంగా, 'సత్యాన్వేషణ' ఛత్రంగా
'వరఫలం' చామరంగా, 'అంతా రాజకీయమే' నైవేద్యంగా,
'కదిలే బొమ్మల కబుర్లు' తాంబూలంగా, 'ఫర్ U' నీరాజనంగా
'ఈ శీర్షిక మీదే' మంత్రపుష్పంగా, మిగిలిన 'సెక్స్ & సైకాలజీ', 'ఐ లవ్ మనీ',
'పర్సనల్ ఎజెండా', 'నేనెవరో తెలుసా!', 'చివరి రోజుల్లో' శీర్షికలతో
రాజోపచార దేవోపచార, భక్త్యోపచార, శక్త్యోపచారాలతో
సరస్వతీదేవిని మాసం మాసం వారం వారం పూజిస్తోంది 'స్వాతి'

'శీఘ్రం వినాశాయ మనోగతమంధకారమ్' అనేది సరస్వతీ ప్రార్థన.
స్వాతిని చదివితే మనసులోని అంధకారం సత్వరంగా మాయమవుతుందని
చెప్పడం మా అభ్యర్థన. సాహితీయజ్ఞంలో సరస్వతిని
ఉపాసించే మీరు స్వాతి పాఠకదేవుళ్ళు.

గత నాలుగు దశాబ్దాలకుపైగా స్వాతి సచిత్ర మాసపత్రిక
మూడు దశాబ్దాలకుపైగా స్వాతి సపరివార పత్రిక
నిరాఘాటంగా, అప్రతిహతంగా దూసుకువెళ్తున్నాయంటే
అందుకు కారణం సరస్వతీమాత కరుణా కటాక్ష వీక్షణాలు
ఆ దేవిని ఉపాసించే స్వాతి పాఠకదేవుళ్ళకు
శిరసు వంచి నమస్కరిస్తున్నాం.

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY AND MONTHLY





# మహాకవి జాషువా కళాపీఠం ప్రచురణ




ప్రతులకు:
మహాకవి జాషువ కళాపీఠం
3వ లైను, లక్ష్మీపురం, గుంటూరు
9440878871, 9848693298
ఇమెయిల్:sateeshnutakki@gmail.com

## వంద గొంతులు ఒక్కటై
## జాషువా కోసం



2015 సంవత్సరం జాషువ జయంతి వారోత్సవాన్ని 'వంద గొంతులు ఒక్కటై జాషువ కోసం' అనే కార్యక్రమంగా వంద మంది కవులతో కవి సమ్మేళనం, రోజుకో కావ్యంపై చర్చా కార్యక్రమాలు నిర్వహించాం. ఆ సందర్భాన మహాకవి జాషువాపై ఆయన సమకాలికులు, పెద్దలు తర్వాత తరాలవారు రాసిన కవిత్వాన్ని ఒక కవితా సంకలనంగా తీసు కురావాలని నిర్ణయించుకున్నాం. ఆ ప్రయత్నంలో భాగంగా అప్పటి నుండి ఇప్పటివరకు జాషువాపై రాసిన పద్యాల్ని, వచన కవితల్ని సేకరించాం. ఇప్పటికి వంద మంది కవుల కవితలతో జాషువ మహాకవికి నీరాజనాలు పలుకుతున్నాం.

– డొక్కా మాణిక్యవరప్రసాద్
అధ్యక్షులు, మహాకవి జాషువ కళాపీఠం

సాహిత్య

# ప్రస్థానం

అక్టోబర్ * నవంబర్ * డిసెంబర్ 2016

## స్వేచ్ఛా స్వరం ప్రత్యేక సంచికలో...

### వర్తమానం



### మేధాస్వరం



### నిషేధ చరిత్ర

సాహిత్య ప్రస్థానం

సంపుటి : 15 అక్టోబర్ • నవంబర్ • డిసెంబర్ 2016 ప్రత్యేక సంచిక సంచిక : 10

సంపాదకీయం



# పాడుదమా స్వేచ్ఛా గీతం!

**స్వేచ్ఛ!** స్వతస్సిద్ధంగా ప్రకృతిలో ప్రతి ప్రాణికీ ప్రతి మనిషికీ వుండే సహజమైన హక్కు అవసరం. స్వాతంత్రం లేనిదే స్వేచ్ఛ వుండదు. స్వేచ్ఛ లేని స్వాతంత్రానికి అర్థమూ వుండదు. మానవాళి చరిత్ర పొడుగునా స్వేచ్ఛా స్వాంతంత్రాల కోసం పోరాడుతూనే వుంది. ఇందుకు పూర్తి భిన్నంగా మరోవైపు నుంచి సామాజిక, ఆర్థిక, రాజకీయ అసమానతలు మరొకరి స్వేచ్ఛను అపహరించడానికి అణిచివేయడానికి కారణమవుతుంటాయి. కనుకనే స్వేచ్ఛను రెండు రకాలుగా నిర్వచిస్తుంటారు. అనుకూల స్వేచ్ఛ, ప్రతికూల స్వేచ్ఛ అని. అంటే ఎవరి స్వతంత్రం వారు కాపాడుకోవడానికి వుండే స్వేచ్ఛ వొకటి. స్వేచ్ఛా స్వాతంత్రాల పేరుతోనే ఇతరుల హక్కులకు ఎసరు పెట్టడం కాలరాయడం మరొకటి. సమత వున్న చోట ఒకరి స్వేచ్ఛ మరొకరికి ఆటంకం కాదు. అలాటి పరిస్థితి వచ్చిందంటే ఆ మాటకు అర్థమే లేదు. స్వేచ్ఛలోనూ అనేక కోణాలు. స్వతంత్ర భావాలు కలిగివుండటం ప్రకటించడం, ప్రసారం చేసుకోవడం, కళా సాహిత్య సృజన చేయడం, సత్యాన్వేషణ, నమ్మిన సత్యాన్ని చాటడం, తన హక్కుల కోసం న్యాయం కోసం పోరాడటం ఇవన్నీ నిజమైన స్వేచ్ఛకు మార్గాలు. ఈ తరహా స్వేచ్ఛ కుల మత ఆర్థిక జాతి వివక్షతలకు, విభేదాలకు అతీతంగా వుండాలి. ఒకరు శాసించడం మరొకరు పాటించడంగా వుండదు. ఒకరికి నచ్చనంత మాత్రాన గొంతుమీద కత్తిపెడతామని, ప్రాణాలు తీసుకుంటామని స్వైర విహారం చేయడం స్వేచ్ఛ అనే భావనకే విరుద్ధం. దురదృష్టవశాత్తూ ఏడు పదుల స్వాతంత్రం తర్వాత మనం చూస్తున్నదదే. ఎవరు ఎలా వుండాలి? ఏం చేయాలి? ఏం కట్టుకోవాలి? ఏం మాట్లాడాలి? ఏం రాయాలి? ఏ బొమ్మ గీయాలి? ఏ చిత్రం తీయాలి? ఇలా ప్రతిదీ శాసిస్తామంటున్నారు. తమకు తల వంచకపోతే తెగనరుకుతామంటున్నారు. కొందరు మేధావులను, నాయకులను, అమాయకులనూ అలా నరికేశారు కూడా. ఈ తాకిడికి రచయితలూ, కళాకారులు, మేధావులు, నటులూ, దర్శకులూ, హేతువాదులూ, పాత్రికేయులూ, పరిశోధకులూ, మహిళలూ, విద్యార్థులు ఒకరేమిటి స్వంత ఆలోచనా శక్తి, భిన్న దృక్పథాలు గలవారంతా గురి కావలసిన స్థితి. దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్న గురజాడ అప్పారావు మాట తలకిందులై దేశమంటే ద్వేషమోయ్ అన్న దనుజ నీతి చలామణిలోకి వచ్చిన భయానక ఘట్టం నడుస్తున్నది. ఫలితంగా భారత దేశంలోని అన్ని భాషలలోకి అసహనం అనే పదం కొత్త అర్థంతో ప్రవేశించింది. ఈ అసహనం, ఈ అమానుష న్యాయం ప్రజాస్వామ్య ప్రాథమిక సూత్రాలకే విరుద్ధమైంది. మన

## సంపాదకీయం

నాగరిక చరిత్రకే మచ్చ తెచ్చేది. రాజ్యాంగ ధర్మాలనూ నిబంధనలనూ కాలరాచేది. మానవీయ విలువలనే మంటగలిపేది. ఈ ప్రత్యేక సంచిక ప్రచురిస్తున్న నేపథ్యం ఇది.

జలియన్‌వాలాబాగ్ ఘటనకు నిరసనగా తెల్లవారిచ్చిన బిరుదును వారి మొహాన కొట్టిన రవీంద్రనాథ్ టాగోర్ భయాందోళనలూ, సంకుచిత దృక్కులు లేని స్వర్గసీమను స్వప్నించాడు. స్వాతంత్ర్యం మా జన్మహక్కు అన్నది స్వాతంత్ర్యపోరాట కాలంలో తిలక్ మహాశయుడి ఉద్యమ గర్జన, భగత్ సింగ్ శపథమూ అదే. వందేమాతరంతో మొదలు పెట్టి అన్ని కీలక చారిత్రిక పోరాటాలలోనూ ముందు నిలిచిన తెలుగు జాతి ప్రతిధ్వనించిన నినాదమూ అదే. భరత ఖండంబు చక్కని పాడియావు అని ఎలుగెత్తిన చిలకమర్తి, మాకొద్దీ తెల్లదొరతనమూ అని గరిమెళ్ల, తక్కెళ్ల జగ్గడి పాటతో తొలిరోజుల్లోనే సమధర్మం చాటిన మాలపల్లి కర్త ఉన్నవ లక్ష్మీనారాయణ, స్వప్న సందేశకర్త, అంతర్జాతీయ సాహిత్యాన్ని సైద్ధాంతిక గ్రంథాలను తెలుగీకరించి వెలుగులు పంచిన మహీధరసోదరులు, క్రొవ్విడి లింగరాజులూ, నిజాం నిరంకుశత్వంపై నిప్పులు చెరిగిన ప్రజాకవులూ, ఇది మా భూమి అని చాటిన అభ్యుదయ రచయితలూ, నిజాం నిరంకుశత్వంపై నిప్పులు చెరిగిన ప్రజాకవులూ, ఒకవీరుడు మరణిస్తే ప్రభవింతురు వేలమంది అని ఉత్తేజ పరిచిన సోమసుందర్‌లూ ఇలా చెబుతూ పోతే పరాయి పాలకులను పదునైన రచనలతో నిలదీసిన వారసత్వం మనది. దానికి ఆగ్రహించిన తెల్లదొరలు నిషేధాస్త్రాలు సంధించినా, నిర్బంధాల పాలుచేసినా వెనుకంజ వేయని ధీరోదాత్త వారసత్వం మనది. స్వాతంత్రానంతరం కూడా పాలకులకు సవాలుగా మారిన రచనలను, విప్లవ భావాలను వివిధ రూపాల్లో వేటాడితే, వేధిస్తే ఎదిరించి పోరాడిన సమరశీలత మనది. అంతర్జాతీయంగానూ సాల్మన్ రష్దీ, తస్లీమా నస్రీన్ వంటి వారిని మత ఛాందసం వెంటాడితే అండనిచ్చిన ఔన్నత్యం మనది. కాని వీటన్నటి మధ్యనా పాలకులు ఆయా సందర్భాల్లో కొన్ని రకాల నిషేధాలు ఆంక్షలు విధించితే ఎప్పటికప్పుడు వ్యతిరేకించిన వరవడి మన సాహిత్యలోకానిది. పలు సందర్భాల్లో న్యాయస్థానాలు, న్యాయమూర్తులూ కూడా రాజ్యాంగ పరంగానే వీటిని కొట్టి వేసిన ఉదంతాలున్నాయి. ఈ ప్రత్యేక సంచికలో అలాటి సమాచారం చాలా వుంది గనక ఇక్కడ మళ్లీ పునరావృతి అవసరం లేదు. ఇది కేవలం పునరుద్ఘాటనకే. ప్రజాస్వామ్యాన్ని కాలరాచిన అత్యవసర పరిస్థితినీ, లౌకిక తత్వానికి చేటుగా మారిన మతతత్వ విజృంభణనూ కూడా మన ప్రజలు చాలా సార్లు తోసిపుచ్చారు. పత్రికల పీకనొక్కే చట్టాలను ఎప్పుడూ సాగనివ్వలేదు. ఇటీవల తెలుగురాష్ట్రాలలో ఛానల్లపై ఆంక్షలనూ ఆమోదించలేదు. అయినా ఆ ధోరణులు మరల మరల దాడి చేస్తుంటాయి. ఆ శక్తులు అనేక రూపాల్లో ముందుకువస్తూనే వుంటాయి. ఇదొక నిరంతర పోరాటం. నిరంతర అప్రమత్తతే స్వాతంత్రానికి మూలం అన్న మాట మనకు శిరోధార్యం. సోషలిస్టు దేశాలలోనూ రచయితలపై కొన్ని ఆంక్షలు పెట్టినా ఆ సందర్భం వేరు. అయినా క్రమానుగతంగా ప్రజాస్వామ్య హక్కులను విస్తరించడంలో వైఫల్యం కాదనలేనిది. సోవియట్ విచ్ఛిన్నం తర్వాత ఆ పాఠాలన్నిటిపై చర్చ జరుగుతూనే వుంది. ఏమైనా దేశదేశాలపై దురాక్రమణలు చేస్తూ, ఆర్థిక రాజకీయ సైనిక ఆధిపత్యం

సంపాదకీయం

రుద్దే సామ్రాజ్యవాద అమెరికా వంటి వాటికి ఆ విషయమై విమర్శ చేసే అర్హత ఏ కోశాన లేదు. రోజెన్‌బర్గ్‌ల దంపతులకు కేవలం వారి అభిప్రాయాల కారణంగా ప్రాణాలు బలిగొనడమే కాదు. హాలివుడ్‌లోనూ, మీడియాలోనూ కూడా ప్రగతిశీల భావాలు గలవారి జాబితాలు తయారు చేసి వేటాడిన చరిత్ర వారిది. ఆఫ్రికా ఖండంలో కవులకు ఉరిశిక్షలు వేసిన క్రౌర్యం శ్వేతజాతి వివక్షా పాలకులది. నిజానికి దేశంలో ఇలాటి ధోరణి పెరగడంతో పాటే ఆమెరికాతో మన బ్రహ్మముడి బలపడటం యాదృచ్ఛికం కాదు. అక్కడి లాగే ఇక్కడా దేశభక్తి జాతీయత వంటివాటికి వింత నిర్వచనాలు పుట్టుకురావడం కూడా చూస్తున్నాం.

గోవింద పన్సారే, కల్బుర్గి వంటి వారి హత్యలతో మొదలై గోరక్షణ పేరిట హత్యల వరకూ వెళ్లి.. హెచ్‌సియు నుంచి జెఎన్‌యూ వరకూ విశ్వ విద్యాలయాలను వివాదాలయాలుగా మార్చిన సమకాలీన ఘటనల వెనక ఒక భావజాలం వుంది. ఒక రాజకీయ సైద్ధాంతిక సంస్థాగత వ్యవస్థ వుంది. ఆరెస్సెస్ ప్రచారక్‌గా ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ ప్రధాని అయ్యాకనే ఇవన్నీ పరంపరంగా జరగడం వెనక కాదనలేని తర్కం వుంది. పైన పేర్కొన్న స్వాతంత్ర పోరాటంలో గాని, ప్రజాస్వామిక ఉద్యమాలలో గాని ఏ పాత్రా లేని మితవాద, మతవాద భావజాలం మూర్తీభవించిన సంస్థ ఆరెస్సెస్. మన దేశం పట్ల, చరిత్ర పట్ల వారి దృక్పథమే విద్వేషమైంది. వినాశకరమైంది. హిట్లర్ యూదుల పట్ల వ్యవహరించినట్టే మనం మన దేశంలో అల్పసంఖ్యాకుల పట్ల వ్యవహరించాలని పిలుపునిచ్చిన వ్యక్తి వారికి ప్రేరణ. జాతీయోద్యమంలో ఏనాడూ వినిపించని, హిందూ మతంతో ఏ సంబంధం లేని రాజకీయపూరిత హిందూత్వ సిద్ధాంతం వారి విధానం. ఇందులో దాపరికమేమీ లేదు. వారు దాన్ని కాదన్నదీ లేదు. గాంధీజీని స్వచ్ఛ భారత్‌కోసం ప్రచారచిహ్నంగా వాడుకుంటూనే ఆయనను చంపిన గాడ్సేను దేశభక్తుడుగా కీర్తించడం వారికే సాధ్యం. హిందూత్వం మతం కాదు జీవన విధానమని వితండ వాదన చేస్తూనే మత ఉద్రిక్తతలు రగిలించడం వారి వ్యూహం. ఇది రాజకీయ చర్చ కాదు గనక మరీ వివరాల్లోకి పోవడం లేదుగాని ఆ పూర్వాపరాలన్నీ ఈ సంచికలో వున్నాయి. మాటవరసకు లాంఛనంగా లౌకికతత్వం మతసామరస్యం అనడం కాదు, భిన్నమతాలకు విశ్వాసాలకు నిలయమైన ఈ దేశపు అసలైన రూపాన్ని అర్థం చేసుకోలేనివారు, అర్థమైనా కానట్టు నటిస్తూ అగ్గి రాజేసేవాళ్లు ఎన్నటికీ ఈ దేశపు సుసంపన్న సంస్కృతికి వారసులు కారు. వేల ఏళ్లకు పూర్వమే శుష్కవేదాంతాలను ప్రశ్నించిన చార్వాకులు, లోకాయతుల వంటి వారికి జన్మనిచ్చిన దేశం ఇది. ఈనాటికి ప్రపంచమంతటా ప్రసరించిన బౌద్ధధర్మానికి పట్టుకొమ్మయిన నేల ఇది. ఈనాటి అనేక హైందవ విశ్వాసాలు, ఆశ్రమాలు పుట్టకముందే జెసూట్ ఫాదరీలనూ, పారశీక విద్వాంసులను, మహమ్మదీయ సంప్రదాయాలను స్వాగతించిన చరిత్ర మనది. ప్రపంచంలోకెల్లా ముస్లిముల సంఖ్యలో రెండవ స్థానమున్న ఈ దేశం భిన్నమతాలకు నిలయం తప్ప ఏక శిలా సదృశమైన మతైక దేశం కాదు. మత యుద్ధాల మాటే ఎరుగని దేశం ఇది. పల్లెపట్టుల్లో మతాల తేడా లేకుండా కలసి మెలసి బతికిన సహన సంప్రదాయాలున్న గడ్డ. కుల వివక్షలను, మూఢనమ్మకాలను చీల్చిచెండాడిన

సంపాదకీయం

వేమన్న వీరబ్రహ్మం వంటివారు ఈ గడ్డ కన్న బిడ్డలు. కబీరు సూక్తులూ ఆ కోవలోవే. భిన్నశాఖల విశ్వాసాల ఘర్షణలో రక్తసిక్తమైన గతాన్ని పునరావృతం కానివ్వరాదన్న వివేకానందుడి హితవచనాలూ విశ్వవ్యాపితమైనాయి. అలాటి చోట విద్వేషం రాజ్యమేలడం, విచ్చుకత్తులు విర్రవీగడం ఈ మహత్తర వారసత్వానికే కళంకం. వైవిధ్యానికి మారుపేరైన ఈ దేశ చరిత్రకే అది చీకటి ఘట్టం. ఎవరెంత పెనుగులాడినా ఈ దేశంపైన ఏకరూప శాసనాన్ని రుద్దడం, స్వేచ్ఛాస్వరాలను నొక్కి పట్టడం జరిగే పని కాదు. అయితే అలాటి ప్రయత్నాల పట్ల ఉపేక్ష కూడా ప్రమాదం. వాటిని నిర్ద్వంద్వంగా ఖండించాలి. నిస్సంకోచంగా ఎదిరించాలి. నిశితంగా విమర్శించాలి. నికరంగా పోరాడాలి. ఈ స్వేచ్ఛాస్వరం కూడా ఆ పోరాటంలో ఒక భాగమే. ఆది కాలం నుంచి తాజా పరిణామాల వరకూ రేఖా మాత్రంగా స్పృశిస్తూ అవగాహన ఇవ్వడానికి జరిగిన ప్రయత్నం. ఇందుకోసం మా మనవి మన్నించి ప్రముఖ రచయితలు రాసిన విలువైన వ్యాసాలతో పాటు, జాతీయ అంతర్జాతీయ మేధావులు, వివిధ రంగాల నిపుణుల రచనలు, పుస్తక భాగాలు కూడా ఇవ్వడం అందుకు దోహదం అవుతుందని మా విశ్వాసం. ఇది సర్వ సమగ్రం కాదు, సమస్య విస్తృతిని బట్టి అది సాధ్యమూ కాదు. ప్రామాణికగ్రంధాల నుంచి తీసుకున్న భాగాలు కూడా వున్నాయి. ఇందుకు సహకరించిన వారందరికీ మా కృతజ్ఞతలు. మా కృషికి ఆర్థికంగా తోడ్పాటు నిచ్చిన వారికి రూపకల్పనలో ముద్రణలో సహకరించిన వారికి ధన్యవాదాలు. సాహిత్య ప్రస్థానం గతంలో ప్రచురించిన ప్రత్యేక సంచికల వలెనే ఇది కూడా మీ ఆదరణకు పాత్రమవుతుందని ఆశిస్తున్నాం. ఇటీవలి రాజకీయ పరిణామాలు నోట్లరద్దు వంటి చర్యల నేపథ్యంలో కొంత సమస్య ఎదురైనప్పటికీ స్వేచ్ఛాస్వరం మీ చేతుల్లో పెట్టగలిగినందుకు సంతోషిస్తున్నాం. లోపాలోపాలపై సలహాలు, సూచనలు ఆహ్వానిస్తున్నాం. వచ్చే 2017లో ఈ కృషిని మరింత విస్తృతంగా కొనసాగించగలమని తెలియజేస్తున్నాం.

**- తెలకపల్లి రవి**




సాహిత్య ప్రస్థానం చందా వివరాలు:

సంవత్సర చందా రూ. 120

5 సంవత్సరాల చందా రూ. 500

10 సంవత్సరాల చందా రూ. 1000

A/c Name: PRASTHANAM
A/c No. 52001500585
Bank: SBH,Governorpet, VIJAYAWAD
IFSC: SBHY0020343

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:

ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం,
డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట,
విజయవాడ - 520 002, 0866-2577248, 9490099059

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

హైదరాబాద్ చిరునామా:
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్టీసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

కవర్ డిజైన్ గిరిధర్

# అసహనం ఒక అనాగరికతకు చిహ్నం!






డా॥ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి

ఈ అసహనం వ్యక్తిగతమైంది కాదు. దానికి రాజకీయ స్వభావముంది. క్రీ.శ. 17వ శతాబ్దంలో శూద్రుడు ఎంత మంచి కవిత్వం రాసినా అది కాకిముట్టిన పాయసం వంటిదని, స్వీకరిచదగింది కాదని అప్పకవి తీర్పునివ్వడంతో ఆయన అసహనత కనిపిస్తున్నది. మొల్ల, శ్రీకృష్ణదేవరాయలు, వేమన, వీరబ్రహ్మం వంటివాళ్ళ కవితలు వనికి రావన్నమాట. (అప్పకవి శూద్రకవులకు ఇలా పద్యం చెప్పి ఆముక్త మాల్యద నుండి అప్పకవీయంలో 13 పద్యాలు ఉదహరించారు మరి) మనుషులకు కులాలు అంటగట్టిన మనువాదులు, వాళ్ళ సృజనాత్మక శక్తికి కూడా కులం బురద పూయడం అసహనానికి సంకేతమే.

ఉపమగలిగిన శయ్యలనొప్పియున్న
అంఘ్రిభవుని కావ్యంబుగ్రాహ్యంబుగాదు
పాయసంబైన సంస్కారపక్వమైన
కాకజుష్టంబు హవ్వంబుగానియట్ల

(అప్పకవి : అప్పకవీయం 1-26)

భారతదేశానికి అసహనం కొత్తకాదు. శంభూకుని తల నరకటంలో, ఏకలవ్యుని బొటనవ్రేలు కత్తిరించడంలో, వేమన్నని ముక్కలు చెయ్యడంలో ధర్మం పేరుమీద పాలకుల అసహనమే కీలకపాత్ర పోషించింది. ఈ అసహనం వ్యక్తిగతమైంది కాదు. దానికి రాజకీయ స్వభావముంది. క్రీ.శ. 17వ శతాబ్దంలో శూద్రుడు ఎంత మంచి కవిత్వం రాసినా అది కాకిముట్టిన పాయసం వంటిదని, స్వీకరిచదగింది కాదని అప్పకవి తీర్పునివ్వడంతో ఆయన అసహనత కనిపిస్తున్నది. మొల్ల, శ్రీకృష్ణదేవరాయలు, వేమన, వీరబ్రహ్మం వంటివాళ్ళ కవితలు పనికి రావన్నమాట. (అప్పకవి శూద్రకవులకు ఇలా పద్యం చెప్పి ఆముక్త మాల్యద నుండి అప్పకవీయంలో 13 పద్యాలు ఉదహరించారు మరి) మనుషులకు కులాలు అంటగట్టిన మనువాదులు, వాళ్ళ సృజనాత్మక శక్తికి కూడా కులం బురద పూయడం అసహనానికి సంకేతమే.

నా కవితావధూటి వదనంబునెగా దిగజూచి రూపురే
ఖాకమనీయ వైఖరులుగాంచి భళీ భళియన్న వారే నీ
దేకులమన్న ప్రశ్న వెలయించి చివాలున లేచిపోవుచో
బ్రాకున గ్రుమ్మినట్లగున్ పార్థివచంద్ర! వచింప సిగ్గగున్!

క్రీ.శ. 20వ శతాబ్దం నాటి అగ్రకుల అసహనానికి గురైన గుర్రం జాషువ వేదన ఇది. మధ్య యుగాలలోనే గాక వలసపాలన కాలంలో కూడా పాలకులు సాహిత్య గ్రంథాలను నిషేధించి తమ అసహనాన్ని ప్రకటించుకున్నారు. ముద్దుపళని రాధికా సాంత్వనం, ఉన్నవ 'మాలపల్లి' నవల వంటివి వలస పాలకుల ఆగ్రహానికి గురై నిషేధింపబడ్డాయి, వీటినేకాదు జయధీర్ తిరుమలరావు గారి సంపాదకత్వంలో "నిషేధగీతాలు" చదివితే వలస పాలకులు, నైజాం ప్రభుత్వం నిషేధించిన గ్రంథాల, పత్రికల పట్టికలు తెలుస్తాయి. యూజిపాటినర్ రాసిన అంతర్జాతీయ గీతం నుండి సుంకర వాసిరెడ్డి మా భూమి, విశ్వనాథ 'అవతార పరివర్తన' దాకా అనేక గ్రంథాలను, రచనలను వలస పాలకులు నిషేధించారు. భారత స్వాతంత్రోద్యమ రచనలు అనేకం నిషేధింపబడ్డాయి. రామరాజు పుండరీకాక్షుని పాంచాల పరాభవం, స్వరాజ్య సోపానం, గరిమెళ్ళ సత్యనారాయణ స్వరాజ్యగీతాలు, రైతుబిడ్డ సినిమా పాటలు వంటివి అసంఖ్యాకంగా నిషేధానికి గురయ్యాయి. అసహనమే ఇందుకు కారణం. ఈ గ్రంథానికి ముందుమాట రాసిన చిరుమామిళ్ళ సుబ్బారావు "ప్లేటో కాలం నుండి ఈ రోజుదాకా పాలకవర్గ నిషేధాజ్ఞలు, ఫర్మానాలు, ఫత్వాలు మనకు పరిచితమే. కాలం మారినా నిషేధాలు మారలేదు. కారణాలు మాత్రం మారాయి. ప్రభుత్వాలకుతోడు రకరకాల ఛాందసవాదులు, సంస్థలు కూడా సాహిత్యం మీద కళలమీద నిషేధాలు విధించి అమలు చేయటానికి పూనుకుంటున్నాయి" అని అభిప్రాయపడ్డారు.

వలసపాలన పోయి స్వపరిపాలన వచ్చినా పుస్తక నిషేధ రుగ్మత పోలేదు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా వాసిరెడ్డి సీతాదేవి 'మరీచిక' నవల వరవరరావు 'రహస్తంత్రి' వంటి గ్రంథాలు రాష్ట్ర ప్రభుత్వ నిషేధానికి గురయ్యాయి. దిగంబర కవులను జైలుకే పంపించారు.

ఇటీవలి కాలంలో సాల్మన్‌రష్దీ, తస్లిమా నస్రీన్‌లు మతోన్మాదుల ఫత్వాకు గురై దేశాలే వదిలిపెట్టాల్సి వచ్చింది. ఆ మధ్య హైదరాబాద్ ప్రెస్‌క్లబ్‌లో తస్లిమా మీద జరిగిన దాడి ప్రజాస్వామ్యం సిగ్గుతో తలవంచుకోవలసి వచ్చింది. పాలకుల, మతోన్మాదుల, కులోన్మాదుల అసహనాలే ఈ దాడులకు, నిషేధాలకు కారణాలు.

ఈ నేపథ్యంలో ఇటీవల జరిగిన నాలుగైదు సంఘటనలు అసహనానికి, నిరంకుశత్వానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయి. ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంగా మనం చెప్పుకునే మనదేశ గౌరవాన్ని ఈ సంఘటనలు మంటలో కలిపాయి.

నరేంద్రదభోల్కర్ పూనాలో పేరుమోసిన డాక్టర్. హేతువాది. సంఘ సంస్కరణోద్యమానికి రంగస్థలమైన మహారాష్ట్ర వాసి. తాను చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా చేసి ప్రజలలో మూఢ నమ్మకాలకు, మూఢా చారాలకు వ్యతిరేక ఆలోచనలు రేకెత్తించే ఉద్యమం నడిపారు. మూఢనమ్మకాల నిర్మూలన కోసం ఒక చట్టం తీసుకురావాలని ఉద్యమించారు. అంతే 2013 ఆగష్టు 20న ఆయన్ని పూనాలో చంపేశారు. చంపడమైతే చంపారుగాని, ప్రభుత్వం ప్రాయశ్చితం చేసుకున్నట్లుగా తర్వాత చట్టం చేసింది. చేతులుకాలిన తర్వాత ఆకులు పట్టుకుంది. ఆయన హత్యకు గురైనా ఆయన కుమార్తె, కొడుకు ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారు.

**మధ్య యుగాలలోనేగాక వలసపాలన కాలంలో కూడా పాలకులు సాహిత్య గ్రంథాలను నిషేధించి తమ అసహనాన్ని ప్రకటించుకున్నారు. ముద్దుపళని రాధికా సాంత్వనం, ఉన్నవ 'మాలపల్లి' నవల వంటివి వలస పాలకుల ఆగ్రహానికి గురై నిషేధింపబడ్డాయి, వీటినేకాదు జయధీర్ తిరుమలరావు గారి సంపాదకత్వంలో "నిషేధగీతాలు" చదివితే వలస పాలకులు, నైజాం ప్రభుత్వం నిషేధించిన గ్రంథాల, పత్రికల పట్టికలు తెలుస్తాయి.**

గోవిందపన్సారె వామపక్షవాది. శివాజీ పేరుమీద ఉద్రేకాలు, ఆవేశాలు తీవ్రంగా ఉంటాయి మహారాష్ట్రలో. పాలకవర్గాల అవగాహనను సవరిస్తూ, శివాజీ మీద కొత్త పరిశోధనలు చేశారు పన్సారె. ప్రజాస్వామ్యం జీర్ణంకాని ఉన్మాదులు ఆయన్ని 2015 ఫిబ్రవరి 20న కొల్హాపూర్‌లో హత్య చేశారు.

కర్ణాటకలోని ధార్వాడ్‌లో 2015 ఆగష్టు 30న 77 ఏళ్ళ వయసుగల ఎ.ఎం. కల్బుర్గిని చంపేశారు. ఈయన కన్నడ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా పనిచేశారు. గొప్ప పరిశోధకుడు. ఈయన పరిశోధన వ్యాసాలు 'మార్గా' పేరుతో నాలుగు సంపుటాలుగా వచ్చాయి. శాసన పరిశోధనలో, ప్రాచీన కావ్య పరిశోధనలో నిష్ణాతుడు. శాసనశాస్త్రం, పుస్తక పరిష్కరణ శాస్త్రం, పరిశోధన శాస్త్రం వంటి గ్రంథాలు రచించారు. ఈయన నాస్తికుడు కాదు. పూజలు చేసే అలవాటుంది.

సౌమ్యుడు. వీరశైవ వచన వాఙ్మయాన్ని, బసవన వచనాలను సంపుటలుగా ఏర్పాటుచేసి ప్రభుత్వం చేత ప్రచురింపజేశారు. వీరశైవంలోని కర్మకాండను వ్యతిరేకించి సాహిత్య ప్రచురణలు చేయించారు. గదగ్ మఠం నుండి 20 సంపుటాలు ప్రచురింపజేశారు. మఠాల ఆధిపత్యాన్ని వ్యతిరేకించారు. తొలి కన్నడ రచన అయిన కవిరాజమార్గ కాలంనాటి కన్నడ సాహిత్యం మీద పరిశోధన చేశారు. బసవన్నకు మేనల్లుడు చెన్నబసవన్న. ఈయన బవసన్నకు అక్క అయిన నాగమ్మ కూడాను. నాగమ్మకు పెళ్ళికాలేదు. నాగమ్మకు దళితుడైన కస్మయ్యకు చెన్నబసవడు పుట్టాడని కల్బుర్గి ప్రకటించాడు. ఈ మాట చెన్నబసవడే చెప్పుకున్నట్లు తెలుస్తున్నది. కాని భక్తులు ఈయన వాదాన్ని వ్యతిరేకించారు. కన్నడ ఆదికవి పంపనికి కరీంనగర్‌లో అగ్రహారం ఇచ్చినపుడు బ్రాహ్మణులు ఆయన్ని చంపేశారని ప్రకటించారు గాని ఆధారాలు చూపించలేదని తెలుస్తున్నది. పంపడు జైనం స్వీకరించినా బ్రాహ్మణ ధర్మాన్నే అనుకరించారు. యు.ఆర్. అనంతమూర్తి అన్నట్లుగా ఒకమాటను కల్బుర్గి ఒక సమావేశంలో ఉదహరిస్తే, అది కల్బుర్గి అన్నమాటే అనుకొని ఉన్మాదులు ఆయన్ని హత్యచేసేశారు. ఒక గొప్ప విద్యాంసుణ్ణి చంపేయడానికి మతవిశ్వాసాలు అడ్డు రాలేదా?

ఈ సమయంలోనే ప్రసాద్ అనే ఒక యువదళిత కవి తన బాధలు చెప్పుకుంటూ ఏవో కవితలు రాస్తుంటే అతనికి కల్బుర్గికి పట్టిన గతే పడుతుందని, ఇకమీదట రచనలు చేస్తే కాళ్ళు తెగనరుకుతామని హెచ్చరించారు. అలాగే భరత్ పట్నాకర్ అనే రచయితకు దభోల్కర్, పన్సారే మార్గాలలో పయనించవద్దని హెచ్చరిస్తూ లేఖ వచ్చింది. 2015 అక్టోబరు 12న ముంబైలో సుధేంద్ర కులకర్ణిని ఇంకుపోసి అవమానించారు. అసహనవాదులు ముంబైలో పాకిస్తాన్ మాజీ మంత్రి ఖుర్షీద్ మహ్మద్ కసూరీ పుస్తకావిష్కరణ సభ నిర్వహిస్తున్న కులకర్ణిని ఆ విధంగా అవమానించారు. కులకర్ణి గతంలో ఎల్.కె. అద్వానీ సహాయకుడు.

పెరుమాళ మురుగన్ తమిళ రచయిత. ఆయన అనేక నవలలు, కథానికలు రాశారు. ఆయన మంచి అధ్యాపకుడు కూడా. ఆయన రాసిన నవల 'మథోరుబాగన్', ఇది తమిళనాడులో తిరుచెంగోడు ప్రాంతంలో కొంతకాలం క్రితం దాకా ఉండిన ఒక ఆచారం వస్తువుగా రాసిన నవల. సంతానం కలగని దంపతులకు సంబంధించిన ఆచారం ఇది. అక్కడ అర్ధనారీశ్వరాలయంలో 14 రోజులు ఉత్సవాలు జరిగేవి. పెండ్లయి ఎంతకాలం గడిచినా సంతానం కలగని స్త్రీలు ఆ ఉత్సవాల ఆఖరి రోజున, సాంఘిక నియమాలతో సంబంధం లేకుండా పరాయి మగవాళ్ళతో ఉండి సంతానం పొందే ఆచారం ఉండేది. ఈ ఆచారం వస్తువుగా ఆయన 2010లో తమిళంలో నవల రాశారు. అందరూ ఆ నవలను చదివారు. 2014లో ఈ నవల ఆంగ్లంలోకి అనువాదమైంది. అప్పటికి మన దేశంలో రాజకీయంగా మార్పు వచ్చింది. హిందూ మతోన్మాదులు మురగన్‌ను అవమానించారు, హింసించారు. ఆయన క్షమాపణ చెప్పారు. పుస్తకంలో అభ్యంతరకర విషయాలను తొలగిస్తానన్నారు. అచ్చయిన ప్రతుల్ని వెనక్కి తెప్పిస్తామన్నారు. రాజకీయ పార్టీలు మౌనం వహించాయి. ఆఖరికి మురుగన్ రచయితగా తాను మరణించానని

**నరేంద్ర దభోల్కర్ పూనాలో పేరుమోసిన డాక్టర్. హేతువాది. సంఘ సంస్కరణోద్యమానికి రంగస్థలమైన మహారాష్ట్ర వాసి. తాను చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా చేసి ప్రజలలో మూఢనమ్మకాలకు, మూఢాచారాలకు వ్యతిరేక ఆలోచనలు రేకెత్తించే ఉద్యమం నడిపారు. మూఢనమ్మకాల నిర్మూలన కోసం ఒక చట్టం తీసుకురావాలని ఉద్యమించారు. అంతే 2013 ఆగష్టు 20న ఆయన్ని పూనాలో చంపేశారు.**

ప్రకటించే స్థితి కల్పించారు. తస్లిమా నస్రిన్‌కు హైదరాబాద్ ప్రెస్‌క్లబ్‌లో జరిగిన అవమానాన్ని మించిన అవమానం మురుగన్‌కు జరిగింది. ద్రావిడ పార్టీలు అధికారం వెలగబెడుతున్న రాష్ట్రంలో పెరియార్ ఉద్యమం నడిపిన ప్రాంతంలో ఒక చారిత్రక ఆచారం మీద నవల రాసిన రచయితను బతికుండగానే మరణించినట్లు ప్రకటించే దుర్మార్గ పరిస్థితులు కల్పించారు అసహనవాదులు. తమిళ ప్రజలకు, స్థానిక ప్రజలకు అభ్యంతరాలుంటే తమిళంలో వచ్చినప్పుడే అవి వ్యక్తమై ఉండాలి. ఆంగ్లంలో వచ్చినప్పుడు ఈ పాశవిక అవమానం జరగటానికి రాజకీయంగా దేశంలో వచ్చిన మార్పే కారణం. మద్రాసు హైకోర్టు మురుగన్ మీద నమోదైన కేసులన్నిటినీ కొట్టివేస్తూ 160 పుటల తీర్పునిచ్చింది. మురుగన్ తిరిగి రచనను చేపట్టాలని సూచించింది.

అసహనం శాస్త్రీయ ఆలోచన లేనప్పుడే పుట్టుకొస్తుంది. మతం మత్తు కాటేసినప్పుడే అసహనం పడగ విప్పుతుంది. రచయితల్ని, మేధావుల్ని, కళాకారుల్ని మామూలు మనుషుల్ని సైతం వాళ్ళ భావ ప్రకటనా స్వేచ్ఛను అడ్డుకొని కొట్టి

> తాళ్ళపాక అన్నమయ్య కాలానికే మనం ముక్కోటి దేవతల్ని కొలుస్తున్నాం. విష్ణువుని కొందరు, శివుని కొందరు, గ్రామదేవతను కొందరు రకరకాలుగా అనేక దేవతారాధన చేస్తున్నాం. అలాంటి సమయంలో అన్నమయ్య వచ్చి "బ్రహ్మమొక్కడే" అని ప్రకటించాడు. ఇది సంప్రదాయాన్ని - అనేక దేవతారాధనను - ధిక్కరించటం కదా! మరి ఆయనకు శిక్ష పడవద్దా? వేమనను ఎన్నిసార్లు చంపాలి?

హింసించి అవమానించి హత్యచేయటం ప్రజాస్వామ్యం మీద నమ్మకం లేనివాళ్ళ దుశ్చర్యలే. భారత రాజ్యాంగం ప్రజాస్వామిక, లౌకిక, సామ్యవాద సార్వభౌమాధికార రిపబ్లిక్ అని మన నిర్వచనం చెప్పుకొంది. రాజ్యాంగం మీద ప్రమాణం చేసి అధికారంలో కొచ్చిన పాలకులు రాజ్యాంగ స్ఫూర్తికి ఏ చిన్న భంగం కలిగినా వెంటనే స్పందించాలి. దురదృష్టవశాత్తు అలా జరగటం లేదు.

పదిమంది ఒక ఆలోచన కలిగి ఉంటే పదకొండో వ్యక్తి దానికి భిన్నమైన ఆలోచన కలిగిఉండే హక్కుంది. వందమంది ఒకరకమైన ఆహారం తింటే, నూట ఒకటో వ్యక్తి తనదైన ఆహారం తినే హక్కుంది. ప్రజాస్వామ్యానికి ఆధిపత్యం శత్రువు. ఒకరు ఒక దేవుని పూజించే హక్కునట్లే, ఇంకొకరు మరో దేవుని పూజించే హక్కుంది. ఏ దేవునీ పూజించకుండా ఉండే హక్కు కూడా ఉంది. మెజారిటీ అన్నది ఎన్నికలలో అధికారానికే గాని, సమాజంలో ఆధిపత్యానికి కాదు. అందువల్ల ఇప్పుడు భారతదేశంలో కొనసాగుతున్న హత్యలు, దౌర్జన్యాలు, అవమానాలు అన్నీ, నశించిపోతున్న, కృశించిపోతున్న భూస్వామ్య వర్ణవాద ఆధిపత్య శక్తుల మృత్యుఘోష తప్ప ఇంకేమీ లేదు.

ఇటీవల రాజ్యసభలో బి.ఎస్.పి. నాయకురాలు మాయావతి దేశంలో దళితులమీద జరుగు దాడులను ప్రస్తావించి మాట్లాడినప్పుడు ఉత్తరప్రదేశ్ బి.జె.పి. అధ్యక్షుడు అమానుషమైన భాషలో మాట్లాడారు. ఆమె పార్టీ టిక్కెట్లు అమ్ముకున్నదని ఆయన చెప్పదలచుకున్నారు. కాని దానికి ఆయన తీసుకొచ్చిన పోలిక "సెక్స్‌వర్కర్ కంటే దారుణంగా వ్యవహరిస్తున్న''దనడం అనాగరికతకు పరాకాష్ట. పార్లమెంటులో ప్రశ్నలడగటానికి లంచం తీసుకొన్న పార్లమెంటు సభ్యుల రహస్యం బయలై, సోమనాథ చటర్జీ చేత లోక్‌సభ నుంచి సస్పెండ్ అయిన చరిత్ర మనం మరచిపోలేదు. గురివింద గింజ వ్యవహారమంటే ఇదే కదా!

తినే తిండిపేరు చెప్పి ఉత్తరప్రదేశ్‌లోని దాద్రిలో, జంతువుల పేరుచెప్పి పంజాబ్‌లోని ఉనా - ఇంకా అనేక సందర్భాలలో ఆలోచనల పేరుమీద, ఆహారం పేరుమీద అరాచక అనాగరిక శక్తులు అకృత్యాలకు పాల్పడుతున్నాయి. ఇవి తాత్కాలికంగా ఆ శక్తులకు ఆనందాన్నివ్వవచ్చునేమో గాని భారతదేశ చరిత్ర సంస్కృతుల మీద నల్లరంగు పులుముతున్నారని కూడా గుర్తించడం అవసరం.

1931 ఆగష్టు 14న బొంబాయిలో డా. బి.ఆర్. అంబేద్కర్ మహాత్మాగాంధీని కలుసుకొన్నారు. మొదటి రౌండ్‌టేబుల్ సమావేశంలో డా. అంబేద్కర్ కృషిని గాంధీజీ శ్లాఘించారు. కాని ఆ సమయంలో అంబేద్కర్ ఆవేశపడ్డారు. "మీరు ఇది నా మాతృభూమి అని అంటున్నారు. కాని నేను మరోసారి చెప్తున్నాను. ఇది నా మాతృభూమి కాదు" అని దానికి వివరణ ఇచ్చారు. ఇక భారతీయుడు భారతదేశం నా మాతృభూమి కాదు అన్నారంటే దానివెనక ఎంత చరిత్ర, వేదన దాగి ఉంటాయో! గాంధీజీ దానిని అర్థం చేసుకున్నారు. గాంధీజీ అంబేద్కర్ల మధ్య భావజాల యుద్ధం చాలాసార్లు జరిగింది. కాని ఎప్పుడూ ఇప్పట్లాగా దౌర్జన్యాలు జరగలేదు. గాంధీ పేరు చెప్పుకొని బతికే వాళ్ళు నేర్చుకోవాల్సింది ఇది. వివేకానందుని పేరు చెప్పుకుంటూ ఉంటారు కదా! ఆయనెక్కడైనా వ్యతిరేక భావజాలం గలవాడని చంపమని, దౌర్జన్యం చెయ్యమని చెప్పాడా?

మార్పును సహించలేని వాళ్ళు, ప్రశ్నకు సమాధానం చెప్పే సామర్థ్యం లేనివాళ్ళు, విమర్శను చూచి భయపడే వాళ్ళు హింసకు పూనుకుంటారు. అసహనం అనాగరికతకు చిహ్నమని గుర్తించేంత సౌజన్యమార్గం అసహన వాదులకుండదు. "మతంలోనే తమం ఉంది" అని ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి ఒక వ్యాసంలో అన్నారు. తమం అంటే చీకటి. చీకటిని ప్రేమించే వాళ్ళు వెలుగును ద్వేషిస్తారు. వెలుగును ప్రేమించే వాళ్ళను చీకటిలో భయపెడతారు.

రచయితలు, కళాకారులు, మేధావుల మీద ఈ హత్యాకాండ, ఈ దౌర్జన్యాలు, అవమానాలు ఏ నాగరికతకు, ఏ సంస్కృతికి సూచనలు. కేవలం ఇప్పుడున్నది అధికారాన్ని అడ్డం పెట్టుకొని అసహన ముఠాలు చేస్తున్న అప్రజాస్వామిక ఆగడాలు మన దేశం పరువును మంటకలుపుతున్నాయి. మనదేశానికి ప్రజాస్వామ్యం ఇంకా జీర్ణం కాలేదన్న వాస్తవానికి ఈ సంఘటనలన్నీ నిదర్శనాలే. రాజ్యాంగంలోని 25 ఆర్టికల్ భారతీయ పౌరులకిచ్చిన భావప్రకటనా స్వేచ్ఛను హరించే మతోన్మాద నిరంకుశత్వమే ఇదంతా. రాజ్యాంగాన్ని

అతిక్రమిస్తే నేరమౌతుంది. నేరానికి శిక్ష ఉండాలి కదా! ఒక్క హంతకుడికీ ఇంతవరకు శిక్షపడిన దాఖలా లేదు. కారుచీకట్లో కాంతిరేఖ మద్రాసు హైకోర్టు పెరుమాళ్ మురుగన్ కేసులో ఇచ్చిన తీర్పు. ఈ తీర్పు చదివిన మతోన్మాద అరాచక శక్తులు ఇకనైనా బుద్ధి తెచ్చుకోగలిగితే మంచిది.

**అంతకడివెడు పాలపై**
**ఒక్కింత మీగడ పేరినట్లుగా**
**మనకు మిగులును గతము లోపలి మంచి**
**అ దియె సంప్రదాయము**

అన్నారు డా. సి.నారాయణరెడ్డి గారు. ఆ మంచిని స్వీకరిద్దాం. మంచి కాని దానిని తిరస్కరిద్దాం. నిజాలను నిగ్గుదేల్చుకుందాం. నిజంకాని వాటిని నిర్దాక్షణ్యంగా తిరస్కరిద్దాం. అలాకాకుండా గతంలోని చెత్తనంతా జేబుల్లో సంచుల్లో నింపుకుంటే కుళ్ళిపోయేది మన సమాజమే.

**మంచిగతమున కొంచెమేనోయి**
**మందగించక అడుగు ముందుకెయ్**

అన్న గురజాడ ప్రబోధానికి తలవంచని వారు ప్రజాస్వామ్యం మీద వ్యక్తి స్వేచ్ఛమీద నమ్మకం లేనివారే అవుతారు. గతంమీద ఈగ వాలనివ్వం, దానిని ఎవరన్నా ముట్టుకుంటే చంపుతాం, కొడతాం అంటే మన మౌఢ్యం మనల్నే చంపుతుంది.

భారతదేశంలో ప్రాచీన కాలంలోనే ఒక ఉత్తమ సంప్రదాయముంది. అది కొన్నివర్గాల మధ్యనే జరిగిన చర్చ సాంప్రదాయమొకటి ఉండేది. ఒక విద్వాంసుడు ఒక సిద్ధాంతాన్నో, మరో అంశాన్నో ప్రతిపాదిస్తాడు. మరో పండితుడు దానిని ఆమోదించకపోతే దానిని హేతుబద్ధంగా పూర్వపక్షం చేస్తాడు. తన ప్రతిపాదన ఏదో తాను చేస్తాడు. దానిమీద మళ్ళీ చర్చ జరుగుతుంది. రెండోవ్యక్తి వాదం సరైనదైతే, మొదటి వ్యక్తి తన ప్రతిపాదనను ఉపసంహరించు కుంటాడు. లేదా అతని వాదాన్ని తను పూర్వపక్షం చేస్తాడు. తన ప్రతిపాదనను తిరిగి ముందుకు తెస్తాడు. ఇది చర్చా పద్ధతి. ఆధునిక కాలంలో కూడా ఈ పద్ధతి కొనసాగుతున్నది. ఈ పద్ధతిని వదలి చంపుతాం, పొడుస్తాం అని అంటే అది ఆటవిక దశను తెలియజేస్తుంది. మనం ఆటవిక దశను ఎన్నడో దాటి వచ్చాం కదా!

ఇలా మనకు నచ్చిన భావాలు గల వాళ్ళను కొడతాం, చంపుతాం అంటే ఎక్కడ మొదలుపెట్టాలి? మొట్టమొదట మహాభారత ఇతిహాస సృష్టికర్త వ్యాసమహర్షి మీద దాడిచేయాలి. పెరుమాళ్ మురుగన్ రచయితగా తాను మరణించానని ప్రకటించినట్లుగా మనం వ్యాసునితో అలాంటి ప్రకటన చేయించాలి. ఆయన ఇప్పుడు లేడుకనుక ఆయన రచనలను మనం బహిష్కరించాలి. ఎందుకంటే మహాభారతంలో ఉండే ఆచారాన్నే మురుగన్ మదోరుబగన్ నవలతో చిత్రించింది. వ్యాసుని కాలం నాటి ఆ ఆచారం ఏదో ఒక రూపంలో మొన్నమొన్నటి దాకా కొనసాగింది అని ఆ నవల సూచించింది. ఆ రచయిత మీద దాడిచేసిన వాళ్ళు వ్యాసమహర్షిని గురించి ఇప్పుడైనా ఆలోచించాలి. శంతనునికి సత్యవతిని తీసుకువచ్చి పెళ్ళిచేశాడు గాంగేయుడు లేదా దేవవ్రతుడు. సత్యవతిని శంతనుడు పెళ్ళాడాలంటే ఆమెకు పుట్టే కొడుకులకు రాజ్యాధికారం ఇవ్వాలని ఆమె తండ్రి దాసరాజు షరతు విధిస్తాడు. దేవవ్రతుడు ఆయన

> **రచయితలు, కళాకారులు, మేధావుల మీద ఈ హత్యాకాండ, ఈ దౌర్జన్యాలు, అవమానాలు ఏ నాగరికతకు, ఏ సంస్కృతికి సూచనలు. కేవలం ఇప్పుడున్నది అధికారాన్ని అడ్డం పెట్టుకొని అసహన మూకలు చేస్తున్న అప్రజాస్వామిక ఆగడాలు మన దేశం పరువును మంటకలుపుతున్నాయి. మనదేశానికి ప్రజాస్వామ్యం ఇంకా జీర్ణం కాలేదన్న వాస్తవానికి ఈ సంఘటనలన్నీ నిదర్శనాలే.**

కోరికను ఆమోదించి తన జీవితాంతం బ్రహ్మచారిగా ఉంటానని ప్రతిజ్ఞ చేశాడు. అందుకే తరువాత ఆయన భీష్ముడయ్యాడు. సత్యవతి, శంతనులకు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అని ఇద్దరు కొడుకులు పుడతారు. చిత్రాంగదుడు మరో చిత్రాంగదునితో జరిగిన ద్వంద్వ యుద్ధంలో మరణిస్తాడు. విచిత్ర వీరునికి ఇద్దరు భార్యలు. అంబిక, అంబాలిక. విచిత్రవీరుడు పెళ్ళి చేసుకొని ఏడేళ్ళు తన భార్యలతో దాంపత్య సుఖాన్ని అనుభవించడంలోనే కాలం గడిపేసి కన్నుమూస్తాడు. అప్పుడు తన వంశం నాశనమైపోతుందని భయపడిన సత్యవతి భీష్ముని పిలిచి సంతానాన్ని పొంది వంశాన్ని నిలబెట్టమని కోరుతుంది. భీష్ముడు ఆమె కోర్కెను నిర్ద్వందంగా తిరస్కరిస్తాడు. "నా పల్కిన పల్కును మఱి నా తాల్చిన వ్రతమును జెఱుపనంత చిఱుతనె చెప్పుమా" (ఆది 4-220) అని చంద్రుడు చల్లదనాన్ని, సూర్యుడు తన కాంతిని, అగ్ని తన ఉష్ణగుణాన్ని వదులుకున్నా తన వ్రతాన్ని తాను వదులుకోనంటాడు అని భీష్ముడు ఒక ఉపాయం చెబుతాడు. పరశురాముడు గతంలో క్షత్రియులను సంపూర్ణంగా సంహరించిన సంగతి గుర్తుచేసాడు. తల్లి గర్భంలో ఉన్న బిడ్డల్ని కూడా చంపేసిన విషయం చెప్పి అయినా ఆ

క్షత్రియ సతులు బ్రాహ్మణుల ద్వారా సంతానాన్ని పొందారని, దీర్ఘత ముని కథ చెబుతాడు. అలాగే ఎవరైనా ధర్మ స్వరూపుడైన బ్రాహ్మణుని ద్వారా అంబిక అంబాలికలకు సంతానం పొందమని సూచిస్తాడు. అది విని సత్యవతి తన పెండ్లికి ముందు జరిగిన కథను చెబుతుంది. తనకు పెళ్ళికాక ముందు సత్యవతి పడవ నడుపుతుండగా ఆ పడవ ఎక్కిన పరాశర ముని ఆమెని మోహిస్తాడు. ఆయన దయవల్ల ఆమెకు కృష్ణద్వైపాయనుడు పుడతాడు. ఈయనే మహాభారత కవి వ్యాస మహర్షి. ఆయన ద్వారా అంబిక అంబాలికలకు సంతానం పొందడం మంచిది అని సత్యవతి చెబుతుంది. ఆమె వ్యాసుని స్మరింపగానే ఆయన ప్రత్యక్షమౌతాడు. అపుడు సత్యవతి జరిగిందంతా చెప్పి దేవరన్యాయం ప్రకారం విచిత్రవీరుని భార్యలకు సంతానప్రాప్తి కలిగించమని కోరుతుంది. వ్యాసుని ద్వారా అంబిక ధృతరాష్ట్రుని, అంబాలిక పాండురాజును, వాళ్ళ దాసి విదురుని కొడుకులుగా పుడతారు. వీళ్ళ కథే మహాభారతం.

పెరుమాళ్ మురుగన్ నవలలోని కథ ఈ పరంపరకు చెందినదే. ఇలాంటి కథలు రాసినందుకు శిక్ష వేయవలసి వస్తే వ్యాసమహర్షికే వేయాలి. ఈ మధ్య ఎవరో శ్రీరాముని మీద కేసు పెట్టారని చదివాం. వ్యాసుని మీద కేసు పెడదామా?

తాళ్ళపాక అన్నమయ్య కాలానికే మనం ముక్కోటి దేవతల్ని కొలుస్తున్నాం. విష్ణువుని కొందరు, శివుని కొందరు, గ్రామదేవతను కొందరు రకరకాలుగా అనేక దేవతారాధన చేస్తున్నాం. అలాంటి సమయంలో అన్నమయ్య వచ్చి "బ్రహ్మమొక్కడే" అని ప్రకటించాడు. ఇది సంప్రదాయాన్ని – అనేక దేవతారాధనను – ధిక్కరించటం కదా! మరి ఆయనకు శిక్ష పడవద్దా? వేమనను ఎన్నిసార్లు చంపాలి? అసహనంతో రగిలిపోయి పన్సారె దాభోల్కర్, కల్బుర్గిలను చంపేస్తున్న మనకు సహనం నేర్పుతూ

**చంపదగిన ఎట్టి శత్రువు మనచేత**
**జిక్కినేని కీడు సేయరాదు**
**పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు**
**విశ్వదాభిరామ వినుర వేమ**

అని మన కోపం మీద నీళ్ళుచల్లిన వేమనకు "జాగ్రత్తగా ఉండు పన్సారెకు పట్టిన గతి నీకు పడుతుంది" అని లేఖ రాద్దామా!

**విప్రులెల్ల జేరి వెర్రికూతలు కూసి**
**సతిపతులను గూర్చి సమ్మతమున**
**మును ముహూర్తముంచ ముండేల మోసిరా**
**విశ్వదాభిరామ వినుర వేమ**

అని పురోహిత వ్యవస్థ మీద, జ్యోతిష్య శాస్త్రం మీద ప్రశ్నా బాణం వేసిన వేమనను పాకిస్తాన్ వెళ్ళమందామా?

"వర్ణధర్మ మధర్మధర్మంబే" అన్న గురజాడను

"నాల్గు పడగల హైందవ నాగరాజు" అన్న జాషువాను

"ఇది నా దేశం అని చెప్పుకోవడానికి కొంచెం సిగ్గుగా ఉంది" అన్న కుందుర్తి.

ఇలా అలాంటి అనేకమంది ఆధునిక రచయితలను మురుగన్ బాట పట్టించగలమా! విశ్వనాథ సత్యనారాయణ, త్రిపురనేని రామస్వామి చౌదరి, 'వేమరాజు', 'ఖూనీ'ల ద్వారా మాట్లాడుకున్నారు. కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షం' రాస్తే ఆనంద పంతుల రామలింగస్వామి 'శుక్లపక్షం' రాశాడు. విశ్వనాథ 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం' రాస్తే రంగనాయకమ్మ 'విషవృక్షం' రాశారు. కట్టమంచి రామలింగారెడ్డి 'కవిత్వ తత్వ విచారం' రాస్తే, కాళూరి వ్యాసమూర్తి 'కవిత్వతత్వ విచార విమర్శనము' రాశారు. అంతేగాని ఎవరూ మనుషుల్ని పంపించి కొట్టించలేదు, తుపాకులతో కాల్పించలేదు. కట్టమంచి విషయంలో కురుగంటి సీతారామయ్య మాత్రం చాలా సహనం ప్రకటించారు. అదికూడా పుస్తకరూపంలో కట్టమంచితో డా. జి.వి. కృష్ణా Studies in Kalapuramలో చాలా నాగరికంగా విభేదించారు తప్ప చంపుతా అని బెదిరించలేదు.

ఈ అసహన వాదులు తెలుసుకోవలసింది అభిప్రాయాల మీద దాడి చేయడం కాదు, ఆహారం మీద, అలవాట్ల మీద దాడి చేయడం కాదు. "అవినీతి బంధుప్రీతి చీకటిబజారు" దీనిపైన అసహనం ప్రదర్శించాలి. క్రైం, సెక్స్, పోర్నోగ్రఫీలు మూడు ప్రాణాలుగా గలిగిన చెత్త సినిమాల మీద అసహనం చూపాలి. అసహనం చూపడమంటే హత్య చేయడం కాదు. సామాజిక రుగ్మతలను, సాంస్కృతిక రుగ్మతలను ప్రజా ఉద్యమాల ద్వారా నిర్మూలించే పనికి పూనుకోవాలి.

**నా కవచం బహింస, సహనంబు మహాయుధ మెక్కిరింత ధ**
**ర్మైక నిరూఢి, సత్యము నియంత, మనంత జగత్తు మొత్తమై**
**నాకెదురైన గెల్తును వినాశపు బాంబుల గుండెకాయలో**
**బాకును, లోకమోహన సబర్మతి సమ్మునికింగు మారుదన్**
**(గుర్రం జాషువ : కొత్త లోకము)**

అసహన క్రియలు ఈ మహాకవి పద్యాన్నయినా అర్థం చేసుకోవడం అవసరం.

వర్తమానం

# స్వేచ్ఛా పథంలో సవాళ్ళు



## కాత్యాయనీ విద్మహే

ఉత్పత్తి సంబంధాలు వ్యవసాయ నాగరికతకు, స్త్రీ, పురుష సంబంధాలు దాంపత్య వ్యవస్థకు మార్పు చెందే దశలో అభివృద్ధి చెందిన బానిస సమాజం, సంస్కృతి మనుషులలో కొందరిని స్వేచ్ఛను అనుభవించే వాళ్ళుగా మరికొందరిని స్వేచ్ఛను కోల్పోయిన వాళ్ళుగా మార్చాయి. స్వేచ్ఛకోసం సంఘర్షణ అక్కడి నుండే ప్రారంభం అయింది. ఆ సంఘర్షణకు పరాకాష్ట రూపం ఫ్రెంచ్ విప్లవం ***(1789-1799).***



"క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనే చెదిరిపోవ
గగనతలము మార్మోగగ కంఠమెత్తి
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు"

– దేవులపల్లి కృష్ణశాస్త్రి

**స్వేచ్ఛ** సర్వజీవుల సహజ జీవన లాలస, బుద్ధిజీవులుగా ఎదుగుతూ మనుషులు, సంఘజీవులుగా స్థిరపడే క్రమంలో అందరి భద్రత కోసం, ఉమ్మడి ప్రయోజనాల కోసం కొంత స్వేచ్ఛను స్వచ్ఛందంగానే వదులుకోవలసి వచ్చింది. అయితే ఉత్పత్తి సంబంధాలు వ్యవసాయ నాగరికతకు, స్త్రీ, పురుష సంబంధాలు దాంపత్య వ్యవస్థకు మార్పు చెందే దశలో అభివృద్ధి చెందిన బానిస సమాజం, సంస్కృతి మనుషులలో కొందరిని స్వేచ్ఛను అనుభవించే వాళ్ళుగా మరికొందరిని స్వేచ్ఛను కోల్పోయిన వాళ్ళుగా మార్చాయి. స్వేచ్ఛకోసం సంఘర్షణ అక్కడి నుండే ప్రారంభం అయింది. ఆ సంఘర్షణకు పరాకాష్ట రూపం ఫ్రెంచ్ విప్లవం (1789-1799).

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రాథమిక విలువలుగా ముందుకు తెచ్చిన 'ది డిక్లరేషన్ ఆఫ్ ది రైట్స్ ఆఫ్ మెన్ అండ్ సిటిజన్స్ (1789) ఫ్రెంచ్ విప్లవ చరిత్రలోనే కాదు. మానవ హక్కుల చరిత్రలోనే అత్యంత కీలకమైంది. మనుషులు స్వేచ్ఛగా పుట్టారు. స్వేచ్ఛగా జీవించడానికి సమానమైన హక్కులు ఉన్నాయి అనటమే కాదు, అభిప్రాయాలు కలిగి ఉన్నందుకు ఎవరూ

**భారత రాజ్యాంగం కూడా స్వేచ్ఛ సమానత్వాలను ప్రాధమిక హక్కులుగా పేర్కొన్నది. మత స్వేచ్ఛను, విద్యాహక్కును, దోపిడీకి వ్యతిరేకంగా పనిచేసే హక్కును ప్రాధమిక హక్కులాగానే గుర్తించింది. స్వేచ్ఛ హక్కులో భాగంగా భావాలు కలిగి ఉండటానికి వ్యక్తీకరించటానికి, మాట్లాడటానికి, సమావేశాలు, సంఘాలు ఏర్పరచుకొని ప్రచారం చేసుకొనటానికి ఉన్న హక్కులను ఆమోదించింది. ఈ విధమైన విలువలతో కూడిన రాజ్యాంగం అమలులోకి వచ్చి 66 ఏళ్ళు గడిచినా అవి సామాజిక జీవన విలువలుగా పరివర్తన చెందక పోవటమే అసలు విషాదం.**

ఇబ్బందులకు గురి అయ్యే పరిస్థితులు ఉండకూడదని (10వ ఆర్టికల్), మానవులకు ఉన్న అత్యంత విలువైన హక్కులలో ఆలోచనలను, అభిప్రాయాలను వినిమయం చేసుకొనే హక్కు ఒకటని, ఆ రకంగా ప్రతి మనిషికి మాట్లాడే హక్కు, రాసేహక్కు, ప్రచురించే హక్కు ఉన్నాయని (11వ ఆర్టికల్) మానవ హక్కుల ప్రకటన పేర్కొంది.

ఆ తరువాత ప్రపంచ దేశాలలో అనేక ఉదారవాద ప్రజాస్వామిక జాతీయ విముక్తి ఉద్యమాలు, విప్లవోద్యమాలు విజయవంతమవుతూ అంతర్జాతీయ మానవ భావన అభివృద్ధి చెందిన క్రమంలో 159 సంవత్సరాలకు 1948 డిసెంబర్ 10 నాడు పారిస్‌లో జరిగిన యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ విశ్వవ్యాప్తంగా ప్రాధమిక హక్కుల పరిరక్షణ కోసం అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటనను ఆమోదించింది. మనుషులందరూ స్వేచ్ఛగా పుట్టారు అని, జాతి, కులం, రంగు, లింగం, భాష ప్రాంతం, మతం, ఆస్తి, సాంఘిక హోదా, రాజకీయ తదితర విశ్వాసాలు - వీటితో నిమిత్తం లేకుండా హక్కులు అందరికీ వర్తిస్తాయని (ఆర్టికల్ 2), జీవించే హక్కు స్వేచ్ఛగా బతికే హక్కు, రక్షణ హక్కు (ఆర్టికల్ 3) ఆలోచించటానికి, అభిప్రాయాలు కలిగి ఉండటానికి, వ్యక్తీకరించటానికి, సమావేశం కావటానికి, సంఘాలు పెట్టుకొనటానికి హక్కు (ఆర్టికల్స్ 18, 19, 20) అందరికీ ఉన్నాయని అది చెప్పింది. అప్పటికి భారతదేశంలో రాజ్యాంగ రచన ప్రారంభం అయిన 15 నెలలు (29 ఆగష్టు 1947). ఆ తరువాత ఏడాది తిరగకుండానే అది ఆమోదింపబడింది. 1950 నుండి అమలుకు వచ్చింది.

భారత రాజ్యాంగం కూడా స్వేచ్ఛ సమానత్వాలను ప్రాధమిక హక్కులుగా పేర్కొన్నది. మత స్వేచ్ఛను, విద్యాహక్కును, దోపిడీకి వ్యతిరేకంగా పనిచేసే హక్కును ప్రాధమిక హక్కులాగానే గుర్తించింది. స్వేచ్ఛ హక్కులో భాగంగా భావాలు కలిగి ఉండటానికి వ్యక్తీకరించటానికి, మాట్లాడటానికి, సమావేశాలు, సంఘాలు ఏర్పరచుకొని ప్రచారం చేసుకొనటానికి ఉన్న హక్కులను ఆమోదించింది. ఈ విధమైన విలువలతో కూడిన రాజ్యాంగం అమలులోకి వచ్చి 66 ఏళ్ళు గడిచినా అవి సామాజిక జీవన విలువలుగా పరివర్తన చెందక పోవటమే అసలు విషాదం. ఈ నేపథ్యంలో ఇప్పుడు మన అనుభవంలో ఉన్న స్వేచ్ఛ, భావాలు కలిగి ఉండటానికి, ప్రకటించటానికి ఉన్న స్వేచ్ఛ ఎన్నిసార్లు, ఎన్ని విషయాలలో ఎంతగా భగ్నం అవుతున్నదో మాట్లాడుకుందాం. కలదు కలదు అంటున్న ప్రజాస్వామికం కలదో లేదో తేల్చుకుందాం.

ఈ 2016 నవంబర్ 14 రాత్రి తెలంగాణలో మహబూబ్‌బాద్ జిల్లా గార్లలో విజయ్‌ని పోలీసులు మాయం చేసారు. ఎవరతను? ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థి ఐక్యకార్యాచరణ చైర్మన్‌గా తెలంగాణ రాష్ట్ర సాధనలో చురుకైన భాగస్వామ్య పాత్ర వహించిన వ్యక్తి. ఇప్పుడు తెలంగాణ యువజన సమాఖ్య కన్వీనర్. తనకున్న రాజకీయ అభిప్రాయాలకు అనుగుణంగా సంఘం కట్టటం, తన అభిప్రాయాలను ప్రచారం చేయటం అతను చేస్తున్న పని. అవి అతనికి రాజ్యాంగబద్ధంగా లభించిన హక్కులేగా!? అతనిని పోలీసులు అనధికారంగా ఎందుకు తీసికెళ్ళినట్లు? అతని హక్కులు మరెవరి ప్రాధమిక హక్కులకన్నా భంగం కలిగిస్తున్నాయా? కలిగిస్తే అతనిని చట్టప్రకారం అదుపులోకి తీసుకొని న్యాయస్థానంలో ప్రవేశపెట్టి విచారణ జరిగే పద్ధతి ఉందికదా? ఆ పద్దతిని పాటించకపోవటం ఏమిటి? అతని ఆచూకీ తెలియక ప్రజాసంఘాలు ఆందోళనకు దిగితే తప్ప అతను పోలీసుల అదుపులో ఉన్న విషయం వెలుగులోకి రాకపోవటం దేనిని సూచిస్తున్నది? రాజ్యమే రాజ్యాంగబద్ధంగా ప్రవర్తించకపోగా రాజ్యాంగం హామీ ఇచ్చిన హక్కులను ఉపయోగించుకొనే అవకాశాన్ని పౌరులకు పూర్తిగా నిరాకరిస్తున్న వర్తమాన వాస్తవాన్ని సూచిస్తుంది.

ఈ నవంబర్ నెలలోనే జాతీయస్థాయిలో ఆందోళన కలిగించిన మరొక ఘటన - బస్తర్ పోలీసులు ఢిల్లీ యూనివర్శిటీ ప్రొఫెసర్ నందిని సుందర్‌పైన, జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్శిటీ ప్రొఫెసర్ అర్చన ప్రసాద్ పైన

హత్యానేరం కేసు పెట్టటం. బస్తర్‌లో మావోయిస్టులకు వ్యతిరేకంగా ఏర్పడి పని చేస్తున్న నిఘా ముఠాల నాయకుడని శమంత్‌బఘెల్ ను మావోయిస్టులు నవంబర్ 4న చంపేశారు. ఆ హత్యలో మరి నలుగురితో (వినీత్ తివారి, సంజయ్ పరాటే, మంజు కవసి, మంగళ రామ్ కర్మా) కలిసి నందిని సుందర్, అర్చనా ప్రసాద్ పాల్గొన్నారని కేసు పెట్టారు బస్తర్ పోలీసులు. ఆ నలుగురి సిపిఐ, సిపిఎం వంటి గుర్తింపు కలిగిన వామపక్ష పార్టీల సభ్యులు. సామాజిక కార్యకర్తలు, మంజు గ్రామ సర్పంచ్ కూడా. ఇక ఈ ఇద్దరు ఆదివాసీ జీవితాలపై, సమస్యలపై విస్తృతంగా క్షేత్రస్థాయి పరిశోధనలు చేసిన వాళ్ళు. అతర్జాతీయ స్థాయి గుర్తింపు పొందిన సామాజిక శాస్త్రవేత్తలు.

నిజానికి సమాజంతో సంభాషించటం, సంబంధం ఏర్పరచుకొనటం విశ్వవిద్యాలయాల అధ్యయనాల పరమార్థం. తద్వారా అవి భిన్న ప్రజాసమూహాల ఆశలకు ఆకాంక్షలకు నిర్దిష్ట ప్రాతినిధ్యాన్ని ఇయ్య గలుగుతాయి. ఇంక్లూసివ్ గ్రోత్ విధానాల రూపకల్పనలకు అవి మార్గదర్శకం కాగలుగుతాయి. అభివృద్ధి అంచులలో కూడా ఎక్కడా కనపడని అత్యంత పీడిత సమాజమంటే ఆదివాసులే. విశ్వవిద్యాలయాల అధ్యాపకులుగా వాళ్ళు చేయవలసిన పనే చేశారు. ఆదివాసీల మీద పరిశోధన సమాచార సేకరణతో, పరిశోధన గ్రంథ ప్రచురణతో ఆపక ఆదివాసీల సమస్యల పట్ల స్పందించే క్రియాశీల కార్యకర్తలుగా కూడా మారారు. అధ్యయనం, ఆచరణ క్రియాకలాపం జమిలీగా సాగాలన్నది కూడా విశ్వవిద్యాలయ తాత్వికతలో భాగమే. దానిని పూర్తిగా విశ్వసించినవాళ్ళు నందిని సుందర్, అర్చనా ప్రసాద్.

అందువల్లనే 2011లో బస్తర్‌లో కూంబింగ్‌కు వెళ్ళిన పోలీసులు తడమెట్ల, తిమ్మాపురం, మొరపల్లి గ్రామాలలో 300 ఇళ్ళు తగలబెట్టి, ముగ్గురు పురుషులను చంపి, ముగ్గురు స్త్రీలపై అత్యాచారం జరిపిన ఘటనపైన, మానవ హక్కుల నాయకుడు స్వామి అగ్నివేశ్ మీద సాల్వజుడుం బాధ్యుడు దాడి చేసిన ఘటన పైన సిబిఐ విచారణను కోరుతూ నందిని సుందర్ సుప్రీంకోర్టులో మనీష్ కుంజంతో కలిసి పిటీషన్ పెట్టింది. ప్రజాప్రయోజనాల కోసం బాధ్యత కలిగిన పౌరురాలిగా ఈ పిటీషన్ వెయ్యటం నేరం అయింది.

2016 మేలో ఆమె మరికొందరితో కలసి బస్తర్‌లో కొన్ని గ్రామాలు పర్యటించి వచ్చింది. మావోయిస్టుల కారణంగా నైతేనేమి, మావోయిస్టులను అణచి వేయటం పేరుమీదనైతేనేమి ఆదివాసీ గ్రామాలలో పెచ్చురిల్లిపోతున్న హింస గురించి నిజానిజాలు నిగ్గుతేల్చి సమాజానికి తెలియచెప్పడానికి వెళ్ళిన వాళ్ళ మీద తిరిగి వచ్చినప్పటినుండి మావోయిస్టులకు అనుకూలంగా ప్రచారం చేశారని పోలీసు స్టేషన్లలో ఫిర్యాదులు ఇప్పించటం వంటివి జరుగుతూనే వున్నాయి. వాటికే పరాకాష్ట ఏకంగా వాళ్ళపై హత్యానేరం మోపటం. ఈ మొత్తం క్రమాన్ని చూస్తే ఏమి అర్థం అవుతుంది? ఉన్నత విద్యాసంస్థలలో పనిచేస్తున్న బుద్ధి జీవులు బాధిత ప్రజాసమూహాలకు గొంతుక ఇచ్చే స్వేచ్ఛ నుండి నిషేధింపబడుతున్నారని అర్థం అవుతుంది. ఈ దేశంలో ఎక్కడికైనా వెళ్ళటానికి, ప్రజలతో కలవటానికి, ఒక రాజకీయార్థిక అనిశ్చితి పట్ల అభిప్రాయాలు ఏర్పరచుకొన టానికి, కలబోసుకొనటానికి ఉన్న సహజ పౌరహక్కులను వినియోగించుకోనుటమే నేరంగా చూపే ఒక అన్యాయమైన భయానక వాతావరణాన్ని – ప్రాథమిక హక్కులను అమలు చేయవలసిన, ఎవరైనా వాటిని ఉల్లంఘిస్తే శిక్షించవలసిన –రాజ్యమే సృష్టిస్తున్న తీరు అర్థం అవుతుంది.

**బుద్ధి జీవులు బాధిత ప్రజాసమూహాలకు గొంతుక ఇచ్చే స్వేచ్ఛ నుండి నిషేధింపబడుతున్నారని అర్థం అవుతుంది. ఈ దేశంలో ఎక్కడికైనా వెళ్ళటానికి, ప్రజలతో కలవటానికి, ఒక రాజకీయార్థిక అనిశ్చితి పట్ల అభిప్రాయాలు ఏర్పరచుకొనటానికి, కలబోసుకొనటానికి ఉన్న సహజ పౌరహక్కులను వినియోగించుకోనుటమే నేరంగా చూపే ఒక అన్యాయమైన భయానక వాతావరణాన్ని – ప్రాథమిక హక్కులను అమలు చేయవలసిన, ఎవరైనా వాటిని ఉల్లంఘిస్తే శిక్షించవలసిన –రాజ్యమే సృష్టిస్తున్న తీరు అర్థం అవుతుంది.**

2016 సెప్టెంబర్‌లో ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక పెనుగొండలో సదస్సు పెట్టుకొని ఒకరోజు పోలవరం ప్రాజెక్ట్ ముంపు నిర్వాసిత గ్రామాల ప్రజలను కలిసి మాట్లాడే క్షేత్ర పర్యటనను సిద్ధమైనప్పుడు ఎదురైన అనుభవం రాజ్యాంగపరమైన హక్కులు నిషేధింపబడుతున్న వర్తమానాన్ని గురించిన హెచ్చరిక అయింది. మేము భారతీయులం. భారతీయులుగా మాకు దేశంలో ఎక్కడికైనా వెళ్ళే హక్కు ఉందనుకున్నాం. అందులోనూ రెండు తెలుగు రాష్ట్రాలకు సంబంధించిన రచయిత్రులకు రెండు జిల్లాల సరిహద్దులను కలిపే పోలవరం వెళ్ళటానికి అడ్డు ఉంటుందన్న ఆలోచనే రాలేదు. 50 మందిమి వెళుతున్నాం, రవాణా భోజన

సదుపాయాలు ఎలా అని వాటి ఏర్పాట్ల గురించి ఆలోచనలు, సంప్రదింపులు చేస్తున్నాం. అటువంటి సమయంలో తీరా మేము రేపు పెనుగొండకు బయలుదేరుతామనగా స్థానిక నిర్మాహకుల నుండి ఫోన్. పోలవరం పోవటానికి కలెక్టర్ నుండి ముందస్తు అనుమతి ఉండాలని. మన దేశంలో మనకు, మన ప్రాంతాలలో మనకు స్వేచ్ఛగా ఎప్పుడు పడితే అప్పుడు ఎక్కడికైనా వెళ్ళగల పరిస్థితులు లేవని తెలిసి దిగ్భ్రాంతికి లోనయ్యాం. అందునుండి తేరుకొని స్థానిక మిత్రుల సహాయంతో కలెక్టర్‌కు విషయం తెలియజేసి అనుమతి పొందటం అది వేరే విషయం.

1952లో గుర్రం జాషువా తన అయిదవ ఖండ కావ్యానికి ఒక మాట అనే పేరుతో రాసిన చిన్న ముందుమాటలో "భయకంపితమై హింసాపీడితమైయున్న ప్రజానీకానికి కవి వాక్కు ఆశాకిరణాన్నందించాలి. మిట్టపల్లాల్ని సమం చేసి చూపాలి. హింసిత ప్రజల మూకీ భాష్పాలకు నోరిచ్చి రచ్చ కెక్కించాలి" - అని రాసాడు. ఏ ప్రజాస్వామిక విలువల కోసం రచయితలు బాధ్యతగా రాయాలని జాషువా అభిలషించాడో అది వాస్తవీకరించబడలం అనేది బుద్ధిజీవులకు, రచయితలకు ఏర్పడే ప్రజాసంబంధాల మీద ఆధారపడి ఉంటుంది. బాధిత ప్రజాసమూహాలకు మధ్య సంబంధం, సంభాషణ జరుగనే కూడదని, ప్రభుత్వాలే కంచెలు కడుతుంటే ఇది ప్రజాస్వామ్య ప్రభుత్వమేనా అన్న ప్రశ్న రాకమానదు. ఈ 2016లోనే జులై నెలలో తెలంగాణాలో మల్లన్న సాగర్ ప్రాజెక్ట్ నిర్మాణం వద్దని ముంపు గ్రామాల ప్రజలు ఉద్యమిస్తే వాళ్ళకు సంఘీభావం పలకటానికి వెళ్ళిన విప్లవ రచయితల సంఘ బాధ్యులను గానీ ఇతర ప్రజాసంఘాల వారిని గానీ గ్రామాలలోకి అడుగుపెట్టనియ్య కుండా తరమటం, అరెస్టులు చేసి ఆపటం ఈ తరహా ఘటనే. ఆస్తులనో, జీవన వ్యాపారాలనో, ప్రాణాలనో కోల్పోయిన కష్టంలో ఉన్న వాళ్ళను పలకరించటం, ఓదార్చి ధైర్యం చెప్పటం, మీకు మేము ఉన్నాము అని ఒక భరోసాను ఇయ్యటం ఒక లౌకిక మర్యాద లక్షణం. మానవీయ సంస్కార చిహ్నం. వాటి వ్యక్తీకరణ నిషిద్ధం అయినా చోట స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఉనికి, విలువ లేనట్లే.

ఈ 2016లోనే ఇంకా ఎన్ని చూసాం మనం? బస్తర్‌లో మావోయిస్టులపై గ్రీన్ హంట్ పేరు మీద ప్రకటించిన యుద్ధం ఆదివాసులపై హింసాకాండగా, హత్యాకాండగా హద్దులు లేకుండా సాగుతుంటే నిజనిర్ధారణకు వెళ్ళాలనుకొన్న కార్యకర్తలను ఆపటం దగ్గరనుండి రిపోర్టు చేయటానికి వెళ్ళిన పాత్రికేయులను, ఆదివాసీల పక్షాల కోర్టులో కేసులు వేయడానికి సిద్ధపడిన లాయర్లను జగదల్‌పూర్ నుండి వెళ్ళగొట్టటం వరకు ప్రభుత్వమే చేసిన పనులు చూస్తుంటే విశ్వాసాలు కలిగి ఉండటం, నచ్చిన పని చేసుకోవటానికి, వృత్తి ధర్మాలు నిర్వహించటానికి మనకున్న ప్రాథమిక హక్కులు పనికిరానివే అని అర్థం అవుతుంది. మడకం హిడిమె అనే ఆదివాసీ మహిళను అత్యాచారం చేసి హత్యచేసి మావోయిస్టు అని బుకాయిస్తుంటే నిజానిజాలు తెలుసుకొనటానికి వెళ్ళాలనుకున్న సోనీ సోరీకి అనుమతి లభించలేదంటే, ఒక ఆదివాసీ మహిళ తన ప్రాంతంలో తనవాళ్ళ మధ్యకు వెళ్ళటానికి సుక్మా పోలీసు స్టేషన్ ముందు బైఠాయించాల్సి వచ్చిందంటే - రాజ్యాంగం హామీ ఇచ్చిన 'స్వేచ్ఛ' వాస్తవానుభవానికి ఎంత దూరమో తెలుస్తుంది.

2

2016లో విద్యార్థి ఉద్యమం కూడా భావప్రకటనా స్వేచ్ఛపై దెబ్బకొట్టటం దగ్గరే మొదలైందని చెప్పాలి. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో కొత్త సంవత్సరం రోహిత్ వేముల ఆత్మహత్యతో మొదలైంది. దాని వెనుక ఉన్న కారణాలలో ప్రధానమైనది అభిప్రాయాల పట్ల హద్దులు మీరుతున్న అసహనం పట్ల నిరసన. అంబేద్కర్ స్టూడెంట్ అసోసియేషన్ పక్షాన రోహిత్ వేముల మరికొందరు విద్యార్థులు యాకూబ్ మెమన్(1993 బాంబే బాంబు దాడుల ఘటనలో పట్టుబడ్డ తీవ్రవాది) ఉరితీతకు వ్యతిరేకంగా 2015 ఆగష్టు 3న ఒక ప్రదర్శన నిర్వహించారు. ఢిల్లీ యూనివర్శిటీలో ముజఫర్‌నగర్ బాకీ హై అనే డాక్యుమెంటరీ ప్రదర్శనపై ఎబివిపి వాళ్ళు చేసిన దాడిని ఖండించారు. అది గిట్టని ఎబివిపి విద్యార్థులు వారిపై కాస్టిస్ట్ యాంటీనేషనలిస్ట్ కార్యకలాపాలు చేస్తున్నారని ఏకంగా యూనియన్ మినిష్టర్ దత్తాత్రేయకు లేఖ రాశారు. దాని పరిణామం వారిపై చర్య తీసుకోవలసినందిగా హ్యూమన్ రిసోర్స్ మినిష్టర్ స్మృతి ఇరాని నుండి యూనివర్శిటీ

***2016లో విద్యార్థి ఉద్యమం కూడా భావప్రకటనా స్వేచ్ఛపై దెబ్బకొట్టటం దగ్గరే మొదలైందని చెప్పాలి. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో కొత్త సంవత్సరం రోహిత్ వేముల ఆత్మహత్యతో మొదలైంది. దాని వెనుక ఉన్న కారణాలలో ప్రధానమైనది అభిప్రాయాల పట్ల హద్దులు మీరుతున్న అసహనం పట్ల నిరసన.***

అధికారులపై వత్తిడి. తత్ఫలితం రోహిత్ తదితరుల సస్పెన్షన్... రోహిత్ ఆత్మహత్య దానికి విషాదాంత ముగింపు.

2016లో జేఎన్‌యు విద్యార్థులు కన్హయ్య కుమార్, ఉమర్ ఖలీద్, అనిర్ బన్‌లపై రాజద్రోహం కేసు పెట్టటం మరొక సంచలనాత్మక ఘటన. 2013లో పార్లమెంటు దాడి కేసులో ఉరితీయ బడిన అఫ్జల్ గురు స్మృతిలో జెఎన్‌యు విద్యార్థులు నిర్వహించిన నిరసన సభ పరిణామం. ఆ తరువాత ఆ కేసు కొట్టివేయబడింది. అది వేరే సంగతి. ఈ రెండు విశ్వవిద్యాలయాల ఘటనలు మన ముందుకు తెచ్చే అంశం ఒకటే. యాకూబ్ మెమన్ కావచ్చు అఫ్జల్ గురు కావచ్చు వాళ్ళ తీవ్రవాద కార్యకలాపాలకు మరణశిక్ష సరియైనది అన్న నమ్మకం ఉన్న వర్గానికి, వాళ్ళు మనుషులు కదా, మరణ శిక్ష అనాగరికమని ప్రపంచదేశాలు చాలావరకు దానిని రద్దు చేశాయి కదా, అసలు శిక్ష అనేది మనిషి మారటానికి అవకాశం ఇచ్చేదిగా ఉండాలి కదా, అందుకు మనిషి బతికి ఉండాలి కదా అని జీవించే హక్కు గురించిన విశ్వాసంతో మరొక కోణం నుండి ఆలోచించే వర్గం పట్ల ఉన్న అసహజం ఇది. జాతి వ్యతిరేక కార్యకలాపాలని దేశద్రోహమని పెద్ద పేర్లు పెట్టి తోటివాళ్ళ పట్ల శత్రుపూరితంగా ప్రవర్తించటం దాని అభివ్యక్తరూపం. అభిప్రాయాలలో భిన్నత్వం ఉన్నప్పుడు వాటిని నిగ్గుతేల్చుకొనటానికి సంభాషణ, వాదన, చర్చ మొదలైన నాగరిక మార్గాలు ఉన్నాయి. వాటిని ఉపయోగించుకొనాలన్న సహన సంస్కృతే ఇప్పుడు కావలసినది. కన్హయ్య కుమార్ రాజద్రోహనేరం కేసు నుండి బయట పడిన తరువాత ఇచ్చిన ఉపన్యాసంలో 'ఎబివిపి విద్యార్థులు నాకు శత్రువు కాదు, ప్రతిపక్షం' అని చెప్పిన మాట పెంచుకోవాల్సిన సహన సంస్కృతిని సూచించేదే.

3

భిన్నవర్గాల, జాతుల, మతాలు, కులాలు, ప్రాంతాలు, దృక్పథాలు ఉన్న అసమ సమాజంలో వైరుధ్యాలకు, సంఘర్షణలకు అవకాశం ఎక్కువ. అధికార సంబంధాల మాయ మనుషులలో ఇతరుల జీవన విధానం పట్ల, నిత్య జీవిత వ్యవహార సంప్రదాయాల పట్ల ఆహారం, ఆహార్య అలవాట్ల పట్ల, భాషాభ్యక్తి విధానాల పట్ల చిన్న చూపును పెంచిపోషిస్తుంది. అది వెక్కిరింత దగ్గర ఆగక అసహనంగా పరివర్తన చెంది నియంత్రణ రూపాన్ని తీసుకుంటుంది. నిర్మూలన కార్యకలాపాలకు దారితీస్తుంది. ప్రజాస్వామిక మూలం, ముఖం లేని ఇటువంటి అసహన రోగానికి ముందుగా జాతీయ సమైక్యతా భావనను ఒక రాజకీయ వ్యూహంగా ముందుకు తీసుకురావటం జరిగింది

భిన్నత్వాల మధ్య, భిన్న సమూహాల మధ్య, భిన్న అభిప్రాయాల పట్ల సహనం ప్రజాస్వామిక విలువ. ఆ విలువను నింపుకున్న మాట 'సహనమే సంస్కృతి' – అన్నది. అయితే సహనం సాధారణంగా అధీనులకే అభ్యాసం చేయవలసిన విలువగా ప్రబోధించబడుతుండటం గమనించవచ్చు. సహనం స్త్రీలకు భూషణంగా చెప్పబడుతుండటం అందరికీ తెలిసిందే. పురుషుడి అధికారాన్ని, కుటుంబం తదితర పితృస్వామిక వ్యవస్థల పెత్తనాన్ని ప్రశ్నించకుండా తలదాల్చి జీవించటానికి స్త్రీలకు కావలసినది సహనమే మరి. ఆధునిక అవసరాల నుండి స్త్రీ స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు, సామాజిక రంగాలలో క్రియాశీల భాగస్వామ్యం అనివార్యమవుతూ ఆమోదం పొందుతున్న తరుణంలో పితృస్వామ్య అధికార వర్గ అసహనం స్త్రీల వస్త్రధారణ రీతులను నిర్దేశించటంగా, స్త్రీలపై జరిగే అత్యాచారాలకు వారి వస్త్రధారణా రీతులే కారణమని బాధితులనే బాధ్యులుగా చేసి సాధించటంగా, కదలికలను నియంత్రించటంగా వ్యక్తమవుతుండటం వర్తమాన దృశ్యం.

అలాగే పేదలకు పీడనను, దోపిడీని ప్రశ్న లేకుండా భరించటానికి సహనం కావాలి. సహనం కోల్పోతే ప్రమాదం మీకే అని వాళ్ళను హెచ్చరించేందుకే 'పేదవాని కోపం పెదవికి చేటు' వంటి నానుడులు వచ్చాయి. దళితులు అగ్రవర్ణ ఆధిపత్యాన్ని ఫిర్యాదు ఏమీ లేకుండా సహించి బతకాలంటే కావలసినది సహనమేగా మరి!? దళితుల పట్ల, ముస్లిముల పట్ల అధికార హిందుత్వ మత సంస్కృతి అసహనం ఈనాడు పశు సంబంధమైన వారి జీవన వృత్తులను, ఆహారపు అలవాట్లను అనుమానించటంగా, అవమానించటంగా, నిషేధించటంగా మొత్తంగా వారి జీవనశైలిపై తీర్పులు ఇచ్చి

*అధికార సంబంధాల మాయ మనుషులలో ఇతరుల జీవన విధానం పట్ల, నిత్య జీవిత వ్యవహార సంప్రదాయాల పట్ల ఆహారం, ఆహార్య అలవాట్ల పట్ల, భాషాభ్యక్తి విధానాల పట్ల చిన్న చూపును పెంచిపోషిస్తుంది. అది వెక్కిరింత దగ్గర ఆగక అసహనంగా పరివర్తన చెంది నియంత్రణ రూపాన్ని తీసుకుంటుంది. నిర్మూలన కార్యకలాపాలకు దారితీస్తుంది.*

శిక్షించే పోలీసు న్యాయ వ్యవస్థల పాత్రలను తానే పోషించే రాజ్యాధికారంగా రూపాంతరం చెందింది. ఆవుకు పవిత్రతని, గౌరవాన్ని ఆపాదించటంతో ఆగక సాటి మనిషిని జంతువుకన్నా హీనంగా చూస్తూ కొట్టటానికి చంపటానికి కూడా వెనుదీయని అమానుషత్వంలోకి దిగజారిన ఉదంతాలు, ఉదాహరణలు ఇటీవలి కాలంలోనే అనేకం కనబడతాయి.

4

భిన్నాభిప్రాయాల పట్ల, జ్ఞానాభివృద్ధికి దోహదపడే భిన్న ఆలోచనా దృక్పథాల పట్ల అసహనం అధికారమై మనుషుల మేథోసృజన శక్తులమీద దాడికి దిగిన కాలం ఇది. మహారాష్ట్రలో 2013 ఆగస్టు 20న నరేంద్ర దబోల్కర్, 2015 ఫిబ్రవరి 16న గోవింద పన్సారే, కర్ణాటకలో 2015 ఆగస్టు 31న కల్‌బుర్గి హత్య చేయబడ్డారు.

నరేంద్ర దబోల్కర్, గోవింద్ పన్సారే ఇద్దరు హేతువాదులు. నిరీశ్వర వాదులు. హిందూత్వ ఆధిపత్యాన్ని, కుల వ్యవస్థను వ్యతిరేకించారు. కుల సంబంధమైన హింసను నిరసించారు. తాము నమ్మిన ఆ విలువల కోసం సామాజిక ఉద్యమాలు నిర్మించారు. అందుకే వాళ్ళు హత్య చేయబడ్డారు. ప్రపంచీకరణ తలుపులు తీసి, బహుళ జాతి పెట్టుబడులకు ఎర్రతీవాచీలు పరచి ఆహ్వానం పలుకుతున్న దేశీయ పెట్టుబడి వర్గానికి అభివృద్ధి మార్గంలో రాకెట్‌లా దూసుకుపోవటానికి ఆటంకంగా ఉన్నది ప్రజాస్వామిక చైతన్యశక్తి ఒక్కటే. ఆ శక్తిని దీప్తిమంతం చేసి ఉద్యమాలను వ్యక్తులను లేకుండా చెయ్యటమే దానికి ఉన్న ఏకైక కార్యక్రమం. అందులో భాగంగానే జరిగిన హత్యలుగా వాటిని అర్థం చేసుకోవాలి.

హత్య చేయబడిన మూడవ వ్యక్తి కల్ బుర్గి. ఆయన ప్రధానంగా సాహిత్య పరిశోధకుడు, విమర్శకుడు. మత ఉద్యమాలలో ప్రజాస్వామికమైనదిగా చరిత్రలో కనబడే శైవమత సాహిత్యం మీద ఆయన పరిశోధన చేశాడు. శైవం పేరుమీద చలామణిలో ఉన్న ఆచారాలకు, మూఢ విశ్వాసాలకు వ్యతిరేకి. మనిషిగా పుట్టి, బ్రాహ్మణీయ మత వ్యవస్థపై తిరుగుబాటుగా శైవ సిద్ధాంతాన్ని అభివృద్ధి చేసి, ప్రచారం చేసిన చెన్న బసవన్నది దైవిక పుట్టుక అంటే అంగీకరించలేకపోయాడు. అందువల్ల 1986 - 1987లోనే ఆయన లింగాయతుల నుండి నిరసనను ఎదుర్కొనవలసి వచ్చింది. వృషభేంద్ర స్వామి నాయకత్వంలో లింగాయత మత శాఖవారు నిర్వహించిన ఆ నిరసన ప్రదర్శన చరిత్ర సాహిత్య జ్ఞాన ప్రపంచ రంగాలలో మాట్లాడే, రాసే స్వేచ్ఛలకు రానున్న ప్రమాదాన్ని చర్చలోకి తెచ్చింది. కన్నడ సంప్రదాయ సాహిత్యానికి, ప్రత్యేకించి శైవ సాహిత్యానికి హేతుబద్ధ వ్యాఖ్యానం చేయటం విద్యావిషయక జ్ఞానాభివృద్ధి క్రమానికి సంబంధించిన అంశం. అందులో కల్ బుర్గీ వాదనలు ప్రతివాదనతో ఎదుర్కొనవలసినవి, నిలబడవని నిరూపించవలసినవి, తర్కబద్ధంగా నిరాకరించ వలసినవి మాత్రమే కానీ అలా వ్యాఖ్యానించి మనిషినే మట్టు పెట్టటం మేథో స్వాతంత్ర్యాన్ని, విచారణ శీలతను, నిరసించటానికి, ధిక్కరించటానికి ఉన్న స్వాతంత్ర్యాన్ని ఉక్కుపాదంతో అణచివేయటం తప్ప మరొకటి కాదు.

ఈ సందర్భంలో సాహిత్య విమర్శ రంంలో నాకు ఎదురైన రెండు అనుభవాలు గుర్తుకు వస్తున్నాయి. రెండూ మహిళా అస్తిత్వ చేతనా దృక్పథంతో సాహిత్య అధ్యయన పరిశోధనలలో చేస్తున్న కొత్త ప్రతిపాదనలకు సంబంధించినవి. 1978 నుండి మార్క్సిజమ్ వెలుగులో ప్రపంచాన్ని సాహిత్యాన్ని అర్థం చేసుకొంటున్న నేను 1982 నుండి స్త్రీగా నా జాతి జనుల అనుభవ కోణం నుండి, స్త్రీల అంతరంగ ఆలోచనల ఆవిష్కరణ లక్ష్యంగా నా సాహిత్య అధ్యయన విమర్శ మార్గాన్ని కొత్తమలుపు తిప్పుకుంటున్న తొలినాళ్ళ అనుభవం మొదటిది. 1986-87ల నాటిది. ఏ సెమినార్‌కైనా స్త్రీల సమస్య మీదనే పేపర్ రాసి తీసుకు వెళ్ళాలని గట్టిగా అనుకొని ఉండటం వల్ల అప్పుడు హైద్రాబాద్‌లో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సుకు మొల్ల రామాయణం - స్త్రీ స్వభావ చిత్రణ అనే వ్యాసంతో వెళ్ళాను. ఆనాడు మా సెషన్‌లో పేపర్లన్నీ రామాయణ సంబంధమైనవి. ప్రతి పేపర్ రాముడు దేవుడు, సీత శ్రీమహాలక్ష్మి, ఆంజనేయుడు మహాభక్తుడు అంటూ భగవంతుడికి భక్తుడికి మధ్య సంబంధాన్ని వివరించటంగా

**కన్నడ సంప్రదాయ సాహిత్యానికి, ప్రత్యేకించి శైవ సాహిత్యానికి హేతుబద్ధ వ్యాఖ్యానం చేయటం విద్యావిషయక జ్ఞానాభివృద్ధి క్రమానికి సంబంధించిన అంశం. అందులో కల్‌బుర్గీ వాదనలు ప్రతివాదనతో ఎదుర్కొనవలసినవి, నిలబడవని నిరూపించవలసినవి, తర్కబద్ధంగా నిరాకరించ వలసినవి మాత్రమే కానీ అలా వ్యాఖ్యానించి మనిషినే మట్టు పెట్టటం మేథో స్వాతంత్ర్యాన్ని, విచారణ శీలతను, నిరసించటానికి, ధిక్కరించటానికి ఉన్న స్వాతంత్ర్యాన్ని ఉక్కుపాదంతో అణచివేయటం తప్ప మరొకటి కాదు.**

**2015 జనవరిలో ఒక స్వతంత్ర సృజనశీల రచయితగా తాను మరణించానని ప్రకటించుకొనవలసిన దుస్థితికి పెరుమాళ్ నెట్టబడ్డాడు. జులై 5న మద్రాస్ హైకోర్టు రచయితపై దాడులను నేరంగా పేర్కొని రాసే హక్కుకు హామీ ఇస్తూ అతను రాయాలని తీర్పునైతే ఇచ్చింది కానీ, రచయిత తనకున్నది స్వేచ్ఛగా రాయగల పరిస్థితులు నెలకొన్నాయా అన్నదే అసలు ప్రశ్న.**

ఉన్నాయి. నేను మాత్రం నా పేపర్‌లో దైవమాయ స్పర్శ లేకుండా సీతారాములను మనుషులుగానే చూసి పితృస్వామిక అధికార రాజకీయాలు. స్త్రీ స్వభావాలను, స్పందనలను, ఆలోచనా విధానాన్ని, భావజాల వ్యవస్థను ఏ రకంగా నియంత్రిస్తాయో చెప్పి ఆ ప్రాతిపదిక మీద మొల్ల రామాయణ స్త్రీల స్వభావాన్ని నిరూపించే ప్రయత్నం చేసాను. వందమంది వరకు ఉన్న ఆ సెషన్‌లో ముగ్గురు తప్ప మిగిలిన అందరూ అది ఏ సోషియాలజీ సెమినార్‌లోనో చదువుకోమని, ఇలాంటి పేపర్లతో ఓరియంట్ సెమినార్‌కు మాత్రం రావద్దని ఫత్వా జారీ చేస్తున్నట్లు గోలగోలగా మాట్లాడారు. అప్పుడు నాగార్జునా యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా ఉన్న తమ్మారెడ్డి నిర్మల, పాపినేని శివశంకర్, హైదరాబాద్ విశ్వవిద్యాలయ పరిశోధక విద్యార్థి – ఈ ముగ్గురు మాత్రమే కొత్త ఆలోచనలతో, కొత్త ప్రతిపాదనలతో వచ్చిన విమర్శ పట్ల అసహనం కూడదని, అది జ్ఞానాభివృద్ధికి ఆటంకం అని నా పక్షాన నిలబడి మాట్లాడారు. ఆ రకమైన మద్దతే నా మార్గంలో నేను వెనుతిరగకుండా ముందుకు సాగటానికి ఉపయోగపడిందని కుంటాను.

రెండవ ఘటన కూడా రామాయణంపై విమర్శకు సంబంధించిందే. 1994–95 ప్రాంతాలలో రాజమండ్రిలో పొట్టిశ్రీరాములు విశ్వవిద్యాలయం డిగ్రీ పిజి కాలేజీ అధ్యాపకులకు నిర్వహిస్తున్న రిఫ్రెషర్ కోర్సులో ప్రాచీన సాహిత్యంలో స్త్రీ గురించిన అన్వేషణ, అధ్యయనం చేయవలసిన పద్ధతి గురించి, అందువల్ల సాధించే ఫలితాల గురించి నేనొక క్లాస్ తీసుకొన్నాను. సాహిత్య రాజకీయాల గురించి మాట్లాడటం, సీత అగ్నిప్రవేశానికి కారకుడై ఆ తరువాత వనవాసానికి పంపి అవమానించిన రాముడి కతను పురాణేతిహాస నాటక సాహిత్యం సమస్తం – బాధితలనే బాధ్యులుగా చేసి తప్పించుకొనే అధికార రాజకీయ శిల్పంతో ఎలా నిర్మించుకొంటూ వచ్చిందో చెప్పటం – వాళ్ళకు నచ్చినట్లు లేదు. వాదించటానికో, ఖండించటానికో వాళ్ళు పూనుకోలేదు. మౌనంగా విన్నారు. బయటకు వచ్చి టీ తాగుతున్నప్పుడు మాత్రం వాళ్ళు ఏక కంఠంతో ఒకే మాట అన్నారు. “మీరు మీ స్త్రీ వాద కోణాన్ని ఆధునిక సాహిత్య అధ్యయానికి, విమర్శకు ఉపయోగించండి. దయచేసి ప్రాచీన సాహిత్యం జోలికి రాకండి” – అని నా సాహిత్య విమర్శ విధానం పట్ల వాళ్ళ అసహనం వ్యక్తమైన తీరు అది. ప్రాచీన సాహిత్య పవిత్రత స్త్రీవాద దృక్పథ విమర్శ వల్ల భంగపడుతుందన్న నమ్మకం ఆ సాహిత్య పరిధి నుండి నన్ను బహిష్కరించాలన్నంతగా వాళ్ళను ప్రేరేపించిందన్న మాట. ఈ రెండు ఘటనల్లోనూ ప్రాచీన సాహిత్యానికి కొత్త సామాజిక సందర్భాలు అవసరాల నుండి కొత్త విమర్శలు రావటం పట్ల అసహనమే ప్రధానమైనది.

కల్ బుర్గి వలె సాహిత్యరంగంలో చికాకులు, పరాభవాలు ఎదుర్కొన్న మరొక మనకాలపు రచయిత పెరుమాళ్ మురుగన్. పిల్లలు లేని దంపతులు తిరుచెన్ గోండి దేవాలయపు రథోత్సవంలో పాల్గొని పిల్లలను పొందటం అనే ఆచారం కేంద్రంగా 'మధోరుభగన్' నవల రాసినందుకు శివుడిని, రథోత్సవంలో పాల్గొనే స్త్రీలను అవమానించడాన్ని ఆరోపణతో దాడిని, ప్రాణభయాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఒత్తిడిని తట్టుకోలేక మార్కెట్లో ఉన్న నవలలను అన్నిటిని వెనక్కు తీసుకొనటమే కాదు 2015 జనవరిలో ఒక స్వతంత్ర సృజనశీల రచయితగా తాను మరణించానని ప్రకటించుకొనవలసిన దుస్థితికి పెరుమాళ్ నెట్టబడ్డాడు. జులై 5న మద్రాస్ హైకోర్టు రచయితపై దాడులను నేరంగా పేర్కొని రాసే హక్కుకు హామీ ఇస్తూ అతను రాయాలని తీర్పునైతే ఇచ్చింది కానీ, రచయిత తనకున్నది స్వేచ్ఛగా రాయగల పరిస్థితులు నెలకొన్నాయా అన్నదే అసలు ప్రశ్న.

లౌకిక జీవితమే ఏ సాహిత్యానికైనా ముడిసరుకు. లోకంలో తనను వేధించిన కలతపెట్టిన, సవాల్ చేసిన ఈ సామాజిక జీవిత పార్శ్వాన్ని అయినా, మానవ ప్రవృత్తిని అయినా వస్తువుగా చేసి రాసే స్వేచ్ఛ రచయితకు ఉంది. వాటి గురించిన రచయిత అవగాహన సరిగా లేకపోతే కొట్టి, బెదిరించి, చంపికాదు బుద్ధి చెప్పవలసినది. విమర్శ అనే మాధ్యమం ఒకటి ఉంది. దానిని ఉపయోగించాలి. ఉపయోగించకపోవటం అప్రజాస్వామికం. 1980వ దశకంలో తెలుగు సాహిత్య రంగంలో రంగనాయకమ్మ విషయంలో దాదాపు ఇలాగే జరిగింది. యండమూరి

వీరేంద్రనాథ్ రాసిన తులసిదళం నవల క్షుద్రశక్తుల ఉనికిని గొప్ప చేస్తూ మనిషిలోని క్షుద్రత్వాన్ని ప్రధాన వస్తువుగా చేసిందని నిరసిస్తూ రంగనాయకమ్మ తులసిదళం కాదు, గంజాయి దమ్ము అనే శీర్షికతో విమర్శ రాసింది. అందులో ఆమె ఆ నవల పుస్తకంగా అచ్చయినప్పుడు మెచ్చుకుంటూ ముందుమాట రాసిన కొమ్మూరి వేణుగోపాలరావును డాక్టర్‌కు ఉండవలసిన శాస్త్రీయ దృక్పథమే లేదని తీవ్రంగా విమర్శించింది. దానిమీద ఆయన రంగనాయకమ్మ మీద 60 వేలకు పరువునష్టం దావా తీసుకువచ్చాడు.

ఆ సందర్భంలో (1983) కేతవరపు రామకోటిశాస్త్రి సాహిత్య విమర్శపై ప్రతి విమర్శలు చేయాలి కానీ కోర్టుకెక్కటం సముచితం కాదని, సాహిత్యంలో ఉన్న వాదవివాద సంప్రదాయాన్ని గుర్తుచేస్తూ రాసిన వ్యాసం (ప్రచురణ 2004)లో చెప్పబడిన విషయాలు కొన్ని ఈ నాటి పరిస్థితులకు కూడా సరిపోతాయి. "సాహిత్య మత తాత్విక సాంఘిక రాజకీయాది ఉపరితల భావజాలమంతటిలోనూ వాళ్ళ వాళ్ళ సామాజిక ప్రయోజనాల దృష్ట్యా అభిప్రాయ భేదాలు ఏర్పడి వాదవివాదాలు జరుగుతుండటం అనాది నుండీ వస్తూనే ఉన్నది. ఆ వివాదాల్లో ఉభయపక్షాల వారూ పరస్పరం ఛిద్రాలు బయటపెట్టుకొంటూ తమ వాదమే సరియైన వాదమని ప్రజలను అంగీకరింపజేయటానికి చేసే ప్రయత్నమెంతైనా ఉంటుంది" అని చెప్పి రామకోటి శాస్త్రి మత తాత్విక సాంఘిక భావ విషయ వివాదాలను కూడా కోర్టుకెక్కించటం మొదలుపెట్టి భావ సంఘర్షణ వల్ల వచ్చే జ్ఞాన చైతన్యాన్ని పోగొట్టుకుంటున్నాం అని హెచ్చరించిన అంశం గమనించదగినది. భావ సంఘర్షణ మెదడులను వదిలి చట్టాలను ఆశ్రయించి నిలబడాలని చూడకూడదని అంటాడాయన. అలా చూడటం మెదడులను పని చేయనీయకుండా చేసి జనాలను భయపెట్టి అదుపులో ఉంచుకొనటానికేనని మూడు దశాబ్దాల క్రితమే ఆయన గుర్తించి చెప్పాడు. గూండాల అండదండలతోనూ, రాజకీయపు పలుకుబడితోనూ న్యాయస్థానాల ఆశ్రయింపులతోనూ సాహిత్య సృజననూ, సాహిత్య విమర్శను నియంత్రించే పద్ధతిని దేనినైతే ప్రమాదకారి అని ఆనాడు వ్యతిరేకించాడో అది అత్యంత వికృతరూపంలో మన అనుభవంలోనికి వస్తున్నది ఈనాడు.

## 5

భిన్న ప్రజా సమూహాల నుండి వ్యక్తమయ్యే అన్నిరకాల, అన్ని రూపాల వ్యతిరేకతల పట్ల, నిరసనల పట్ల చూపించే సహనంలోనే ప్రజాస్వామ్యానికి నిజమైన విలువ సమకూరుతుంది. ఆ క్రమంలో ప్రజాస్వామిక స్వరాల పట్ల అగ్రవర్ణ మత తాత్విక సాంఘిక రాజకీయ పెత్తందారీ సమూహాల అసహనాన్ని నియంత్రించవలసిన రాజ్యం ఆయా సమూహాల ప్రయోజనాలకు కొమ్ముకాసి నిర్మాణ స్వభావం వల్ల విభేదించే సమూహాల పట్ల అసహనమే ఒక వ్యూహంగా అణచివేతకు దిగుతున్నది. ఈ పరిస్థితుల తీవ్రత ఒత్తిడి ఇన్నాళ్ళుగా స్త్రీలు దళితులు, మైనారిటీలు, పేదలు, ప్రజాస్వామిక వాదులు, ప్రజా ఉద్యమకారులు ప్రదర్శిస్తూ వస్తున్న సహనాన్ని పరీక్షకు పెడుతున్న రోజులివి. ఇప్పుడిక సహనం గాడిద లక్షణం అనక తప్పదు. అసమానతల పట్ల, అన్యాయాల పట్ల, దుర్మార్గం పట్ల సహనం అంటే నేర వ్యవస్థకు మౌన ఆమోదం అన్న మాట. అది వివేకం గల పౌరుల లక్షణం కాదు. పౌర ప్రజాస్వామిక విలువ రూపం తీసుకొన్న అసహనం అద్భుతమైన సామాజిక పరివర్తనను ఆశించే ఉద్యమ నిర్మాణం అవుతుంది. విప్లవోద్యమాల నుండి అస్తిత్వ ఉద్యమాల వరకు అన్నిటినీ ఈ కోణం నుండి చూడాలి. భావ ప్రకటన నుండి అన్ని ప్రాథమిక హక్కుల అనుభవానికి అవరోధంగా ఉన్న అసహనం మనకొక సవాల్.

చరిత్రలో సహన అసహన భావనల అభివృద్ధి, సంఘర్షణల క్రమాన్ని, సామాజికార్థిక రాజకీయ మానవ సంబంధాలలో సంస్కృతిలో సహనం పాత్రను, అసహన సంస్కృతిపై సాహిత్యంలో నమోదైన ధిక్కార రూపాలను, స్వభావాన్ని అధ్యయనం చేయటం, అసహనాన్ని సహించకపోవటం ఒక హక్కుగా ఉద్యమించటం ఇప్పుడు మన ముందు ఉన్న కర్తవ్యం.

**"యుగయుగంబుల నీశ్వర యోధులగుచు**
**స్వేచ్ఛకై ప్రాణ సుమము లర్పించు వారి**
**అమల జీవితఫలము ధన్యతను గాంచ**
**జగము నిండ స్వేచ్ఛా గాన ఝరుల నింతు"**

– దేవులపల్లి కృష్ణశాస్త్రి



# అనాది నినాదం - "స్వేచ్ఛ, న్యాయం"



ముక్తవరం పార్థసారథి

సాహిత్యం గురించి, అమెరికన్ సోషలిస్టు రచయిత అప్టన్ సింక్లేర్‌కు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి.

"సాహిత్యం సమాజానికి అద్దం పడుతుందనేది నిజం. అందువల్ల మనది డబ్బు సాహిత్యమని అన్నామంటే, దాని అర్థం డబ్బు సమాజమని

భూస్వామ్య యుగం తర్వాత, స్వేచ్ఛా విపణిలో నెగ్గగలిగిన, కుట్రలూ, కుతంత్రాలూ పన్నగలిగిన ధనికవర్గపు చేతిలో, సమాజాన్ని నడిపించే పగ్గాలున్నాయి. వీళ్ళకున్న ప్రధాన ఆయుధం డబ్బు-సంపద. ఈ వర్గపు విలువల ఆద్యంతాలు ధనం. చరమ లక్ష్యం ధనార్జన. భూస్వామ్య వర్గానికి భూమి ఎలాగో ఈ వర్గానికి ధనం అలాగ. అందువల్ల ఈ వర్గపు సాహిత్యానికే, కళలకూ లక్ష్యం ధనార్జనే. వీళ్ల దృష్టిలో కళా, సాహిత్యాల పరమోద్దేశం కేవలం వినోదం. మానవ విలువలున్న కళా సాహిత్యాలకు ఈ సమాజంలో స్థానం లేదు."



ధనస్వామ్య జీవితానికి ప్రామాణికమైనది "నగదు చెల్లింపు" నాకు నచ్చిన పుస్తకం రాశానంటే మిస్టర్ మనీ వికటాట్టహాసం చేస్తా! ఓ లక్ష కాపీలు అమ్ముడుపోయిన రచయితంటే, పుస్తకం ఎలా ఉన్నా సరే, అతడు గొప్ప రచయితైపోతాడు. రచయిత ప్రతిభ, జీనియస్‌కు గీటురాయి "సక్సెస్". అంతే తప్ప సక్సెస్ ఎలా వచ్చింది, ఏ కారణం వల్ల అది సక్సెస్ అయింది అనేది అనవసరం.

కాని, స్వేచ్ఛకోసం, న్యాయం కోసం మనిషి పోరాటం చెయ్యని కాలమేదైనా వుందా? అతి ప్రాచీన చరిత్రలో కూడా అతడు వీటికోసం ఆక్రోశించాడు. పైగా, యిది ఏ ఒక్క దేశానికో పరిమితం కాలేదు. ప్రపంచ వ్యాప్తంగా, అన్ని నాగరికతలలో, సంస్కృతులలో, సాహిత్యాలలో ఈ గళాలు వినిపిస్తాయి.

ఈ విషయమే మరింత లోతుగా పరిశీలించాలను కున్నాడు అప్టన్ సింక్లేర్. అసలు, యిలాంటి రచనలన్నీ ఒకచోట కూర్చితే ఎంత వుపయోగకరంగా వుంటుంది! ఈ బృహత్కార్యం తను చెయ్యగలడా? సింక్లేర్‌కు తనమీద తనకు అపారమైన నమ్మకం. కించిత్తు కూడా సందేహించలేదు.

"అసలు యింతవరకూ యిలాంటి ప్రయత్నం జరగక పోవటమే ఆశ్చర్యం. ఒకటి రెండు సోషలిస్టు గేయాల సంకలనాలు చూశాను. కాని అన్ని ప్రపంచ సాహిత్యాలలోని నిరసన గళాలు, సామాజిక న్యాయం, స్వేచ్ఛ కోసం

ఉద్యమించిన వాళ్ళ రచనలు - వచనం, కవిత్వం, మరే ప్రక్రియ అయినాసరే - సంకలం చెయ్యాలి!

"కొందరు యిలా చెయ్యటానికి నా అర్హతలేమిటి అని ప్రశ్నించవచ్చు. ఏ అర్హతలు కావాలనుకుంటున్నారు మీరు? విద్యాలయాల్లోనూ, ఆ తర్వాతా, జీవితమంతా సాహిత్యా ధ్యయనం చేస్తూనే వున్నాను. లభ్యమవుతున్న కార్మికవర్గ సాహిత్యమంతా చదివాను. సోషలిస్టు వుద్యమంలో పనిచేశాను. చేస్తున్నాను. పదిహేనుళ్ళుగా దాని గురించి ప్రచారం చేస్తున్నాను."

"సాహిత్యంతో సంబంధం లేని వ్యక్తులను కూడా యిందులో వుదహరించినా, యిది ప్రధానం సాహిత్యపరమైన సంచలనం. నేను సాహిత్య పక్షపాతిని కావటం యిందుకో కారణం కావచ్చును. జాక్‌లండన్‌తో సహా. చదివిన అనేకమంది మహానుభావులు "సోషలిస్టు వుద్యమానికి బైబిల్ లాంటిదిది" అన్నారు. చదివిన వాళ్ళలో నిరాశా నిస్పృహలను దూరం చేస్తుంది. కొత్త ఆశలు రేకత్తిస్తుంది. భవిష్యత్తు మీద నమ్మకం కలిగిస్తుంది.

జాక్‌లండన్ ముందు మాటతో 1915లో వెలువడింది. **The Cry for Justice, An Anthology of The Great Social Protest Literature of All Time.**

"నాకు తెలిసినంతవరకూ, విశ్వవ్యాప్తంగా వున్న మానవీయమైన ఆలోచనకల అందర్నీ ఒకచోట చేర్చిన మొదటి సంకలనం యిదే. అత్యంత సమర్థవంతంగా ఎంపిక చేశారు. **రాబోయే రోజుల్లో మరింత బాగా, మరింత సమగ్రంగా తయారుచేసే అవకాశమూ లేకపోలేదు. కొన్ని కలుపుతారు, కొన్ని తొలగిస్తారు.** కాని మొత్తంమీద, మానవజాతి యింతవరకు ఎలుగెత్తి నినదించిన సాహిత్యమంతా ఒకచోట చేరుతుంది. ఇంతకన్న కావలసిందేముంది!

బైబిల్, ఖురాన్, తాల్ముడ్ వంటి మతగ్రంథాలు ఆయా మతస్తులకు మార్గదర్శకంగా వున్నట్టే న్యాయం కోసం, స్వేచ్ఛకోసం పోరాడే యువతీ యువకులందరికీ ఈ 'పవిత్ర గ్రంథం' తప్పక దారిచూపిస్తుంది. ప్రస్తుతమున్న మేథో మురికికూపంలో, చీకటిదారుల్లో ఇదొక వెలుగు దివ్వె.

ఈ 'పవిత్ర గ్రంథం' చదివిన తర్వాత "చిన్ని నా బొజ్జకు శ్రీ రామరక్ష" "ఇంతకన్న ఇంకేం కావాలి అనుకునే అమాయకుడు కూడా ఆశ్చర్యపడక మానడు. తరతరాల కవులు, దార్శనికులు, తత్వవేత్తలు చెప్పిందిదే.

అంతా సజావుగానే సాగిపోతున్నదనుకునే లోకంలో యింత దురన్యాయం వుంది. ప్రకృతిసిద్ధంగా యిలా లేదు. తను చుట్టూ వున్న లోకాన్ని యిలా నరకంలా మార్చుకున్నారు. అవగాహనాలోపం ఎక్కడుంది? సరిగా అర్థం చేసుకోవటానికే అవగాహన అని మరోమాట. స్వార్థాన్ని అధిగమించటమే నిజమైన అవగాహన. స్వార్థరాహిత్యమే మానవ సేవ. అన్ని సమస్యలకూ ఏకైక పరిష్కారం సేవ.

సేవా మార్గాన్ని ఎంచుకున్న వ్యక్తి అబద్ధాలు చెప్పే దుర్మార్గుల్ని ధైర్యంగా ఎదిరించగలడు. వాళ్ళను కూడా సత్య మార్గానికి నడిపించగలడు. ఫలితంగా సమాజంలో అమానుషత్వం తగ్గుతుంది. లోకంలో నిజమైన ఆనందం, సౌందర్యం అప్పుడే ఆవిష్కృతమవుతుంది. బలవంతుడు, బలహీనులకు సాయంచేసి వాళ్ళను కూడా బలవంతులను చేస్తాడు అంతేగాని, తన బలంతో వాళ్ళను అణగదొక్కడు.

ఈ పేజీలలో జాజ్వ్యల్యమానంగా ప్రకాశిస్తున్న పేర్లనొకసారి స్మరించుకుంటే చాలు. తమ మేథో సంపత్తితో వాళ్ళు చరిత్ర గతినే మార్చివేశారు. వీళ్ళు నియంతలు కారు - విలాస పురుషులు కారు. ద్వంద్వ విలువలగాళ్ళు కారు. అబద్ధాలకోర్లూ, సారా వ్యాపారులూ, జూదరులూ, వ్యాపారాలు చేసి లాభార్జించినవాళ్ళూ, స్టాక్‌బ్రోకర్లూ కాదు. వీళ్ళు వున్నదంతా లోకానికి, పీడిత జనసేవలో అర్పించుకున్నారు. నిస్వార్థమైన జీవితాలు గడిపారు. అందరూ దార్శనికులే. మానవతా మూర్తులే. వాళ్ళ జీవితలక్ష్యం లాభాల వేటకాదు. మానవ సేవ మాత్రమే.

వాళ్ళ జీవితాలలో గుండెలవిసే విషాదాలకు కొదవ లేదు. కాని, ఆ బాధల నుండే వాళ్ళు తమను తాము వుక్కు మనుషులుగా మార్చుకున్నారు. వయ్యక్తిక సమస్యల నుండి సామాజిక సమస్యలవైపు పయనించారు. సంకుచిత అవసరాల పొరలు తొలగిపోయాయి. ప్రతిఫలాలు కాంక్షించకుండా సేవ చేశారు. మానవ కళ్యాణానికి, సౌభాతృత్వానికి బాటలువేసిన మహానుభావుల నివేదిక ఈ పేజీలలో మీరు చదవవచ్చు.

జరుగుతున్న తప్పుల గురించి, లోపాల గురించి స్పృశించి వదిలెయ్యలేదు వాళ్ళు. పరిష్కారాలు కూడా చూపించారు. అయితే, యిందులో ఆధ్యాత్మికత, ముక్తిమార్గం కోసం వెదక్కండి. పరలోక ప్రస్తావన లేదు. కనిపించే ఆకాశానికి ఆవల మరోలోకం వుంటుందని వాళ్ళు చెప్పలేదు. ఉన్నదొక్కటే. ఈ లోకం. దీన్నే మనం మెరుగుపరచుకోవాలి.

కాలం మారుతుంది కాలంతోపాటే మనుషుల ఆలోచనలూ మరతాయి. గతంలో, నాగరికతలన్నీ - ఈ లోకంలోనో, పరలోకంలోనో - అధికారమే పరమావధిగా ఏర్పడ్డాయి. కాని సాటిమనిషిని ప్రేమించమన్న నాగరికత మాత్రం యింతవరకు ఏర్పడలేదు. అయితే, గతంతో మనకు పేచీలేదు. కొత్త ఆశయాలతో, మానవుడు కేంద్రంగా మనం మరో మహోన్నతమైన నాగరికతను నిర్మించుకోవాలి" అంటాడు జాక్‌లండన్.

"మరింత సమగ్రమైన పుస్తకం రావాలి" అన్న తన గురువు (జాక్‌లండన్)తో పూర్తిగా ఏకీభవిస్తాడు సింక్లేర్. ఇదైనా, మరొకటైనా అతని రచనలన్నీ అమెరికన్ పెట్టుబడిదారీ వ్యవస్థమీద సంధించిన అస్త్రాలే.

"తప్పకుండా యింతకన్నా మంచి పుస్తకాలు వస్తాయి. కాని యింతవరకు ఎవరూ యిలాంటి ప్రయత్నం చేయలేదు గనక, నేను నా బాధ్యత నిర్వర్తించాను. భవిష్యత్ సాహిత్య, సాంస్కృతిక పోరాటాల్లో కార్మిక వర్గం చేతికి నేనందించిన చిన్న ఆయుధమిది. ఈ సందర్భంగా ఒక పిట్టకథ గుర్తుకొస్తున్నది. ఒక రాజ్యంలో ఒక రైతు తన వంటి బడుగు జీవులను కూడదీసుకుని రాజుగారి మీద యుద్ధం ప్రకటించాడు. కాలం కలసొచ్చి పైచేయి సాధించాడు. అధికారం చేజిక్కించుకున్నాడు. అతణ్ణందరూ "నేషనల్ హీరో" అన్నారు. అంతటి సచ్ఛీలుడు, సకల గుణాభిరాముడు చరిత్రలోనే లేరని స్కూలు పిల్లలు చదువుకున్నారు కూడాను. అదే రైతు పరాజితుడై వుంటే? అంతటి దుష్టుడు, అబద్ధాలకోరు, పాపి, దుర్వ్యసనాల పుట్టలెవరూ లేరని కూడా చదువుకునే వారు అదే పిల్లలు. ఈనాడు పేదలు, పీడితులు, బహిష్కృతుల పక్షాన రాస్తున్న రచయితల పరిస్థితి యిలాగే వుంది. పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో కార్మికవర్గం విజయం సాధిస్తే, వీళ్ళనే హీరోలని శ్లాఘిస్తారు. కాని పరాజితులైతే ప్రాపగండిస్టులనీ, 'మక్‌రేకర్స్' అనీ, "పగటి కలలు కంటున్న సోమరిపోతులనీ" అంటారు. ఇప్పటికే ఈ దేశంలో (అమెరికాలో) రచయితలను ఎంత నీచంగా చూస్తున్నారో మీకు తెలుసు; కార్మికులు, కర్షకులంటే సృష్టికర్తలు. వాళ్ళ దృష్టికోణం నుండి సాహితీ, సాంస్కృతిక చరిత్రను అధ్యయనం చేసి రాయాలి. (మమనార్ట్)

The Cry for Justic. పెద్ద పుస్తకం. ఇందులో వున్న వందలాది రచనల్లో మచ్చుకు కొన్ని:



**1. ఫిలాసఫర్స్ ఫర్ సేల్**

ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్, నార్వేజియన్ నాటకకర్త (1849-1917)

**తత్వశాస్త్రమంటే ఏమిటి?**

**సత్యాన్వేషణ.**

అదే నిజమైతే. ఇది ధనికవర్గానికి అనుకూలంగా ఎందుకుంటుంది? ధనికుల సేవలో తరిస్తారు తత్వవేత్తలు. వాళ్ళ ఆస్థాన వుద్యోగుల్లాంటి వాళ్ళు. ధనికులకు అనుకూలంగా వుండే సత్యాలనే అన్వేషిస్తారు. ఆవిష్కరిస్తారు.

ఒకవేళ, ధనికులకు యిబ్బందికరంగా వుండే సత్యాలను వాళ్ళు తెలుసుకుంటేనే అవన్నీ అబద్ధాలని కొట్టిపారేస్తారు. ఆ తత్వవేత్తకు భరణం కట్!

**చరిత్ర అంటే ఏమిటి?**

గతం గురించిన కథ. ధనికుల ప్రయోజనాలకు అనుకూలంగా వుండేవిధంగా, వాళ్ళ దృష్టికోణం నుండి రాస్తారు.

చరిత్రలో ధనికుల కిబ్బందికరమైన విషయాలు తెలిసివస్తే?

అవన్నీ కట్టుకథలు, వట్టి పుకార్లు, స్కాండల్స్ అంటారు.

స్కాండల్ అంటే ఏమిటి?

ధనికుల మనస్సు నొప్పించేది.

**కళాదృష్టి అంటే ఏమిటి?**

కళాఖండాన్ని పొగడటమైనా, తెగటమైనా కళాదృష్టి అనిపించుకుంటుంది.

**ఏ కళాఖండాలను మనం కీర్తించాలి?**

ధనికవర్గపు సుగుణాలను చాటిచెప్పే కళాఖండాలను. రాఫేల్, మైకలేంజిలో అత్యంత ప్రజాదరణ పొందిన ఆర్టిస్టులు.. వాళ్ళు. సమకాలీన ధనికవర్గపు మతమౌఢ్యాన్ని నిరసించారు. షేక్స్‌పియర్, రాజుల కీర్తిగానం చేశాడు; గోతె తనంత గొప్పవాడు మరెవడూ లేడన్నాడు. యితడు ధనికవర్గపు రచయిత.

ఇతర కళాఖండాల సంగతేమిటి?

'ఇతర' నచ్చేవి యింకేమీ వుండకూడదు.



### 2. రాజలక్షణాలు

నికోలో మాకియవెల్లి (1469-1527)

ఇటాలియన్. "రాజు ఎలా వుండాలి?" అని 'ప్రిన్స్' పేరుతో పుస్తకం రాశాడు.

**ప్రజలకు రాజు ఎలా కనిపించాలంటే!**

సౌమ్యుడు, సచ్ఛీలుడు, నిజాయితీకి నిర్వచనం, మానవతామూర్తి, దైవభక్తి పరాయణుడు, అనుకోవాలందరూ. ప్రజలు చూసిందే నమ్ముతారు గాని, నిజమేమిటో తెలుసు కోవటానికెవ్వరూ ప్రయత్నించరు గదా! ఒకవేళ, అతి కొద్దిమంది సత్యం గ్రహించినా, అధిక సంఖ్యాకులను వ్యతిరేకించటానికి వారు సాహిసించరు. పైగా రాజు గారెప్పుడూ అధిక సంఖ్యాకులకు మాత్రమే రక్షకుడు!



### 3. క్రీస్తుకు పూర్వం నాల్గవ శతాబ్దంలో, గ్రీకు తత్వవేత్త అరిస్టాటిల్ రోజుల్లో కూడా రాజులిలాగే వున్నారు.

రాజు, తాను దైవభక్తి పరాయణున్నని ప్రజల్ని నమ్మించాలి. మతఛాందసుడనిపించుకుంటే మరీ మంచిది.

ఇంత పవిత్రుడైన ప్రభువు  
ఏ నిర్ణయం తీసుకన్నా ప్రజలు నిరసించరు.  
దేవుడికి ప్రతినిధిగా వున్న రాజులమీద  
ఎవరికీ తిరుగుబాటు చేయాలనిపించదు.



### 4. మానవ వాహనం

**టాల్‌స్టాయ్, రష్యన్ రచయిత (1828-1910)**

విద్యావంతులు, వున్నత వర్గాల వాళ్ళు  
పేదలమీద సవారీ చేస్తున్నారు.

పేదలంటే మనకు చాలా సానుభూతి. వాళ్ళ శ్రేయస్సుకోసం ఏమి చేయటానికైనా సిద్ధమే.

పేదలకు పౌష్టికాహారం కావాలి. వాళ్ళకోసం సంక్షేమ పథకాలు అమలు చెయ్యాలి. తమ కాళ్ళమీద తాము నిలబడటానికి సహకరించాలి.

అవును. వాళ్ళ కోసం ఏమైనా చేస్తాం గాని  
వాళ్ళమీద సవారీ చెయ్యటం మాత్రం మానం.



### 5. వాళ్ళలో ఒకణ్ణి.

**యుజీన్ వి. డెబ్స్ (1855-1926)**

(కార్మిక నాయకుడు, సోషలిస్ట్)

ఈ సమాజంలో పేదలున్నంత కాలం,  
నేరస్తులున్నంత కాలం,  
జైళ్ళలో ఖైదీలున్నంతకాలం  
నేనూ వాళ్ళలో ఒకణ్ణి.



### 6. లె మిజరాబ్ (Les Miserables)కు ముందుమాట.

**(పేదల బతుకులు) విక్టర్ హ్యూగో (1802 -1855)**

**ఫ్రెంచి నవలా రచయిత**

"ఈ లోకంలో అన్యాయం, అక్రమం, పేదరికం, దోపిడీ వున్నంతకాలం, అలకాపురులలోని కుబేరుల పక్కనే నరకకూపాలలో నరులు నివసించినంత కాలం, అజ్ఞానాంధకారంలో మనుషులు దిరాంధాల్లా కొట్టుమిట్టాడినంత కాలం యిలాంటి పుస్తకాల అవసరం వుంటుంది."



### 7. యంత్ర జగతి

**జాన్ స్టువార్ట్‌మిల్ (బ్రిటిష్ తత్వవేత్త) (1806 - 1873)**

ఇప్పటివరకు జరిగిన సాంకేతిక అభివృద్ధి, యంత్రీకరణతో కార్మికుల శ్రమకాలం ఏమైనా తగ్గిందా అన్నది అనుమానమే.



### 8. సంపాదన

**జార్జి బెర్నార్డ్ షా (1856 - 1950)**

**(ఐరిష్ నాటకకర్త, విమర్శకుడు, ఫేబియన్ సోషలిస్ట్.)**

''మనుషుల సామర్థ్యాలను బట్టి వాళ్ళ ఆదాయాలుంటాయి. ప్రకృతిలోనే ఆ తేడాలున్నాయి" అని ఎవడన్నా అంటే, వాడి ముక్కుమీద గుద్దాలనిపిస్తుంది. మహాకవి విలియం బ్లేక్ కన్నా ఓ డబ్బు మూటలగాడు ఎక్కువ సమర్థుడా? జాన్ రస్కిన్ కన్న ఓ కాంట్రాక్టర్ ఎలా గొప్ప? షేర్ మార్కెట్లో అదృష్టం కలసొచ్చి నాలుగు డబ్బులు పోగేసుకున్న కోటేశ్వరమ్మ, ఫ్లారెన్స్ నైటింగేల్ కన్న గొప్పదా?



### 9. ఉద్యమ లక్షణం

**స్టీవెన్ చికో (1946 - 1977)**

**విద్యార్థి నాయకుడు (దక్షిణాఫ్రికా వర్ణవివక్ష పోరాట**

యోధుడు)

ఉద్యమం ప్రజల అలవాట్లలో, దృక్పథాలలో మార్పు తెస్తుంది. బలప్రయోగం వల్లకాదు. అది దాని నైతిక బలం. ప్రజలు తమను తాము మార్చుకుంటారు.

◆◆◆

**10. ఫ్రెడరిక్ హారిసన్**

**(1831-1923) బ్రిటిష్ తత్వవేత్త)**

హత్యలు, వ్యభిచారం, స్కాములు, దొంగతనం లేదా మరే నేరమైనా ఫరావాలేదుగాని వ్యవస్థ మారాలన్న వాళ్ళను సమాజం ఎప్పుడూ క్షమించదు.

◆◆◆

**11. సంపద**

**ఫ్రెంచి ఆర్థిక శాస్త్రవేత్త ప్రూధో"** (Pierre - Joseph Proudhon 1809 - 1865) **కన్న శతాబ్దాల క్రితమే సెయింట్ జెరోమ్ (340 - 420) చెప్పిన మాటలివి.**

సంపద అంటేనే అసమానత. ఒకడు పోగొట్టుకుంటే తప్ప మరొకరు సంపాదించలేడు. సంపద అంటే దొంగతనం. సంపన్నుడు దొంగతనం చేయకపోయినా, వాడి తండ్రో, పూర్వికులో దొంగతనం చేసుంటారు.

◆◆◆

**12. సెయింట్ ఆగస్టీన్ (354 - 430)**

లక్షలాది మంది పేదల కనీసావసరాలు కలసి, ధనికుడి ఒకనాటి వాడి నుండి లాక్కున్న దొంగసొత్తు అయి వుంటుంది.

◆◆◆

**13. కూలీ**

**హగ్గయ్ (515 B.C.), హెబ్రూ ప్రవక్త**

కూలీవాడి చేతిలో డబ్బు నిలవదు.

◆◆◆

**14. ప్రభుత్వ హత్యలు**

**మెన్షియస్, చైనీస్ రాజనీతిజ్ఞుడు (300 B.C.)**

మెన్షియస్ : కర్రతో కొట్టి చంపటానికీ, కత్తితో పొడిచి చంపటానికీ తేడా వుందా?

హ్వేరాజు : లేదు

మెన్షియస్ : కత్తితో చంపటానికీ, ప్రభుత్వం చంపటానికీ తేడా వుందా?

హ్వేరాజు : లేదు

మెన్షియస్ : నీ అశ్వశాలల్లో బలిసిన గుర్రాలు కనిపిస్తున్నాయి. కాని నీ ప్రజలు అస్తిపంజరాల్లా వున్నారు. రాజ్యమంతటా క్షామం తాండవిస్తున్నది. ప్రజలు ఆకలికి మలమలా మాడి చస్తున్నారు. నిస్సహాయంగా వున్న జనాన్ని, జంతువులు పీక్కుని తింటున్నాయి. ప్రభువంటే ప్రజలకు తండ్రి వంటివాడు. జంతువులు మనుషుల్ని పీక్కు తింటుంటే, ప్రభువు బలిసిన గుర్రాలమీద స్వారీ చెయ్యటం న్యాయమా?

◆◆◆

**15. సామ్యవాదం**

**వాంగ్ ఆన్ షి (చైనీస్ తత్వవేత్త), 11వ శతాబ్దం.**

వాణిజ్యం, పరిశ్రమలు, వ్యవసాయం వంటివి ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకోవాలి. ఇలా చెయ్యటం ద్వారా మాత్రమే పేదలకు న్యాయం జరుగుతుంది. ధనికులు వాళ్ళ నెత్తురు తాగటం ఆగుతుంది.

**16. డబ్బు**

**జాన్ కెనెత్ గాల్‌బ్రేత్ (1908 - 2006),**

**అమెరిక్ ఆర్థిక శాస్త్రజ్ఞుడు, దౌత్యవేత్త**

పంచభూతాల్లాంటిదే డబ్బు. మన వ్యాఖ్యానాల వల్ల దాని స్వభావం మారదు. దీన్ని మనిషి తన అవసరానికి వాడుకోవచ్చు. లేదా పూజగదిలో పెట్టి పూజించనూ వచ్చు. డబ్బుంటే ఎన్నికల్లో సోషలిస్టుకైనా, ఫాసిస్ట్‌కైనా గెలుపు ఖాయం. బూతకథలు రాసినా, భగవద్గీతకు మరో వ్యాఖ్యానం రాసినా వచ్చేది డబ్బే. డబ్బుంటే ప్రపంచంలోని అరుదైన కళాఖండాలను స్వంతం చేసుకోవచ్చు. లేదా నాజీల నరమేథాన్ని సృష్టించవచ్చు. డబ్బు మంచిదా, చెడ్డదా అంటే, మనం వుపయోగించటాన్ని బట్టి దాని అర్థం మారుతుంది.

◆◆◆

**17. సైనికుడు**

**ఫ్రెడెరిక్ ది గ్రేట్ ఆఫ్ ప్రష్యా (1712-1786)**

సైనికులు ప్రశ్నించటం ప్రారంభిస్తే అసలు సైన్యమే వుండదు.

◆◆◆

**18. హాస్యమే ఆయుధంగా**

**అనతోల్ ఫ్రాంస్ (1844 - 1924)**

**ఫ్రెంచి రచయిత, విమర్శకుడు, సోషలిస్టు.**

"చట్టం దృష్టిలో అందరూ సమానులే. పేవ్‌మెంట్ల మీద పడుకోవటానికీ, వీధుల్లో ముష్టెత్తుకోవడానికీ, పేదవాళ్ళకూ, ధనికులకూ సమాన స్వేచ్ఛ వుంది."

"ఆలోచించటం ఒక బలహీనత, తరతరాలుగా ప్రవక్తల్నీ మతప్రచారకుల్నీ రక్షించినట్టుగానే, దేవుడు ఈ బలహీనత నుండి కాపాడనీ."

"ప్రజాస్వామ్యంలో అసలు పాలకులు ప్రజలు కారు. పత్రికలలో నిత్యం అబద్ధాలు ప్రచురించీ, చట్టసభల్లోని ప్రతినిధులను తన జేబుల్లో పెట్టుకుని ప్రజాభిప్రాయాన్ని తమకు అనుకూలంగా మార్చుకునే కోటీశ్వరుల లాబీలు. ప్రజాధనం వాళ్ళ ప్రైవేటు ఖజానాల్లోకే చేరుతుంది. ప్రజల భాగ్యవిధాతలు వాళ్ళే.



**19. పెంగ్విన్ ఐలండ్ (1908) నుండి**

"అదిగో, వాడు ప్రత్యర్థిని నిర్దయగా గొంతుపిసికి చంపేస్తున్నాడు. మరొకరు స్త్రీ తల పచ్చడి చేస్తున్నాడు."

"అవును వాళ్ళు చట్టాన్ని అమలు చేస్తున్నారు, ప్రైవేటు ఆస్తి యిక్కడే, యిప్పుడే ఆవిర్భవిస్తున్నది. ఈ విలువలతోనే మన నాగరికత అభివృద్ధి చెందబోతున్నది. ప్రభుత్వానికి మూలస్తంభాలు యివే. ఆస్తి. హింస."

"ఎలా?"

ప్రైవేటు ఆస్తికి సామాజిక రూపమే ప్రభుత్వం. ఈ హక్కును కాపాడటానికే ప్రభుత్వాలు ఏర్పడతాయి. లాయర్లు, జడ్జీలు, పోలీసులు - అందరి డ్యూటీ యిదే. ప్రైవేటు ఆస్తి పరిరక్షణ."



**20. మార్క్‌ట్వేన్ (1835 - 1910), అమెరికన్ రచయిత**

సమాజంలో సత్ప్రవర్తనకు గౌరవం వుంది. డబ్బుకు అంతకన్నా ఎక్కువ గౌరవం వుంది.



**21. కవి**

**ఫ్రాన్సిస్ థాంప్సన్ (1859 - 1907) ఇంగ్లీష్ కవి.**

గిల్లితే ఏడ్చితే పిల్లల్లాగ, కడుపు కాలితే తప్ప మంచి కవిత్వం రాయలేడెవడూ. దేవుడు వాణ్ణలా పుట్టించాడు. అంతే.



**22. జర్నలిజం**

**జాన్ స్వింటన్ (1829 - 1901) అమెరికన్ జర్నలిస్ట్.**

**(ఒక సంపాదకుల సమావేశంలో)**

అమెరికాలో స్వతంత్ర వార్తా పత్రికలున్నాయనడం ఒక పెద్ద అబద్ధం - అక్కడక్కడా వూళ్ళనుండి వెలువడే కొన్ని చిన్న పత్రికలు తప్ప.

ఈ విషయం నాకన్న మీకే బాగా తెలుసు. ఏ జర్నలిస్టూ, ఏ సంపాదకుడూ నిజాయితీగా తన అభిప్రాయాన్ని రాయటానికి వీల్లేదు. ఒకవేళ రాసినా అది పత్రికలో ప్రచురింపబడే అవకాశం లేదని కూడా మీకు తెలుసు.

నా అభిప్రాయాలను వ్యక్తపరచకుండా వుండటానికి నా పత్రిక వాళ్ళు నాకు వారానికి 150/- ఇస్తారు. మీరూ నాలాగే రాజీపడినందుకు, లొంగిపోయినందుకు, మిమ్మల్ని మీరు అమ్ముకున్నందుకు యిలాగే మంచి జీతాలిస్తారు. ఒకవేళ రాయటమే ముఖ్యమనుకున్నారనుకోండి. మీరు రాసిన కాగితం మీద సిరా ఆరిపోకముందే, వుద్యోగం వూడగొట్టుకొని, రోడ్డుమీద పడటం ఖాయం. మరో వుద్యోగం కోసం ప్రయత్నిస్తామంటారా, అక్కడా యిదే పరిస్థితి ఎదురవుతుంది.

న్యూయార్క్ జర్నలిస్టు నిర్వరిస్తున్న ఏకైక కర్తవ్యం సత్యాన్ని సమాధి చెయ్యటం. కాదు కాదు నాశనం చెయ్యటం. లేదా దాన్ని మార్చి, వక్రభాష్యాలు చెప్పి దుష్టధనదేవత (Mammon) కాళ్ళదగ్గర బలివ్వటం. అలా, భుక్తికోసం, తన చిన్న చిన్న కోరికలు తీర్చుకోవటం కోసం జర్నలిస్టులు తమనూ, తమ వృత్తినీ తాకట్టు పెట్టుకుంటున్నారు.

ఈ విషయం కూడా నాకన్నా మీకే బాగా తెలుసు. ఇంచుమించు అందరూ అనుభవపూర్వకంగా యిప్పటికే చేదునిజం గ్రహించి వుంటారు.

మరి ఈ నేపథ్యంలో మనం 'Independent Press' అంటూ సంబరాలు చేసుకోవడం అవసరమా? అసలు యిది నిజమైన "స్వతంత్ర వార్తా పత్రికల"ను పరిహసించడం కాదా?

తెరవెనక దాగి భాగోతం నడిపిస్తున్న డబ్బుమూటల గాళ్ళ చేతుల్లో కీలు బొమ్మలం మనం. వాళ్ళ మోచేతి నీళ్ళు తాగి బతుకుతున్నాం. వాళ్ళు ఆడమన్నట్టల్లా ఆడుతున్నాం. మన ప్రతిభ, మన పాండిత్యం, మన వృత్తినైపుణ్యం అన్నీ వాళ్ళకు నైవేద్యం. మనం మేథో వ్యభిచారులం. జర్నలిజం పేరిట విటులను వెదుక్కుంటున్న వేశ్యలం.

**23. గిలటిన్ కింద నువ్వూ, నేనూ**

**ఆల్బర్ట్ కామూ (1913-1960)**

**ఫ్రెంచి నవలా రచయిత, తత్వవేత్త.**

నేరం పునాదులమీద నిర్మాణమైన ఈ నాగరికతను ఎలా అర్థం చేసుకుందాం? సమాధానం సులభమే. గత కొన్ని

ముందుకు పోతానంటే
ఎందుకు నీ విరగబాటు ఇటనే నిలుచో
మందురు వెనక్కి పోవల
సిందని కూడా శాసింత్రు సిరిసిరి మువ్వా

◆

గడియారం వెనకకు త్రి
ప్పెదువారే నేడు మనకు పెత్తనదారుల్
నడికడలిని పడవను ముం
చెడు నావికులిట్టివారే సిరిసిరిమువ్వా.....

◆

స్వాతంత్ర్యం సౌమ్యం సౌ
భ్రాతృత్వాలను చిలుక పలుకలతోడన్
నూతన నిగళ నిబంధన
చేతస్కులు వెలసినారు సిరిసిరిమువ్వా

◆

శ్రీశ్రీ



ఇంతెందుకు వింతలలో
వింతైన విశేషమొకటి వినిపిస్తున్నా
సొంతంగా సొంతంగా
చింతిస్తే పెద్ద తప్పు సిరిసిరి మువ్వా ◆

మాట్లాడటం లేదు. రక్తం కొందరికి మద్యం లాంటిదే. మత్తెక్కిస్తుంది. రాజ్యహింస పెరిగింది. ప్రైవేటు హత్యలకన్న ఎన్నోరెట్లు ఎక్కువ ప్రభుత్వ హత్యలు జరుగుతున్నాయి. చట్టబద్ధంగా శిక్షింపబడే వాళ్ళు తక్కుమంది. రాజకీయ కారణాలతో హత్య చేయబడుతున్న వాళ్ళెక్కువమంది. మనం ఎంత అమాయకులం, ఎంత సజ్జనులం, చట్టాన్ని గౌరవించే వాళ్ళమనుకున్నా, మనకూ ఎప్పుడు మరణశిక్ష విధిస్తారో తెలియని పరిస్థితి దాపురించింది. ఈ శతాబ్ద (అంటే గత శతాబ్ద) ప్రారంభంలో యిలాంటి విషయాలు జరగగలవన్న వూహ కూడా ఎవరికీ రాలేదు. పైగా, ఈ నరహంతకులు తాము చాలా న్యాయబద్ధంగానే, ధర్మబద్ధంగానే హత్యలు చేస్తున్నామని తమను తాము నమ్మించుకుంటున్నారు. “చరిత్ర మేం చేసిన పనులు సరైనవే అని తీర్పు చెబుతుంది” అని విర్రవీగుతున్నారు.

అందువల్ల సమాజం తనను తాను రాజ్యహింస నుండి ప్రభుత్వం హత్యల నుండి రక్షించుకోవలసిన అగత్యం వచ్చింది.

**24. కమ్యూనిస్ట్ మేనిఫెస్టో**

**కార్ల్‌మార్క్స్ (1818 - 1883);**

**ఫ్రెడరిక్ ఎంగెల్స్ (1820 - 1895)**

కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలను, ఆశయాలను దాచుకోరు. ప్రస్తుత సామాజిక వ్యవస్థను కూలదోయటం ద్వారానే తమ లక్ష్యం నెరవేరుతుందని బహిరంగంగా ప్రకటిస్తారు. కమ్యూనిస్ట్ విప్లవాన్ని చూసి అధికారవర్గాలు గజగజా వణకనీ! కార్మికులకు పోయేదేం లేదు సంకెళ్ళు తప్ప. నవయుగానికి వారసులు వాళ్ళే.

ప్రపంచ కార్మికులారా, ఏకం కండి!

◆◆◆

**25. తత్వవేత్తలికో సలహా**

**(పదకొండవ) Theses on Feuerbach**

**తత్వవేత్తలు ఈ లోకాన్ని గురించి రకరకాలుగా వ్యాఖ్యానించారు కాని, కావలసింది, దాన్ని మార్చటం.**

# పునఃసమీకరణకు ఒక పిలుపు



సుచిత్రా విజయన్

ఏ సమాజమైతే తన రచయితలను పర్యవేక్షిస్తుందో, వారి నోళ్ళను నొక్కేస్తుందో ఆ సమాజం నీతి, రాజకీయాలను గురించి విమర్శనాత్మకంగా ఆత్మపరిశీలన చేసుకోవల్సిన అవసరం ఉంటుంది. సాహిత్యానికి మనం వదిలే స్థలం ప్రమాదకరంగా చాలా తక్కువగా ఉంటుంది. దాన్ని కూడా రాజకీయ ప్రయోజనాల కోసం వాడుతున్నారు. ఈ సంఘటనను అధిక్షేపించటం అంటే కేవలం భావ ప్రకటనా స్వేచ్ఛను అణచి వేయటం గానే కాకుండా ఒక క్రూర కథనాన్ని సమాజంపై రుద్దటంగానూ; కుల, మతతత్వాలను పెంచిపోషించేది గానూ, తన పౌరుడి ప్రాథమిక హక్కులను కాపాడే బాధ్యతనుంచి ప్రభుత్వం తప్పుకోవటం గానూ దీనిని చూడవల్సి ఉంటుంది.



'నా'తో ఇలా ప్రవర్తించకండి.
నన్ను వదలి వెళ్ళకండి,
నేను నా రచనల్లో ఎల్లవేళలా నిజం మాట్లాడలేదా?
నన్ను మీరు ఇప్పుడు ఒక అబద్దాలకోరుగా చూస్తున్నారు!
నేను మిమ్మల్ని ఆదేశిస్తున్నాను!!
నన్ను కాల్చేయండి!!!

1933లో నాజీలు ప్రచురణలను నిషేధిస్తూ, గ్రంథాలను తగలబెడుతున్న సందర్భంగా ప్రముఖ జర్మన్ కవి, నాటక రచయిత బెర్‌టోల్ట్ బ్రెక్ట్ ఈ వాక్యాలను రాశాడు. కల్లోల కాలంలో నివసించిన ఆయన తనను కాల్చివేయండని డిమాండ్ చేశాడు. కొన్ని దశాబ్దాల తరువాత మరో విషాదంలో రచయిత పెరుమాల్ మురుగన్ ఇలా రాశాడు. 'రచయిత పెరుమాల్ మురుగన్ మరణించాడు. ఆయన దేవుడేం కాదు. కాబట్టి ఆయన మళ్ళీ బతికి తిరిగిరాడు. ఆయనకు పునర్జన్మ మీద నమ్మకం లేదు. ఇప్పటినుంచి ఆయన గతంలోలాగా ఉపాధ్యాయుడిగానే మిగిలిపోతాడు'.

2010లో తాను రాసిన 'మధోరుభగన్' కారణంగా కుల, హిందూ మతతత్వవాదులు వెంటాడి వేధింపులకు గురిచేసిన తరువాత మురుగన్ ప్రకటన వెలువడింది. ఒక శతాబ్దం క్రితం రచయిత స్వస్థలం తమిళనాడులోని తిరుచెంగోడ్ పట్టణం నేపథ్యంలో మురుగన్ ఈ గ్రంథాన్ని రచించాడు. ఈ

గ్రంథం వెలువడిన నాలుగు సంవత్సరాల తరువాత దీనిలో ప్రధానాంశంగా పేర్కొనబడిన సమ్మతితో కూడిన లైంగిక ఆచారాలు తమ పట్టణాన్ని, తమ ఆలయాన్ని, తమ స్త్రీలను కించపరిచాయని స్థానిక గ్రూపులు నిరసనలకు దిగాయి. 'మధోరుభగన్' నవల ప్రతులను దగ్ధం చేసి, రచయితను నిర్బంధించాలని అధికారులను డిమాండ్ చేశాయి.

ఈ హింస కొనసాగు తుండగా ప్రభుత్వ యంత్రాంగం, రాజకీయ పార్టీలు అహేతుకంగా మౌనం వహించాయి. రచయిత పెరుమాల్ మురుగన్ హక్కులను పరిరక్షించటానికి బదులుగా జిల్లా యంత్రాంగం ఒక 'శాంతి సమావేశాన్ని' నిర్వహించింది. ఈ సమావేశంలో పాల్గొన్న కుల, మత సంస్థల ప్రతినిధులు 'గ్రంథంలోని భాగాలను తొలగిస్తానని, అమ్ముడు పోని ప్రతులను ఉపసంహరించు కుంటానని, ప్రజల మనోభావాలను దెబ్బతీసే రచనలను చేయనని' రచయితను నిర్బంధంగా ఒప్పించారు. ఒక రచయితను తన మాటలను ఉపసంహరించుకునేలా చేయటం, తన సృజనకుగాను క్షమాపణ వేడుకునేలా చేయటం, ఒక రచయిత గౌరవాన్ని దెబ్బతీయటం నియంతృత్వ చర్య. ఈ హింస అంగీకారం కానిది. సరిగ్గా ఇలాంటి హింసనే పెరుమల్ మురుగన్‌పై ప్రయోగించారు.

ఏ సమాజమైతే తన రచయితలను పర్యవేక్షిస్తుందో, వారి నోళ్ళను నొక్కేస్తుందో ఆ సమాజం నీతి, రాజకీయాలను గురించి విమర్శనాత్మకంగా ఆత్మపరిశీలన చేసుకోవల్సిన అవసరం ఉంటుంది. సాహిత్యానికి మనం వదిలే స్థలం ప్రమాదకరంగా చాలా తక్కువగా ఉంటుంది. దాన్ని కూడా రాజకీయ ప్రయోజనాల కోసం వాడుతున్నారు. ఈ సంఘటనను అధిక్షేపించటం అంటే కేవలం భావ ప్రకటనా స్వేచ్ఛను అణచివేయటంగానే కాకుండా ఒక క్రూర కథనాన్ని సమాజంపై రుద్దటంగానూ; కుల, మతతత్వాలను పెంచిపోషించేది గానూ, తన పౌరుడి ప్రాథమిక హక్కులను కాపాడే బాధ్యతనుంచి ప్రభుత్వం తప్పుకోవటంగానూ దీనిని చూడవల్సి ఉంటుంది.

ప్రపంచంలో అస్థిత్వంలో ఉన్న ప్రతిదీ ఒక పుస్తకంలో నిక్షిప్తం అవుతుందని ఫ్రెంచి కవి స్టెఫానె మల్లార్మె అన్నాడు. జ్ఞాపకాలను, ఊహల్ని, భావనల్ని, జ్ఞాన మూలాలను నిక్షిప్తం చేసుకునేందుకు వాడే ప్రధాన సాధనంగా గ్రంథం ఉంటుంది. అది భావజాలాలను సృష్టిస్తుంది. వాటికి సవాలు విసురుతుంది. అది రాజ్యాన్ని ప్రశ్నిస్తుంది. అన్నిటికీమించి అది అధికారాన్ని చలాయించే సాధనం. దాన్ని విమర్శించే పద్ధతి. సోవియట్ విమర్శకుడైన యవ్‌జెని యవ్‌తుషెన్‌కో ఇలా అన్నాడు: 'సత్యం స్థానాన్ని మౌనం భర్తీ చేసినప్పుడు ఆ మౌనం ఒక అబద్ధమౌతుంది'. ఒక రచయిత నోరు నొక్కటం అనాగరికం తప్ప మరొకటి కాదు. పుస్తకాలను తగలబెట్టటం అంటే రచనా వ్యాసాంగాన్ని ఒక ఆచారంగా తీవ్రరూపంలో నియంత్రించటమే! అది ఒక గ్రంథాన్ని, దానిలోని భావాలను బలవన్మరణానికి గురిచేయటానికి ప్రతీక. ఏది ఏమిటి, ఏది అంగీకారం లేక ఏది ఆమోదయోగ్యం అనే విషయాన్ని తెలిపే క్రూర కథనం ఇచ్చే ఆజ్ఞ అది. ఆలోచనలను నిర్మూలించటం, ప్రవచనాన్ని ముగించటం, మేధో స్వేచ్ఛను చావుదెబ్బ తీయటం కోసం చేసే నిశ్చిత ప్రయత్నమే ఇది. ఇది రాబోతున్న ప్రక్షాళన దృశ్యం. దాని ఆచార సంకేతం.

> **ఒక రచయిత నోరు నొక్కటం అనాగరికం తప్ప మరొకటి కాదు. పుస్తకాలను తగలబెట్టటం అంటే రచనా వ్యాసాంగాన్ని ఒక ఆచారంగా తీవ్రరూపంలో నియంత్రించటమే!**

1933లో జర్మనీ అంతటా నాజీలు పుస్తకాలను తగల బెడుతున్నప్పుడు 'కుటుంబ గౌరవాన్ని కాపాడటం కోసం', 'జర్మన్ భాష సమగ్రతను పునఃప్రతిష్టించటానికి' తామీ పని చేస్తున్నామని ఆ కార్యక్రమంలో పాల్గొన్నవారు సమర్థించుకున్నారు. 'మహిళలను కించపరిచారు', 'సమాజం మనోభావాలను ఉద్దేశపూర్వకంగా ఆయన గాయపరిచాడు' లేక 'జరగని విషయాలను గురించి ఆయన రాశాడు' లాంటి సమర్థింపులను పెరుమాల్ మురుగన్ గ్రంథాన్ని తగలబెడుతున్నప్పుడు ఈనాడు మనం వింటున్నాం. మనం గర్హించే ఆలోచనల పట్టిక మన దగ్గర కూడా ఒకటి ఉంది. సృజనాత్మక రచనలను అర్థం చేసుకోలేక, నీతిపేరుతో వాటిని నాశనం చేసే, నైతిక, రాజకీయ భావనలు లేని వ్యక్తులచే వడపోయబడిన ఆలోచనలు అవి. ఇలాంటి సంకుచిత వ్యాఖ్యానాలు ఇలానే కొనసాగితే తమిళ సాహిత్యంలోని కొన్ని మహోన్నత ప్రాచీన గ్రంథాలు వాటి సంక్లిష్ట ఉద్విగ్న- కామోద్దీపక- రాజకీయ సృష్టి కారణంగా నియంత్రణకు

గురవుతాయి.

కీర్తిశేషుడు ఆచార్య ఎంఎస్ ఎస్ పాండ్యన్ ఇలా రాశాడు : 'లౌకికవాదం తనకు తాను విశ్వజనీనమైన భావన అని అనుకోవచ్చు. అయితే దాని రాజకీయ కార్యాచరణ తీరుతెన్నులను 'దాని' స్థానిక వ్యక్తీకరణలు మాత్రమే తెలుపగలవు'. ఈ ప్రహసనం అర్థం కావాలంటే దీనికి కారణభూతులైన వారి గురించి అర్థం చేసుకోవాలి. హిందూ మున్నానితో పాటుగా మరో మూడు కులసంఘాలు పెరుమాల్ మురుగన్ నోరునొక్కే కార్యక్రమంలో పాల్గొన్నాయి. తమిళనాడులో తిరోగామి శక్తుల రాజకీయ సమీకరణ, ఎన్నికల రాజకీయాల నేపథ్యంలో ఈ కృత్రిమ నిరసనను అర్థం చేసుకోవల్సి ఉంటుంది.

**హిందూ మున్నానితో పాటుగా మరో మూడు కులసంఘాలు పెరుమాల్ మురుగన్ నోరునొక్కే కార్యక్రమంలో పాల్గొన్నాయి. తమిళనాడులో తిరోగామి శక్తుల రాజకీయ సమీకరణ, ఎన్నికల రాజకీయాల నేపథ్యంలో ఈ కృత్రిమ నిరసనను అర్థం చేసుకోవల్సి ఉంటుంది.**

తమిళనాడులో రాజకీయ దృశ్యం అనేక చారిత్రక శక్తుల ఉజ్జాయింపుగా ఉంది. ఇది చాలావరకూ మత విశ్వాసాలు లోతుగా వేళ్ళూనుకున్న సమాజం. కులపర విభజనతోపాటు బ్రాహ్మణ సంప్రదాయాలు ప్రధానపాత్ర పోషిస్తున్నాయి. అదే సమయంలో హేతువాదం, నాస్తికత్వం, బ్రాహ్మణవాద వ్యతిరేకత భావజాలంగా ఉన్న ద్రవిడియన్ ఉద్యమం కూడా బలంగా ఉంది. అఖిల భారత అన్నా ద్రవిడ మున్నేట్ర ఖగజం, ద్రవిడ మున్నేట్ర ఖగజం పార్టీల పాలనలో ఈ రాష్ట్రం ఉంది. హేతువాదం, నాస్తిక సంప్రదాయం భావజాలంగా ఉన్న ఈ పార్టీలు ఎన్నికల్లో గెలవటానికి అనేక విధాలుగా రాజీపడుతున్నాయి. తాత్కాలిక ప్రయోజనాల కోసం ఈ పార్టీలు తమ రాజ్యాంగ విధులను విస్మరిస్తున్నాయి.

తాము ప్రకటించుకున్న హేతువాదం, లౌకికవాదం, సామాజిక న్యాయం కోసం పోరాటం అనే ఆశయాలను విస్మరిస్తూ మోసపూరితంగా ఈ పార్టీలు వ్యవహరిస్తున్నాయి. మాజీ ముఖ్యమంత్రి అన్నాదురై ప్రవచించిన తమిళ్ లౌకికవాదం అడ్రసు గల్లంతై 1970వ దశకం నుంచి ఎన్నికల్లో గెలవటానికి ఈ పార్టీలు కుల రాజకీయాలను ఆశ్రయిస్తున్నాయి. గత కొన్నేళ్ళుగా ప్రభుత్వ పాలనానిర్వహణలో కుల రాజకీయాలు, ఆశ్రిత పక్షపాతం మరింతగా వ్యవస్థీకృతమైంది. ఈ వాతావరణంలో హిందూ మున్నాని పార్టీ 1990లలో ఒక శక్తిగా అవతరించింది. ఆర్ఎస్ఎస్‌తోపాటు మున్నాని తమిళనాడులో ప్రధాన హిందూ మతతత్వ పార్టీగా ఆవిర్భవించింది. ఇది ఉత్తర భారతదేశంలో విశ్వ హిందూ పరిషత్‌లాగా రాజకీయ– మత– నైతిక పోలీసింగ్ పాత్రను నిర్వహిస్తోంది. గత పదేళ్ల కాలంలో హిందూ మతతత్వ శక్తులు తమిళనాడులో అంతగా ప్రభావం చూపలేకపోయాయి. పెరుమాల్ మురుగన్ సంఘటనతో ప్రమాదకర త్రయం అయిన ద్వేషం, మత దురభిమానం, మోసపూరిత భావజాలాలు తమిళనాడులో స్వైర విహారం చేస్తున్నాయి. మొట్టమొదటిసారిగా కులయుద్ధాలు, హిందూ జాతీయవాదం చేతులు కలిపి ఒక ప్రమాదకర దృష్టాంతాన్ని సృష్టించాయి.

తమిళనాడుతో పొనగని తిరోగమన హిందుత్వ వాదం క్రమేణా ఆమోదయోగ్యంగా మారుతోంది. భాషా ఉద్యమాలరూపంలో, నైతిక ప్రవర్తన నియంత్రణ రూపంలో, మత ఘర్షణల రూపంలో ఉదార స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు ప్రమాదంలో పడ్డాయి. ఆశ్చర్యకరంగా రక్షించాల్సిన ప్రభుత్వం మౌనంగా ఉండిపోతోంది. పెరుమాల్ మురుగన్‌కు రాజ్యాంగం ఇచ్చిన హక్కు కాలరాయబడుతోంది.

ఒక సమాజంగా మనం సిగ్గుతో తల దించుకుంటున్నాం. మన మేధో భవితను, మన సాహిత్య సంబంధ గతాన్ని తాకట్టు పెట్టిన దివాళాకోరు రాజకీయ నాయకత్వం ఉక్కు కౌగిలిలో మనం బంధీలమయ్యాం. మనం చేసుకున్న ఏర్పాట్లను కుల వైషమ్యాలు కబళిస్తున్నాయి. మన ప్రతిఘటనలో రాజకీయ చైతన్యం కనిపించకుండా పోతుంది. నిషేధాలు, నియంత్రణలు, విచారణలు, కుసంస్కారులు చరిత్ర సుదీర్ఘయాత్రలో అనివార్యంగా ఓడిపోతారనే ఊరట తప్ప ఈ దుర్దినాన మనకు మిగిలిందేమీ లేదు. నోరు నొక్కబడిన రచయిత తను ఏమీ రాయకపోయినా రచయితగా మిగులుతాడనే ఆశలో మనం సాంత్వనం పొందగలం. జీవించి ఉన్న రచయిత మరణానికి ఇది స్తుతిగా మిగలరాదు. దీనిని మన పునఃసమీకరణకు పిలుపుగా భావిద్దాం.

# ఒక కలానికి ఊపిరులూదిన తీర్పు



తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్ కేసులో మద్రాసు హైకోర్టు వెలువరించిన తీర్పు కూడా వర్తమాన పరిస్థితుల మధ్య అలాంటి వెలుగే. ఏడాదిన్నర క్రితం పెరుమాళ్ మురుగన్ రచయితగా తాను మరణించినట్టు ఫేస్‌బుక్‌లో చేసిన ప్రకటనతో ఒక అణచివేత వెలుగులోకి వచ్చింది. ఆయన నవల 'మాధోరుబగన్' 1940ల్లో తిరుచెంగోడ్ పట్టణంలో పిల్లలు లేని దంపతులు కాళి, పొన్నల కథ చెబుతుంది. ఇద్దరూ ఎన్ని గుళ్లు తిరిగినా, ఎవరికి మొక్కినా ఫలితం దక్కదు. చివరికి ఒకటే దారి కనిపిస్తుంది. తిరుచెంగోడ్ అర్ధనారీశ్వరుడికి జరిగే రథోత్సవ వేడుకల్లో 14వ రోజున సాంఘిక కట్టుబాట్లు వదులవుతాయి. ఆ రాత్రి ఎవరు ఎవరితోనైనా శృంగారంలో పాల్గొనవచ్చు. ఈ వేడుక కాళి, పొన్నల సంసారంలో ఏ మార్పు తీసుకొచ్చిందన్నది అసలు కథ. ఇలాంటి సంప్రదాయం ఏదీ లేదని, పెరుమాళ్ మురుగన్ కల్పితకథతో తమ దేవుడ్నీ, స్త్రీలను అవమానించాడని కొన్ని హిందూసంస్థలు గొడవకు దిగాయి. పెరుమాళ్ మురుగన్ చేత పోలీసుల సమక్షంలో క్షమాపణ చెప్పించాయి.

మూర్ఖత్వం నల్లగా దట్టంగా అలుముకున్నప్పుడు ఏ కొంచెం కామన్‌సెన్స్ అయినా కొట్టొచ్చినట్టు ప్రకాశిస్తుంది. తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్ కేసులో మద్రాసు హైకోర్టు వెలువరించిన తీర్పు కూడా వర్తమాన పరిస్థితుల మధ్య అలాంటి వెలుగే. ఏడాదిన్నర క్రితం పెరుమాళ్ మురుగన్ రచయితగా తాను మరణించినట్టు ఫేస్‌బుక్‌లో చేసిన ప్రకటనతో ఒక అణచివేత వెలుగులోకి వచ్చింది. ఆయన నవల 'మాధోరుబగన్' 1940ల్లో తిరుచెంగోడ్ పట్టణంలో పిల్లలు లేని దంపతులు కాళి, పొన్నల కథ చెబుతుంది. ఇద్దరూ ఎన్ని గుళ్లు తిరిగినా, ఎవరికి మొక్కినా ఫలితం దక్కదు. చివరికి ఒకటే దారి కనిపిస్తుంది. తిరుచెంగోడ్ అర్ధనారీశ్వరుడికి జరిగే రథోత్సవ వేడుకల్లో 14వ రోజున సాంఘిక కట్టుబాట్లు వదులవుతాయి. ఆ రాత్రి ఎవరు ఎవరితోనైనా శృంగారంలో పాల్గొనవచ్చు. ఈ వేడుక కాళి, పొన్నల సంసారంలో ఏ మార్పు తీసుకొచ్చిందన్నది అసలు కథ. ఇలాంటి సంప్రదాయం ఏదీ లేదని, పెరుమాళ్ మురుగన్ కల్పితకథతో తమ దేవుడ్నీ, స్త్రీలను అవమానించాడని కొన్ని హిందూసంస్థలు గొడవకు దిగాయి. పెరుమాళ్ మురుగన్ చేత పోలీసుల సమక్షంలో క్షమాపణ చెప్పించాయి. అయినా గొడవ కోర్టుకెక్కి ఏడాది పాటు విచారణ సాగింది. మొన్న జూలై 5న మద్రాసు హైకోర్టు కేసు కొట్టివేస్తూ చరిత్రాత్మకమైన తీర్పునిచ్చింది. చీఫ్ జస్టిస్ ఎస్.కె.కౌల్, జస్టిస్ పుష్పా సత్యనారాయణలతో కూడిన ధర్మాసనం ఇచ్చిన 160 పేజీల తీర్పు నుంచి ఏరికూర్చిన పాఠ్యానికి ఇది అనువాదం.

సమాజం ఒక పుస్తకాన్ని చదివి అదేమి చెబుతున్నదో నొచ్చుకోకుండా

ఆకళింపు చేసుకోవటానికి సిద్ధమేనా కాదా అన్నది ఎన్నో ఏళ్లుగా ఉన్న చర్చే. కాలం మారుతున్నది. ఒకప్పుడు ఒప్పుకోలేనిది తర్వాత సమ్మతి పొందుతున్నది. 'లేడీ ఛాటర్లీస్ లవర్' దీనికి ఒక ప్రముఖ ఉదాహరణ. ఒక పుస్తకం చదవాలా వద్దా నిర్ణయించుకునే వెసులుబాటు పాఠకునికి ఎప్పుడూ ఉంది. ఒక పుస్తకం నీకు నచ్చకపోతే, విసిరి పారేయ్. బలవంతమేమీ లేదు. సాహిత్యాభిరుచులు మనిషి మనిషికీ మారతాయి– ఒకరికి సరైనది మరొకరికి కాకపోవచ్చు. అయితే రాసే హక్కుకు ఏ ఆటంకమూ లేదు. ఒకవేళ పుస్తకంలోని అంశాలు రాజ్యాంగ విలువలని కాలరాస్తున్నా, వర్గ ఘర్షణల్ని లేవనెత్తుతున్నా, కులాలను కించపరుస్తున్నా, సమర్థనీయంకాని శృంగారాన్ని చిత్రిస్తున్నా, లేదా దేశ అస్తిత్వంపైనే దాడి చేస్తున్నా, రాజ్యం ఖచ్చితంగా కలగజేసుకుంటుంది, అందులో సందేహం లేదు.

ప్రస్తుతం మా ముందున్నది చిత్రమైన కేసు. ప్రొఫెసర్ పెరుమాళ్ మురుగన్ రాసిన 'మాధోరుబగన్' ఒక తమిళ నవల, ఇది 'వన్ పార్ట్ వుమన్' పేరుతో ఇంగ్లిషులోకి తర్జుమా అయింది, ఎన్నో పురస్కారాలు కూడా దక్కాయి, అయినాకూడా ఈ పుస్తకం ప్రమాదకరమనీ, వినాశకరమనీ, కథ జరిగిన స్థలానికి చెందిన ప్రజల మనోభావాల్ని రెచ్చగొడుతున్నదనీ ఆరోపణలు వచ్చాయి.

ఈ నవలకు చరిత్ర ఆధారమా, అయితే ఏమిటి? కొన్ని సంఘటనలు జరిగాయనటానికి ఎప్పుడూ నమోదైన చరిత్రే రుజువుగా ఉండితీరాలా, లేక మనిషి నుంచి మనిషికి అందే జానపద వృత్తాంతాలు కూడా ఒక పుస్తకానికి ఆధారం కావొచ్చునా? ఏదేమైనా, మన మనసు నొచ్చుకునే పరిస్థితి నుంచి ఎలా తప్పించుకోవచ్చు? "ఒక పుస్తకానికి నొచ్చుకోకుండా ఉండటం చాలా సులువు, దాన్ని మూసేస్తే చాలు?" అన్న సాల్మన్‌రష్దీ మాట మనకేమైనా పనికొస్తుందా?

చిత్రకారుడు ఆలోచనల్ని గీస్తాడు. శిల్పి చెక్కుతాడు. అలాగే రచయిత రాస్తాడు. మొదటి రెండు సందర్భాల్లోనూ ఆలోచనలు సరళమైన నిర్మాణంతో వ్యక్తమవుతాయి. పుస్తకం ఆలోచనల్ని చెప్పటానికి మరింత వివరమైన విశదమైన పద్ధతి. అది సరళ నిర్మాణం కాదు. ఒక ఇతివృత్తాన్ని నింపాదిగా అల్లుతుంది. అందుకే, ఒక పుస్తకాన్ని అశ్లీలతే కాదు, మరింకే ప్రమాణాల ద్వారానైనా నిగ్గుతేల్చాలంటే ముందు దాన్ని ఆసాంతంగా చదివి, ఆకళింపు చేసుకోవాలి. పుస్తకాన్ని ఏదో చట్టశాసనం చదివినట్టు చదివి ఒక నిర్ధారణకు రాలేము. అక్కడో వాక్యమూ ఇక్కడో వాక్యమూ ఎత్తిచూపి అంచనా వేయలేము. పుస్తకాల్లో వాడే భాష కూడా సందర్భాన్ని బట్టి ఒక్కోసారి మర్యాదగా మెరుగుపెట్టిన భాషలాగానూ, మరోసారి స్థానిక యాసలతో వెూటుగానూ ఉండవచ్చు. దూషణపూరితమైన భాష విషయంలో ఎలాగూ కొన్ని హద్దులున్నాయి. కానీ మరోలా చూస్తే, వాస్తవాలెప్పుడూ పూలపాన్పు కాదు, అవి కటువుగానే ఉంటాయి. అందుకే, స్త్రీల సమస్యలు, లేదా సామాజికంగానూ ఆర్థికంగానూ వెనుకబడిన వర్గాలవారి యాతనలూ ఇలాంటి సామాజికాంశాల గురించి రాసిన పుస్తకాలు పైకి కటువుగా కనిపించవచ్చు. ఒక్కోసారి సందేశాన్ని పాఠకులకు చేర్చేందుకు వారు బిత్తరపోయేట్టుగానే వాస్తవాల్ని చూపించాల్సి వస్తుంది. ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడి, సంఘ వివక్షను ఎదుర్కొంటున్న పిల్లలు లేని దంపతుల కష్టాలని కూడా "సున్నితమైన" పద్ధతిలో చెప్పితీరాలా?

అశ్లీలపు హద్దుల్ని తాకకుండా ఏమేరకు శృంగార రీతుల్ని పుస్తకాల్లో చిత్రించవచ్చన్నది ఈ వివాదంలో మరో అంశం. ఇది ఆయా సమాజాల సంస్కృతీ సంప్రదాయాలపైనా, వర్తమానం లోని కట్టుబాట్ల పైనా ఆధారపడి ఉంటుంది. అయితే వర్తమానపు కట్టుబాట్లు ఎప్పుడూ కొంత గతం తాలూకు బరువు కూడా మోస్తూంటాయి.

స్వాతంత్ర్యం తరువాత రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగంలోని భాగం–3లో ప్రాథమిక హక్కులకు ఎంతో గొప్ప స్థానమిచ్చారు. వాక్ స్వాతంత్ర్యమూ, వ్యక్తీకరణ స్వాతంత్ర్యమూ రాజ్యాంగానికి ఆయువుపట్టు, దీన్ని న్యాయస్థానాలు బలంగా సమర్థిస్తూ వచ్చాయి. అయితే ఏ స్వేచ్ఛా హద్దుల్లేనిది కాదు. అందుకే వ్యక్తీకరణ స్వాతంత్ర్యానికి కూడా ఆర్టికల్ 19(2) ద్వారా పరిమితి విధించారు. ఆశ్చర్యకరంగా, స్త్రీ పురుష సంబంధాలు, శృంగారమూ, మతపరమైన ఆచారాల విషయాల్లో ప్రాచీన ధార్మిక గ్రంథాలే వర్తమానంతో పోలిస్తే ఎంతో ఉదారంగా ఉన్నాయి. అందం చూసేవాడి కళ్లల్లో ఉంటుందంటారు, ఏది అశ్లీలత అనేది తేల్చటానికి కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది.

ప్రాచీన సాహిత్యంలో శృంగార రీతుల్ని స్వేచ్ఛగా చిత్రించిన సందర్భాల్ని రచయిత తరఫు న్యాయవాదులు మా ముందుంచారు. ఇంతకుముందు లేనిదేదీ రచయిత



# ఈ తీర్పు రచయితలపై, కళాకారులపై దాడులను అరికడుతుందా?

- కన్నన్ సుందరమ్

జూలై 5వ తేదీ మధ్యాహ్నం న్యాయవాది, పియుసిఎల్ కార్యదర్శి అయిన డా॥ వి.సురేష్ పెరుమాళ్ మురుగన్ కేసులో ఆ రోజే వెలువడిన తీర్పును నాకు పంపించారు. నేను ఆ తీర్పును ఒకటికి రెండుసార్లు చదివాను. ఏ కోరికైనా నేరవేరాలని నేనెప్పుడైనా అనుకున్నానంటే అది ఇదే!

ఒక ప్రచురణ కర్తగా ఈ తీర్పు నాకెంతో శక్తినిచ్చింది. పెరుమాళ్ మురుగన్‌కి ఒక రచయితగా జీవితం బహుకరించబడింది. సాధారణ జీవితాన్ని గడపగలిగేందుకు ఒక అవకాశం దొరికింది.

**వేధింపుల పూర్వరంగం :**

2008లో డిఎమ్‌కె ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎడిటోరియల్స్, వ్యాసాలు ప్రచురించినందుకు మా 'కలచునాడు' మాసపత్రిక వరుసగా దాడులు ఎదుర్కొంటూ ఉండేది. శ్రీలంక తమిళుల అంతర్యుద్ధం చివరకు చేరుకున్న దశలో వారికి మద్దతు పలుకుతున్న వారిపై ప్రభుత్వం విరుచుకుపడుతుండేది. చెన్నై నగర శివార్లలో ఉన్నవారు



రాయలేదనీ, కానీ ప్రాచీన భారత సాహిత్యం పట్ల ఏ గౌరవమూ లేని కొన్ని గుంపులు సంకుచిత ద్ృక్పథంతో ఈ నవలకు వ్యతిరేకంగా కత్తిగట్టాయనీ నిరూపించే ప్రయత్నం చేశారు. వేద కాలం నుంచీ శృంగారమూ, కామరసభరితమైన సాహిత్యమూ, ప్రాచీన మధ్యయుగాల్లోని శృంగారపరమైన ఆచారాలూ ఎలా ఉన్నాయో ఈ తీర్పు ముందరి భాగాల్లో విస్తృతంగా ఉటంకించాము గనుక వాటిని మరలా పేర్కొనటం లేదు. మన స్వేచ్ఛావిలువల్ని నిజంగా ప్రతిబింబించేది ఆ సాహిత్యమేనని మరోమారు చెప్తున్నాము. మనదేశంపై బ్రిటిష్ దురాక్రమణ అనంతరం చెలామణీలోకి వచ్చిన విక్టోరియన్ ఇంగ్లిష్ భావజాలం చేత కలుషితం కాని విలువలు అవి. ఒక సమాజంగా మనం మన సాహిత్యం నుంచీ, ధార్మిక గ్రంథాల నుంచీ ప్రేరణ పొందటం మానేసి విక్టోరియన్ భావజాలంలో కూరుకుపోతున్నాం. శృంగారం దానికదే అవాంఛనీయంగా ఎన్నడూలేదు, నాగరికత ఆదిగా అది ఒక అంతర్భాగంగా ఉంటూనే వచ్చింది. మహాభారతంతో సహా భారతీయ ధార్మిక గ్రంథాల నిండా వివాహేతర శృంగారం గురించిన ఉదంతాలెన్నో ఉన్నాయి, అది కూడా చాలాసార్లు వంశాలను కొనసాగించటానికే. భవిష్యత్తులో ఒక పరిపూర్ణుడైన రాజుని పొందటం కోసం ఇలాంటి ఆచారాల్ని ఆనాటి సమాజంలో ఉన్నత నిమ్న సామాజిక ఆర్థిక వర్గాలు రెండూ పాటించాయి. ఇప్పుడు మహాభారతమూ, అలాంటి అనేక ఇతర గ్రంథాల్ని మన చరిత్రలో భాగమని చెప్తూనే, అవి మితిమీరిన కామాతురతని వ్యక్తం చేస్తున్నాయన్న కారణంతో వాటిని నిషేధించాలని చెప్పగలమా? మేము చెప్పగలిగినదల్లా ఇదే

**- *భవత్య అధర్మో ధర్మో హి ధర్మాధర్మావుభావపి***

***కారణాత దేశకాలస్య దేశకాలః స తాదృశః***

***స్థలకాల పరిస్థితుల్ని బట్టి ఏది ధర్మమో అది అధర్మం కావొచ్చు, అలాగే ఏది అధర్మమో అది ధర్మంగా మారవచ్చు.***

***-శాంతిపర్వము, 79. 31***

ఇతర మాధ్యమాలకు ఎంత ప్రజాదరణా లాభదాయకతా వున్నా, పుస్తకాలు ఇప్పటికీ ఒక శక్తివంతమైన సాధనమే. అవి చరిత్రను తీర్చిదిద్దటంలో అసమానమైన పాత్రపోషిస్తాయి. మంచి పుస్తకాలెప్పుడూ సాధికార స్వరంతో, సహేతుకంగా, స్పష్టంగా మాట్లాడతాయి. రచయిత, పాఠకులిద్దరి ఆలోచనకూ చోటిస్తాయి. ఈ ఆన్‌లైన్ వాదోపవాదాల, బెదిరింపుల కాలంలో ప్రచురణకర్తలపై మరింత పెరిగిన బాధ్యత ఏమిటంటే- పాఠకుల చెంతకు నిజాన్ని చేర్చటమే.

రచయిత పెరుమాళ్ మురుగన్ భయపడాల్సిన పనిలేదు. అతను రాయాలి, తన రచనల పరిధిని పెంచుకుంటూ పోవాలి. అతని రచనల ఇతివృత్తాలతోనూ శైలితోనూ విబేధించే వారు ఎందరున్నా, అతని రచనలు సాహిత్యానికి ఎంతో సమకూరుస్తాయి. మా తీర్పుతో ఈ గొడవ సమసిపోతుందనీ, అన్ని పక్షాలూ ఆత్మపరిశీలన చేసుకుంటాయనీ ఆశిస్తున్నాం. చివరిగా ఈ పరిశీలనతో ఈ తీర్పును ముగిస్తున్నాం **- "Let the author be resurrected to what he is best at. Write."**

**(ఆంధ్రజ్యోతి వివిధ సౌజన్యంతో)**

ఫ్లై ఓవర్లను నిర్మించే పేరుతోనో, నగరాన్ని సుందరీకరించే పేరుతోనో గెంటివేయబడుతుండేవారు.

ఆ సమయంలో కలచునాడు తరపున జీవించే హక్కుకోసం, వాక్‌స్వాతంత్రం కోసం ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశాం. ఆ సమావేశంలో జి.కుప్పుస్వామి భావప్రకటనా స్వేచ్ఛకు సంబంధించి రెండు పత్రాలు సమర్పించారు. (ఆ తరువాత కాలంలో అవి మా ప్రత్యేక సంచికలో ప్రచురించబడ్డాయి.) ఆ పత్రంలో ఎం.ఎఫ్. హుస్సేన్ కేసులో ఢిల్లీ హైకోర్టు జస్టిస్ ఎస్.కె. కౌల్ తీర్పును ఎక్కువగా ప్రస్తావించారు. అదృష్టం కొద్దీ పెరుమాళ్ మురుగన్ కేసు మద్రాసు హైకోర్టు ముందుకు వచ్చిన నాటికి ఆయనే అక్కడ ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నారు! సమాజపరంగా మనం వాక్‌స్వాతంత్ర్యాన్ని కోరుకుంటున్నామని నేను అనుకోవడం లేదు. ఎక్కువమంది వాక్‌స్వాతంత్రం అంటే వారు నమ్మే ఆలోచనల స్వాతంత్ర్యం అనుకుంటున్నట్టు నాకనిపిస్తున్నది. పెరుమాళ్ మురుగన్ సమస్య వెలుగులోకి రాగానే అగ్రకుల ఆధిపత్యానికి, మతతత్వ శక్తులకు వ్యతిరేకంగా నిలిచింది తమిళనాడు ప్రగతిశీల రచయితల, కళాకారుల సంఘం. ఇది సిపిఐ (ఎం) అనుబంధ సాహిత్య సంఘం.

వారే ప్రప్రథమంగా కోర్టులో పెరుమాళ్ మురుగన్ చేత నమ్మక్కళ్ కలెక్టర్ 'మదోరు బాగన్ నవలను ప్రాచుర్యం నుండి తొలగిస్తున్నట్టు' రాయించబడిన ఒప్పంద పత్రానికి వ్యతిరేకంగా న్యాయస్థానం తలుపులు తట్టారు. 2015 ఫిబ్రవరిలో ఢిల్లీలో సహమత్ ఒక పెద్ద ప్రదర్శనను నిర్వహించింది. అశోక్ వాజ్‌పై, రొమిల్లా థాపర్‌లాంటి పెద్దలందరితో వేదిక పంచుకునే అదృష్టం నాకు అప్పుడే కలిగింది.

వాక్‌స్వాతంత్రంపై వామపక్షాల వైఖరేంటి? దీనికి సంబంధించిన విధాన పత్రమేదైనా వారి వద్దనున్నదా? కాంగ్రెస్‌కి అయినా వాక్‌స్వాతంత్రానికి సంబంధించిన ఓ విధానం అన్నదుందా? ఆ మాటకొస్తే ఏ రాజకీయ పార్టీకయినా ఈ విషయంపై ఒక నిర్దిష్ట విధానం అంటూ ఉన్నదా?

అయితే నరేంద్రమోడి ఢిల్లీ గద్దెనెక్కిన నాటి నుండి భావప్రకటనా స్వేచ్ఛమీద, మన సంస్కృతిలోని ఎన్నోరకాల భావప్రకటనలు - సైన్సు, సాహిత్యము, సినిమా, ఆలోచనలపై, ఒక పద్ధతి ప్రకారం దాడులు జరుగుతున్నాయి. ఇది హిందూత్వ అనుయాయులైనా ప్రభుత్వ సంస్థల ద్వారా గాని, సంఘ్‌తో అధికారికంగా గాని, అనధికారికంగా గాని అనుబంధం కలిగిన మితవాద సంస్థల ద్వారా గాని జరపబడుతున్నాయి.

పెరుమాళ్ మురుగన్ విషయంలో మెజారిటీ అగ్రకుల సంఘాలు, హిందూత్వ శక్తుల మధ్య ఒక కొత్త బంధం కనిపిస్తున్నది. ఇది భావప్రకటనా స్వేచ్ఛకు పెద్ద అవరోధం. పట్టణంలోని ప్రజల భావోద్వేగాలను రెచ్చగొట్టడం ద్వారా ఒక రచయిత భయభ్రాంతులకు గురిచేయబడ్డాడు. ఒక పట్టణం అంతా ఆ ప్రాంత ముద్దుబిడ్డ వ్రాసిన ఒక నవలకు వ్యతిరేకంగా మూతపడడం బహుశ భారతదేశ చరిత్రలోనే ఇది మొదటిసారి అయి ఉండవచ్చు. ఆయన పుస్తకాన్ని తగలపెట్టారు. ఆయన కుటుంబాన్ని బహిష్కరించారు.

పెరుమాళ్ మురుగన్ ఎలాంటి హింసకు గురైనా గంట గంటకూ ఆయనతో సమన్వయం చేసుకుంటున్న నా లాంటివారెవరైనా ఊహించగలరు. ఆయన మాటల్లో "ఈ తీర్పు చాలా ఆనందాన్నిచ్చింది. ఇది కృంగి కృశించిన హృదయానికి స్వాంతన నిచ్చింది"

అయితే ఈ ప్రశంసాపూర్వక తీర్పు రచయితల మీద, కళాకారుల మీద జరుగుతున్న దాడులకు చరమగీతం పాడుతుందా? భావప్రకటనా స్వేచ్ఛను అనుమతించాలని ఒప్పిస్తుందా? మనకు నచ్చని ఆలోచనలను, భావప్రకటనలను సహించేందుకు ప్రోత్సహిస్తుందా? 'మనసులను గారవరచడ'మనే రాజకీయాలకు తెరదించుతుందా? దీనికి సమాధానం పొందేందుకు మనం ఎక్కువ రోజులు ఎదురు చూడనక్కర్లేదనుకుంటున్నాను.

**(కన్నన్ సుందరమ్ 'కలచనాడు' ప్రచురణ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్. ఈ సంస్థే తమిళంలో పెరుమాళ్ మురుగన్ వ్రాసిన మధోరు బాగన్ నవలను ప్రచురించింది.)**



## అక్షరాలు గాయపడిన వేళ

- మందరపు హైమవతి

పక్షులే కాదు
అక్షరాల పక్షులూ గాయపడతాయి
గుండెల్లో గుచ్చుకున్న
గుండు దెబ్బల్తో విలవిల లాడతాయి
అసలు
అక్షరమంటే
ఆగ్రహజ్వాలలా అలా
మండిపడతావెందుకు
కరడుగట్టిన తీవ్రవాది
ఎదురుదాడి చేసినట్లు
అలా భయపడతావెందుకు

కొన్ని నిప్పుకణికెల
నిష్ఠుర నిజాలు చెప్పినందుకు
మూఢాచారాల చరిత్ర పుటల్లో
మతదురహంకార
చిత్రాలు చిత్రించినందుకు
ఇంత శిక్షా!

సబ్సిడీల మాయలాంతరు చూపించో
కళ్ళు మిరుమిట్లుగొలిపే
సంక్షేమ పథకాల మయసభా హర్మ్యాలు
చూపించో
ప్రజలను వెర్రిబాగుల వాళ్ళుగా
చెయ్యకపోవడమే
నేను చేసిన నేరమా!
పండగలంటూ జాతరలంటూ
భక్తిరసవాహినిలో ముంచెత్తకపోవడం
ఉచితాల తాయిలాలు చూపించి
ప్రజలను
సోమరిపోతులుగా బిచ్చగాళ్ళుగా
మార్చకపోవడమే నేను చేసిన దోషమా!

సరిహద్దుల్ని అతిక్రమించి
దేశంలోకి ప్రవేశించే
చొరబాటుదారుణ్ణి కాను నేను
విచక్షణారహితంగా
మసీదులపై మందిరాలపై
బాంబులు వేసే ఉగ్రవాదిని కాను నేను

అక్షరాల గదిలో విహరించనిదే
ఊపిరాడని నా చేత
అక్షర సన్యాసం చేయించినా
అక్షరం సాక్షిగా భయమెరుగని
సాహసికుణ్ణి

అక్షరమంటే
చీకటి కొలనులో విరిసిన వేకువ పువ్వు
పిరికితనం గుండె గుహలో
వెలిగించిన ధైర్యదీపం
తాడితుల పీడితుల పక్షాన
బిగించిన పిడికిలి.
(పెరుమాళ్ మురుగన్‌పై దాడికి
నిరసనగా)



# భావ ప్రకటనా స్వేచ్ఛకు కొత్త ఊపిరి





సుహృత్ పార్థసారథి

"ఒక ప్రత్యేక సమాజంలోని ఒక సెక్షన్ ఇంటర్నెట్‌లో పొందుపరిచే 'మితవాద అభిప్రాయాల' అంటే మహిళల విముక్తి లేదా కుల వ్యవస్థను రద్దు చేయాలనడం లేదా అలాగే వేరే మతంలో ఉన్నవారిని తమ మతంలోకి తెచ్చుకోవడానికి అనుమతించాలనే వాటి వల్ల పూర్తిగా గాయపడటం లేదా చికాకుకు గురికావచ్చు. ఇలాంటివన్నీ కూడా సెక్షన్ 66ఎ పరిధిలోకి రావచ్చు" అని ఆయన రాశారు. అందువల్ల కోర్టు అభిప్రాయంలో ఆ నిబంధన సమర్థనీయం కాదు, అలాగే భావ ప్రకటనా స్వేచ్ఛ నుంచి మినహాయిస్తూ రాజ్యాంగం అనుమతించిన వాటితో వీటికి ఎలాంటి సంబంధం లేదు.

ఐటి చట్టంలోని సెక్షన్ 66ఎను సవాలు చేస్తూ శ్రియా సింఘాల్‌కు, భారత ప్రభుత్వానికి మధ్య జరిగిన వాదనలో సుప్రీం కోర్టు సంతోషకరమైన నిర్ణయం తీసుకుంది. వాక్ స్వాతంత్ర్యాన్ని, భావ వ్యక్తీకరణ స్వేచ్ఛకు విఘాతం కలుగుతోందని ధృవీకరించింది. సమాచార పరిజ్ఞానం చట్టం, 2000(ఐటి చట్టం)లోని 66ఎ రాజ్యాంగ విరుద్ధమైనదని పేర్కొంది. శివసేన అధినేత బాల్‌థాకరే మరణానంతరం ఆ పార్టీ ఇచ్చిన బంద్ పిలుపుకు వ్యతిరేకంగా తమ అసంతృప్తిని వ్యక్తం చేశారనే నెపంతో ఇద్దరు మహిళలను ముంబాయి పోలీసులు అరెస్టు చెయ్యటంతో సెక్షన్ 66ఎ అపకీర్తిని మూటగట్టుకుంది. ఈ తరువాత వివిధ రాష్ట్రాల్లో ఆన్‌లైన్‌లో ఉంచిన సమాచారం ఆధారంగా ఆయా రాష్ట్రాల పోలీసులు అనేక మందిని అరెస్టు చేశారు. తాజాగా ఉత్తర ప్రదేశ్‌కు చెందిన 11వ తరగతి విద్యార్థి ఓ మంత్రికి సంబంధించి ఫేస్‌బుక్‌లో అభ్యంతరకర సమాచారాన్ని ఉంచినట్లు పేర్కొంటూ సెక్షన్ 66ఎ కింద కేసు నమోదు చేయడంతో ఇలాంటి కేసులతో ఎందరు బలవుతున్నారో అర్థమవుతోంది. ఈ అరెస్టులను పరిశీలిస్తే భావవ్యక్తీకరణను, అసమ్మతిని తెలిపేందుకు ఏమాత్రం హానికరం కాని సమాచారాన్ని ఉంచినప్పటికీ చట్టంలో ఉన్న లొసుగులను ఆధారం చేసుకుని పెట్టిన కేసులే ఎక్కువగా కనబడుతున్నాయి. కంప్యూటర్ ద్వారా గానీ, ఇతర సమాచార సాధనాల ద్వారాగానీ 'ప్రమాదకరంగా', స్వాభావికంగా 'భయంకరమైన', ఎవరినైనా 'గాయపరచడం', 'అసౌకర్యం', అవరోధం కలిగించే విధంగా ఎలాంటి సమాచారాన్ని ప్రసారం చెయ్యకూడదని నిబంధనలు స్పష్టంగా ఉన్నాయి. 66ఎ అస్పష్టమైన, నిరంకుశమైందే కాకుండా వాక్‌స్వాతంత్ర్యపు హక్కును హరించేదిగా ఉందని జస్టిస్ ఆర్ఎఫ్

నారిమన్, జస్టిస్ జె చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం అభిప్రాయపడింది.

అనేక కారణాల రీత్యా శ్రియా సింఘాల్ కేసు విషయంలో సుప్రీం కోర్టు చరిత్రలో ఈ తీర్పుకు అత్యంత ప్రాముఖ్యత ఉంది. పార్లమెంటు ఆమోదం పొందిన సెన్సార్‌షిప్ చట్టం మొత్తంగా న్యాయ విరుద్ధమైందని ప్రకటించడం ద్వారా కోర్టు చాలా అరుదైన సందర్భానికి ప్రాతినిధ్యం వహించింది. కోర్టు ఇలాంటి నిర్ణయం తీసుకోవడం చాలా అరుదు. అయితే మనం స్వేచ్ఛగా భావవ్యక్తీకరణ చేసేవిధంగా హక్కును అందుబాటులోకి తేవడంతో పాటు కొన్ని ప్రత్యేక సందర్భాల్లో మాత్రమే దానిపై పరిమితులు విధించే అధికారం రాజ్యానికున్నదని కూడా స్పష్టం చేసింది. హక్కుకు, దానికున్న పరిమిత అడ్డంకులకు మధ్య ఉన్న సమతూకంపై వివరణనిస్తూ.. భావవ్యక్తీకరణ, వాక్ స్వాతంత్రపు హక్కును సాధ్యమైనంత దుర్బలమైన హామీగా మిగిల్చే సూచనలు కనిపిస్తున్నాయంటూ ప్రభుత్వపు మోసపూరిత నిర్ణయాలపై చావుదెబ్బ కొట్టింది. ఆలోచన, భావ వ్యక్తీకరణ హక్కు అనేది కేవలం అభిలషణాత్మక ఆదర్శం మాత్రమే కాదనీ, ప్రామాణిక విలువలకు పెద్దపీట వేస్తూ అది రాజ్యాంగ పథకం కింద మనకివ్వబడిందని జస్టిస్ నారిమన్ అభిప్రాయాన్ని ప్రముఖంగా ముందుకు ఎత్తి చూపింది.

రాజ్యాంగంలోని అర్టికల్ 19(1)(ఎ) వాక్ స్వాతంత్ర్యం, భావప్రకటన స్వేచ్ఛకు హామీ ఇస్తుంది. తరువాత వెంటనే వచ్చే క్లాజ్ 19(2) ఈ హక్కుకు పరిమితులు విధిస్తోంది. దేశ రక్షణ, దేశ సమగ్రత, సార్వభౌమాధికారం, ప్రజా రక్షణ, నైతిక విలువలకు ఇబ్బంది కలిగించడం, పరువునష్టం కలిగించి చట్టవ్యతిరేకతకు పాల్పడడం వంటి సహేతుకమైన ఆంక్షలను విధించి, ఇలాంటి వాటిలో కలుగజేసుకునేందుకు రాజ్యానికి అధికారాన్ని ఇస్తోంది. శ్రియా సింఘాల్ పిటిషన్ ప్రకారం ఐటి చట్టంలోని 66ఎ సెక్షన్‌కు రక్షణ కల్పించటానికి అవసరమైన 19(2) అధికరణానికి సంబంధించి ఏ అంశాలూ పొందుపర్చలేదు. అంతేకాకుండా 66ఎ సెక్షన్‌లోని నిబంధనలు చాలా అస్పష్టంగా ఉన్నాయనీ, నేర చట్టానికి సంబంధించి సరైన నిర్వచనం లేదనీ, సైద్ధాంతికంగా కూడా చాలా వైరుధ్యాలు ఉన్నాయని, అందువల్ల ఇది ఒక రకమైన నిషేధ రూపమని వారు వాదించారు. ఇంకా ఈ పిటిషన్‌లో సెక్షన్ 66ఎ వల్ల అమాయకులైన ప్రజల్లో భయాందోళనలు మొదలయ్యాయనీ, తద్వారా వారి భావనల్లోగానీ, మాటల్లో గానీ ఎటువంటి హానికరమైన విషయాలు లేకపోయినప్పటికీ మిన్నకుండిపోయే విధంగా వారి వాక్‌స్వాతంత్ర్యంపై ప్రభావం పడుతోందని శ్రియా సింఘాల్ వాదించారు. పిటిషనర్ వాదనల్లోని ఈ విషయాలతో సుప్రీం కోర్టు ఏకీభవించింది. కోర్టు ఉత్తర్వుల ప్రకారం దేశ రక్షణకు, దేశ సమగ్రతకు, సార్వభౌమాధికారానికి, ప్రజా రక్షణకు, నైతిక విలువలకు ఇబ్బంది కలిగించడం, పరువునష్టం కలిగించి చట్టవ్యతిరేకతకు పాల్పడడం సహా అధికరణం 19(2)లో పొందుపర్చిన అన్ని విషయాల్లో మాత్రమే ప్రభుత్వం చట్టాన్ని ఆశ్రయించాలని తెలిపింది. అప్పుడు మాత్రమే న్యాయవంతంగా అన్వయించవచ్చని సూచించింది. అధికరణం 19(2)కు సంబంధించి అభ్యంతరకరమైన విషయాలేమైనా ఉంటే తప్ప, వాక్ స్వాతంత్ర్యంపై ఆంక్షలు విధించే ఏ చట్టమైనా కాలగర్భంలో కలిసిపోతుందని నారిమన్ తన తీర్పులో వెలువరించారు.

రాజ్య వాదనను తిరస్కరిస్తూ కోర్టు ఈ నిబంధనలను విధించే పరిస్థితులపై కీలకంగా వ్యాఖ్యానించింది. ఉదాహరణకు ప్రజా భద్రత పేరుతో వాక్‌స్వాతంత్ర్యాన్ని పరిమితం చేయాల్సి వస్తే అలాంటి నిబంధన విధిస్తూ చేయబడిన చట్టం ప్రస్తుత ప్రమాదం ఉందనే పరీక్షలో నెగ్గాల్సి ఉంటుందని కోర్టు రూలింగ్ ఇచ్చింది. అలా ప్రసారం చేసిన సమాచారం తక్షణం ప్రజా అభద్రతను కల్గిస్తుందని లేదా సృష్టిస్తుందనే ధోరణిని కలిగి ఉండాలి. వాక్‌స్వాతంత్ర్యంపై పరిమితి విధించాల్సినంతగా ఆ సమాచారం తప్పనిసరిగా అలాంటి అభద్రతను కల్గించేదిగా ఉండాలి. ఉల్లంఘన, నేరం జరిగే అవకాశముందని భావించడం, సభ్యత లేదా నైతికతల ప్రాతిపదికన అధికరణం 19(2) కింద రాజ్యం తన అభిప్రాయాన్ని సమర్థించుకుంటోంది. దాన్ని సుప్రీంకోర్టు శ్రేయా సింఘాల్ కేసులో సున్నితంగా త్రోసిపుచ్చింది. "పూర్తిగా ప్రమాదకరమైన" లేదా "చికాకు పెట్టే" భాషణను నేరపూరితం చేయడానికి, రాజ్యాంగం కింద అనుమతించిన అడ్డంకులు విధించడానికి మధ్య ఎలాంటి సంబంధం లేదని కోర్టు ఎత్తి చూసింది. అధికరణం 19(2) కింద ప్రభుత్వ వాదనలను తిరస్కరించడంతోపాటు కచ్చితత్వం లోపించినందున

అధికరణం 66ఎ రాజ్యాంగ విరుద్ధమని కోర్టు పేర్కొంది. "పూర్తిగా ప్రమాదకరమైన" లేదా "క్రూరమైన" భావాలను వ్యక్తం చేశారనడం చాలా అస్పష్టమని, అందువల్ల దాని ప్రాతిపదికన ఒక వ్యక్తి నేరం చేశాడని లేదా నేరం చేయలేదని చెప్పడానికి స్పష్టమైన ప్రమాణాలు లేవని జస్టిస్ నారిమన్ రాశారు. ఇంకా సెక్షన్ 66ఎ భావప్రకటనపై భయంగొలిపే ప్రభావాన్ని కల్పించే వినాశకరమైన ప్రభావాన్ని చూపడంతో పాటు అది అత్యంత ప్రమాదకరమైనదని కోర్టు వివరించింది. దీనికి సంబంధించి నారిమన్ మనకు కొన్ని ఉదాహరణలిచ్చారు : "ఒక ప్రత్యేక సమాజంలోని ఒక సెక్షన్ ఇంటర్నెట్‌లో పొందుపరిచే 'మితవాద అభిప్రాయాల' అంటే మహిళల విముక్తి లేదా కుల వ్యవస్థను రద్దు చేయాలనడం లేదా అలాగే వేరే మతంలో ఉన్నవారిని తమ మతంలోకి తెచ్చుకోవడానికి అనుమతించాలనే వాటి వల్ల పూర్తిగా గాయపడటం లేదా చికాకుకు గురికావచ్చు. ఇలాంటివన్నీ కూడా సెక్షన్ 66ఎ పరిధిలోకి రావచ్చు" అని ఆయన రాశారు. అందువల్ల కోర్టు అభిప్రాయంలో ఆ నిబంధన సమర్థనీయం కాదు, అలాగే భావ ప్రకటనా స్వేచ్ఛ నుంచి మినహాయిస్తూ రాజ్యాంగం అనుమతించిన వాటితో వీటికి ఎలాంటి సంబంధం లేదు.

కొన్ని పరిమిత పరిస్థితుల్లో ఫేస్‌బుక్, యుట్యూబ్ వంటి వెబ్‌సైట్లను తమ వేదికగా వ్యక్తులు సమాచారాన్ని ముద్రించుకోవడానికి రక్షణ కల్పిస్తోంది. ప్రభుత్వం ఈ రెండు సెక్షన్లలో దేన్నీ కొట్టివేయలేదు. ఈ రెండింటి విషయంలో ప్రభుత్వ దుర్వినియోగం నుంచి తగినన్ని రక్షణలు చట్టంలో ఉన్నట్లు గుర్తించింది.

శ్రేయా సింఘాల్ కేసులో ఇచ్చిన తీర్పు కేవలం సెక్షన్ 66ఎకు మాత్రమే సంబంధించింది కాదు. ఐటి చట్టంలోని సెక్షన్ 69ఎ, దాన్ని అనుసరించి ఉండే నిబంధనలు, సెక్షన్ 79ని కూడా ఫిర్యాదీలు సవాలు చేశారు. వీటిలో మొదటి సెక్షన్ ఇతర కారణాలతో పాటు సార్వభౌమత్వ ప్రయోజనం, భారత సమగ్రత, ప్రజా భద్రత లేదా ఏదైనా ప్రమాదం జరుగుతుందని ఊహించడం వంటి ఇతర కారణాలతో అలా చేయడం అవసరం లేదా యుక్తం అయినప్పుడు వెబ్‌సైట్లను బ్లాక్ చేయడంతో పాటు సమాచారాన్ని నిలిపివేసే అధికారాన్ని ప్రభుత్వానికి కల్పిస్తోంది. ఇక రెండవది కొన్ని పరిమిత పరిస్థితుల్లో ఫేస్‌బుక్, యుట్యూబ్ వంటి వెబ్‌సైట్లను తమ వేదికగా వ్యక్తులు సమాచారాన్ని ముద్రించుకోవడానికి రక్షణ కల్పిస్తోంది. ప్రభుత్వం ఈ రెండు సెక్షన్లలో దేన్నీ కొట్టివేయలేదు. ఈ రెండింటి విషయంలో ప్రభుత్వ దుర్వినియోగం నుంచి తగినన్ని రక్షణలు చట్టంలో ఉన్నట్లు గుర్తించింది. మన పౌర హక్కులకు ఈ నిర్ణయంలోని అంశాలు ఏదో విధంగా నష్టదాయకమని ఎవరైనా భావిస్తే ఈ తరుణంలో అది కేవలం అనవసర చర్చే అవుతుంది.

మనం చాలా తరచుగా మన సుప్రీంకోర్టును, దాని నిర్ణయాలను చాలా విశిష్టమైనవిగా భావిస్తాం. శ్రేయా సింఘాల్ కేసులో సుప్రీంకోర్టు సెక్షన్ 66ఎను రద్దు చేయడం ద్వారా భారత్‌లో భావ ప్రకటనా స్వేచ్ఛకు కొత్త ఊపిరులూదడంతో పాటు చెప్పుకోదగినంత చురుకుదనంతో భారతీయుల రాజ్యాంగ కోర్టు పాత్రను కూడా నిర్వహించింది. సరైన నేర నిర్ధారణతో మన రాజ్యాంగంలో విస్తృత ప్రాతిపదికన పొందుపరచిన స్వాతంత్ర్యం ప్రాధాన్యతను వెలికి తీయడం సాధ్యమేనని జస్టిస్ నారిమన్ తీర్పు చూపుతోంది. చురుకైన, సమగ్రమైన దృష్టితో మన రాజ్యాంగంలో పొందుపరచిన సహనంతో కూడిన ఆదర్శాలను కోర్టు పరిరక్షించింది. మనకు ఆశను కల్పించే విధంగా మెరుగైన అరుదైన స్పష్టతతో వాక్‌స్వాతంత్ర్యపు న్యాయశాస్త్ర మీమాంసను అందించింది. దేశంలో విస్తరించే నిషేధాలు విధించే ప్రమాదకర సంస్కృతిని ఇప్పుడు సవాలు చేయగలమనే విశ్వాసాన్ని అది మనకు కల్పించాలి.

స్వేచ్ఛను సాధించుకునేందుకు అమెరికా తరహా తొలి సవరణ మనకు అవసరం లేదని కూడా ఇది చూపుతోంది. ఇక్కడ కోర్టు ప్రదర్శించిన విధంగా మనకు కావల్సిందేమంటే స్వేచ్ఛగా మన భావాలను వ్యక్యం చేసేందుకు, అసమ్మతిని, వ్యతిరేకతను వ్యక్తం చేసేందుకు, రాజ్య జోక్యం నుంచి స్వేచ్ఛను ప్రసాదించిన మన సొంత రాజ్యాంగాన్ని అమలుపరిచే ప్రభుత్వం కావాలి.

# గోరక్ష...శాస్త్రీయత, ప్రాచీనత



కెఎల్. కాంతారావు

ఒకసారి బీహార్‌లో కరువు వచ్చింది. కరువు తీవ్రతకు మనుషులూ, పశువులూ పిట్టల్లా రాలిపోతున్నారు. అప్పుడు కొంతమంది గోరక్ష సంఘంగా ఏర్పడి గోరక్షణ కోసం విరాళాలు వసూలు చేస్తున్నారు. వారు విరాళం కోసం నెహ్రూని కలిశారు. ఆయన వారిని "కరువు కారణంగా మనుషులు కూడ చనిపోతున్నారు గదా? వారికోసం మీరేమి చేస్తున్నారు?" అని అడిగారు. దానికి వారు "మనుషులు తమ పూర్వ జన్మ కర్మల ననుసరించి చనిపోతున్నారు. అది భగవంతుని నిర్ణయం. అందువలన వారి విషయంలో మేము ఏమీచేయడం లేదు" అన్నారు. ఆ మాటలకు నెహ్రూకి కోపం వచ్చింది. "సాటి మానవులు ఆకలి బాధతో చనిపోతుంటే, అది వారి పూర్వజన్మలో చేసిన పాప ఫలమని చెబుతూ, వారి కోసం ఏమీ చెయ్యని మీ ప్రవర్తన ఎంత అమానుషత్వం? ముందు మీరు మీ సాటివారిని ఆదుకోండి.. వెళ్ళండి" అని చెప్పి పంపించారు.

గోరక్షణకు సంబంధించి నంత వరకు అది కొందరి మతపరమైన నమ్మకమని అన్నప్పుడు "ఎవరిమత నమ్మకం వారిది" అనే భావనతో శాస్త్ర విజ్ఞాన ప్రచారకులెవరూ ఆ నమ్మకాన్ని ప్రశ్నించలేదు. కానీ ఇటీవల ఆర్‌ఎస్‌ఎస్ అఖిల భారతీయ ప్రచార ప్రముఖ్ మన్‌మోహన్ వైద్య ఒక ప్రకటన చేస్తూ గోరక్షణకు శాస్త్రీయ కారణాలున్నాయని ప్రకటించారు. ఈ విషయాన్ని చర్చించవలసిన అవసరం ఉంది.

వైద్యజీ, ఆవుమీద ఆధారపడిన వ్యవసాయం రసాయనిక ఎరువుల మీద ఆధారపడిన వ్యవసాయం కంటే మేలైనదనీ, భూసారాన్ని కాపాడుతుందనీ సెలవిచ్చారు. ఇదే నిజమైతే గేదె, దున్నపోతుల పేడ కూడ అంతే ఉపయోగకరం కదా? వాటి వధను ఆపకుండా కేవలం గోవధనే నిషేధించమనడం ఏరకంగా శాస్త్రీయం? మరో ముఖ్య విషయమేమంటే ఎద్దుల కంటే, భారతదేశం వంటి ఉష్ణదేశంలో దున్నపోతులే ఎక్కువ సమర్ధవంతంగా వ్యవసాయ పనులలో ఉపయోగపడతాయి. ఎద్దులు ఎండలో కొద్దిసేపు పొలం దున్నినా, రొప్పుతాయి. దున్నపోతులు ఎండలోనైనా అవలీలగా పొలం దున్నుతాయి. ఎద్దులు మాగాణీ చేల వ్యవసాయానికి అసలే పనికిరావు.

ఈ సందర్భంలో వినోబాభావే జీవితంలోని ఒక సంఘటన ప్రస్తావించుకోవడం అవసరం. ఒకసారి వినోబాజీ గోవధ నిషేధం కోసం నిరాహారదీక్షకు కూర్చున్నారు. అప్పుడు ఆయనకు విదర్భ ప్రాంతానికి చెందిన ఒక రైతు ఒక ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరం సారాంశం ఏమిటంటే 'ఆవులకు ముసలితనంలో పారుడు వ్యాధి వస్తుంది. అప్పుడు విపరీతమైన చెడు వాసనతో కూడిన ద్రవంలాంటి పేడ వేస్తాయి. ఆ వాసన భరించలేము. వాటిని ఎంతకాలం రైతు భరించగలడు? ఆ వాసనకు పిల్లలకు శ్వాసకోశ వ్యాధులు వస్తాయి. వాటికి వేసే మేతను, వయస్సులో ఉన్న ఆవులకు వేస్తే అవి ఇంకా పుష్టిగా తయారై, ఎక్కువ పాలిస్తాయి. పారుడు రోగం వచ్చిన ముసలి ఆవులను వేరే ఎవరూ కొనరు. గోవధపై నిషేధం పెడితే ఇదీ మా పరిస్థితి."

అలాగే గోరక్షణ విషయంలో నెహ్రూ అభిప్రాయాన్ని పరిశీలిద్దాం. ఒకసారి బీహార్‌లో కరువు వచ్చింది. కరువు తీవ్రతకు మనుషులూ, పశువులూ పిట్టల్లా రాలిపోతున్నారు. అప్పుడు కొంతమంది గోరక్ష సంఘంగా ఏర్పడి గోరక్షణ కోసం విరాళాలు వసూలు చేస్తున్నారు. వారు విరాళం కోసం నెహ్రూని కలిశారు. ఆయన వారిని "కరువు కారణంగా మనుషులు కూడ

## వేమన్న ఏమన్నాడు?

... 400 ఏళ్ల కన్నా ముందే ఇలాటి భావాలు చెప్పిన వేమన్నకు ఏం శిక్ష వేస్తారో ఈ అసహన పరులు? ...

కనక మృగము భువిని కద్దు లేదనకుండ
తరుణివిడిచిపోయే దాశరథియు
తెలివి లేని వాడు దేవుడెట్లాయరా
విశ్వదాభిరామ వినురవేమ

కులము నీరుజేసె గురువును జంపించె
పొసగ యేనుగంత బొంకు బొంకె
పేరు ధర్మరాజు పెనువేప విత్తయా
విశ్వదాభిరామ వినురవేమ

శిలను ప్రతిమ చేసి చీకటింటబెట్టి
మ్రొక్కవలదు వెర్రి మూఢులార
యుల్లమందు బ్రహ్మాయుండుట తెలియదు
విశ్వదాభిరామ వినురవేమ

కొండరాళ్ల దెచ్చి కోరిక కట్టిన
గుళ్లలోన దిరిగి కుళ్లనేల
పాయరాని శివుడు ప్రాణియై యుండగా
విశ్వదాభిరామ వినురవేమ

గూబయెక్కిన గృహము పాడుగబెట్టి
వెళ్లిపోదురంత వెర్రివారు
గూబయేమి చేసె గ్రహము యేమి చేసె
విశ్వదాభిరామ వినురవేమ



పిండములను చేసి పితరుల దలపోసి
కాకులకును పెట్టు గాడ్దెలార
పియ్యి దినెడు కాకి పితరుడెట్లాయెరా
విశ్వదాభిరామ వినురవేమ

విప్రులెల్లజేరి వెర్రికూతలు కూసి
సతిపతులను గూర్చి సమ్మతమున
మునుముహూర్తముంచ ముండెట్లు మోసెరా
విశ్వదాభిరామ వినురవేమ

పాలపక్షి శకున ఫలమిచ్చునందురు
పాలపక్షి కేమి ఫలము దెలియు
తనదు మేలు కీళ్లు తన కొననుండగా
విశ్వదాభిరామ వినురవేమ

మాలవాని నేల మరి మరి నిందింప
మాట తిరుగువాడు మాలగాక
వాని లోన వెలుగు కులంబేది
విశ్వదాభిరామ వినురవేమ

ఉర్వివారికినెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తుగుడిపి కులము పొలియజేసి
తలను చెయ్యిపెట్టి తగనమ్మజెప్పరో
విశ్వదాభిరామ వినురవేమ

చనిపోతున్నారు గదా? వారికోసం మీరేమి చేస్తున్నారు?" అని అడిగారు. దానికి వారు "మనుషులు తమ పూర్వ జన్మ కర్మల ననుసరించి చనిపోతున్నారు. అది భగవంతుని నిర్ణయం. అందువలన వారి విషయంలో మేము ఏమీచేయడం లేదు" అన్నారు. ఆ మాటలకు నెహ్రూకి కోపం వచ్చింది. "సాటి మానవులు ఆకలి బాధతో చనిపోతుంటే, అది వారి పూర్వజన్మలో చేసిన పాప ఫలమని చెబుతూ, వారి కోసం ఏమీ చెయ్యని మీ ప్రవర్తన ఎంత అమానుషత్వం? ముందు మీరు మీ సాటివారిని ఆదుకోండి.. వెళ్ళండి" అని చెప్పి పంపించారు.

భారతదేశానికి చెందిన ఆవుపేడ, ఆవు మూత్రంలో ఎన్నో ఔషధ గుణాలున్నాయని వైద్యులు చెబుతున్నారు. అదే నిజమైతే ఎవరైనా ఆవుపేడ, మూత్రంతో చేసిన మందులు వేటికైనా పేటెంట్ తీసుకోవడం జరిగిందా? లేక ఆవు మూత్రం అనే ఔషధం కూడ "మొరార్జిన్" వంటిదేనా? (మన మాజీ ప్రధాని మొరార్జీదేశారు, తాను 82 ఏళ్ళ వయస్సులో కూడ ప్రధాన మంత్రి బాధ్యతలు నిర్వహించడం వెనుక గల తన ఆరోగ్య రహస్యం తాను తన మూత్రం తాగడమేనని ప్రకటించారు. అదినమ్మి అనేక మంది అప్పట్లో మానవ మూత్రాన్ని 'మొరార్జిన్' అని ప్రజలు పిలవసాగారు!

చివరగా, ముసలి ఆవులపేడ వాతావరణాన్ని కలుషితం చేస్తుందని సామాన్య రైతులు కూడా అర్థం చేసుకుంటుండగా, గోరక్షణ పర్యావరణ పరిరక్షణ చేస్తుందని వైద్యజీ చెప్పడం ఎంతవరకూ శాస్త్రీయం? ◆

# వేదాలను శోధించిన అంబేద్కర్





డా॥ కత్తి పద్మారావు

వేదాలను మొదట ఎదిరించిన భారతీయులు చార్వాకులని పేర్కొన్నాడు. అప్పటి నుంచి వేదాల ప్రమాణత మీద భారతదేశంలో హేతువాదులు, తాత్వికులు, నాస్తికులు యుద్ధం చేస్తూనే ఉన్నారని ఆయన చార్వాకుల వాదాన్ని బలపరిచాడు. అసలు వేదాలు ఎలా పుట్టాయి అనే దానిలో పదకొండు వాదాలున్నాయని అంబేద్కర్ తేల్చాడు.

డాక్టర్ బిఆర్ అంబేద్కర్ గొప్ప హేతువాది. గొప్ప మానవతావాది. మహోన్నత సామాజిక విప్లవకారుడు. సాంస్కృతిక విప్లవ యోధుడు. భారతదేశ పునర్నిర్మాణకర్త. గొప్ప చదువరి. మహోజ్వల పోరాట యోధుడు. లోతైన ఆలోచనాపరుడు. ప్రపంచ మేధావుల్లో మొదటి వరుసలో నిలబడినవాడు. నీతి, నిజాయితీ, నిష్కపటత్వం, నిర్మలత్వం, నిక్కచ్చితనం, ముక్కుసూటితనం, సున్నితత్వం ఆయన వ్యక్తిత్వంలోని బహుపార్శ్వాలు. స్నేహం, ప్రేమ, కరుణ, ఆత్మీయత, అనునయం ఆయన సుగుణాలు. దేశంలోని వ్యక్తిత్వాల్లో ఆయన హిమాలయమంత ఎత్తయినవాడు. అంబేద్కర్ దేశంలోని వాఙ్మయాన్ని మొత్తం అధ్యయనం చేశాడు. వేదాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, భారత, భాగవత, రామాయణ పురాణాలు, అష్టాదశ పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు, నాటకాలు, శతకాలు, ధర్మశాస్త్రాలు అన్నింటినీ క్షుణ్ణంగా చదివాడు. వీటన్నింటినీ మానవతావాద దృష్టితో పరిశీలించి పునర్నిర్మించాడు. ఆయన ముఖ్యంగా వేదాలను అధ్యయనం చేశాడు. వేదాలను అధ్యయనం చేసినవారు అతితక్కువ మంది ఉన్నారు. అంబేద్కర్ వేదాలను అధ్యయనం చేయక ముందు వాటి పూర్వాపరాలు దేశానికి పూర్తిగా తెలియవు. ఆయన

వేదాలను అధ్యయనం చేసి వాటి మూలాలను ప్రపంచానికి చాటాడు. వేదాలనే కాక వేదాంగాలను కూడా అధ్యయనం చేశాడు.

ఈ సందర్భంగా అంబేద్కర్ వేదాల గురించి ఇలా చెప్పారు. వేదాలను ప్రశ్నించడానికి వీలుకానివిగా చేసి వేద బ్రాహ్మణులు తృప్తి చెందలేదు. ఇంకొంచెం ముందుకు సాగి వేదాలు అపౌరుషేయాలు (మనుషుల చేత రాయబడనివి) అని నొక్కి వక్కాణించారు. వేదాలు మానవ కల్పితాలు కాదని ఇక్కడ వారి ఉద్దేశం. ఈ సిద్ధాంతం ప్రశ్నించడానికి వీలులేదనే సిద్ధాంతానికి దారి తీస్తుందనడంలో అనుమానం లేదు. ఎలాగంటే అవి మానవ కల్పితాలు కావు అనడం వల్ల సామాన్యంగా మానవుల వల్ల కలిగే తప్పిదాలు, పొరపాట్లు, దౌర్భల్యాలూ అందులో ఉండటానికి వీల్లేదని. అందుచేతనే అవి ప్రశ్నాతీతాలు అయ్యాయి.

ఈ ప్రతిపాదనలన్నింటినీ అశాస్త్రీయమైనవిగా అంబేద్కర్ కొట్టివేశాడు. ఒక రకంగా అంబేద్కర్ పరిశోధన వల్ల భారతీయ తత్వశాస్త్రానికి మేలు జరిగింది. ఎందుకంటే మంచి రాసినా, చెడు రాసినా రుషులే రాశారు. మానవేతరమైన శక్తులేమీ రాయలేదని ప్రతిపాదించటం వల్ల రుషులకు అస్తిత్వం వచ్చింది.

ఏది ఏమైనప్పటికీ ఇది స్వతంత్రమైన సిద్ధాంతం కనుక దీన్ని ప్రత్యేకంగా పరిశీలించవలసిన అవసరం ఉందని అంబేద్కర్ చెబుతూ 'వేదాలు మానవాతీతాలు కాదని, మానవులు రాసినవే' అని నిర్ధారించారు. ఎందుకంటే వేదాల్లో మంత్రాలు, అధిదేవతల పేర్లు, రకరకాల ఛందస్సులు ఉన్నాయి. ఇవన్నీ అనేకమంది రుషుల పేర్ల మీద రాయబడ్డాయి. వారందరూ మానవులే. అయితే ఈ రుషులు అనేక ప్రేరణలతో రాశారనచ్చుకాని, ఇవి మానవులు రాయలేదనటంతో ఈ రుషుల అస్తిత్వమే పోతుంది. ముఖ్యంగా వేదాల్లో యజ్ఞ, యాగాల గురించి చెప్పబడింది. అందులో పుత్రకామేష్టి యాగం. అంటే పుత్రుడు లేకపోతే యాగం చేయటం ద్వారా పుడతారని అర్థం. చాలా మంది తమకు పిల్లలు ఎలా కలుగుతారో తెలియక పుత్రకామేష్టి యాగాలు చేశారని అంబేద్కర్ చెప్పాడు. అలాగే అశ్వమేథ యాగం. అశ్వాన్ని ఎంత భూభాగంలో తిప్పగలిగితే ఆ భూమంతా నాదనే సామ్రాజ్యవాద భావన వేదాల నుంచే వచ్చింది. ఇది కూడా ఆర్యుల సామ్రాజ్య విస్తరణ కాంక్షకు సంబంధించిన విషయమే.

అంబేద్కర్ తన 'హిందూమతంలో చిక్కుముడులు' అనే గ్రంథంలో వేదాలను మొదట ఎదిరించిన భారతీయులు చార్వాకులని పేర్కొన్నాడు. అప్పటి నుంచి వేదాల ప్రమాణత మీద భారతదేశంలో హేతువాదులు, తాత్త్వికులు, నాస్తికులు యుద్ధం చేస్తూనే ఉన్నారని ఆయన చార్వాకుల వాదాన్ని బలపరిచాడు. అసలు వేదాలు ఎలా పుట్టాయి అనే దానిలో పదకొండు వాదాలున్నాయని అంబేద్కర్ తేల్చాడు. పురుషుని నిగూఢ యజ్ఞం నుంచి ఉద్భవించాయని, స్కంభపై ఆధారపడినవని, బ్రహ్మ నుంచి వేరు చేయబడిన వెంట్రుకల నుంచీ, నోటి నుంచీ వచ్చాయని, ఇంద్రుని నుంచి ఉద్భవించాయని, కాలం నుంచి ఉద్భవించాయని, అగ్ని నుంచి ఉద్భవించాయని, ప్రజాపతి నుంచి, జలాల నుంచి ఉద్భవించాయని, బ్రహ్మ ఉఛ్వాసంగా వచ్చాయని, మనో సముద్రం నుంచి దేవతలు తవ్వి తీశారని, ప్రజాపతి గడ్డంలో నుంచి వచ్చాయని, వచస్సు యొక్క సంతతి అని ప్రతిపాదించారు.

ఈ ప్రతిపాదనలన్నింటినీ అశాస్త్రీయమైనవిగా అంబేద్కర్ కొట్టివేశాడు. ఒక రకంగా అంబేద్కర్ పరిశోధన వల్ల భారతీయ తత్వశాస్త్రానికి మేలు జరిగింది. ఎందుకంటే మంచి రాసినా, చెడు రాసినా రుషులే రాశారు. మానవేతరమైన శక్తులేమీ రాయలేదని ప్రతిపాదించటం వల్ల రుషులకు అస్తిత్వం వచ్చింది. నిజానికి రుగ్వేదంలో ఎక్కువగా ఆదిభారతీయులను నిందించే సూత్రాలే రాయబడ్డాయి. రుగ్వేదంలో ఆర్య రుషులు తమ శత్రువులను నిందించడానికే (రుక్కులలో) ఎక్కువ ప్రయత్నించారు. వారెంత ప్రాధాన్యత నిచ్చారంటే, ఆ శత్రువర్గం ఎంతో శక్తిమంతమైందని మనకు అర్థమవుతుంది.

ఆర్య రుషైన మధుఛన్దసుడు ఇంద్రుని స్తుతిస్తూ శత్రువర్గాన్ని జయించడానికి ఎలా అభ్యర్థిస్తున్నాడో చూడండి. 'ఇంద్రత్వోతాస ఆవయం వజ్రం ఘనాదదీమహి జయేమ సంయుధిస్ప ృధః' ఓ ఇంద్రా! నీచే రక్షితులమగు మేము ఘనమైన వజ్రమును దీసి కొనుచున్నాము. యుద్ధములందు శత్రువులను జయింతుము. 'వయంశూరేభి రస్త ృభి రింద్ర త్వయాయుజా వయమ్ సాన హ్యామ పృతన్యతః' శూరులై ఆయుధ హస్తులైన భటులతోను, నీతోను గూడినవారమై ఓ ఇంద్రా! సేనలతో గూడిన శత్రువులను

మేమోడింతుము. 'మహా ఇంద్రః పరశ్చను మహిత్వ మస్తువజ్రిణే ద్యౌర్న ప్రథినాశవః' ఇంద్రుడు గొప్ప శరీరము, గొప్ప గుణములు కలవాడు. అయినను వజ్రము ధరించిన ఇంద్రునకు అవి (శరీరము, గుణము) అధికములగుగాక, ద్యులోకమెంత విస్తారమో అంతగా బలము విస్తరించుగాక. 'ఏవాహ్యస్య సూన ృతా విరప్శీగోమతీమహి సక్వాశాఖాన దాశుషే' యుద్ధంలో హెచ్చరిస్తుంది. గోవులనిచ్చునదియు, గొప్పదియు, సత్యప్రియమైనదియునగు నా ఇంద్రుని వాక్కు యజమానునకు బండ్లతో నిండిన కొమ్మవంటి దగుగదా! అని మంత్రము.

**రుగ్వేదం, యజుర్వేదం, సామవేదాలు మూడూ అనార్యులను జయించడానికి ప్రకృతి శక్తులను ప్రార్థించిన సూత్రాలేనని అంబేద్కర్ చెప్పాడు. సింధూ నాగరికతలోని వ్యవసాయ సంస్కృతి రుగ్వేద సంస్కృతి కంటే పూర్వపుది. చాలా ఉన్నతమైంది**

ఇలా మూలవాసులైన శత్రువులను నిర్జించే శక్తినిమ్మని ఆర్య రుషులు ఇంద్రుని కోరారు. సింధూ నాగరికతను నాయకత్వం వహిస్తున్న జాతులు ఆర్యులకు ఎదురు నిలిచి పోరాడారనడంలో ఎలాంటి సందేహం లేదు. భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తున్న వారు వ్యవసాయ సంస్కృతి ప్రతినిధులు కాగా, వారికి వ్యతిరేకంగా నిలబడిన ఆర్యులు పశుగణాలకు నాయకులు. ఆర్యులది పితృస్వామిక వ్యవస్థ, భారతీయ గణాలది మాతృస్వామ్య వ్యవస్థ. వారికి, వీరికి జీవన విధానాల్లో వైరుధ్యం ఉంది. అందుకే ఆర్యగణాలు భారతీయ వారసులను జయించడానికి తహ తహ లాడారు. ఆనాడు భారతీయుల తరపున నిలబడిన, పోరాడిన వారిని ఆర్యులు రాను రాను శత్రువులుగా, అస్పృశ్యులుగా కూడా ప్రకటించి వారి మీద ద్వేషానలాన్ని కుమ్మరించారు. ఇక తత్వశాస్త్ర పరంగా అంబేద్కర్ వేదాలను ఎదిరించిన చార్వాకుల వాదాన్ని 'సర్వదర్శన సంగ్రహం' నుంచి ఇలా చెప్పారు.

'వైదిక పండితులమని చెప్పుకొనే వంచకులు పరస్పర విధ్వంసకారులవుతున్నారు. కర్మకాండను ప్రమాణంగా అంగీకరించేవారు జ్ఞానకాండ ప్రమాణాన్ని త్రోసి పుచ్చుతున్నారు. జ్ఞానకాండను ప్రమాణంగా అంగీకరించేవారు కర్మకాండ ప్రమాణాన్ని త్రోసి పుచ్చుతున్నారు. చివరకు ఈ మూడు వేదాలూ మోసగాళ్ల పరస్పర విరుద్ధమైన సందర్భశుద్ధి లేని మాటలుగా అయ్యాయి. ఈ మేరకు ఒక ప్రసిద్ధమైన లోకోక్తి ఇలా ఉంది. అగ్నిహోత్రం, వేదత్రయం, సన్యాసి, మూడు కట్టెలు, విబూది రాసుకోవటం ఇవన్నీ ఆలోచన, లోకజ్ఞానమూ లేని వారి జీవనధారాలని చార్వాకులు చెప్పారు. అంబేద్కర్ ఒక హేతువాదిగా చార్వాక దర్శనాన్ని ఇక్కడ మనకు ఉటంకించాడు. రుగ్వేద రుషులు భారతదేశ సంస్కృతీ విధ్వంసానికి పూనుకున్నారు. ఆ సంస్కృతీ విధ్వంసానికి వాళ్ళు ఇంద్రుణ్ణి సృష్టించారు.

రుగ్వేదం, యజుర్వేదం, సామవేదాలు మూడూ అనార్యులను జయించడానికి ప్రకృతి శక్తులను ప్రార్థించిన సూత్రాలేనని అంబేద్కర్ చెప్పాడు. సింధూ నాగరికతలోని వ్యవసాయ సంస్కృతి రుగ్వేద సంస్కృతి కంటే పూర్వపుది. చాలా ఉన్నతమైంది కూడా. అప్పటికే వారు భూమిని గుర్తించారు. వ్యవసాయాన్ని చేస్తున్నారు. సింధూ సంస్కృతి రుగ్వేద సంస్కృతి కంటే చాలా ఉన్నతమైంది కావడం వల్ల ఆర్యులు ద్వేషపడ్డారు. అక్కడ గొప్ప జనావాసాలు నెలకొన్నాయి. సింధూవారసులు నదులకు ఆనకట్టలు కట్టి నీటిని ప్రవహింపజేశారు. హరప్పా, మొహంజదారో నగరాలలో ఒక నిర్మాణాత్మకమైన పద్ధతి ఉంది. అప్పటికే చెక్క పని చేయగలిగిన పనివాళ్ళు, ఆనకట్టలు కట్టగలిగిన నిర్మాణకర్తలు ఉన్నారు. అయితే రుగ్వేదంలో ఆనకట్టల నిర్మాణానికి సంబంధించిన యంత్రాంగం మనకు ఎక్కడా కనిపించదు. అందుకే వాళ్ళు సింధూ సంస్కృతి కూడా మాదే అని చెప్పడానికి ఆధారాలు లేవు. భారత ఉపఖండ సంస్కృతి నిర్మాతలు మాతృస్వామిక వ్యవస్థకు సంబంధించిన వారైన సింధూ నాగరిక వాసులు ఈనాటి దళితులే. ముఖ్యంగా నదుల ప్రక్కన జీవించే స్వభావం ఉన్నవారు. నదిని వ్యవసాయ సంస్కృతికి మలచినవారు మూలవాసులే. మనకు క్రీస్తుపూర్వం మూడు వేల సంవత్సరాల నుంచి సింధూ నాగరికత కనిపిస్తుంటే క్రీస్తు పూర్వం 1750కి రుగ్వేదం కూర్చబడింది. 1500 నుంచి 1400 వరకు కాబూల్ గంగానదుల మధ్య ప్రాంతంలో ఈ పని జరిగింది. సింధూ నాగరికతలో ఆర్యుల ఉనికి లేదు. రుగ్వేదంలో చెప్పిన గోత్రాలకు సంబంధించిన వారు కానీ, వైదిక ఆర్యులకు సంబంధించిన ఎవరి ఉనికి కానీ సింధూ నాగరికతలో కనిపించటం లేదు. భారతదేశ చరిత్రను పరిశీలిస్తే మూలజాతులే ఈ దేశ నిర్మాతలు. మూల జాతుల మీద మొదటి

మేధోస్వరం

## ఎక్కడ మనస్సు.....

– రవీంద్రనాథ్ టాగూర్



ఎక్కడ మనస్సు నిర్భయంగా మసలుతుందో
ఎక్కడ సగర్వంగా తల ఎత్తుకు తిరుగుతారో

ఎక్కడ జ్ఞానం ఉచితంగా అభిస్తుందో
ఎక్కడ ప్రపంచం సంకుచిత మానవ
సంబంధాలతో ముక్కలు చెక్కలు కాదో

ఎక్కడ సత్యాన్నే పలుకుతారో

ఎక్కడ శ్రమ లక్ష్యసాధన వైపు చేతులు చాస్తుందో

ఎక్కడ జ్ఞాన స్రవంతి దారితప్పి
అజ్ఞానాంధకార యడారిలో ఇంకిపోదో!

ఎక్కడ మానవ మేధస్సు నీచే
విశాల దృక్పథంతో వికసిస్తుందో–

నా తండ్రీ... ఆ స్వర్గ స్వేచ్ఛలోకి
నా దేశం మేలుకోనీ!



యుద్ధం ప్రకటించింది రుగ్వేదమే. అందుకే అంబేద్కర్ ఒకానొక దశలో రుగ్వేదంలోని కథనాలన్నీ మూలజాతులను వధించిన ఘట్టాల వర్ణనలే అన్నారు. అయితే వేదాలు జ్ఞానవంతమైనవని బ్రాహ్మణవాదులు ప్రచారం చేశారు. వేదాల్లోని చిన్నచిన్న కథలను తీసుకుని పురాణ సాహిత్యమంతా సృష్టించారు. అందులో ప్రతి నాయకుడూ మూలవాసుల నాయకులను చంపినవాడే. వేదాలకు నాయకులు ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, వాయువు. నిజానికి ఇంద్రుడు తప్ప మిగిలినవన్నీ ప్రకృతి శక్తులే. వీటిని మూలవాసులు ఎప్పుడో అధ్యయనం చేసి వారి జీవన క్రమానికి వాడుకున్నారు. మూలవాసులు ఎవరూ అగ్నిని పూజించరు. అగ్నితో అన్నం వండుకుంటారు. కానీ యిగ్వేదం మొత్తం అగ్ని స్తోత్రాలే. మూలవాసులు ఎవరూ నవధాన్యాలను అగ్నిలో వేయరు, నెయ్యిని అగ్నిలో కాల్చరు, కానీ వేదాల్లో చెప్పబడిన యజ్ఞయాగాల్లో కొన్ని లక్షల టన్నుల నెయ్యిని అగ్నిలో కాల్చారు. అందుకే వేదాలను భారతీయ విధ్వంసక శాస్త్రాలన్నాడు అంబేద్కర్. ప్రసిద్ధ చరిత్రకారులైన రొమిల్లా థాపర్, డిడి కొశాంబి, ఆర్ఎస్ శర్మ, ఎఎల్ భాష్యం అందరూ వేదాలు భారతదేశ సాంస్కృతిక విధ్వంసక కథనాల సమాహారమనే చెప్పారు. రొమిల్లా థాపర్ రుగ్వేద సంస్కృతి గురించి చెబుతూ దేవతల్లో మిత్ర, వరుణులు ఇండోఇరానియన్ సంస్కృతులకు చెందినవారని, వీరికి బదులుగా ఇంద్రుడు, అగ్ని పేర్కొనబడ్డారు. ఇంద్రుడు యుద్ధంలో ముందుండి నడిపించటం చేత ఎల్లప్పుడు మూలవాసులను హతమార్చడానికి దాసుల నివాసాలను నాశనం చేయటం ద్వారా ఇంద్రుడు గొప్ప నాయకుడయ్యాడు. వేదాల లోతుల్ని అంబేద్కర్ చూసిన తర్వాత భారతదేశ చరిత్రకారుల్లో వేదాలకు ఎదురు మాట్లాడగలిగిన స్థైర్యం విస్తరించింది. బ్రాహ్మణవాదానికి వేదాలు పునాది అనే విషయం బలపడింది. వేద వాఙ్మయంలో జ్ఞానం లేదని, హింస, కర్మకాండ, ద్వేషం, అణచివేత ఉన్నాయనే విషయం అంబేద్కర్ ద్వారా బట్టబయలయ్యింది. వేదాల్లో రాయబడిన పూర్వసంస్కృతం భారతదేశంలో ఏ జాతులూ మాట్లాడవని అంబేద్కర్ నిగ్గు తేల్చాడు. భారతదేశంలోని ఏ తెగల సంస్కృతీ వేద సంస్కృతి కాదని తెలియజెప్పాడు. అంబేద్కర్ తన హేతువాద దృక్పథంతో చేసిన రచనలన్నీ ఆయన పుట్టి 125 ఏళ్ళు, చనిపోయి 60 ఏళ్ళు అవుతున్న ఈ సందర్భంగా వామపక్ష, లౌకికవాదులు, హేతువాదులందరికీ వైదిక హిందూత్వ బ్రాహ్మణవాద భావజాలానికి ప్రత్యామ్నాయ వాదాలను, సిద్ధాంతాలను ఆచరణలో ప్రతిఫలింపజేసుకుని దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి అందరూ నడుం కట్టాలని, అంబేద్కర్ ఆలోచనా మార్గంలో నడవాల్సిన చారిత్రక సందర్భం ఇదని ఆయన స్మృతిలో జ్ఞాపకం చేసుకుందాం.. ◆

# ఊగిసలాడని సత్యాన్వేషణ



కారల్‌మార్క్స్

సత్యాన్వేషి అటూ ఇటూ దిక్కులు చూడరాదు. సత్యంపైనే దృష్టి నిలపాలి. అవునా, కాదా? అని నిర్ణీత రూపంలో మాత్రమే నా భావాలను వ్యక్తం చేయాలని షరతు పెడితే అసలు సారాంశాన్ని నేను మరిచిపోనా?

వెలుగు ఏపాటి వినయశీలో సత్యమూ అంతే. అయినా, సత్యం ఎవరిపట్ల వినయంగా ఉండాలి? తన పట్ల తానే వినయంగా ఉండాలా? సత్యమే సత్యాసత్యాల గీటురాయి అన్నాడు స్పినోజా. పోనీ సత్యం అసత్యం పట్ల వినయంగా ఉండాలా?

ఒకవేళ వినయం అనేది అన్వేషణకు స్వాభావిక లక్షణమైతే, అసత్యం కన్నా సత్యమే ఎక్కువ భయపెడుతుందనడానికి అది సూచన అవుతుంది.

**స**త్యాన్వేషణ గంభీరంగానూ, వినయపూర్వకంగానూ ఉండాలి. అలా ఉంటేనే సెన్సార్‌షిప్ దానిని అడ్డగించదన్నమాట. ఈ నిర్వచనాలు అన్వేషణా వస్తువుకు సంబంధించినవి కావు. వస్తువుకు ప్రమేయం లేని పరాయి విషయాలివి. మొదటి నుంచీ వాళ్ళు సత్యాన్వేషణను సత్యం నుంచి పక్కకు లాగి, రెంటికీ సంబంధంలేని మరేదో మూడో విషయం వైపు దృష్టిని మళ్ళింపజూస్తున్నారు. ఇలా వేరేదో అంశంపైనే తదేకంగా దృష్టి నిలపాలనే షరతు వల్ల దృష్టి పథం నుంచి సత్యం తప్పించుకుపోదా? సత్యాన్వేషి అటూ ఇటూ దిక్కులు చూడరాదు. సత్యంపైనే దృష్టి నిలపాలి. అవునా, కాదా? అని నిర్ణీత రూపంలో మాత్రమే నా భావాలను వ్యక్తం చేయాలని షరతు పెడితే అసలు సారాంశాన్ని నేను మరిచిపోనా?

వెలుగు ఏపాటి వినయశీలో సత్యమూ అంతే. అయినా, సత్యం ఎవరిపట్ల వినయంగా ఉండాలి? తన పట్ల తానే వినయంగా ఉండాలా? **సత్యమే సత్యాసత్యాల గీటురాయి** అన్నాడు స్పినోజా. పోనీ సత్యం అసత్యం పట్ల వినయంగా ఉండాలా?

ఒకవేళ వినయం అనేది అన్వేషణకు స్వాభావిక లక్షణమైతే, అసత్యం కన్నా సత్యమే ఎక్కువ భయపెడుతుందనడానికి అది సూచన అవుతుంది. అంటే నేను వేసే ప్రతి ముందడుగునీ నిరుత్సాహ పర్చడానికి ఇదొక సాధనం అన్నమాట. అన్వేషణాఫలితం పట్లనే దడ పుట్టించడ మన్నమాట. సత్యానికి వ్యతిరేకంగా కాపలా కాసే సాధనం కాదా ఇది?

ఇంకా చెప్పాలంటే, సత్యం సార్వత్రికం. అది నా ఒక్కడికే కాదు. అందరిదీ. సత్యం నా సొంతం కాదు. నేనే దానికి సొంతం. రూపం మాత్రమే నా ఆస్తి. అదే నా వ్యక్తిత్వం. మనిషి అంటే అతని శైలే. చట్టం నన్ను రాయడానికి

అనుమతిస్తుంది. నిజమే! కాని నేను నా శైలిలో రాయకూడదు. నాదికాని శైలిలో రాయాలి. ఆహా, నేను నా మానసిక లోకాలను వ్యక్తీకరించ వచ్చు. కాని వాటిని ప్రభువులు నిర్దేశించిన చట్రంలోనే బిగించాలి! ఆత్మగౌరవం ఉన్న ఏ మనిషైనా ఈ సూచన పాటించాలంటే సిగ్గుతో కుంచించుకు పోడా? తన ముఖాన్ని ముసుగులో దాచేసుకోడా?

అనంతమైన ప్రకృతి సంపదనీ ఎంతో ఆనందదాయకమైన దాని వైవిధ్యాన్నీ మీరు ఆరాధిస్తారు. గులాబి వయోలెట్‌లా గుబాళించాలని మీరనరు. అవునా? సంపదలన్నింటిలోనూ అత్యున్నతమైనదేది? ఆత్మసంపదే కదా! అటువంటి ఆత్మ ఒకే తీరుగా ఒకే రీతిగా ఉండి తీరాలంటారా? నేను హాస్యప్రియుడిని. కాని గంభీరంగా మాత్రమే రాయాలని చట్టం నన్ను శాసిస్తోంది. నేను తెంపరిని. అణుకువగా మాత్రమే రాయమని చట్టం నన్ను ఆదేశిస్తోంది. బూడిద రంగు, మొత్తం బూడిద రంగే. అదే ఏకైక సాధికారికమైన 'స్వేచ్ఛా' వర్ణం! సూర్యకాంతి ప్రతిఫలించినప్పుడు ప్రతి ఒక్క మంచు బిందువూ అనంతమైన వర్ణాల సమ్మేళనంగా మెరిసిపోతుంది. కాని మానసిక సూర్యుడు మాత్రం ఎందరిలో ప్రతిఫలించినా కేవలం అధికారిక వర్ణాన్నే సృష్టించాలి! ఆత్మ అసలు రూపం ఉల్లాసం. అంటే వెలుగు. కాని తమరేమంటున్నారు? నీడే దాని ఏకైక రూపం అంటున్నారు. ఆత్మను నల్ల రంగుతో కప్పేయాలనుకుంటున్నారు. పూలల్లో నల్లని పూలుంటాయా, ప్రభూ?

ఎప్పుడూ సత్యమే ఆత్మసారం. కాని తమరేమంటున్నారు? వినయమే దాని సారం అంటున్నారు. నీచుడు మాత్రమే వినయంగా ఉంటాడన్నాడు గెథె. ఆత్మను అలా నీచంగా హీనంగా మార్చాలనేనా తమ ప్రయత్నం? మహా మేధావులకు సహజమైన వినయం గురించి షెల్లర్ మాట్లాడాడు. తమరంటున్నది, ఆ వినయం గురించా? అయితే, ముందు మీ పౌరులనీ, మీ సెన్సార్ అధికారులనూ మహా మేధావులుగా మార్చేయండి, మరి. నిజానికి, మహామేధావి అన్నవాడు వినయావినయాలను మరిచిపోయి, అసలు విషయంపైనే కేంద్రీకరిస్తాడు. అదే మహామేధావి వినయం. మనసుకు చెందిన సార్వత్రిక వినయం హేతుబద్ధతే.

> **సెన్సార్ అధికారులు ఇరవై ఏళ్లకు పైగా చట్ట వ్యతిరేకంగా ప్రవర్తిం చారంటే అర్థమేమిటి? అటువంటి బాధ్యతా రహితులైన వ్యక్తులకు ఇటువంటి సాధారణ ఆదేశాలు సరిపోవనడానికి ఇది రుజువు కాదా! ఇంకా వేరే రుజువు లేం కావాలి? పత్రికలకు ఇవి కాక వేరే హామీలు అవసరమని స్పష్టం కావడం లేదా?**

ఆత్మలోపాన్ని దాచుకోవడానికి శరీరం అనుసరించే కపట ప్రవర్తనే గాంభీర్యం అంటాడు ట్రిస్టామ్ షాండీ. తమ గాంభీర్యం ఈ నిర్వచనం పరిధిలోకి రారాదని, విషయం మాత్రమే గంభీరంగా ఉండాలని తమరు ఆశిస్తున్నారా? అప్పుడు కూడా తమ ఆదేశాలు కుప్పగూలిపోతాయి. ఎందుకంటే, హాస్పాస్పదమైన విషయంతో హాస్యాస్పదంగా వ్యవహరించినప్పుడే దానిని గంభీరంగా పరిగణించినట్టవుతుంది. అవిధేయతకు వినయంగా ఉండడమంటే, అది వినయరాహిత్యమే.

**గాంభీర్యం, వినయం.** ఎంత చంచలమైన, సాపేక్షమైన భావనలివి! ఎక్కడ గాంభీర్యం అంతమౌతుంది? నవ్వులాట ప్రారంభమయ్యేదెక్కడ? ఎక్కడ వినయం అంతమై, అహంకారం ప్రారంభమవుతుంది? అంటే మనమిక సెన్సార్ అధికారి మనస్తత్వం పైన ఆధారపడి ఉండాలన్న మాట. రచయితకు శైలిని నిర్దేశించడం ఎంత తప్పో, సెన్సార్ అధికారికి మనస్తత్వం ప్రతిపాదించడం అంతే తప్పు. అతడు ఫలానా మనస్తత్వం కలిగి ఉండాలనడం అసంబద్ధం. మీ సౌందర్యాత్మక విమర్శలో నిక్కచ్చిగా ఉండదలచుకున్నారా? అలా అయితే మీ సత్యాన్వేషణలో మితిమీరిన గాంభీర్యాన్ని, అతి వినయాన్నీ వదిలేయండి. ఎందుకంటే, అతి గాంభీర్యం అత్యంత హాస్యాస్పదం. అతి వినయం ఘోరమైన వినయరాహిత్యం. ఒకే వస్తువుని వివిధ వ్యక్తులు వేర్వేరుగా దర్శిస్తారు. వేర్వేరుగా వ్యక్తం చేస్తారు. వ్యక్తిని బట్టి మారే వ్యక్తిగత కోణం ఇది. పోనీ, దీనిని పక్కన పెడదాం. వస్తువుకి దాని సొంత లక్షణమంటూ ఉంటుంది. ఈ వ్యక్తిగత లక్షణాలకి పరిశోధన మీద ఏ ప్రభావమూ ఉండదా? వీసమెత్తు ప్రభావమైనా ఉండదని అనుకోవాలా?

సత్యమంటే కేవలం పరిశోధనా ఫలితం మాత్రమే కాదు. అన్వేషణాపథం కూడా సత్యంలో భాగమే. సత్యాన్వేషణ స్వయంగా సత్యవంతంగా ఉండాలి. నిజమైన అన్వేషణ అంటే పరిణత

సత్యమే. చెల్లాచెదురుగా ఉన్న దానిలోని వేర్వేరు అంశాలను గుదిగుచ్చి ఒక దగ్గరకు చేర్చగలిగితేనే సత్యవంతమైన ఫలితం సాధ్యం. వస్తువు స్వభావాన్ని బట్టే అన్వేషణా పద్ధతి కూడా మారుతుంది. కాదా? కాని వస్తువు నవ్వు పుట్టించేదయినా శైలి మాత్రమ గంభీరంగా ఉండాలని తమరు శాసిస్తున్నారు. వస్తువు ఆమోదయోగ్యం కానిదైనా, దాని శైలి వినయంగా ఉండాలంటున్నారు. తద్వారా ఆ వస్తువు హక్కును తమరు ఉల్లంఘిస్తున్నారు. అంతేకాదు. దానిని పరిశీలించి, ప్రతిఫలించే వ్యక్తి హక్కునూ ఉల్లంఘిస్తున్నారు.

బహుశా, ఇటువంటి సత్యాసత్యాల మీమాంస అవసరమే లేదేమో!! సత్యం అంటే ప్రభుత్వ తాకీదులే అని అర్థం చేసుకుంటే సరిపోతుందేమో!? అన్వేషణ కేవలం ఒక లాంఛనం మాత్రమేనేమో! అన్వేషణ అనేది ఒక అనవసరమైన, వ్యర్థ అంశమేమో!! పైగా అది ఒక తలనొప్పి వ్యవహారం కూడానేమో!! అవును. ఇదే నిజమనిపిస్తోంది.

ఎందుకంటే, అన్వేషణ అంటే ముందుగానే సత్యానికి విరుద్ధమైనదిగా అర్థమవుతోంది. రాజ్యాధికారపు తర్కమే ప్రభుత్వ అవగాహన. కొన్ని సందర్భాలలో, భిన్నమైన అవగాహనకూ దాని కబుర్లకూ కొంత రాయితీ ఇవ్వాల్సి రావచ్చు. నిజమే కాని ఈ భిన్నమైన అవగాహన అనేది తనకు రాయితీ లభించిందనీ, తనకు స్వతహా హక్కు లేదనీ గుర్తెరిగి వ్యవహరిస్తుంది. ఆ స్పృహతోనే అది రంగం మీదకు వస్తుంది. అందుకే అది వినయంగా, అణకువగా, గంభీరంగా, విసుగెత్తించేదిగా వుంటుంది.

**నిజానికి, 1819 నాటి పాత ఉత్తర్వు ఈ కొత్త తాకీదూ, రెండూ మధ్యంతర చర్యలే. ఒకే ఒక్క తేడా. పాత చట్టానికి, ఐదు సంవత్సరాల నిర్ణీత కాల వ్యవధిని ప్రకటించారు. కొత్త తాకీదుకి కాల పరిమితే లేదు. పాత చట్టం పేరు పత్రికా స్వాతంత్ర్య చట్టం. ఇప్పటి కొత్త తాకీదు పేరు సెన్సార్‌షిప్ చట్టం.**

'మనల్ని విసుగెత్తించే రకం తప్ప మిగిలినవన్నీ మంచివే' అంటాడు వోల్టేర్. కాని ఇప్పుడు మనకు ఆ విసుగెత్తించే రకం ఒక్కటే మిగిలింది. ఆహా, మీరు స్వేచ్ఛగా రాసుకోవచ్చు. కాని మీ ప్రతి మాటా కొత్త సెన్సార్‌షిప్ తాకీదుకి తలవంచాలి. ఇక అప్పుడు వినయంగా, గంభీరంగా మీ అభిప్రాయాలను యథేచ్ఛగా వెళ్ళబోసుకోవచ్చు. ఒక్కమాట. మీ భక్తి ప్రపత్తుల్ని మాత్రం ఒక్క క్షణం కూడా మరవకండి. చట్టానికి కావాల్సింది సత్యం కాదు. కేవలం గాంభీర్యం, వినయం మాత్రమే.

'మొత్తంగా క్రైస్తవ మతానికి గానీ లేదా ఏదైనా ఒక ప్రత్యేక మత విశ్వాసానికి గానీ వ్యతిరేకంగా ఉద్దేశించిన **చిల్లర** రాతలను. **శత్రుపూరిత** రాతలను ఎంత మాత్రం సహించరాదు", అనే కొత్త సెన్సార్‌షిప్ తాకీదు తేల్చింది.

పాత సెన్సార్‌షిప్ ఉత్తర్వు అసలు క్రైస్తవ మతాన్ని ప్రస్తావించనే లేదు. పైగా అది మతానికీ, వేర్వేరు విడి మత శాఖలకూ, తెగలకూ మధ్య భేదాన్ని చూస్తుంది. సామాన్య అర్థంలో మతం అన్నదాన్ని కొత్త సెన్సార్‌షిప్ తాకీదు క్రైస్తవ మతంగా మార్చింది. అంతేకాదు. విడి విశ్వాసాన్ని కూడా దానికి జోడించింది. కనుక క్రైస్తవ్యాన్ని గానీ, ఏ విడి మత శాఖను గానీ ఎవరూ కన్నెత్తి కూడా చూడరాదు. మన క్రైస్తవీయ శాస్త్రపు ముద్దులొలికే సంతానం ఇది. ఇది పత్రికలకి కొత్త సంకెళ్లు తగిలిస్తున్నది. ఇంకా దీనికి కాదనే వారెవరయినా ఉంటారా? **శత్రుపూరితం. చిల్లర.** ఈ రెండు మాటలు వాడడం ద్వారా కొత్త తాకీదు ఈ సంకెళ్ళను గులాబి మాలలుగా మార్చిందని మీరు భ్రమపడటం లేదు గదా. **చిల్లర! శత్రుపూరిత!** ఈ పదాలను ప్రయోగించడంలో ఎంత నేర్పు! ఎంత ప్రజ్ఞ!

**చిల్లర** అనే విశేషణం వాడటం ద్వారా పౌరుడికి అతని మాన మర్యాదలు వారు గుర్తుచేస్తున్నారు. **శత్రుపూరిత** అనే విశేషణాన్ని సెన్సార్ అధికారి చెవిలోరహస్యంగా ఊదుతున్నారు. చట్టపరిభాషలో చిల్లర అన్నదానికి శత్రుపూరితమని అర్థం అన్నమాట. ఈ తాకీదులో ఇటువంటి సొంపైన అంశాలు ఇంకా ఎన్నో ఉన్నాయి. **చిల్లర** అనే మాట వినగానే మర్యాదస్తులయిన ప్రజల ముఖాలు సిగ్గుతో కందిపోతాయి. **శత్రుపూరితం** అనే మాట వినగానే సెన్సారు అధికారికి ఉప్పు అందుతుంది. రచయిత ముఖం భయంతో పాలిపోతుంది.

రాజ్య వ్యవహారాలను నిర్ధారించడంలో ఒక విడి మత శాఖ స్వభావం కొలబద్ద కారాదని పాత ఉత్తర్వు శాసించింది. దానివల్ల భావాలలో గందరగోళం తలెత్తుతుందని అది

సరిగానే గ్రహించింది. కనుక ఒక విడి మతాన్ని, దాని సారాంశాన్ని ఎవరైనా విమర్శించ వచ్చు అంది. ఇది హేతువాదమే గానీ, పై పై హేతువాదం మాత్రమే అయినా ఈ హేతువాదాన్ని సైతం కొత్త తాకీదు చీదరించు కొంటోంది. రాజ్యాన్ని మత విశ్వాసాల మీద, క్రైస్తవం మీద నిలబెట్టాలను కొంటోంది.

అటువంటప్పుడు భావాలలో గందరగోళాన్ని తొలగించడానికి కొత్త సెన్సారు అధికారులకు ప్రభువులయిన తమరు ఇచ్చే ఉత్తర్వులేమిటి? మతానికీ లౌకికత్వానికీ మధ్య,రాజ్యానికీ చర్చికీ మధ్య బేధాన్ని కొందరు ప్రభుత్వాధి కారులు గమనించలేక పోతున్నారనే విషయాన్ని ఇటీవలి అనుభవం తమకు నేర్పింది. అదే సెన్సారు అధికారులకు నిర్ణయాధికారం ఇస్తే భావాలలో గందర గోళం పటాపంచలు అవుతుందను కుంటున్నారా తమరు? అది అసాధ్యం. దౌత్యనీతిని ప్రయోగించి చర్చల ద్వారా పరస్పర విరుద్ధ శక్తుల మధ్య సమస్యని పరిష్కరించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. కనుక, రాజకీయాల్లోకి మతం ప్రవేశించ డాన్ని నిషేధించండి. లేదంటారా, నేరుగా రాజకీయాల్లోకి మతోన్మాదాన్ని సైతం తన తరహాలో యథేచ్ఛగా ప్రవేశించనవ్వండి. తమకు అదీ కుదరదు. ఇదీ కుదరదు.

స్వేచ్ఛా హేతువు మీద రాజ్యాన్ని నిర్మించటం తమ అభిమతం కాదు. దానిని మత విశ్వాసం మీద నిలబెట్ట దలచారు. మతం యథాతథస్థితి అనుమతించి ఆశీర్వదిస్తుందని తమ ఉద్దేశం. అందుకే, రాజకీయాల్లోకి మత ప్రవేశాన్ని తమరు అడ్డుకోరు. పోనీ, మతాన్ని తన సొంత పద్ధతిలో సొంత బాధ్యత మీద రాజకీయాలలో దూరనిస్తారా అంటే అదీ చేయరు. తమ దృష్టిలో, లౌకిక అధికారాన్ని మతం సమర్థించాలి. లౌకిక అధికారం మాత్రం మతానికి లోబడనక్కరలేదు.

కానీ, ఒకసారి మతం రాజకీయా ల్లోకి ప్రవేశించిందా అది దుర్భరంగా మారుతుంది. ఆ మాటకొస్తే అది మత విరుద్ధంగా తయారవుతుంది. రాజకీయాల్లో మతం ఎలా వ్యవహరించాలో మీరు లౌకిక పద్ధతిలో నిర్ణయించలేరు. మతంతో జట్టు కట్టాలనుకునేవారు ఎవరైనా అన్ని విషయాల్లోనూ మతానికే నిర్ణయాధికారాన్ని ధారపోయాల్సి వుంటుంది. లేదా మతమంటే తమ అపరిమిత అధికారాన్నీ ప్రభుత్వతత్వాన్నీ నెత్తినపెట్టుకొని కొలిచే సాధనమను కుంటున్నారా, ఏం?

"నీతికీ,సత్ప్రవర్తనకీ, వ్యతిరేకమైన వాటిని" అణచివేయడం పాత ఉత్తర్వు లక్ష్యాలలో ఒకటి. కొత్త తాకీదులో మతం విషయంలో మార్పులున్నట్లే నీతి విషయంలో తొలగింపులున్నాయి. "నీతికీ, సత్ప్రవర్తనకీ వ్యతిరేకమైన వాటిని, అన్న పదాల స్థానంలో "ఔచిత్యం,ప్రవర్తన, బాహ్య మర్యాదల" ఉల్లంఘన అనే పదాలు వచ్చి చేరాయి.

కానీ, ఒకసారి మతం రాజకీయా ల్లోకి ప్రవేశించిందా అది దుర్భరంగా మారుతుంది. ఆ మాటకొస్తే అది మత విరుద్ధంగా తయారవుతుంది. రాజకీయాల్లో మతం ఎలా వ్యవహరించాలో మీరు లౌకిక పద్ధతిలో నిర్ణయించలేరు.

**నీతి.** అది దానికదే ఒక స్వతంత్ర్య, పవిత్ర రంగం. కాదా! కాని మన ఈ క్రైస్తవ శాసనకర్త దానినలా ఎంచడు. నీతి సహజ సారాంశం మతానికే చెందుతుందని అతడు వాదిస్తాడు. స్వతంత్ర్య నీతి అనేది సాధారణ మత సూత్రాలకు భిన్నం. ప్రత్యేక మత భావనలు నీతితో ఘర్షణ పడుతూ ఉంటాయి. నీతి తన సొంత, సార్వత్రిక, హేతుబద్ధ మతాన్ని మాత్రమే గుర్తిస్తుంది. మతం కేవలం రూఢమైన తన సొంత నీతిని మాత్రమే గుర్తిస్తుంది. కనుక ఈ కొత్త తాకీదు ప్రకారం నైతిక మేథో నాయకులైన కాట్, ఫికె, స్పినోజా వంటి వారు మత బాహ్యులవుతారు. అంతేకాదు, ఔచిత్యాన్ని, ప్రవర్తననూ, బాహ్య మర్యాదను భంగపరచిన వాళ్ళవుతారు. నీతికీ, మతానికీ మధ్య సూత్రరీత్యా ఉండే వైరుధ్యం నుంచే నైతిక వాదులందరూ ప్రారంభమయ్యారు. మానవుని మనసు సర్వ స్వతంత్ర్యం అంటారు వీరు. కాదు అది పరతంత్రం, దైవాధీనం అంటుంది మతం. దీనిని బట్టి చూస్తే, కొత్త తాకీదు తన నైతికాత్మను బలహీన పరచుకొంది. మతాత్మను మాత్రం అతిగా బలోపేతం చేసుకుంది.

పత్రికా రచనల **రూపం** పట్ల, వాటి **ధోరణి** పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలని సెన్సార్ అధికారులను కొత్త తాకీదు ఆదేశించింది. ఒకవేళ ఆ రచనల **ధోరణి** "ఉద్వేగం వల్లనో, దూకుడు వల్లనో, అహంకారం వల్లనో వినాశకరంగా ఉన్నట్లయితే వాటి ప్రచురణకు అనుమతించకూడదు" అని శాసించింది.

అంటే, రచయిత ఇక్కడ అతి భయంకరమైన టెర్రరిజానికి గురి అవుతున్నాడు. అనుమానపు పరిధిలోకి లాగబడుతున్నాడు. వస్తుగత ప్రమాణాలు లేని చట్టాలు, మానసిక ధోరణిని శిక్షించగోరే చట్టాలు, టెర్రరిస్టు చట్టాలే. రాబ్స్పియర్ నాయకత్వంలోని ఆనాటి రాజ్యపు అత్యవసర పరిస్థితుల్లోనూ, రోమన్ చక్రవర్తుల క్రింద అవినీతికర మైన రాజ్యంలోనూ ఇటువంటి చట్టాలు పుట్టాయి.

చట్టాలకి ప్రధాన ప్రమాణం వ్యక్తి చేతలే తప్ప అతని మానసిక ధోరణి కారాదు. మానసిక ధోరణిని గీటురాయి గా పెట్టుకునే చట్టాలు చట్టరాహిత్యానికి ఆలంబనం అవుతాయి. కోసక్కులను పురమాయించి తన కొలువులో ఉన్న ప్రతి ఒక్కరి గడ్డాన్నీ బలవంతంగా గొరిగించిన రష్యన్ జారు చక్రవర్తి ఇంతకంటే ఎంతో నయం. నేను గడ్డం పెంచుకోవడానికి నాకున్న ఒకానొక మానసిక ధోరణి కారణం గనుక దానికి శిక్షగా నా గడ్డం గొరిగిస్తాననలేదు!

నేను బయటకు కనిపించిన మేరకే, వాస్తవికతలో అడుగు పెడతాను. అంటే శాసనకర్త పరిధిలోకి ప్రవేశిస్తాను. నా చర్యలతో ప్రమేయం లేని మేరకు చట్టం నన్ను పట్టించుకోదు. ఆ మేరకు చట్టం దృష్టిలో నాకు అస్తిత్వమే లేదు. చట్టానికి నా మీద పట్టు ఉండే ఏకైక సాధనం నా చర్యలు మాత్రమే. నా చేతల ద్వారా మాత్రమే నేనున్నాను అని చెప్పగలుగు తాను. నేను వాస్తవం అనడానికి నా చేతలే ఆధారం. అప్పుడే, నేను వాస్తవం గా చట్టం పరిధిలోకి ప్రవేశిస్తాను. అయితే నా మానసిక ధోరణిని శిక్షించాలనే చట్టం. నన్ను నా చేతల కారణంగా మాత్రమే గాక, వాటికి సంబంధంలేని

**'మనల్ని విసుగెత్తించే రకం తప్ప మిగిలినవన్నీ మంచివే' అంటాడు వోల్టేర్. కాని ఇప్పుడు మనకు ఆ విసుగెత్తించే రకం ఒక్కటే మిగిలింది. ఆహా, మీరు స్వేచ్ఛగా రాసుకోవచ్చు. కాని మీ ప్రతి మాటా కొత్త సెన్సార్‌షిప్ తాకీదుకి తలవంచాలి. ఇక అప్పుడు వినయంగా, గంభీరంగా మీ అభిప్రాయాలను యధేచ్ఛగా వెళ్ళబోసుకోవచ్చు.**

నా ఆలోచనల కారణంగా కూడా శిక్షిస్తుంది. అటువంటి చట్టం పౌరుడి ఆత్మగౌరవానికి అవమానకరం. నా అస్తిత్వానికే ఎసరు పెడుతున్న భయంకరమైన చట్టమిది.

ఇక్కడ నా అస్తిత్వవే అనుమానానికి గురవుతోంది. నా అంతరాంతరాలు సారమైన నా వ్యక్తిత్వం చెడ్డదిగా పరిగణించబడుతున్నది. నా మీదున్న ఈ అభిప్రాయం కారణంగానే నేను శిక్షకు గురవుతున్నాను. నేను పాల్పడిన ఏ తప్పుకో చట్టం నన్ను శిక్షించడం లేదు. నేను చేయని తప్పుకు శిక్షిస్తోంది.

మానసిక ధోరణిని గీటురాయిగా పరిగణించే చట్టం, నిజానికి ఒక రాజ్యం తన పౌరుల కోసం చేసే చట్టం కాజాలదు. అది ఒక పక్షం మరో పక్షానికి వ్యతిరేకంగా గురిపెట్టిన చట్టం మాత్రమే. చట్టం దృష్టిలో పౌరులంతా సమానులయి ఉండాలి. కాని మానసిక ధోరణిని శిక్షించే చట్టం ఆ సమానత్వాన్ని రద్దు చేస్తుంది. ఆ చట్టం ఏకం చేయదు. విభజిస్తుంది. విభజించే చట్టాలన్నీ అభివృద్ధి నిరోధకమైనవే. అప్పుడది చట్టం కాదు. ప్రత్యేక హక్కు అవుతుంది. ఈ **నైతిక రాజ్యం** తన పౌరులందరూ తన మానసిక చిత్రాన్నే కలిగి ఉండాలని కోరుతుంది. ప్రభుత్వం అప్పుడు సూత్రరీత్యా ప్రజల్ని వ్యతిరేకిస్తుంది. అందుకే ప్రజలు సామాన్యంగా రాజ్య వ్యతిరేక మానసిక చిత్రవే కలిగి ఉంటారని అది నమ్ముతుంది. మానసిక ధోరణిని నియంత్రించాలనే చట్టాలు మామూలు చట్టాలు కాదు. అవి ప్రతీకార చట్టాలు.

మనస్తత్వానికి వ్యతిరేకంగా గురిబెట్టిన చట్టాలకు నీతిబాహ్యమైన మనస్తత్వమే ఆధారం. ఒక దుష్ట ఆత్మ అనుకోకుండా వేసే పొలికేక అది. ఈ బాపతు చట్టం అమలయ్యే తీరేమిటి? ఈ చట్టం కన్నా రోత పద్ధతులలో మాత్రమే అది అమలవుతుంది. అంటే గూఢచారుల ద్వారా. కొన్ని సాహిత్య ధోరణులను మొత్తంగా అనుమానా స్పదం అని గుర్తించడం ద్వారా. ఒక వ్యక్తి ఏ సాహిత్య ధోరణికి చెందుతాడో ఆ ధోరణిపైన విచారణ జరపడం ద్వారా.

కొత్త సెన్సార్‌షిప్ తాకీదు ద్వంద్వంలో చిక్కుబడిపోయింది. పత్రికల విషయంలో ఏయే పనులనైతే రాజ్య వ్యతిరేకమైనవని చట్టం ఖండిస్తుందో, ఆ పనులన్నింటినీ ఆ చట్టమే చేస్తుంది. ఆ పనులు చేయడం సెన్సార్ అధికారుల కర్తవ్యమని కొత్త తాకీదు నిర్దేశిస్తుంది. చట్టంలో ఈ వైరుధ్యం వుంది. వ్యక్తుల మనస్తత్వాన్ని, మొత్తం వర్గాల మనస్తత్వాన్ని అనుమానించరాదని రచయితలను చట్టం నిర్దేశిస్తుంది. అదే చట్టం పౌరులందరినీ అనుమానాస్పదుల గానూ, అనుమానాస్పదులు కాని వాళ్ళుగా సహృదయులుగా,

దుర్మార్గులుగా విడదీయమని సెన్సార్ అధికారిని ఆదేశిస్తుంది. పత్రికలకు విమర్శించే హక్కుండదు. కాని ప్రభుత్వ విమర్శకుడైన సెన్సారు అధికారికి మాత్రం విమర్శ అనేది దైనందిన కర్తవ్యం అవుతుంది. చట్టం ఇలా ద్వంద్వ ప్రమాణాలను అనుసరిస్తుంది.

ఇప్పుడు మొత్తం వ్యవహారం తలకిందులైపోయింది. రాజ్య వ్యతిరేకమన్నది ఇక వెలుగు చూడడానికి వీలులేని ఒక ప్రత్యేక అంశమైపోతుంది. దానిని బహిరంగ ప్రచార క్షేత్రం నుంచి తొలగించి ప్రభుత్వ విమర్శకుడి ఆఫీసు ఫైళ్లలో బంధించవలసి వస్తుంది.

కొత్త తాకీదు మతాన్ని పరిరక్షించదలచింది. వ్యక్తి అంతస్సాక్షి అన్నది పవిత్రమూ అనుల్లంఘనీయమూ అన్నది సకల మతాల సర్వ సాధారణ సూత్రం. దానిని ఈ చట్టం ధిక్కరిస్తోంది. భగవంతుడే హృదయాధినేత. మతం చెప్పేదదే. కాని చట్టం సెన్సార్ అధికారిని హృదయాధినేతగా నియమిస్తోంది.

వ్యక్తుల మీద ఎవరూ విమర్శనా దాడి చేయరాదనీ, నిందాపూర్వకమైన అభియోగాలకు పాల్పడరాదనీ చట్టం శాసిస్తోంది. కాని ప్రతి రోజూ నిరంతరాయంగా జనం మీద దాడి చేసి, అభియోగాలను మోపి, వాటిపై తీర్పు చెప్పే అధికారాన్ని అది సెన్సార్ అధికారికి ధారాదత్తం చేస్తోంది. దుష్ట బుద్ధులూ, అల్పజ్ఞానులూ పాల్పడే గుసగుసలపైన ఆధారపడక తప్పదు. దుష్ట బుద్ధులూ, అల్ప జ్ఞానులూ గుసగుసలపై చేసే గూఢచర్యం మీద అతడు ఆధారపడక తప్పదు. దీనివల్ల న్యాయమూ, తీర్పులూ వస్తుగత స్వభావాన్ని కోల్పోతాయి. సెన్సారు అధికారి వ్యక్తిగత అభిప్రాయామే న్యాయంగా చలామణి అవుతుంది. చట్టబద్ధ పాలన చట్టుబండలవుతుంది. ఇష్టారాజ్యమే మిగులుతుంది.

రాజ్యాన్నీ రాజ్యపు ఉద్దేశాన్నీ ఎవరూ శంకించరాదు. కొత్త తాకీదు ఆదేశమిది. కాని రాజ్యాన్నీ ప్రజలనూ అనుమానించడంతోనే అది మొదలవుతుంది. చెడు మనస్తత్వాన్ని ఎవరూ మంచి రూపం కింద దాయరాదు అంటుంది. కాని అది ఎప్పుడూ తప్పుడు రూపం మీదనే ఆధారపడి ఉంది. తాను జాతీయ భావాన్ని ఉద్దీప్తం చేస్తానంటున్నది. కాని జాతిని మనిషినీ హీనపరచి, అవమానపరిచే దృక్పథాన్ని అది చేపట్టింది.

మనం చట్టబద్ధంగా వ్యవహరించాలి, చట్టం పట్ల గౌరవాన్ని కలిగి వుండాలి. ఇది తాకీదు. కాని చట్టం పరిధి నుంచి మనల్ని గెంటేసే సంస్థలను కూడా మనం గౌరవించాలని సర్కారు పట్టుబడుతోంది. ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని అతని చేతలను బట్టి గాక అతని చేతలపైన ఏర్పర్చుకొన్న అభిప్రాయాల పైన అభిప్రాయాలను బట్టి నిర్ధారించడం జరుగుతుంది.

ప్రజలు వినయశీలురయి ఉండాలి. ఇది తాకీదు. కాని ఈ తాకీదు స్వయంగా అంతులేని అహంకారానికి నిదర్శనంగా నిలుస్తుంది. ప్రజల గుండెచప్పుళ్ల మీద గూఢచర్యం చేయడానికి మనుష్యులని నియమించడం అహంకారమే. ఆ గూఢచారులు సర్వజ్ఞులు, తత్వవేత్తలు, మత గురువులు, రాజకీయ కోవిదులు, త్రికాలజ్ఞులు అన్నట్టుగా వ్యవహరించడం అంతులేని అహంకారం.

ఒక వైపు ఈ అహంకారాన్ని గౌరవించడమే ప్రజల కర్తవ్యం అని మమ్మల్ని తమరు శాసిస్తున్నారు. మరో వైపు అహంకారానికి మేము దూరంగా ఉండాలి అంటున్నారు. వినయశీలురమై మెలగాలంటున్నారు. జాతి మొత్తం సాధించిన పరిపూర్ణతను ప్రత్యేక వ్యక్తులకు ఆపాదించడంలోనే నిజమైన అహంకారం ఉంది. రాజ్య సంస్థలపైన తమకు అపారమైన నమ్మకం.

సెన్సార్ అధికారి ఒక విడి వ్యక్తి. ఒక దుర్బల మానవుడు. అతడు ఒక అధికారి కాగానే ఈ సంస్థలు అతడిని మహాత్ముడిగా మారుస్తాయని తమ నమ్మకం. అతనికి అంతకుముందు సాధ్యం కానివన్నీ అధికారిగా మారిన తర్వాత సుసాధ్యమైపోతాయని తమ నమ్మకం. కాని ఒక ప్రైవేట్ వ్యక్తి అభిప్రాయమంటే మాత్రం తమకు అంతులేని భయం. తమరు పత్రికా రంగాన్ని ఒక ప్రైవేట్ వ్యక్తిగా పరిగణిస్తారు గనుక అదంటే తమకు అంత భయం.

అధికారులకు వ్యక్తిగత రాగద్వేషాలుండవని తమ నమ్మకం. సంకుచితత్వానికీ, మానవ బలహీనతలకూ వారు అతీతులని తమ విశ్వాసం. నిజానికి, వ్యక్తిగత రాగద్వేషాలతో ప్రమేయం లేనివి

> **"నీతికీ,సత్ప్రవర్తనకీ, వ్యతిరేకమైన వాటిని" అణచివేయడం పాత ఉత్తర్వు లక్ష్యాలలో ఒకటి. కొత్త తాకీదులో మతం విషయంలో మార్పులున్నట్లే నీతి విషయంలో తొలగింపులున్నాయి. "నీతికీ, సత్ప్రవర్తనకీ వ్యతిరేకమైన వాటిని, అన్న పదాల స్థానంలో "ఔచిత్యం, ప్రవర్తన, బాహ్య మర్యాదల" ఉల్లఘన అనే పదాలు వచ్చి చేరాయి.**

భావాలే. కాని వ్యక్తిగత కుట్ర, కక్ష, దుర్మార్గం అన్నీ భావాల్లోనే ఉంటాయని తమ అభిప్రాయం.

అధికార యంత్రాంగం పట్ల అపరిమిత విశ్వాసాన్ని కలిగి ఉండాలని కొత్త తాకీదు కోరుతోంది. అధికారం లేని ప్రజల పట్ల మాత్రం దానికి అంతులేని అవిశ్వాసం. కుక్కకాటుకు చెప్పుదెబ్బ అనే సూత్రాన్ని ఎందుకు స్వీకరించ గూడదు? ఈ అధికార యంత్రాంగం పట్ల అపనమ్మకాన్ని జనం మాత్రం ఎందుకు ప్రదర్శించకూడదు? నిష్పక్ష పాతంగా ఆలోచిద్దాం. దొంగచాటుగా వ్యవహరించే విమర్శకుడు గౌరవనీయుడా? బహిరంగ విమర్శకుడు గౌరవనీయుడా? మన గౌరవానికి ఎవరు ఎక్కువ అర్హులు?

చెడు అన్నది ఎలాగైనా చెడే. ఆ చెడు ఏ వ్యక్తిలో ఉన్నా చెడే. ఆ వ్యక్తి ప్రైవేట్ విమర్శకుడైనా, ప్రభుత్వం నియమించిన వాడైనా ఒకటే. కాని ప్రభుత్వం నియమించిన విమర్శకుడు చెడ్డవాడైన సందర్భంలో ఆ చెడుగుకు అధికార ముద్ర లభిస్తుంది. అప్పుడు కింది నుంచి మంచిని సాధించడానికి పైనుంచి చెడును రుద్దడం అవసర మేనేమో అనిపిస్తుంది.

మనస్తత్వంపై సెన్సార్‌షిప్పూ, సెన్సార్‌షిప్ మనస్తత్వమూ రెండూ ఒక ఉదారవాద తాకీదు మనకిచ్చిన కానుకలు. ఎంత ఔదార్యం! "వ్యక్తుల మీద దాడిచేసే వ్యాఖ్యలూ నిందాపూర్వ కమైన నిర్ధారణలూ ప్రచురణార్హం కావు". కొత్త తాకీదు. ఎంత మృదుత్వం!! అయినా ఈ మృదుత్వానికి బదులు, దాడిచేయడం అంటే ఏమిటో, నిందాపూర్వకమైన నిర్ధారణలు అంటే ఏమిటో వస్తుగత నిర్వచనం ఇచ్చి ఉంటే ఎంత బాగుండును!

**మనస్తత్వానికి వ్యతిరేకంగా గురిపెట్టిన చట్టాలకు నీతిబాహ్యమైన మనస్తత్వమే ఆధారం. ఒక దుష్ట ఆత్మ అనుకోకుండా వేసే పొలికేక అది. ఈ బాపతు చట్టం అమలయ్యే తీరేమిటి? ఈ చట్టం కన్నా రోత పద్ధతులలో మాత్రమే అది అమలవుతుంది. అంటే గూఢచారుల ద్వారా. కొన్ని సాహిత్య ధోరణులను మొత్తంగా అనుమానాస్పదం అని గుర్తించడం ద్వారా.**

ఒక వ్యక్తిని విమర్శించడానికి వీలులేదు. వర్గాన్ని అసలే తూలనాడ రాదు. జాగ్రత్త! రాజ్యం అవమానాలను భరించదు. వ్యక్తిగత విమర్శలను సహించదు. దీని పర్యవసానం ఏమిటి? వర్గ సంస్థలనుగానీ, వ్యకులను గానీ, అధికారులనుగానీ పత్రికలు కన్నెత్తి కూడా చూడరాదు. ఈ రెంటి మీద ఇక పత్రికలకు ఎటువంటి అజమాయిషీ ఉండబోదు.

ఈ తాకీదుల వల్ల అవసరానికి మించిన క్రీడాక్షేత్రం లభిస్తుందని తమరంటారు. నిజమే. గాలిలో పిల్లిమొగ్గలు వేసి సంతృప్తిపడే పత్రికలకు ఈ క్షేత్రం చాలా ఎక్కువ. కాని, యథార్థ ప్రచారమనే ఆట ఆడే పత్రికలకు ఈ ఆటస్థలం సరిపోతుందా? దాన్ని తేల్చాల్సిన బాధ్యత మాత్రం పాఠకులదే. జాతీయ భావనను తాను రేకిత్తించ గలనని సర్కారు ఆశిస్తోంది. వింటినారిని చూడగానే టర్కిష్ జాతీయతా భావన వికసించినట్టే, ఈ తాకీదు వల్ల ప్రష్యన్ జాతీయ భావన వికసిస్తుందేమో చూద్దాం. వినయ గాంభీర్యాలలో దానికదే సాటి అయిన మన పత్రికా రంగం పితృభూమి ప్రయోజనం పట్ల ప్రేమాభిమానాలను రేకెత్తించగలుగు తుందా, మరి? ఏమో దాన్నే తేల్చమంటే, సరి. అయినా అసలే బక్కచిక్కిన మన పత్రికలను ఎవరైనా మందుబిళ్ళలతో బలిపించగలరా?

కొత్త తాకీదుని గులాబీల మాలలోని ముల్లుగా పరిగణించగలిగితే మనం దానిని సరిగ్గా అర్థం చేసుకుంటామేమో. బహుశా ఈ ఉదారవాద ముల్లు చాలా నిగూఢమైన విలువ గల ముత్యమేనేమో. చూద్దాం. "తమ పాఠకుల ఆసక్తిని ఆసరా చేసుకొని, విదేశీ వార్తాపత్రికల నుండి తీసుకున్న నిరాధార సమాచారం తోనో, దుష్ట బుద్ధులూ, అరకొర పరిజ్ఞానులూ అయిన విలేకరుల నుంచి అందించిన వార్తలతోనో, కాకమ్మ కబుర్ల తోనో, వ్యక్తిగత దూషణలతోనో రచనల ను సిద్ధంచేసే పనికి పత్రికలు భవిష్యత్తు లో పూనుకోరాదు. ఒకవేళ ఎవరైనా పూనుకుంటే అటువంటి ధోరణికి వ్యతిరేకంగా సెన్సార్‌షిప్ అధికారులు నిస్సందేహంగా చర్యలు చేపట్టాలి. అదే వారి కర్తవ్యం." అని కొత్త తాకీదు శలవిచ్చింది. కొత్త తాకీదు మొదలు ఆశాభావంతో ప్రారంభించింది. ఆశా భావం క్రమంగా ఆదేశంగా రూపొం దింది. అసలే అర్భకంగా, కొన ఊపిరితో కొట్టుకొంటున్న మన దిన పత్రికల ప్రాణానికి ఇది మరో ప్రతిబంధకం. ఒక శరాఘాతం.

**(పీకాక్ క్లాసిక్స్ 'స్వేచ్ఛ' నుండి)**

# మరణానికి జంకని సత్యాన్వేషి సోక్రటీస్





యం.వి. రమణారెడ్డి

*బ్రతికున్న సోక్రటీస్‌ను గురించి ప్రపంచానికి పెద్దగా తెలీదు. మరణించేందుకు అతడు చూపిన నిబ్బరమే అబ్బురపాటు కలిగించే ఆదర్శమై, అతన్ని నిజమైన తాత్వికుడిగా నిలబెట్టింది. స్వహస్తాలతో సోక్రటీస్ రాసింది ఒక్క అక్షరమైనా లేదు. శిష్యుల రచనల మూలంగా అతని జీవితాన్ని గురించీ, తాత్వికచింతన గురించీ నేడు మనం తెలుసుకుంటున్నాం. చదువు నేర్పించినందుకు ప్రతిఫలం ఆశించని సోక్రటీస్, పేదరికంలో బ్రతికి పేదరికంలో మరణించాడు. జీవితంలో అతడు సంపాదించిన ఆస్తంతా - చెరగని విజ్ఞానంతో చరిత్రకెక్కిన ప్లాటో (Plato), గ్జెనోఫోన్ (Xenophon), ఐసోక్రటీస్ (Isocrates) వంటి శిష్యబృందం.*

చిన్న చిన్న తిరుగుబాట్లు గట్రా వదిలేస్తే, క్రీ.పూ. 431లో ఏథెన్స్‌కు స్పార్టాతో జరిగిన యుద్ధం (పెలొపొనేసియన్ వార్) చాలా దీర్ఘమైంది. పెరిక్లిస్ విదేశాంగ విధానంలోని లొసుగులే యుద్ధానికి కారణమంటూ ప్రతిపక్షం అతనిమీద ధ్వజమెత్తింది. కానీ, పెరిక్లిస్ మీద ప్రజలకుండే గౌరవం కారణంగా, అధికారం నుండి అతన్ని తొలగించడం అంత తేలిక కాదని వాళ్ళకూ తెలుసు. అందువల్ల, రెమ్మలను తప్పించే ఎత్తుగడకు వాళ్ళు పూనుకున్నారు. మరో 24 సంవత్సరాల పెలొపొనీసియన్ యుద్ధంలో స్పార్టాకు ఏథెన్స్ లొంగిపోయింది. ఫలితంగా, స్పార్టాకు తొత్తులైన ముప్పైమంది నియంతల కూటమి (Thirty tyrants) ఏథెన్స్‌కు ప్రభుత్వంగా ఏర్పడింది. వాళ్ళ నిరంకుశత్వానికి ప్రాణాలు సమర్పించిన నిజాయితీపరుల జాబితాలో సోక్రటీస్ పేరుగూడా ఒకానొకటి.

బ్రతికున్న సోక్రటీస్‌ను గురించి ప్రపంచానికి పెద్దగా తెలీదు. మరణించేందుకు అతడు చూపిన నిబ్బరమే అబ్బురపాటు కలిగించే ఆదర్శమై, అతన్ని నిజమైన తాత్వికుడిగా నిలబెట్టింది. స్వహస్తాలతో సోక్రటీస్ రాసింది ఒక్క అక్షరమైనా లేదు. శిష్యుల రచనల మూలంగా అతని జీవితాన్ని గురించీ, తాత్వికచింతన గురించీ నేడు మనం తెలుసుకుంటున్నాం. చదువు నేర్పించినందుకు ప్రతిఫలం ఆశించని సోక్రటీస్, పేదరికంలో బ్రతికి పేదరికంలో మరణించాడు. జీవితంలో అతడు సంపాదించిన ఆస్తంతా - చెరగని విజ్ఞానంతో చరిత్రకెక్కిన ప్లాటో (Plato), గ్జెనోఫోన్ (Xenophon), ఐసోక్రటీస్ (Isocrates) వంటి శిష్యబృందం. ఆ శిష్యులద్వారా పోగైన సమాచారన్నంతా కూడేసుకుంటే, కనీసం పది తరహాల సోక్రటీస్ మనకు దర్శనమిస్తాడు. దాన్నిబట్టి, మనకు తెలిసేది అతడు ఉగ్గుపాలతో తన శిష్యులకు నూరిపోసిన ఔషధాల్లో ప్రధానమైంది 'సంకెళ్ళు లేని ఆలోచన'. భావాల్లో

భిన్నత్వమున్నా అతని శిష్యుల్లో కనిపించే ఉమ్మడి స్వభావం – తమ గురువుపట్ల వాళ్ళకున్న ఎనలేని గౌరవం, అచంచల విశ్వాసం, అవధులు దాటిన ఆప్యాయత.

**'తనకు తాను మేధావిని అనుకునే మనిషికంటే మూర్ఖుడు ఈ ప్రపంచంలో మరొకడుండడు. విజ్ఞానం అనేది అనంతం. మనిషికి అందుబాటయ్యేది ఏదో కొంత. బ్రతికినంతకాలం ఏ మనిషైనా విద్యార్థిగానే బ్రతకాలి' అనేది అతని సమాధానం. ఆనాటికి వెలువడిన సాహిత్యంలో అతనికి తెలియనిదంటూ ఏదీ ఉండేదిగాదు.**

'నీతిగా బ్రతకడానికి మించిన విజ్ఞానం లేదు (virtue is knowledge) అనేది సోక్రటిస్ తత్వం' అంటాడు అతనికి రెండవతరం వాడైన మహామేధావి అరిస్టోటిల్ (Aristotle). సోక్రటిస్ తరువాతి రెండుతరాల తాత్వికుల అభిప్రాయంలో 'అతడు సాటిలేని మేధావి'. కానీ, ఆ మాట ఎవరైనా అంటే జీవితకాలంలో సోక్రటిస్ ఒప్పుకునేవాడు కాదు. 'తనకు తాను మేధావిని అనుకునే మనిషికంటే మూర్ఖుడు ఈ ప్రపంచంలో మరొకడుండడు. విజ్ఞానం అనేది అనంతం. మనిషికి అందుబాటయ్యేది ఏదో కొంత. బ్రతికినంతకాలం ఏ మనిషైనా విద్యార్థిగానే బ్రతకాలి' అనేది అతని సమాధానం. ఆనాటికి వెలువడిన సాహిత్యంలో అతనికి తెలియనిదంటూ ఏదీ ఉండేదిగాదు. 'ఇన్ని విషయాలు నీకు ఎలా తెలిసొచ్చా'యని ఎవరైనా అడిగితే, 'తెలుసుకోవాలనునేవాడు ఒకే మూలంమీద ఎప్పుడూ ఆధారపడడు. నాకు గురువులుగా ఎందరో ఉన్నారు' అనేవాడు సోక్రటిస్.

బోధనకు సోక్రటిస్ ఉపయోగించే ప్రత్యేక విధానం 'సోక్రటిస్ మెథడ్ (Socratic Method)'గా తరువాతి కాలానికి మిగిలిపోయింది. 'ఏది నీతి, ఏది అన్యాయం' అనే సంశయాలకు సూటిగా జవాబివ్వడం సోక్రటిస్ పద్ధతిగాదు. 'అలా జవాబిస్తే తన అభిప్రాయాన్ని ఎదుటివాళ్ళ మీద రుద్దడమే కాదు, ఎదటివాళ్ళ ఆలోచనా శక్తిని అడ్డుకున్నట్టు గూడా ఔతుంది. ప్రతి జవాబుకు మరొకరిమీద ఆధారపడేట్టు కాకుండా, మనం చూపెట్టవలసింది తనకు తానుగా సమస్యను విశ్లేషించుకునే మార్గం' అంటాడతడు. సరైన జవాబును పట్టుకునేందుకు అవసరమైన ఆలోచనను అతడు చిన్న చిన్న ప్రశ్నలుగా విభజిస్తాడు. విశ్లేషణా మార్గంలో పుట్టుకొచ్చే అనేక అవకాశాల్లో (hypothesisలలో) నిజాయితీ లోపించిన వాటిని తొలిగించుకునేలా ప్రశ్నల ద్వారానే నడిపిస్తాడు. తాను అవలంభించిన ఈ పద్ధతి వల్ల, పాశ్చాత్య ప్రపంచంలో 'వాదన (dialecties)' అనే విధానానికి సోక్రటిస్ పితామహుడైనాడు.

ఇదివరకటి తత్వజ్ఞులకు భిన్నంగా, తన పరిశీలనకు సోక్రటిస్ ఎన్నుకున్న రంగం 'మానవ సమాజం'. సమాజానికి నైతిక విలువలు ఎంత అవసరమో, దాని పాలకవర్గానికి అవి అంత చేదైనవని తెలిసిగూడా ప్రమాదానికి జంకని వ్యక్తిత్వమే సోక్రటిస్ ప్రత్యేకత. 'ఏ తరహా పాలన ప్రజలకు బాగుంటుందని మీ ఆలోచన?' అన్న ప్రశ్నకు అతడెప్పుడూ సూటిగా జవాబు చెప్పినట్టు కనిపించదు.

ఈ అంశంమీద ఆధునిక పరిశోధకుల అభిప్రాయాల్లోనూ తేడా కనిపిస్తుంది. 'ప్రజాస్వామ్యం నచ్చిందో లేదోగానీ, ఏథెన్స్‌ను ముప్పైమంది నిరంకుశులు పాలించడాన్ని మాత్రం అతడు ఓర్చుకోలేదు' అనేది కొందరి సూచన. అందుకు ఆధారంగా వాళ్ళు చూపించేది – లియోన్ (Leon) అనే వ్యక్తిని పట్టుకురమ్మని ఆ కూటమి జారీచేసిన ఆదేశాలను సోక్రటిస్ తిరస్కరించడం. పెలొపోనీసియన్ యుద్ధంలో ఏథెన్స్ తరఫున పోరాడిన సైనికాధికారి ఆ లియోన్. యుద్ధం ముగిసిన తరువాత అతని పేరు చనిపోయినవాళ్ళ జాబితాలోనూ లేదు, తిరిగొచ్చిన వాళ్ళ జాబితాలోనూ కనిపించలేదు. అందువల్ల, అతడు స్పార్టాకు బంధీ అయ్యుంటాడని అందరూ అనుకున్నారు. దయాదాక్షిణ్యాలకు విరోధులు అనర్హులుగా భావించే ఆటవికయుగంలో, అతడు ప్రాణంతో తిరిగొచ్చే ఆశ ఏ ఒక్కరికి ఉండేదిగాదు. కానీ, అతన్ని పట్టుకున్న స్పార్టా సైనికాధికారి విడ్డూరమైన మానవతావాది. ఇరుపక్షాల మధ్య సంధి కుదిరిన తరువాత, బంధీ నుండి విడుదలై స్వదేశం తిరిగొచ్చాడు లియోన్. వచ్చినప్పటి నుండి ఎందులోనూ జోక్యం చేసుకోకుండా, తనపాటికి తను ఐదేళ్ళుగా స్వగ్రామంలో నివసిస్తున్న లియోన్ మీద పొంతనలేని అభియోగాలతో మరణదండ విధించింది ముప్పైమంది కూటమి. అతన్ని పట్టుకొచ్చేందుకు ఐదుగురు పౌరులను ఎంపికజేసి బాధ్యత అప్పగించింది. అందుకు తలవొగ్గినవాళ్ళు నలుగురు కాగా, అన్యాయమైన ఆ తీర్పుకు భాగస్వామిని కాలేనని ముఖంమీదే తిరస్కరించినవాడు సోక్రటిస్. దాంతో, అవిధేయుల జాబితాలో అతని పేరు పదిలమైంది.

యువకులను లౌక్యానికి దూరంజేసి పెడదారి

పట్టిస్తున్నాడన్న అభియోగం మీద అనతికాలంలోనే సోక్రటిస్ ముప్పైమంది నియంతల కోర్టులో ముద్దాయిగా నిలబడ్డాడు. 'వాటినుండి తేలిగ్గా బయటపడే వాదనాపటిమ ఆయనకుంది. ఐనా ఎందుకో ఆయన దాన్ని ఉపయోగించలేదు. బహుశా ఈ లోకం నుండి తప్పుకోవలసిన సమయం తనకు ఆసన్నమైందనే అభిప్రాయం ఆయనలో కలిగిందో ఏమో' అన్నాడు గ్జినోఫోన్. విచారణ ముగిసింది. స్వహస్తాలతో విషం తాగి మరణించాలనే దండన విధించింది పాలనా కూటమి.

కాళ్ళు బరువెక్కిందాకా తిరిగి, అరుగుమీద పడుకున్నాడు. పాదాలకు స్పర్శ నశించిందని పరీక్షించిన వైద్యులు తేల్చుకున్నారు. ఇక విషం శరీరంలో ఎగబ్రాకుతూ గుండెను ముసిరేందుకు అట్టే సమయం పట్టదు. ఆ క్షణంలో సోక్రటిస్ తనకు దగ్గరగా రమ్మని క్రిటియాస్‌ను నెమ్మదిగి పిలిచాడు

సోక్రటిస్‌కు శిష్యుడేగాక, అత్యంత సన్నిహితుడు, వరుసకు మేనమామ అయిన క్రిటియాస్ (Critias) గూడా ఆ ముప్పై కూటమి సభ్యుడే. జైలునుండి తప్పించి, ఎల్లలు దాటించేందుకు అతడు చేసిన ఏర్పాట్లను సోక్రటిస్ నిరాకరించాడు. అతని అభిప్రాయంలో అందుకు కారణాలు–

1. తెలివున్నవాడెవ్వడూ చావుకు బెదిరి తప్పించుకునే ప్రయత్నం చెయ్యడు.

2. ఒక దేశం చట్టాలను గౌరవించేందుకు ఐచ్ఛికంగా అంగీకరించి ఆ దేశంలో బ్రతుకుతున్న వ్యక్తి, వాటికి లొంగాలే తప్ప, ఇతరత్రా ప్రవర్తిస్తే తన సామాజిక బాధ్యతను భంగపరచడమౌతుంది.

3. ఏథెన్స్‌ను కాదని మరో నగరాన్ని ఎన్నుకున్నా, అక్కడి వాళ్ళకు మాత్రం నా తత్వం నచ్చుతుందనే నమ్మకమేమిటి?

4. నన్ను ఖైదునుండి తప్పించారనే అభియోగంమీద పదుగురు సన్నిహితులకు ప్రమాదం తెచ్చిపెట్టడం ప్రయోజనం లేని ప్రయత్నం.

'ప్రాణాన్ని ఫణంగా పెట్టి, ప్రతి పౌరుడు చట్టానికి విధేయుడుగా బ్రతకాలనే ఆదర్శం ప్రదర్శించాడు కాబట్టి, సోక్రటిస్ మొగ్గు ప్రజాస్వామ్యానికే' అనేది ఆధునిక పరిశోధకుల్లో మరికొందరి వాదన.

తత్వం ఏదైనా కావచ్చుగాని, మరణ శాసనాన్ని ఊహాతీతమైన మనోనిబ్బరంతో స్వీకరించిన సోక్రటిస్ ప్రవర్తన మాత్రం అజ్ఞాతమరణంగా చరిత్రలో నిలిచిపోయింది. నిదానంగా ప్రాణంతీసే కషాయాన్ని సేవించి మరణించాలనేది దండన. అయినవాళ్ళ సమక్షంలో తొణుకూ బెణుకూ లేకుండా, శిక్షను అమలుపరిచేందుకు వచ్చిన వైద్యులకు దిమ్మతిరిగేంత ప్రశాంతంగా, వాళ్ళిచ్చిన కషాయాన్ని కడుపులోకి సేవించాడు సోక్రటిస్. కాళ్ళు బరువెక్కిందాకా తిరిగి, అరుగుమీద పడుకున్నాడు. పాదాలకు స్పర్శ నశించిందని పరీక్షించిన వైద్యులు తేల్చుకున్నారు. ఇక విషం శరీరంలో ఎగబ్రాకుతూ గుండెను ముసిరేందుకు అట్టే సమయం పట్టదు. ఆ క్షణంలో సోక్రటిస్ తనకు దగ్గరగా రమ్మని క్రిటియాస్‌ను నెమ్మదిగి పిలిచాడు. 'క్రీటో, ఇది అసలేపియస్ (Aselepius) దేవతకు బలిదానం సమర్పించేందుకు తగిన సందర్భం; అది మాత్రం మరవొద్దు' అన్నాడు. గ్రీకుల నమ్మకంలో రోగాలకు ఊరట కలిగించే దేవత అసలేపియస్. అదే సోక్రటిస్ నోటినుండి వెలువడిన ఆఖరు మాట.

ముప్పై మంది నియంతల మీద అదివరకే గూడుకట్టుకున్న వ్యతిరేకత ప్రజల్లో పెల్లుబికింది. పౌరుల ఆగ్రహానికి ఆ పాలన నేలమట్టంగా కూలిపోయింది. క్రిటియాస్ మొదలు కూటమిలోని సభ్యులందరూ ఆ దాడుల్లో దారుణంగా ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఏథెన్స్ నగరానికి పాత పద్ధతి ప్రజాస్వామ్యం తిరిగొచ్చింది.

మరణ సమయంలో సోక్రటిస్ చెంతనలేని ఏకైక శిష్యుడు ప్లాటో (Plato, క్రీ.పూ. 428–348). తండ్రితో సమానమైన గురువుకు విధించిన శిక్ష, సున్నితమైన మనసుండే ప్లాటోనే జబ్బుపడి మంచం పట్టేలా పీడించింది. కోలుకున్న తరువాతగూడా సోక్రటిస్ లేని ఏథెన్స్‌లో ఉండేందుకు మనసొప్పక, అతడు విదేశాల పర్యటనకు బయలుదేరాడు. ఈజిప్టు, కార్థేజ్, సిసిలీ, ఇటలీ వంటి ప్రదేశాల్లో కొంతకాలం నివసించి, నలభైయేళ్ళ ప్రాయంలో అతడు ఏథెన్స్ తిరిగొచ్చాడు.

తిరిగొచ్చిన వెంటనే ప్లాటో చేసిన మొదటిపని విద్యను క్రమపద్ధతిలో బోధించే పాఠశాలను స్థాపించడం. అందుకుగానే నగరానికి వెలుపలగా ఉన్న 'అకాడమస్' పేరుతో పిలువబడే విశాలమైన తోపును ఎన్నుకోవడంతో దానికి 'అకాడమీ' పేరొచ్చింది. సుప్రసిద్ధమైన చరిత్రతో ఆ పాఠశాల 900 సంవత్సరాలు నడవడమేగాక, 'ప్రణాళికాబద్ధమైన విద్యాబోధన' అనే ఆధునిక భావనకు అది మార్గదర్శి.

# ప్రశ్నించడం మానవ లక్షణం



## భగత్‌సింగ్

ప్రజల్లో బలంగా వున్న విశ్వాసాలను మీరు వ్యతిరేకించితే, అందరిచే విమర్శకు అతీతుడనుకున్న ఒక గొప్ప వ్యక్తిని లేదా ఒక వీరుడిని మీరు విమర్శించితే అందుకోసం మీరు చేసే వాదనలన్నీ అహంకారయుతమైనవని జనం మిమ్ములను తెగనాడటం కద్దు. ఇందుకు కారణం మానసికంగా స్తబ్ధత ఏర్పడడమే. విమర్శ, స్వతంత్ర ఆలోచన. ఇవి రెండూ ఏ విప్లవకారునికైనా తప్పనిసరిగా వుండవలసిన మంచి లక్షణాలు.

మన తాత ముత్తాతలు సర్వశక్తిమంతుడైన దేవుడిపై నమ్మకం కలిగిన వారు కాబట్టి ఆ విశ్వాసాన్ని ఎవరైనా సవాల్ చేయడానికి సాహసించితే అతణ్ణి విద్రోహికింద నిందించుతారు. అతని వాదనలు సహేతుకంగా వుండి, నిరాకరించడానికి వీలులేనివైతే అతణ్ణి అహంకారి అని ప్రకటిస్తారు. అలాంటి వారితో వాదించి ఫలితం వుండదు. ఈ సమస్య ప్రజల ముందు బహిరంగ చర్చకు మొదటిసారిగా వస్తుంది. కాబట్టి దీనిని గురించి మొత్తంగానే వాదించుతాను.

మొట్టమొదటి సమస్య– నేను నాస్తికుడను కావడానికి దారి తీసింది అహంభావం కాదనేది ఇప్పటికే నేను స్పష్టం చేయగలిగానని భావించుతున్నాను. నేను వాదన చేసిన తీరు నచ్చిందీ లేనిదీ తీర్పు చెప్పవలసింది నేను కాదు పాఠకులే. ప్రస్తుత పరిస్థితుల్లో దేవుడిపై నమ్మకం వుంటే నా జీవితం మరింత సులభతరమై వుండేది. నా భారం కూడా తగ్గేది. కాని దేవుడిపై నాకు నమ్మకం లేకపోవడం వలన పరిస్థితి నాకు కష్టతరంగా పరిణమించింది. దైవత్వంపైనా, పరలోకంలోని సుఖభోగాలపైనా నమ్మకం వుండివుంటే మరణం ఆనందకరంగానే వుండేది. కాని ఆ మైకంలో నేను వుండదలచలేదు. నేను వాస్తవికవాదిని. హేతువాదం సహాయం పైననే నేను నిలబడదలచాను. ఈ లక్ష్యసాధనలో నేనెప్పుడూ జయప్రదం కాలేను. కాని అందుకోసం ప్రయత్నించడం మానవ ధర్మం. విజయం పరిస్థితులపైన ఆధారపడి వుంటుంది.

ఇంక రెండో ప్రశ్న ఉదయించుతుంది. ఇది అహంభావం వలన కాకపోతే ప్రాచీన కాలం నుండి వస్తూ నేటికీ ప్రబలంగా వున్న దేవునిపై విశ్వాసం

లేకపోవడానికి మరొక కారణం వుండి తీరాలి. దాని విషయానికే ఇప్పుడు వస్తున్నాను. అందుకు మరో కారణం లేకపోలేదు. నా ఉద్దేశ్యంలో ఏ వ్యక్తికైనా ఏమాత్రం వాదనాశక్తి వున్నా తాను వున్న పరిస్థితుల్లో ఏది ఏమిటన్న విషయాన్ని గురించి తర్కించుతాడు. ఎప్పుడైతే సరియైన ప్రత్యక్షమైన ఆధారాలు దొరకవో అప్పుడు విశ్వాసమనేది ప్రధాన స్థానమాక్రమించుతుంది. ఇంతకు ముందే నేను చెప్పినట్లు మానవుని బలహీనత ఫలితమే మత విశ్వాసమని ఒక విప్లవ మిత్రుడు నాతో అంటూ వుండేవాడు. మన పూర్వీకులకు ఈ ప్రపంచ రహస్యాన్ని, దాని గతం, వర్తమానం, భవిష్యత్తును గురించి పరిశోధించి తెలుసుకోవడానికి తగినంత సమయం వుండేది. ఈ ప్రపంచం ఎక్కడ నుండి పుట్టింది? ఎప్పుడు ఉనికిలోకి వచ్చింది? మొదలైన విషయాలను ఆలోచించినప్పుడు వారి వద్ద సూటిగా ఆధారాలు కొరవడేవి. ప్రతి ఒక్కరూ తమ కిష్టం వచ్చిన రీతిలో సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించేవారు. అందువల్లనే వివిధ మతాలు సిద్ధాంతాలు మధ్య విపరీతమైన భేదాలు మనకు కనిపించుతాయి. ఆ సిద్ధాంతాలు ఒక్కోసారి పరస్పర విరుద్ధంగా వుండి ఘర్షణకు సిద్ధపడే ధోరణిలో వుంటాయి.

ప్రాచ్యదేశాలకు సంబంధించిన మతాలను గురించి అధ్యయనం చేయాలని నాకు ఎంతో ఆసక్తి వుంది. కాని అందుకు నాకు అవకాశం లభించలేదు. కాని ఈ ప్రకృతి సంతటినీ శాసించే ఒక అతీతశక్తి లేదనే విషయంలో మాత్రం నేను గట్టిగానే వున్నాను.

ప్రాక్ పశ్చిమ వేదాంతాలు విభిన్నమైనవి. తిరిగి ప్రాచ్య దేశాల్లోని మతాల్లోనే ముస్లిం మతం హిందూ మతానికి పూర్తిగా విరుద్ధంగా వుంటుంది. భారతదేశంలోనే బౌద్ధమతమూ, జైనమతమూ బ్రాహ్మణత్వానికి భిన్నంగా వుంటాయి. మళ్ళీ పరస్పర విరుద్ధమైన ఆర్యసమాజం, సనాతన ధర్మమూ వేరుగా వుంటాయి. చార్వాకుడు గత యుగాలకు సంబంధించిన మరో స్వతంత్ర ఆలోచనాపరుడు. గత యుగంలోనే ఆయన దేవుడి అస్తిత్వాన్ని సవాలు చేశారు. మౌలిక సమస్యలపైన ఈ మతాలన్నీ ఒక దానితో మరొకటి విభేదించుతాయి. అజ్ఞానాన్ని అధిగమించి ఈ నిగూఢమైన సమస్యకు పరిష్కారాన్ని కనుగొనడానికి బదులుగా వాటినే గ్రుడ్డిగా విశ్వసించుతూ మానవ ప్రగతికి అడ్డుపడుతుంటారు.

అభ్యుదయం కోసం నిలబడే ప్రతివ్యక్తీ పాత విశ్వాసాలలోని ప్రతి ఒక్క అంశాన్ని మూఢంగా నమ్మకుండా ఒక దాని తరువాత మరొకదానిని సవాలు చేయాలి. దానిపై వాదోపవాదాలకు సిద్ధపడాలి. వాదనల అనంతరం ఆ సిద్ధాంతాన్ని గాని, ఆ మత విశ్వాసాన్ని గాని అంగీకరించితే మనం ఆహ్వానించవలసిందే. ఆ వ్యక్తి వాదన పొరపాటు కావచ్చు. కొన్ని సందర్భాలలో తప్పుకావచ్చు. కాని ఆ తరువాత సరిదిద్దుకోవచ్చు. ఎందువల్లనంటే ఆ వ్యక్తి జీవితంలో హేతువాదం మార్గదర్శకం కావాలి. కాని కేవలం విశ్వసించడం, గ్రుడ్డిగా నమ్మడం ప్రమాదకరం. అది మేధస్సును పనిచేయకుండా చేస్తుంది. వ్యక్తిని అభివృద్ధి నిరోధకంగా మార్చివేస్తుంది. వాస్తవిక వాదినని చెప్పుకొనే ప్రతి వ్యక్తీ పాత విశ్వాసాలను సవాలు చేయాలి. అవి వాదనకు నిలబడలేక పోతే సహజంగానే కుప్పకూలిపోతాయి. అప్పుడు పాత విశ్వాసాలను త్రోసిపుచ్చి నూతన తత్వశాస్త్రం కోసం అన్వేషించాలి.

ప్రాచ్యదేశాలకు సంబంధించిన మతాలను గురించి అధ్యయనం చేయాలని నాకు ఎంతో ఆసక్తి వుంది. కాని అందుకు నాకు అవకాశం లభించలేదు. కాని ఈ ప్రకృతి సంతటినీ శాసించే ఒక అతీతశక్తి లేదనే విషయంలో మాత్రం నేను గట్టిగానే వున్నాను. మేము ప్రకృతిని విశ్వసించుతాం. ప్రకృతిని తన కోసం ఉపయోగించుకోవడానికి దానిపై అధిపత్యాన్ని సాధించడానికి మానవుడు ఎల్లప్పుడూ ప్రయత్నించాలి. మొత్తం అభ్యుదయ ఉద్యమం ఇందుకే కృషి చేస్తుంది..

ఈ భూమిని, ఈ ప్రపంచాన్ని సృష్టించిన ఒక సర్వశక్తివంతుడు, సర్వాంతర్యామి, భగవంతుడు వున్నాడని మీరు నమ్ముతున్నారు. అలా అయితే దానిని ఆయన ఎందుకు సృష్టించాడు చెప్పగలరా? ఈ ప్రపంచంలో ప్రజలు పేదరికంతో, రకరకాల కష్టాలతో, బాధలతో అనేక అత్యాచారాలకు గురవుతూ జీవించుతున్నారు. ఎవ్వరూ తృప్తిగా జీవించడం లేదు.

దయచేసి ఆయనకున్న శాసనాలకు లోబడి చేస్తున్నాడని అనబోకండి. ఆయనే గనుక కొన్ని శాసనాలకు కట్టుబడి వుండవలసినవాడైతే ఆయన కూడా ఒదిగిఒదిగి వుండవలసిన బానిస మాత్రమే కాగలడు. ఇలా జనాన్ని బాధపెట్టడం ఆయనకు సరదా అని అనబోకండి.

నీరో చక్రవర్తి రోమ్ నగరాన్ని తగులబెట్టించాడు. నీరో పరిమిత సంఖ్యలోనే ప్రజలను హతమార్చాడు. అనేక విషాదాలను తన చిద్విలాసం కోసమే ఆయన జరిపించాడు. మరి అలాంటి నీరో చక్రవర్తి స్థానం చరిత్రలో ఏమిటి? చరిత్రకారులు ఆయనను ఏ పేరుతో పిలుస్తారు? నీరో చక్రవర్తిని ఎన్ని రకాల విషభరితమైన, అపభ్రంశమైన పేర్లను పెట్టి పిలవాలో అన్నీ పెట్టి మరీ పిలుస్తారు. నీరో చక్రవర్తి

పరమ నిరంకుశుడు, హృదయంలేని పరమ క్రూరుడు అని చరిత్ర పుటలన్నింటా వర్ణించబడ్డాడు.

మీకు నా సూటి ప్రశ్న ఇది. ఇంచుమించు నరకప్రాయంగా వున్న ఈ ప్రపంచాన్ని ఆయన యిలా ఎందుకు సృష్టించాలి?ఎల్లప్పుడూ మానవులకు ఆవేదనలనూ, అశాంతినీ కలుగజేసే విధంగా ఈ ప్రపంచాన్ని ఎందుకు సృష్టించాలి. దేవుడు సర్వశక్తి సమన్వితుడు కదా? ఏదైనాసరే చేయటానికి లేదా చేయకుండా వుండటానికి ఆయనకు శక్తివుంది కదా? అటువంటప్పుడు యిన్ని దు:ఖాలు, బాధలుపడే మానవుల్ని ఆయన ఎందుకు సృష్టించాలి? ఆయన చేసిన పనిని మనం యెలా సమర్థించగలం?

**మీకు నా సూటి ప్రశ్న ఇది. ఇంచుమించు నరకప్రాయంగా వున్న ఈ ప్రపంచాన్ని ఆయన యిలా ఎందుకు సృష్టించాలి?ఎల్లప్పుడూ మానవులకు ఆవేదనలనూ, అశాంతినీ కలుగజేసే విధంగా ఈ ప్రపంచాన్ని ఎందుకు సృష్టించాలి.**

. ఇదంతా ఆయన ఆనందానికే అయితే, నీరో చక్రవర్తికి, భగవంతుడికి ఏమిటి తేడా?

హిందూ వేదాంతం మరో వాదన కూడా తీసుకురావడానికి పెనుగులాడుతుంది. కానీ మహమ్మదీయులూ, క్రైస్తవ మతావలంబులారా పై ప్రశ్నలకు మీరిచ్చే సమాధానమేమిటి? హిందువుల్లా మీరు పునర్జన్మను అంగీకరించరు. అలాంటి పునర్జన్మ సిద్ధాంతాన్ని మీరు విశ్వసించరు. పూర్వజన్మలో చేసిన పాపాల ఫలితాన్ని, దుష్కృత్యాల ఫలితాలను మానవులు ఈ జన్మలో అనుభవిస్తారని మీరు హిందువులవలె వాదించరు. అయితే మీరు చెప్పేదేమిటి? మీ విశ్వాసాలు ఏమిటి? ఈ ప్రపంచాన్ని సృష్టించడానికి భగవంతుడు వారంలో ఆరు రోజులు పనిచేస్తూ వుంటాడట. సృష్టి ఆరు రోజులు చేసేవాడు. ఏడో రోజున తను సృష్టించిన ప్రపంచంలో లోటుపాట్లను ఎందుకు తెలుసుకోడు? అనుభవాన్నుండి ఎందుకు నేర్చుకోడు? అలాకాక సృష్టి చేసిన ప్రతిరోజూ ఆఖరున "అంతా సవ్యంగా వుంది. అంతా సక్రమంగానే జరిగింది. అని ఎలా అనుకుంటాడు?

చెరసాలలో మగ్గేవాళ్ళు, ఆకలి మంటలతో అలమటించేవాళ్ళు లక్షలాది కోట్లాది ప్రజలు ఈ ప్రపంచంలో వున్నారు. దోపిడీ చేయబడుతున్న కష్టజీవులు, కార్మికులు, అభాగ్యులు, దీనులు, హీనులూ వున్నారు. వీరంతా తమ రక్తాన్ని స్వేదంగా మారుస్తున్నారు. ఈ రక్తాన్ని పిండి పెట్టుబడిదారీ వర్గాలు రాబందులవలె, జలగలవలె వీరిని పీలుస్తూ సంపన్నులవు తున్నారు. లక్షలాదిమందిని నిరుద్యోగులుగా, నిరర్థకులుగా చేస్తున్నారు. అంతే కాదు, అవసరమైతే తమ లాభాల రక్షణ కోసం, అధికోత్పత్తి చేసి నిల్వపడి వున్న సరుకులను, ఆహార ధాన్యాలను సముద్రం పాలు చేస్తున్నారు. (పెట్టుబడి దారీ విధానంలో సంక్షోభం ఏర్పడినప్పుడు, ధరల మాంద్యం వచ్చినప్పుడు లక్షల కోట్ల టన్నుల పాల డబ్బాలను ఇతర ఆహార పదార్థాలను పెట్టుబడిదారీ వర్గాలు సముద్రంపాలు చేస్తాయి. అనువాదకుడు) ఆకలితో మలమలమాడే కోటాను కోట్ల ప్రజలకు ఈ ఆహార ధాన్యాలను, పాలడబ్బాలను, బట్టలను తదితర జీవితావసర వస్తువులను పంచిపెట్టరు. తమ చెమటను, రక్తాన్ని ధారపోసి శ్రామిక ప్రజలు పంటలు పండిస్తారు. తమ ఎముకలను సున్నంగా చేసి మహాభవనాలను కార్మికులు నిర్మిస్తారు. వారందరూ దారిద్ర్యంతో కడుపునిండా తిండిలేక, బట్టలేక, ఇల్లులేక ఎందుకు అలమటించాలి? దీనికి భగవంతుడు ఏమి సమాధానం చెపుతాడు? ఇలా ఎందుకు జరుగుతున్నది? ఇలా ఒక వైపున జరుగుతూ వుంటే నా సృష్టి అంతా సవ్యంగానే వున్నదని భగవంతుడు ఎలా అనగలడు? దీనికి ఆయన ఏమైనా సమాధానం చెప్పగలడా? మౌనమే సమాధానమా?

ఇంక పూర్వజన్మల, పాపపుణ్యాల సిద్ధాంతాలు ఎంతవరకు నిజమో కొంచెం పరిశీలించుదాం.

నేరస్తుణ్ణి సంస్కరించి సన్మార్గంలోకి, సమాజంలోకి తీసుకొని వచ్చేటట్లు శిక్షలుండాలనేది సర్వత్రా అంగీకరిస్తున్న విషయం. మానవ పురోభివృద్ధికి ఈ సృష్టి అవసరం. కాని తప్పుచేసిన వాళ్ళను దేవుడు ఎలా శిక్షించాలి? ఎలా శిక్షించుతున్నట్లు నేడు చెపుతున్నారు? పాపం చేసిన వారిని కుక్కగానో, పిల్లిగానో, ఆవుగానో, చెట్టు చేమలుగానో పుట్టమని దేవుడు శాసిస్తున్నాడా లేదా శపించుతున్నాడా! ఇలాంటి శిక్షలు 84 లక్షలున్నాయట.

నేను అడుగుతున్నాను దేవుడు విధించుతున్న ఈ శిక్షలు తప్పుచేసిన వారిని సంస్కరించే శిక్షలేనా అని, మీలో ఎప్పుడైనా ఎవరైనా నేను పూర్వజన్మలో గాడిదగా పుట్టాను. నేను చేసిన పాపానికి నాకు దేవుడు అలాంటి శిక్షను విధించాడని అని అన్నారా? అలా చెప్పినవాళ్ళు ఎవరైనా వున్నారా? వుండరు.

పురాణాల సంగతినలా వుంచండి. అందులోకి నేను వెళ్ళదలచలేదు. కాని ఒక్క సంగతి మాత్రం చెప్పగలను. అన్ని పాపాలకంటే మహాపాపం దరిద్రుడుగా వుండడమే. దరిద్రం కంటే పాపం మరొకటిలేదు. అంతకంటే శిక్ష మరొకటిలేదు.

న్యాయవేత్త లేదా న్యాయాధిపతి లేదా నేర శిక్షానిపుణుడు

ఎవరైనా యిలాంటి శిక్షను విధించినట్లయితే అటువంటి శిక్షను ప్రశంసించుతారా? సమర్థిస్తారా? ఈ దారిద్ర్యమనే శిక్ష యింకా అనేక నేరాలు చేయడానికి దారితీయదా? దోహదపడదా?

ఉదాహరణకు ఒకరు దారిద్ర్యంలో నిరక్షరాస్యతతో వుండే కుటుంబంలో లేదా పాకీపని కుటుంబంలోనో జన్మించాడనుకొందాం. అతడు దారిద్ర్యంలో వున్నాడు. కాబట్టి చదువుకొనే అవకాశం లేదు. కడజాతికి చెందిన నిర్భాగ్యుడు కాబట్టి అతణ్ణి ఎవ్వరూ దగ్గరకు చేరనివ్వరు. పైపెచ్చు చేసే వృత్తిరీత్యా చూస్తేనే అసహ్యించుకొంటారు. ఛీ కొడతారు. తాము అధికులమని అనుకుంటారు. దారిద్ర్యంలో పుట్టిన వ్యక్తి యొక్క అవిద్యా, అవిజ్ఞానం ఇతరులు అతనిపట్ల చూపే చిన్న చూపు యివన్నీ అతనిలో ఈ సమాజం పట్ల ఒక విధమైన కసిని, అసహనాన్ని కలుగజేస్తాయి. అతని మనస్సు కరుడుగట్టేట్లు చేస్తాయి. ఒకవేళ ఈ పరిస్థితుల్లో వున్న వ్యక్తి ఏదైనా అకార్యం లేదా చేయరాని పనిని చేశాడనుకుందాం. ఇందుకు బాధ్యత ఎవరిది? ఎవరు దీని ఫలితాన్ని, పర్యవసానాన్ని అనుభవిస్తారు? దేవుడు బాధ్యత వహిస్తాడా లేక ఆ వ్యక్తి బాధ్యత వహిస్తాడా లేక ఈ సమాజాన్ని నడిపిస్తున్న పండితులు వహిస్తారా? అహంభావం, అధిక్యభావం కలిగిన బ్రాహ్మణ వర్గం సంఘంలో కొందరిని అజ్ఞానంలోనూ అమాయకత్వంలోనూ వుంచుతున్నారు. ఈ విధంగా అజ్ఞానంలో వుంచబడటం కూడా వారికి పూర్వజన్మ పాపఫలితంగా వచ్చిన శిక్షేనా?

వేదాలు చదువుతూ వుంటే వినకూడని వాళ్ళు ఈ సమాజంలో వున్నారట. వేదంలోని ఒక ముక్క విన్నప్పటికీ వాళ్ళ చెవుల్లో సీసం కరిగించి పోయాలట. అది వారికి శిక్షట. ఈ శిక్షలకు కూడా పూర్వజన్మలో చేసుకున్న పాపఫలమే కారణమా? ఈ పాపం చేయడానికి కారకులు, బాధ్యులు ఎవరు? ఫలితాన్ని అనుభవించేది ఎవరు?

వేదాలు చదువుతూ వుంటే వినకూడని వాళ్ళు ఈ సమాజంలో వున్నారట. వేదంలోని ఒక ముక్క విన్నప్పటికీ వాళ్ళ చెవుల్లో సీసం కరిగించి పోయాలట. అది వారికి శిక్షట. ఈ శిక్షలకు కూడా పూర్వజన్మలో చేసుకున్న పాపఫలమే కారణమా?

ప్రియ మిత్రులారా! ఈ సిద్ధాంతాలన్నీ సమాజంలో కడుపునిండినవారు, అన్ని హంగులు, అధికారాలు కలిగినవారు సృష్టించినవే తప్ప మరొకటి కాదు. తాము చేజిక్కించుకున్న అధికారాన్ని సకల సంపదలనూ అధికృతలను కాపాడుకొనేందుకు ఈ సిద్ధాంతాలన్నిటినీ వారు కనిపెట్టారు. వాటి సాయంతోనే తమ స్థానాన్ని నిలబెట్టుకొంటున్నారు.

అప్టన్ సింక్లర్ అనుకొంటాను ఒకచోట యిలా చెప్పాడు "మానవుడు అమరుడు అనే విశ్వాసాన్ని కలిగించు. నీకు ఎన్నటికీ మరణం లేదు అని చెప్పు అతని వద్దనున్న సకల సంపదలు, వస్తు వాహనాలు అన్నీ లాగేసుకో, మారు మాట్లాడకుండా నీవు అడిగినదంతా యిస్తాడు" నమ్మకం అటువంటిది, విశ్వాసం అటువంటిది. ఒక రకంగా చెప్పాలంటే మతాధిపతులకు, రాజ్యాధికారం చెలాయించే వారికి మధ్య సమన్వయం వుంది. ఈ సమన్వయం ఫలితంగానే జైళు ళ , ఉరికంబాలు, విద్యాస్థానాలు ఈ పూర్వజన్మల పుణ్యంతో పాటు సిద్ధాంతాలను ప్రవేశపెట్టారు.

ఒక మనిషి ఏదైనా పాపకార్యం చేస్తున్నప్పుడు అది చేయకుండా దేవుడు... ఈ సర్వశక్తివంతుడైన భగవంతుడు ఆ పాపకార్యం చేయకుండా ఎందుకు ఆపు చేయకూడదు? యుద్ధ బీభత్సాలను, మానవ మారణహోమాన్ని సాగించే రాజులను, ప్రభువులను ఎందుకు హతమార్చడు? ఇలాంటి దుర్మార్గులను ముందుగానే ఎందుకు శిక్షించకూడదు? మానవజాతిని మారణహోమం చేసే భయంకరమైన ప్రపంచ యుద్ధాన్ని రాకుండా దేవుడు ఆపుచేయలేడా?

మరొక ప్రశ్న అడుగుతాను. భారతదేశాన్ని బానిసత్వంలో ముంచిన బ్రిటిష్ వారి మనస్సును మార్చి భారతదేశాన్ని బానిసత్వాన్నుండి వారు విముక్తి అయ్యేటట్టు ఎందుకు చేయకూడదు? పెద్ద పెద్ద ధనవంతులు, పెట్టుబడిదారులు తమ వద్దనున్న ధనాన్ని, ఉత్పత్తి సాధనాలను ప్రజల పరం చేసేటట్లు భగవంతుడు వారికి హృదయపరివర్తన ఎందుకు తీసుకొని రాకూడదు? ఆ విధంగా కష్టజీవులుందరినీ ఉద్ధరించేటట్లు చేయరాదా?

పరమ కిరాతకమైన ఈ దోపిడీ విధానం నుండీ, బానిసత్వాన్నుండీ యావత్ సమాజాన్ని దేవుడే స్వయంగా విముక్తి చేస్తే బాగుంటుందికదా?

అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు లేని సోషలిస్టు సమాజం ఏర్పడితే ఎంతో బాగుండునని మనం అనుకొంటున్నాం. అలాంటి సమాజాన్ని ఎలా సాధించుకుందాం అని చర్చించుకుంటాం. అందుకోసం పోరాడే మార్గాలను అన్వేషించుదాం. కొందరు అది ఆచరణ సాధ్యంకాదని వాదిస్తారు. అయితే అలాంటి సోషలిస్టు సమాజాన్ని మనకు బాదరబంధీ లేకుండా సర్వశక్తివంతుడైన దేవుడే సృష్టించవచ్చు కదా? భగవంతుడే స్వయంగా రంగంలోకి దిగి సమాజాన్ని అంతటినీ ఒక క్రమ పద్ధతిలో పెట్టి సవ్యంగా

నడిపించవచ్చును కదా?

భగవదేచ్ఛ అలా వుంది గాబట్టే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు యిక్కడికి వచ్చి మనదేశంలో తిష్టవేసి కూర్చోలేదు. భగవంతుడు అలా రాసి పెట్టలేదు. బ్రిటిష్ వాళ్ళ చేతుల్లో అధికార బలం వుంది. మన దగ్గర ఆ బలం లేదు. కాబట్టి మనం వాళ్ళను రాకుండా చేయలేకపోయాం. వాళ్ళను తిప్పికొట్టగల శక్తి సామర్థ్యాలు మన వద్దలేవు. అంతేకాని భగవంతుని సాయం వలన ఆయన యిచ్ఛమేరకు బ్రిటిష్‌వారు భారతదేశాన్ని ఆక్రమించుకొని తమ అధీనంలో వుంచుకోలేదు. తుపాకులతో, రైఫిళ్ళతో, బాంబులతో, బుల్లెట్లతో, సైన్యంతో, పోలీసులతో వాళ్ళు మనలను బానిసలుగా చేసుకోగలిగారు. మనజాతిని బానిసత్వంలో ముంచి ఘోరమైన అన్యాయాన్ని, నేరాన్ని, దారుణమైన దోపిడీని వారు కొనసాగిస్తున్నారు. ఇంత ఘోరాతిఘోరం జరుగుతున్నదంటే భగవంతుడు వుంటే అతడు ఏమి చేస్తున్నటు?

**అయితే, ఈ ప్రపంచానికి మూలం ఏమిటి? మానవునికి ఆది ఏమిటి? అని మీరు నన్ను అడుగుతారా? సరే, చెపుతాను వినండి. ఈ సమస్యపై ఛార్లెస్ డార్విన్ కొంత వెలుగు నివ్వడానికి యత్నించాడు. ఆయన రచనను చదవండి.**

అయితే, ఈ ప్రపంచానికి మూలం ఏమిటి? మానవునికి ఆది ఏమిటి? అని మీరు నన్ను అడుగుతారా? సరే, చెపుతాను వినండి. ఈ సమస్యపై ఛార్లెస్ డార్విన్ కొంత వెలుగు నివ్వడానికి యత్నించాడు. ఆయన రచనను చదవండి.

కొంతమంది పిల్లలు గ్రుడ్డిగాను, కుంటిగానూ పుడతారు. అదంతా గత జన్మలో వారు చేసిన పాప ఫలితమేనంటారు సనాతనులు. మానవ శాస్త్రవేత్తలు, వైద్యులు దానిని చక్కగా వివరించారు. వారి తల్లిదండ్రులలో గల లోపాల వల్లనే వారలా పుడతారని.

సహజంగానే మీరు నన్ను మరో ప్రశ్న కూడా అడగవచ్చు. అసలు దేవుడే లేకపోతే ఈ ప్రపంచంలో దేవుడిని యింతమంది జనం నమ్మటం ఎలా సాధ్యమైందని. ఇందుకు నా సమాధానం క్లుప్తంగాను, స్పష్టంగాను యిది. లేని దయ్యాలను గురించి మనుష్యులు ఎలా నమ్ముతున్నారో దేవుణ్ణి గురించి కూడా అంతే. అయితే ఒక్కటే భేదం. దేవుడిని అందరూ నమ్మడం, దాన్ని గురించి ఒక తత్వశాస్త్రాన్ని రూపొందించి చక్కగా ప్రచారంలో పెట్టగలగడం, కొంతమంది తీవ్రవాదులు చెప్పుతున్నట్లు దోపిడీదారులు, పీడకులు తమ స్వప్రయోజనాల కోసం దేవుడిని సృష్టించారని మాత్రం నేను చెప్పదలచలేదు. అయితే మతాన్ని వారు ఉపయోగించుకొన్నారన్న విషయాన్ని నేను కాదనను. రాజు మీద తిరుగుబాటు చేయడం పాపమని అన్ని మతాలు చెబుతాయి.

నా ఉద్దేశ్యంలో మానవుడు తనకున్న పరిమితులను, బలహీనతలను, లోపాలను దృష్టిలో వుంచుకుని దేవుడనే సర్వశక్తివంతుడిని వూహలోకి తెచ్చుకున్నాడు. కష్ట సమయంలో ప్రమాదాలను ధైర్యసాహసాలతో ఎదుర్కొనేందుకు దేవుడిమీద విశ్వాసం తోడ్పడు తుందనుకున్నాడు. అలాగే సమాజానికి హాని చేయకుండా మానవుడిని దేవుడు అదుపులో పెట్టగలడనుకొన్నాడు. ఒక తండ్రిగా, తల్లిగా, సోదరిలా, సోదరుడిగా. మిత్రుడిగా అవసరమైనపుడు దేవుడు ఆదుకోగలడనే విశ్వాసాన్ని మానవుడు తనలో పెంపొందించుకున్నాడు. ఆదిమ సమాజంలో తప్పులు చేయకుండా సమాజానికి దేవుడు అనే విశ్వాసం మానవుడికి సహాయపడింది. అలాగే దేవుడనే భావం కష్ట సమయంలో ఓదార్పుగా మానవునికి వుండేది.

ఆ తరువాత కాలంలో పూజలు చేస్తే దేవుడు రక్షించుతాడనే భావనకి వ్యతిరేకంగానూ, సంకుచిత మత విశ్వాసాలకు వ్యతిరేకంగానూ, యితర మూఢ విశ్వాసాలకు ప్రతికూలంగా సమాజంలో పోరాడవలసి వచ్చింది. అలాగే మానవుడు తన కాళ్ళపై తాను నిలబడటానికి ప్రయత్నించుతూ వాస్తవికవాది అయినప్పుడు ఈ దేవుడనే విశ్వాసాన్ని త్రోసిపుచ్చుతాడు. కష్టాలు వచ్చినప్పుడు ధైర్యంతో అధిగమించడానికి ప్రయత్నించుతాడు. నా పరిస్థితి కూడా సరిగ్గా యిదే. మిత్రులారా, నేను అహంభావంతో దేవుడిని తిరస్కరించడం లేదు. పైన వివరించిన ఆలోచనా విధానమే నన్ను నాస్తికుడిగా చేసింది. దేవుడిని నమ్మడం, ఆయనను నిత్యం ప్రార్థించడమూ అత్యంత స్వార్థపూరితమైన విషయమని నేను భావించుతాను. ప్రార్థించడం ద్వారా దేవుడి నుండి ప్రయోజనం పొందాలనుకోవడం మానవుని నైతిక పతనానికి నిదర్శనం. అనేక కష్టాలను ధైర్యంతో ఎదుర్కొన్న నాస్తికుల జీవితాలను నేను చదివాను. కనుక నేను కూడా ఒక మనిషి వలే చివరి వరకూ నా ఆశయాల కోసం మనోనిబ్బరంతో నిలబడటానికి చివరికి ఉరికంబం ఎక్కడానికి కూడా సంసిద్ధంగా వున్నాను.

నేను ఎలా వ్యవహరించుతానో చూడండి. ఒక మిత్రుడు నన్ను దైవ ప్రార్థన చేయవలసిందిగా కోరాడు. నేను

నాస్తికుడనని చెప్పినా ఆయన ఇలా అన్నాడు: "ఆఖరి రోజుల్లోనైనా దేవుడిని నమ్మడం నీవు ప్రారంభిస్తావు". అలాంటిదేమీ లేదని నేనన్నాను. అది ఎన్నటికీ జరిగేదికాదని కూడా అతనికి స్పష్టం చేశాను. కష్ట సమయంలో అలా దేవుడిని నమ్మడమంటే నేను నైతికంగా దిగజారిపోవడమే కాగలదు. నా స్వార్థం కోసం నేను ప్రార్థించదలచలేదు. పాఠకులారా, మిత్రులారా ఇది అహంభావం అనిపించుకుంటుందా? ఒకవేళ అదే అయితే అందుకే నేను నిలబడతాను.



జైలు గోడల మధ్య భగత్‌సింగ్ సాహిత్యాధ్యయనం విస్తృతంగా సాగించాడు. అందులో ప్రత్యేకించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గురించి, ఒంటరితనం గురించి, బంధీగా వుండటం గురించి పలు చరణాలు ఎత్తి రాసుకున్నారు. ఇవి ఆయన స్వేచ్ఛాప్రియత్వాన్ని అదే సమయంలో మానసికంగా జైలు జీవిత ప్రభావాన్ని తెలియజేస్తాయి.

## స్వేచ్ఛ

స్వేచ్ఛాపిపాసులు సాహసికులైన
పితృపాదులకుపుట్టామని గొప్పలు చెబుతారే
ఈ భూమిపైన ఒక్క బానిస శ్వాస వినిపించినా
మనం నిజంగా స్వేచ్ఛగా సాహసంగా వున్నామంటారా?

సోదరుడికి నొప్పి కలిగించే శృంఖలాల బాధ
మీకు అనుభవంలోకి రాదా?
అప్పుడు అసలైన బానిసలు
స్వేచ్ఛకు అనర్హులు మీరే కదా
మన ఆప్తుల కోసం శృంఖలాలు
బద్దలు కొట్టడమే స్వేచ్ఛకు అర్థం
ఈ శరీరంలోని హృదయ కుహరం
గుర్తుచేయదా మానవాళికి మన రుణం
కాదు, నిజమైన స్వేచ్ఛాభావం
మనసోదరుల శృంఖాలాలు పంచుకోవడం
అప్పుడే కదా మన చేతులు మనసు కూడా
ఇతరుల స్వేచ్ఛ కోసం పనిచేయడం

బాధితులు బలహీనుల కోసం మాట్లాడేందుకు
భయపడే వారే బానిసలు



ఆలోచింపచేసే సత్యాల సమక్షంలో
మౌనముద్ర దాల్చేవారే బానిసలు
ముందు నడిచే ఒకరిద్దరితో కలసి
అడుగు వేయలేని వారే బానిసలు
జేమ్స్ రస్సెల్ లోవెల్ **(1819-91)**
అమెరికా రచయిత, సంపాదకుడు



## స్వేచ్ఛా భావన

స్వేచ్ఛాయుత భావనను భరించలేనిదేదైనా వుంటే
అది నిట్టనిలువునా బద్దలై పోవు గాక
విండెల్ ఫిలిప్స్ ***(1811-1884)*** అమెరికన్ సంస్కర్త



## అణచివేత

నిస్సందేహంగా అణచివేత
ఒక బుద్ధిశాలిని ఉన్మాదిగా మారుస్తుంది
- హెన్రిక్ ఇబ్సెన్ ***(1828-1906)***
ప్రసిద్ధ నాటకకర్త అమరులు



## స్వేచ్ఛా వృక్షం

స్వేచ్ఛా వృక్షాన్ని ఎప్పటికప్పుడు దేశభక్తుల నియంతల రక్తం పోసి తడుపుతూ వుండాలి. అదే వాటి సహజ ఎరువు.

థామస్ జెఫర్సన్
స్వేచ్ఛ కోసం పోరాటం



## సైన్యాల శక్తిపైకి కనిపిస్తుంది

అది నామకార్థమైంది, కాలం స్థలం పరిమితులుంటాయి
అయితే ఆ శక్తి కాపాడే అధికార వ్యవస్థ ఎదుట
సాహసోపేతంగా పోరాడే ప్రజల ధైర్యం ఇచ్చే వెలుగు
స్వాతంత్రం కోసం పోరాటాన్ని
ఇష్టానుసారం తొక్కిపట్టడం సాధ్యమేనా?
- విలియం వర్డ్స్‌వర్త్





# మతతత్వం - లౌకికతత్వం



ఐజాజ్ అహ్మద్

యూరప్ దేశాల నుండి పాకిన రైల్వేలు, విమానయానం మొదలు సర్వసౌఖ్యాలూ అనుభవిస్తూ, యూరప్ - అమెరికా ఖండాల నుండి ప్రభవించిన ఆధునికానంతర ధోరణుల వరకూ అన్ని సిద్ధాంతాలనూ రెండు చేతులా ఆహ్వానిస్తూ 'మత ప్రసక్తి లేని లౌకికరాజ్యం, విషయానికి వచ్చేసరికి అది మనకు సరిపడేది కాదు అని చెప్పడం విచిత్రమే కదా. ఏ విషయాన్నయినా దాని ప్రయోజనం రీత్యానే చూడడం తప్ప, మూలాలు ఎక్కడివని చూడడం శాస్త్రీయం కానేకాదు.



భారతదేశం ఎదుర్కొంటున్న పేదరికం సమస్య మూలాలు, పరిష్కారాలు చర్చలకు వచ్చే క్రమంలోనే లౌకికతత్వం అంశం కూడా ప్రత్యేకంగా తలెత్తుతుంది. అటు ఆర్.ఎస్.ఎస్. నుండి ఇటు దేశవాళీ సామాజిక వేత్తలు, చరిత్రకారుల వరకు మతప్రసక్తి లేని పటిష్టమైన లౌకికవాదం అనేది పశ్చిమదేశాల మూలాల నుండి వచ్చింది, కాబట్టి 'మనదేశ సంప్రదాయాలకు సరిపడదు' అని వాదిస్తూ ఉంటారు. నాకు ఈ వాదన చాలా చిత్రంగా అనిపిస్తూ ఉంటుంది. యూరప్ దేశాల నుండి విస్తరించిన రైల్వేలు, విమానయానం మొదలు సర్వసౌఖ్యాలూ అనుభవిస్తూ, యూరప్ - అమెరికా ఖండాల నుండి ప్రభవించిన ఆధునికానంతర ధోరణుల వరకూ అన్ని సిద్ధాంతాలనూ రెండు చేతులా ఆహ్వానిస్తూ మత ప్రసక్తి లేని లౌకికరాజ్యం, విషయానికి వచ్చేసరికి అది మనకు సరిపడేది కాదు అని చెప్పడం విచిత్రమే కదా. ఏ విషయాన్నయినా దాని ప్రయోజనం రీత్యానే చూడడం తప్ప, మూలాలు ఎక్కడివని చూడడం శాస్త్రీయం కానేకాదు. రైల్వేలు, విమానయానాలు, ఇలా ఎక్కడెక్కడి సౌకర్యాలనూ మనం ప్రయోజనాల రీత్యా స్వంతం చేసుకుంటూ లౌకికవాదం విషయానికి వచ్చేసరికి తలకిందుల వాదన ఎందుకు ముందు తేవలసి వస్తున్నదో అర్థంకాదు. పోనీ కాసేపు వారి వాదనకే వద్దాం. మూలాల గురించి ఆలోచించేటపుడు నిర్దిష్టమైన నాటి చారిత్రక పరిస్థితులు మన గమనంలో ఉండాలి కదా. కొన్ని చారిత్రక రూపాలు నిజంగానే భిన్నమైనవిగా, రాడికల్‌గా

ఒక్కో దేశంలో ఒక్కో తరహా మత వైవిధ్యం నెలకొని వుంది. పౌరులందరూ సమానులే అన్న ఆదర్శంతో కూడిన ఆధునిక పౌరసమాజం ఆవిర్భవించడానికి మతాన్ని రాజకీయాల నుండి వేరు చెయ్యాల్సి రావడం అనివార్యమయ్యింది. అందుకు లౌకికవాదం ఆలంబనగా నిలిచింది. ఇరుగుపొరుగు రాజ్యాలతో తరచూ ఎదురయ్యే మతయుద్ధాలను నివారించుకోవడానికి, రాజ్యంలో ఉన్న అల్పసంఖ్యాకులు, మైనార్టీ మతస్థులు తదితరులకు రక్షణ కల్పించడానికి లౌకికవాదమే శరణ్యమయ్యింది.

మనగలిగాయి. మత రాజ్యాల్లో ఉండే వివక్షత, పిడివాద, పెడధోరణులు మూలంగా తలెత్తిన సామాజిక సంక్షుభిత సందర్భాలను సరిదిద్దుకునేందుకే ఆధునిక ఐరోపా దేశాలు లౌకిక పరిపాలనను ఆలంబనగా చేసుకున్నాయి. ఆ అనుభవాలు, గుణపాఠాల నుండే దక్షిణాసియా, మధ్య ప్రాచ్యం ప్రాంతాలలో స్వాతంత్ర్యం సముపార్జించుకున్న దేశాలు ఆయా దేశాల్లో కొట్టొచ్చినట్టు కనబడే సంక్షోభాల దృష్ట్యా లౌకికవాదాన్ని ఎంచుకున్నాయి.

ఈ చారిత్రాత్మక సంవిధానం యూరప్ దేశాలలో అనివార్యంగా పటిష్ట లౌకికవాద ఆవిర్భావానికి దారితీసింది. రాజకీయాలు మతం మధ్యన విభజనరేఖ ఏర్పరిచింది. 16వ శతాబ్దంలో తలెత్తిన సంక్షోభాలు ఒకవైపు, రాజరిక నిరంకుశ రాజ్యాలనేకం ఆవిర్భావం మరోవైపు, సంస్కరణవాదం దానికి ప్రతిఘటనగా యథాతథవాదుల మధ్యన నెలకొన్న యుద్ధాలు ఇంకొకవైపు - ఇవన్నీ కలిసి యూరప్ ఖండాన్ని మత ప్రాతిపదికన విభజించేసాయి. ప్రధానంగా కాథలిక్, ప్రొటెస్టెంట్ మత ప్రాతిపదికన విడిపోయినా ప్రధాన మతంతోపాటు ప్రతి రాజ్యంలో మైనార్టీ మతస్తులు, ఇతర తెగలవాళ్ళు ఉంటూ వచ్చారు. క్యాథలిక్‌మత ఫ్రాన్స్ దేశంలో ప్రొటెస్టెంట్లు, ఆంగ్లో ఇంగ్లండ్‌లో క్యాథలిక్‌లు, మెజార్టీ క్రిస్టియన్ దేశాల్లో యూదు మైనార్టీలు - ఇలా ఒక్కో దేశంలో ఒక్కో తరహా మత వైవిధ్యం నెలకొని వుంది. పౌరులందరూ సమానులే అన్న ఆదర్శంతో కూడిన ఆధునిక పౌరసమాజం ఆవిర్భవించడానికి మతాన్ని రాజకీయాల నుండి వేరు చెయ్యాల్సి రావడం అనివార్యమయ్యింది. అందుకు లౌకికవాదం ఆలంబనగా నిలిచింది. ఇరుగుపొరుగు రాజ్యాలతో తరచూ ఎదురయ్యే మతయుద్ధాలను నివారించుకోవడానికి, రాజ్యంలో ఉన్న అల్పసంఖ్యాకులు, మైనార్టీ మతస్థులు తదితరులకు రక్షణ కల్పించడానికి లౌకికవాదమే శరణ్యమయ్యింది. ప్రొటెస్టెంట్ మతం భిన్నమైన భావనలతో కూడిన చర్చిలు అనేకం ఆవిర్భావానికి దోహదం చేసింది. కొత్తగా ఏర్పడిన కేంద్రీకృత రాజ్యాలలో వాటికన్ చర్చినుండి, రాజ్యంలో ఆవిర్భవించిన క్యాథలిక్ చర్చి నుండి స్వేచ్ఛను పొందడానికి లౌకికవాదం ఆదరువుగా మారింది. అంటే లౌకికవాద భావానికి - పౌర సమానత్వానికి అవినాభావ సంబంధం ఉంది. మైనార్టీ మతస్థుల, తెగల ప్రజానీకానికి రక్షణగా నిలిచింది. తదనంతర కాలపు పరిశోధనల నుండి మనకు తెలియవచ్చేది ఏంటంటే - ఆ తరువాతి కాలంలో ఫ్రాన్స్ కేంద్రంగా మొదలయిన సాంస్కృతిక పునర్వికాసం పదిహేడవ శతాబ్దపు మధ్యకాలంలో చోటు చేసుకున్న ఇంగ్లీష్ విప్లవం తాలూకు మేథో మూలాల కుదురు నుండి జరిగిందని. 'మతాన్ని రాజ్యం నుండి అనివార్యంగా విడదీయాల్సి రావడం ఆగామి ప్రజాస్వామిక సమాజంవైపు వేసిన తొలి అడుగుగా, మనం గమనించాలి. ఈ రకమైన భావజాలం కలవారంతా మతశరణార్థులు, అవిశ్వాసులుగా ముద్రపడ్డారు. క్రామ్‌వెల్ పతనానంతరం బ్రిటన్ పునర్నిర్మాణ సమయంలో మత విశ్వాసాలను ప్రశ్నించిన వారందరి మీదా విచారణ జరిపి దేశాంతరాలకు తరిమేసారు. క్రైస్తవ మతం నుండి యూదులు, కాథలిక్‌ల నుండి ప్రొటెస్టెంట్లు ఇలానే వేరు పడ్డారు. వీరిలో చాలామంది ఆమ్‌స్టర్‌డాంలో మరీ ముఖ్యంగా హేగ్‌లో తలదాచుకున్నారు. వారి భావజాలం పారిస్ వరకు ప్రసరించింది. అక్కడ కొంత మంది ఈ భావాలను అంది పుచ్చుకున్నారు. కానీ అవి కూడా పలచబార్చిన భావాలే కావడం మన గమనంలో ఉండాలి.

బ్రిటన్‌లో లాకీ నుండి స్టువర్ట్‌మిల్ వరకు పేరొందిన ప్రచారవాదులందరూ ఇలా అడుగంటించిన ఆలోచనా స్రవంతినే ఆలంబనగా చేసుకున్నారు. రాజ్యాంగబద్ధమైన రాజరిక పాలనలో కూడా పౌర హక్కులు ఉండాలనే ప్రజాతంత్ర ఆకాంక్షలతో మొదలిడి మెజారిటీ ప్రజానీకం మీద రుద్దిన కులీనాధిపత్యాన్ని వ్యక్తిగత స్వేచ్ఛ కల్పించాలనే డిమాండుతో

సవాలు చేసే దాకా వీరి సైద్ధాంతిక వాదనలు కొనసాగాయి. లౌకిక ఆలోచనల విషయానికి వస్తే స్వతఃసిద్ధమైన హక్కుల సిద్ధాంతం పునాదిగా ప్రతి వ్యక్తి ఒక సార్వభౌమశక్తి కాబట్టి ప్రతి వారికీ తమవైన ప్రాథమిక హక్కులు ఉంటాయని, ఇవి స్వతఃసిద్ధమైన హక్కులు కాబట్టి ఏ పౌర సమాజమయినా ముందు హక్కులను గౌరవించాలనే వాదన నడిచింది. ఆ తరువాత మరో వందేళ్ళకి జాన్‌స్టువర్ట్ మిల్ ప్రజాస్వామ్యంలోని సందేహాస్పద అంశాల మీద దృష్టి పెట్టాడు. ప్రజాస్వామ్యంలో కీలక సమస్య మెజార్టీ పరిపాలన అనే ఆలోచనకన్నా మైనార్టీల హక్కులు వాటితో ముడిపడిన ఇతరేతర సమస్యలే కీలకమన్న ఆలోచన ముందుకు తీసుకువచ్చాడు. తద్వారా ప్రజాస్వామ్యంలో మెజార్టీకి పాలనా హక్కులు ఎలానో మైనార్టీలకు రక్షణతోపాటు స్వేచ్ఛకూడా ఉండాలని ప్రతిపాదించాడు. కాబట్టి ఉదారవాద వ్యక్తివాదం కేవలం మైనార్టీలకు సమాన హక్కుల కల్పనకే పరిమితం కాకుండా సమాన స్వేచ్ఛకు కూడా అవకాశం కల్పించింది.

ఈ రకమైన రాజకీయ ఉదారవాదం రాజరికానికి వ్యతిరేకంగా నిలవడంతోపాటు లౌకికతత్వానికి ఆదరువుగా నిలిచింది. ఉదాహరణకు ఇంగ్లాండ్ రాజ్యాంగాన్నే తీసుకుంటే, రాజరికానికి రాజ్యాంగబద్ధత కల్పిస్తూనే ఇంగ్లాండ్‌లో చర్చికి అధిపతిగా కూడా కొనసాగే అవకాశం కల్పిస్తుంది. అంటే ఒక వంక రాజరికం మీద పరిమితులు విధించే ప్రజాస్వామిక దృక్పథంతో పాటు రాజ్యానికి-చర్చికి మధ్యన సంబంధం కొనసాగించే మితవాద లక్షణానికీ చోటు కల్పించింది.

అదే ఫ్రాన్స్ విషయానికి వస్తే సంస్కరణ ఉద్యమ వ్యతిరేకశక్తులు అంతిమంగా విజయం సాధించినా సంస్కరణ ఉద్యమ ప్రభావ ఫలితాన్ని సమూలంగా తుడిచి పెట్టలేకపోయాయి. సంస్కరణ ఉద్యమ ప్రభావంతో మొదలయిన మతాధిపతుల పట్ల వ్యతిరేకత మరింత రాడికల్ రూపాలు సంతరించుకుని పద్దెనిమిదవ శతాబ్దం చివరినాటికి పెనుఉప్పెన లాంటి విప్లవరూపం తీసుకుంది. తత్ఫలితంగా లౌకికతత్వ సిద్ధాంతం సార్వభౌమత్వం, పౌరసత్వ హక్కులు వంటి అంశాలపై తనదైన ముద్ర బలంగా వెయ్యడంతోపాటు రాజకీయ సంవిధానంలోనే మౌళికంగా మార్పులు చోటు చేసుకునేందుకు దోహదం చేసింది.

***దైవదత్తమైన రాజరికం సార్వభౌమ అధికారం పేరిట మానవ స్వేచ్ఛపై పరంపరాగత ఆంక్షలు విధించి బానిస లొంగుబాటుతనానికి చట్టబద్ధత కల్పిస్తే 1789 ఫ్రెంచి విప్లవం మానవ హక్కులు-పౌరహక్కులకు పెద్దపీట వేసింది. సార్వభౌమాధికారం అంటే దైవదత్తమైనది కాదని, సమిష్టితత్వం, సమానత్వం, స్వేచ్ఛ, పౌరసత్వాలే అత్యున్నత సామాజిక లక్షణాలని నిర్దేశించింది.***

దైవదత్తమైన రాజరికం సార్వభౌమ అధికారం పేరిట మానవ స్వేచ్ఛపై పరంపరాగత ఆంక్షలు విధించి బానిస లొంగుబాటుతనానికి చట్టబద్ధత కల్పిస్తే 1789 ఫ్రెంచి విప్లవం మానవ హక్కులు-పౌరహక్కులకు పెద్దపీట వేసింది. సార్వభౌమాధికారం అంటే దైవదత్తమైనది కాదని, సమిష్టితత్వం, సమానత్వం, స్వేచ్ఛ, పౌరసత్వాలే అత్యున్నత సామాజిక లక్షణాలని నిర్దేశించింది. తద్వారా సార్వభౌమాధికారం అనేది రాజుల దైవదత్తం అనే భావనను తుత్తినియలు చెయ్యడంతోపాటు వ్యక్తుల ఐచ్ఛిక స్వేచ్ఛల సమాహారమైన సమిష్టితత్వమే సార్వభౌమాధికారం అన్న భావనను పాదుకొల్పింది. అంటే హక్కులు దైవదత్తంగా, ప్రకృతిపరంగా ప్రసాదింపబడతాయనే సిద్ధాంతం తప్పని త్రోసిపుచ్చడంతో పాటు రాజకీయ సమాజంలో వ్యక్తి స్వేచ్ఛయే పరమోన్నతమైనదనే తప్పుడు అభిప్రాయాలను కూడా తృణీకరించింది. సార్వభౌమాధికారం అంటే పౌరుల సమానత్వ స్వేచ్ఛా హక్కుల ఉమ్మడి తత్వమే అని స్పష్టం చేసింది. సార్వభౌమ హక్కులలో ప్రతి మనిషికీ అవిభాజ్యమైన భాగం ఉంటుంది. ఇవి స్వతఃసిద్ధంగా వ్యక్తులకు వచ్చే హక్కులు కావు. ఆ వ్యక్తులు పౌర సమాజంలో భాగం కాబట్టి, పౌర చట్టానికి లోబడి ఉండాలి కాబట్టి రాజకీయ సమాజంలో (రాజ్యంలో) పౌరుడు కాబట్టి అతనికి ఆ హక్కులు దాఖలుపడతాయి. పౌరసమాజానికి, రాజ్యానికి మధ్యన భేదం ఉంటుంది. రాజ్యం అనేది ఒక పద్ధతిన ఒక చట్రంలో పనిచేస్తూ ఉంటుంది. రాజ్యానికి పౌరసమాజానికి మధ్యన ఉండే సంబంధం (వ్యక్తి - పౌరుడు) లేదా (పౌరుడు - వ్యక్తి) (సబ్జెక్ట్ - సిటిజన్)

*మత గురువుల అధికారం అంటేనే ఆత్మలోకంలో దివాళా ఎత్తిపోవడం. మత నియమావళి ప్రకారం జ్ఞానం కొద్దిమందికే అందుబాటులో ఉంటుంది. అప్పట్లో గ్రంథాలన్నీ 'లాటిన్' భాషలో ఉండేవి. పామరులకు వాటిని తాకే హక్కు కూడా ఉండేది కాదు. భారతదేశం కూడా ఇందుకు మినహాయింపు కాదు. మహిళలు, శూద్రులు సంస్కృత భాష నేర్వడానికి అనర్హులు అని బ్రాహ్మణవాదం శాసించింది. ఆ రకంగా వేదాలను మహిళలు, శూద్రులు చదవరాదు, నేర్వరాదు అని శాసించింది.*

లేదా (సిటిజన్ – సబ్జెక్ట్)ల మధ్యన ఉండే సంబంధమే. కాబట్టి సార్వభౌమాధికారం అనేది అవిభాజ్యమైనది. అది సమిష్టిగా అనుసరించాల్సినది, అనుభవించాల్సిందే తప్ప వ్యక్తులకు, వ్యక్తిగతమైనది కాదు.

1789 ఉద్యమంలో ఆలోచనలు వెన్నాడోతూనే ఉన్నాయి. రూసోను చర్చి బహిష్కరించింది. అయినప్పటికి అతను హక్కులు స్వతఃసిద్ధంగా సంక్రమిస్తాయనే వాదనను తోసిపుచ్చారు. హక్కులు భగవంతుడు ప్రసాదించినవో, ప్రకృతి వరమో అన్న వాదనలను రూసో అంగీకరించలేదు. అవి సమాజం నుండి సంక్రమించేవని చెప్తాడు. అందుకే 'సోషల్ కాంట్రాక్ట్' అన్న పదబంధాన్ని రూసో విరివిగా వాడేవాడు. అయితే రూసో ఉదహరించిన 'సోషల్ కాంట్రాక్ట్' కూడా వాస్తవమైనది కాదు. హక్కులు దేవుని వల్లగాని, స్వతఃసిద్ధంగా గాని సంక్రమించినవి కాదు. ఇవి సమాజం వల్లనే సంక్రమించాయి. వాటినే రూసో "సామాజిక ఒప్పందం" (సోషల్ కాంట్రాక్‌లు) అన్నారు. అయితే రూసో చెప్పే ఈ సామాజిక ఒప్పందానికి ఒక వాస్తవ రూపం అంటూ లేదు. స్వతఃసిద్ధమయిన రాజ్యంలోని నివసిస్తున్న మానవులందరూ తామొక పౌర సమాజంగా ఏర్పడాలని కుదుర్చుకున్న ఒప్పందం కాదు. చరిత్రలో ఫలానా రోజుకు ముందూ, ఫలానా రోజు తరువాత జరిగిన ఒప్పందంగా కూడా చెప్పలేము. దీనిని తాత్విక అమూర్త భావనగా మనం పరిగణించవచ్చు. అయితే ఇది ఒక ప్రయాణానికి ఆరంభంగా వ్యక్తుల ఇష్టాఇష్టాలను దాటి ఒక – పౌర విద్యుక్త ధర్మం, సామాజిక హక్కులతో కూడిన ఒకానొక చారిత్రిక దశకు కేంద్రంగా మనం చూడాలి. లౌకిక తాత్వికతకు భిన్నంగా రూసో తన 'సోషల్ కాంట్రాక్ట్' తాత్విక భావన ద్వారా సమాజానికన్నా ముందు మానవీయత లేదు, అలానే సమాజ ఆవిర్భావానికి ఏ దివ్యశక్తి అనుమతి అవసరం లేదు అని ప్రతిపాదించాడు. సమాజానికన్నా ముందు వ్యక్తుల సంవిధానంలో హక్కుల పాకులాట ఉందనడం మీద తీవ్ర సందేహాలు వ్యక్తం చేశాడు.

మ్యానో తాత్విక వివేచన నుండే పౌరసత్వ భావన – ఆత్మన్యూనత ఆలోచనల మధ్యన క్రియాశీలమైన ఉద్రిక్తతల జాడలను మనం గమనించవచ్చు. చారిత్రకంగా చూస్తే 'ఆత్మ' అనే పదం పితృస్వామిక భావజాలంతో కూడిన జమిందార్లు, మతగురువుల ఆధిపత్యం కింద చలామణి అయ్యింది. జమిందార్ల అధికారం అంటే రాజరికమే. మత గురువుల అధికారం అంటేనే ఆత్మలోకంలో దివాళా ఎత్తిపోవడం. మత నియమావళి ప్రకారం జ్ఞానం కొద్దిమందికే అందుబాటులో ఉంటుంది. అప్పట్లో గ్రంథాలన్నీ 'లాటిన్' భాషలో ఉండేవి. పామరులకు వాటిని తాకే హక్కు కూడా ఉండేది కాదు. భారతదేశం కూడా ఇందుకు మినహాయింపు కాదు. మహిళలు, శూద్రులు సంస్కృత భాష నేర్వడానికి అనర్హులు అని బ్రాహ్మణవాదం శాసించింది. ఆ రకంగా వేదాలను మహిళలు, శూద్రులు చదవరాదు, నేర్వరాదు అని శాసించింది. వ్యవసాయమే ప్రధాన ఉత్పత్తిగా ఉన్నంత కాలమూ పితృస్వామిక భావజాల ఆధిపత్యం చలామణి అయ్యింది. దాని ఆధిపత్యం నడిచినంత కాలం బానిసత్వం ఏదో ఒక రూపంలో కొనసాగింది. 18వ శతాబ్దంలో చోటుచేసుకున్న రాజకీయ తిరుగుబాటు తదనంతర కాలంలోని సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమాలు భాషాపరంగా కూడా 'వ్యక్తి' అర్థాన్ని మార్చేశాయి.

1789లో జరిగిన ఫ్రాన్స్ విప్లవం (పారిస్‌కమ్యూన్) 'వ్యక్తి' 'వ్యక్తిత్వ' అర్థాలనే విప్లవాత్మకంగా మార్చేసింది. అవిభాజ్యమైన సార్వభౌమత్యం అనే భావన బహుళ ప్రాచుర్యంలోకి వచ్చింది. తద్వారా నూతన రాజకీయ ఒరవడి ప్రభవించింది. సామాజికుడయిన వ్యక్తి పౌరుడిగా అవతరించాడు. విశ్వాసాల పట్ల వ్యక్తిగత స్వేచ్ఛను అనుసరిస్తూ, రాజ్యమే ఉచిత ప్రభుత్వ లౌకిక విద్యను

అందించాలనే డిమాండు ముందుకు వచ్చింది. అప్పటిదాకా జనం మీద ఏకపక్షంగా రుద్దిన చట్టాలని కూలదోసి రాజ్యము-సమాజము సజావుగా నడిచేందుకు అవసరమైన సామాజిక చట్టాలను రూపొందించారు. ఈ విజయాలన్నీ ఒక్క యుద్ధంలో గెలుచుకున్నవి కావు. ఒక్క ఫ్రాన్స్ దేశానికే పరిమితం కాలేదు. యుద్ధం మీద యుద్ధం చేసుకుంటూ అనేక యుద్ధాల తరువాతగానీ ఈ విజయాలను సాకారం చేసుకోలేకపోయింది జనావళి. అలాగే ప్రపంచంలో అనేకానేక రాజ్యాలకి, దేశాలకి ఈ యుద్ధాలు పాకాయి. అక్కడా అదే అనుభవం. ఒక్కో విజయం సాధించడానికి జనం ఎంతో యుద్ధం చెయ్యాల్సి వచ్చింది. ర్యూసో తాత్వికత మూలంగా పౌరసత్వం అంటే జనం సమిష్టిగా లోబడి ఉండాలనే ఆలోచన ముందుకు వచ్చింది. ఆ రకంగా పౌరుడు తానే శాసనకర్త అయి ఆ శాసనాలకు అనుగుణంగా వ్యవహరించే శాసనబద్ధుడు అయ్యాడు. ఆ రకంగా ప్రజలే చరిత్ర నిర్మాతలుగా నిలిచారు. వ్యక్తుల ఆకాంక్షలు, సమిష్టి ఆకాంక్షల మధ్యన తలెత్తే వైరుధ్యాలను పరిష్కరించుకోవడమనే సమస్య ముందుకు వచ్చింది. సమిష్టి ఆకాంక్షలు అంటే ఒక ప్రాంతానికీ, ఒక విశ్వాసానికి చెందిన ప్రజానీకం అనే సమాన పౌరసత్వ ప్రాతిపదికన మొత్తం సమాజం అంతటికీ చెందిన ఆకాంక్షలనే సమిష్టి ఆకాంక్షలుగా పరిగణనలోకి తీసుకున్నారు. తద్వారా వ్యక్తిగత ఆకాంక్షలు సమాజం ఉమ్మడి కట్టుబాట్లు, ఆకాంక్షలకు లోబడి ఉండాలని, స్వీయ ప్రయోజనాల కన్నా సమాజ ప్రయోజనాలే మిన్న అన్న ఉదాత్త భావనను ఆలంబనగా చేసుకున్నారు. మతపరమైన రాజ్యాల్లో కూడా లౌకికతత్వ భావన పాదుకోవడానికి పౌరసమానత్వ భావన ఊపందుకోవడానికి రాజకీయ తాత్విక చరిత్ర ఒక మూలమలుపు తీసుకోవడానికి ర్యూసో తాత్విక చింతనయే ఆదరువుగా నిలిచింది అని నే భావిస్తాను. తదనంతర కాలంలో సమత్వ, లౌకికతత్వ భావనలే ప్రజాస్వామికత ఆవిర్భావానికి దారి తీశాయి.

ర్యూసో ఇక్కడే నిజమైన విప్లవాత్మక అడుగు వేశాడు. ఏ పౌరులయితే చట్టం చేస్తున్నారో, ఏ పౌరులయితే అవే చట్టాలకి లోబడి ఉంటున్నారో, చట్టం ముందు సమానంగా ఉంటున్నారో అలాంటి వారి మధ్య భౌతికసంపద పంపిణీ సమానంగా ఎందుకు ఉండదూ అన్న ప్రశ్న లేవదీశాడు. మరోలా చెప్పాలంటే (ప్రైవేటు) ఆస్తి-ప్రజాస్వామ్యం రెండూ ఒకే ఒరలో ఇమడగలవా అని ప్రశ్నించాడు ర్యూసో. ఇది మనల్ని సంభ్రమానికి గురిచెయ్యడం లేదూ?

**ఈ సాంస్కృతిక పునరుజ్జీవన వికాస రాజకీయాల్లో భాగంగానే మార్క్సిజం ముందుకు వచ్చింది. ప్రజాస్వామ్యం, లౌకికతత్వం, సోషలిజం భావాలను రాజకీయంగా నైతికంగా పూర్తి విప్లవాత్మకంగా మార్చేసింది. తద్వారా నిర్మాణోత్తర ఆధునికులను, సబాల్టర్న్‌వాదులను కూడ ఒప్పించేలా మనమంతా సాంస్కృతిక పునరుజ్జీవనయుగపు వారసులంగా నిలబెట్టింది.**

సరే... ఇక్కడ నా ఉద్దేశం తాత్విక వివేచన చెయ్యడం కాదు, కాకపోతే ఈ నేపథ్యాన్ని మనం అర్థం చేసుకుంటే లౌకికతత్వంలోనే ప్రజాస్వామిక పునాదులు ఉన్నాయని ఇట్టే బోధపడుతుంది. మైనార్టీల హక్కులు, స్వేచ్ఛలను పణంగా పెట్టే ఏ మెజారిటీ మత రాజ్యంలో అయినా సార్వభౌమిక హక్కులకు విలువే ఉండదు. అలానే ఇందాక చెప్పుకున్నట్లు ర్యూసో వివేచించిన ప్రజాస్వామిక భావనలోనే సోషలిజం మూలాలు మనకు కనబడతాయి. ఆస్తి సంబంధాల్లో అసమానతలు ఉన్న సమాజంలో పౌరులందరూ సమానం కాదు అని చెప్పనే చెప్పాడు. ప్రైవేటు ఆస్తి రద్దు కానిదే ప్రజాస్వామిక పౌరుడు అవతరించడు అని స్పష్టం చేశాడు. అయితే ఆ సమస్యను ఎలా పరిష్కరించాలి అన్న అంశాన్ని కనీసంగా కూడా ఆలోచించలేకపోయాడు. ఐనప్పటికీ ప్రైవేటు ఆస్తి - సమానత్వం ఒకదానికొకటి పొసగనివి అన్న ర్యూసో ఆలోచన సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో మరిన్ని పరిష్కారానికి నోచని వైరుధ్యాలను తెరమీదకి తెచ్చింది. యధాతథావాదులు బూర్జువా మగపుంగవులనే సమాజంలో వ్యక్తికి అర్థమూ, పరమార్థము అని తెరమీద ఊరేగిస్తుంటే, సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో ముందుకొచ్చిన విప్లవ రాజకీయాలు మాత్రం వర్గవిభాజిత సమాజంలో పౌరుడే సర్వశక్తిమంతుడిగా భావించడం కల్ల అని తేటతెల్లం చేశాయి.

అందుకే 1789 ఫ్రెంచి విప్లవం 'స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం, సమానత్వం' అన్న మూడు అంశాలే మానవుడిని అత్యున్నతీకరిస్తాయని చాటిచెప్పింది. దీనిని మన కాలపు మాటల్లోకి అనువదించుకోవాలంటే 'ప్రజాస్వామ్యం, లౌకికతత్వం, సోషలిజం' అని చెప్పుకోవాలి. సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలోనే మార్క్సిజం ఊపందుకుంది.

ఈ సాంస్కృతిక పునరుజ్జీవన వికాస రాజకీయాల్లో భాగంగానే మార్క్సిజం ముందుకు వచ్చింది. ప్రజాస్వామ్యం, లౌకికతత్వం, సోషలిజం భావాలను రాజకీయంగా నైతికంగా పూర్తి విప్లవాత్మకంగా మార్చేసింది. తద్వారా నిర్మాణోత్తర ఆధునికులను, సబాల్టన్‌వాదులను కూడ ఒప్పించేలా మనమంతా సాంస్కృతిక పునరుజ్జీవనయుగపు వారసులంగా నిలబెట్టింది. అంతేనంటారా, అని మీరు ఎన్నిసార్లు అడిగినా, అవును అనే ఢంకా బజాయించి చెబుతున్నా మనం అంతే అని. మనం ఈ భూమిని చాలాచాలా కాలంపాటు వెంటాడే భూతాలమే.

స్వేచ్ఛ, సమానత్వం - ఈ రెండు భావనల ఆవిర్భావ కాలంలోనే మత స్వేచ్ఛ, భిన్నమతాల శాంతియుత సహజీవనం అన్న భావనలు కూడా ప్రధానాంశాలుగా ముందుకువచ్చాయి. ప్రజాస్వామిక అసమ్మతినే ఒకానొక కాలంలో మత విభేదంగా పరిగణించేవారు. క్రమంగా మతం పట్ల ఎవరి విశ్వాసాలను, అవిశ్వాసాలను వారి వారి స్వంత విషయంగా పరిగణించడం మొదలయింది. అదే సందర్భంలో ఇలాంటి వ్యక్తిగత హక్కులు సమిష్టి ప్రయోజనాలకు వ్యతిరేకంగా కాకుండా చూడడం ఎలా అనే చర్చ నడిచింది. ప్రజలందరికీ సమానహక్కులు, ప్రజలందరికీ సమానత్వం అన్న ఆశయాలు చర్చకు వచ్చినపుడు లౌకికతత్వమే ప్రధాన చోదకశక్తిగా నిలిచింది. తదనంతరం రూపుదిద్దుకున్న రాజకీయ ప్రజాస్వామ్యానికి కేంద్ర బిందువుగా నిలిచింది. కాబట్టి ఉదారవాద ప్రజాస్వామ్యం లౌకిక భావనలకు ఊపిరినిచ్చింది అనే వాదన సరికాదని, లౌకిక భావనల ఆధారంగానే ప్రజాస్వామికత్వం ఆవిర్భవించిందని మనం స్పష్టంగా అర్థం చేసుకోవాలి లౌకికతత్వం అంటే పరమత సహనం ఒక్కటే కాదు, సమాజంలో ఉన్న అన్ని మతాల, జాతుల ప్రజానీకానికి పౌర

**లౌకికతత్వ భావన రాజకీయ ప్రజాస్వామ్యానికి, రాజకీయ సమానత్వ భావన ఆర్థిక సమానత్వానికి, సమాజంలో మగవాళ్ళకు దక్కే సామాజిక ఆర్థిక సమానత్వం మహిళలకు, ఒక కులానికి దక్కే సమానత్వం మరో కులానికి, ఒక జాతికి దక్కే సమానత్వం మరో జాతికి దక్కుతుంది. అయితే ఈ సైద్ధాంతిక తర్కాలు వాటంతట అవే పదార్థ ప్రపంచంలో మార్పులు తీసుకురాలేవు.**

సమానత్వం కల్పించడం. సమానత్వం- రాజకీయ ప్రజాస్వామ్యం ఈ రెండింటి మనుగడ లౌకికతత్వం మీదే ఆధారపడి ఉంటుంది.

మరో విధంగా చెప్పుకోవాలంటే ప్రజాస్వామ్యం అనేది లౌకిక సామాజిక జీవన సరళి, లౌకిక పరిపాలనల మీద ఆధారపడి ఉంటుంది . ఏ రంగంలో సమానత్వమైనా తాత్కాలికంగా అనివార్యంగా ఒకదానికొకటిగా ఇతర రంగాలలో సమానత్వానికి దారితీస్తుంది. లౌకికతత్వ భావన రాజకీయ ప్రజాస్వామ్యానికి, రాజకీయ సమానత్వ భావన ఆర్థిక సమానత్వానికి, సమాజంలో మగవాళ్ళకు దక్కే సామాజిక ఆర్థిక సమానత్వం మహిళలకు, ఒక కులానికి దక్కే సమానత్వం మరో కులానికి, ఒక జాతికి దక్కే సమానత్వం మరో జాతికి దక్కుతుంది. అయితే ఈ సైద్ధాంతిక తర్కాలు వాటంతట అవే పదార్థ ప్రపంచంలో మార్పులు తీసుకురాలేవు. సైద్ధాంతిక భావాలకు పదార్థ ప్రపంచానికి మధ్యన ఉండే సంబంధాలు నిరంతరం ఆ సమాజ నిర్మాణ గతితార్కిక సూత్రాల మీద, మానవ చైతన్యం మీద ఆధారపడి ఉంటాయి.

నేను చివరిగా మరొక్కసారి నొక్కి చెప్పదలుచుకుంది ఏమిటంటే ఏదేని ఒక రంగంలో సమానత్వ భావనలు పాదుకుంటే అవి ఇతర రంగాల్లో సమానత్వ భావనకు ఊపిరి ఊదుతాయి. అలాంటి భావనలు ప్రజాస్వామ్యానికీ, లౌకికతత్వానికీ సోషలిజానికే పరిమితం కావు. లౌకికతత్వము ప్రజాస్వామికత ఇవన్నీ మెట్టుమెట్టుగా కమ్యూనిజం వైపుకు దారితీస్తాయి. సమన్యాయం అన్న భావన వైరుధ్యాలను వాస్తవ రీతిని పరిష్కరిస్తుంది. మొదట్లో చెప్పినట్లుగానే ఒకసారి రాజకీయ సమానత్వ ప్రశ్న లేవనెత్తబడిందంటే, ఆ ప్రశ్న ఊహాజనిత వాదనలన్నింటికీ స్వస్థివాక్యం పలికే దాకా ఆగదు.



# 'జాతీయత' అంటే ఏమిటి?





ప్రభాత్ పట్నాయక్

అసమానతలను పెంపొందిస్తూ పేదరికాన్ని సృష్టించే అడ్డూ అదుపూలేని పెట్టుబడిదారీ వ్యవస్థ వల్ల ప్రజాతంత్ర జాతీయవాదం వాస్తవ రూపం దాల్చడానికి కావలసిన ఆర్థిక చట్రం ఏర్పాటు కాజాలదు. ఈ వాస్తవాన్ని గాంధీ, నెహ్రూ, అంబేద్కర్ వంటి ప్రధాన నాయకులు(ఇందుకు సంబంధించి వీరి అవగాహన వేరువేరుగా ఉన్నప్పటికీ) గుర్తించారు. అయితే ప్రభుత్వ నియమనిబంధనలు, బలమైన ప్రభుత్వ రంగం ఉన్నప్పటికీ పెట్టుబడిదారీ వ్యవస్థ దేశంలో వేళ్ళూనింది.

మా విశ్వవిద్యాలయ విద్యార్థులు 'జాతి వ్యతిరేకులు' అనే నిందను ఎదుర్కొం టున్నప్పుడు అసలు 'జాతీయత' అంటే ఏమిటనే ప్రశ్న అడిగే సమయం ఆసన్నమైంది. దీనికి సమాధానం చాలామంది అనుకుంటున్నట్లుగా అంత తేలిక కాదు. 'జాతీయ', 'జాతీయత', 'జాతిరాజ్యం' అనే పారిభాషిక పదాలు వెస్ట్‌ఫాలియన్ శాంతి ఒప్పందాల తరువాత 17వ శతాబ్దంలో ఐరోపా ఖండంలో వాడుకలోకి వచ్చాయి. అయితే ఐరోపా జాతీయవాదానికి మూడు ప్రధాన లక్షణాలున్నాయి. మొదటిది, 'జాతి'కి చెందిన ప్రాంతంలో నివసించే ప్రజానీకం యావత్తూ దీనిలో భాగం కాదు. అది ఎల్లవేళలా 'అంతర్గత శత్రువు'(ఉదాహరణకు యూదులు) గురించి పట్టించుకునేది. రెండవది, అది అవశ్యంగా సామ్రాజ్యవాద స్వభావాన్ని కలిగి ఉండేది. వెస్ట్‌ఫాలియన్ శాంతి ఒప్పందాలు జరిగిన తరువాత కొన్ని నెలల కాలంలోనే ఐర్లాండ్‌పై ఆలివర్ క్రామ్‌వెల్ దాడిచేసి ఆ దేశానికి చెందిన మొత్తం భూభాగంపై బ్రిటీష్ ఆధిపత్యాన్ని నెలకొల్పాడు. ఆ తరువాతి దశాబ్దాలలో ఐరోపా దేశాలు ఐరోపాలో శాంతియుతంగా సహజీవనం చేస్తూనే తమకంటూ ఒక సామ్రాజ్యాన్ని నెలకొల్పే ప్రయత్నంలో భాగంగా భారతదేశం వంటి సుదూర ప్రాంతాలలో భీకర యుద్ధాలలో పాల్గొన్నాయి. మూడవది, 'జాతి' భావాన్ని బలోపేతం చేయటానికి దానికి మహత్తును ఆపాదించారు. దీనికి కారణం అందరూ అనుకునే లాభకర వాణిజ్యవాదం భావన మాత్రమే కాదు. ఇది సంప్రదాయ రాజకీయ అర్థశాస్త్రానికి కూడా ఆధారంగా ఉన్నది. ఆడమ్‌స్మిత్ తన మహాకావ్యానికి 'జాతుల సంపద స్వభావం, కారణాల పరిశీలన' అని నామకరణం చేశాడు. జాతుల సంపద అసలు స్వభావం ఏమిటనే విషయంపై ఆడమ్‌స్మిత్ వాణిజ్య

వాదులతో విభేదించాడు. అయితే ప్రజలకు దీనితో గల సంబంధం విషయంలో వారితో ఆయనకు ఎటువంటి పేచీ లేదు. క్లుప్తంగా చెప్పాలంటే ఐరోపా 'జాతీయవాదం' విస్తరణకాంక్ష గల జాతీయవాదం.

ఈ కారణం చేతనే జర్మనీలాంటి 'జాతి' ఆలస్యంగా రూపుదిద్దుకోవటం వల్ల విస్తరణకాంక్ష రంగం పైకి ఆలస్యంగా వచ్చింది. అయినప్పటికీ జర్మన్ జాతీయవాదం తన విస్తరణ కాంక్ష కోసం అత్యంత ద్వేషపూరితమైన జాతీయవాదాన్ని ముందుకు తెచ్చింది. ఈ మొత్తం ప్రక్రియ ఫాసిజంతో ఉచ్ఛదశకు చేరుకున్నది. ఈ మధ్య కాలంలో ఈ కారణం చేతనే ఐరోపా ఖండంలోని ప్రగతిశీల, ప్రజాస్వామిక సంప్రదాయం రెండు ప్రపంచ యుద్ధాలలో చవిచూసిన దారుణ అనుభవాలను గమనంలోకి తీసుకుని ఐరోపా యూనియన్‌ను స్థాపించి ఇటువంటి 'జాతీయవాదాన్ని' అధిగమించదలచింది. ఆధునిక కాలంలో జాతీయవాదానికి చెందిన ఈ విస్తరణ కాంక్ష ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలతో ముడిబడి ఉన్నప్పటికీ ఐరోపాలో అది నెరవేరకపోవటం ఊహించని విషయమేమీ కాదు.

అయితే భారతదేశం వంటి దేశాలలో వలస పాలనకు వ్యతిరేకంగా సాగిన పోరాట కాలంలో అభివృద్ధిచెందిన 'జాతీయవాదం' భావన పూర్తిగా భిన్నమైనదనే విషయాన్ని గుర్తించటం అవసరం. ఎందుకంటే ఆ పోరాటం వలస పాలకుల రూపంలో ఉన్న అత్యంత బలమైన శత్రువుకు వ్యతిరేకంగా జరుగుతున్నందున లక్ష్య సాధన కోసం సమాజం లోని అన్ని విభాగాలనూ కార్యోన్ముఖులను చేయటానికి ప్రజలందరినీ కలుపుకుని పోవలసిన అవసరం ఏర్పడింది. ఆ విధంగా ఈ దేశాలలోని జాతీయవాదం తృతీయ ప్రపంచ దేశాలలోని జాతీయవాదంతో విస్తరణ కోసం పోటీపడకుండా అక్కడి పోరాటాలతో సంఘీభావాన్ని పెంపొందించు కోవలసి వచ్చింది. అంతిమంగా జాతీయవాదం 'జాతి' ఔన్నత్యంపై కాకుండా ప్రధానంగా 'ప్రజల' సంక్షేమంపైనే తన దృష్టిని సారించింది. 'ప్రతి భారతీయుడి కళ్ళలోని కన్నీటిని తుడవటమే స్వాతంత్ర్యం ప్రధాన లక్ష్యం' అని గాంధీ అన్నమాటలో ఈ విషయం ప్రస్ఫుటమౌతున్నది.

ఆ విధంగా భారత జాతీయవాదం ప్రత్యేక లక్షణం కలిగివున్నది. అంతేకాక ఇలాంటి జాతీయవాదాన్ని అంతకు ముందు ప్రపంచం చూడలేదు. అది ఆవశ్యకంగా ప్రజాతంత్ర

జాతీయవాదం 'జాతి' ఔన్నత్యంపై కాకుండా ప్రధానంగా 'ప్రజల' సంక్షేమంపైనే తన దృష్టిని సారించింది. 'ప్రతి భారతీయుడి కళ్ళలోని కన్నీటిని తుడవటమే స్వాతంత్ర్యం ప్రధాన లక్ష్యం' అని గాంధీ అన్నమాటలో ఈ విషయం ప్రస్ఫుటమౌతున్నది.

యుతంగా ఉండటమే కాక సమభావంతో కూడిన జాతీయవాదంగా ఉన్నది. అలా భారత జాతీయవాదం ఇంతకు ముందు వివరించిన విస్తరణకు ప్రాకులాడే ఐరోపా జాతీయవాదానికి చెందిన మూడు అంశాలకూ భిన్నమైనది. ఇలా చెప్పటమంటే ఇదొక మహత్తర సృష్టిగా పంచ రంగుల్లో చూపాలని నాకు లేదు. దీనిలో కూడా అంతర్గతంగా విస్తరణకు ప్రాకులాడే అంశాలున్నాయి. ఈ విస్తరణ కాంక్ష హద్దుమీరి నప్పుడు అది 'జాతి నిర్మాణం' ప్రక్రియను ప్రతికూలంగా ప్రభావితం చేస్తుంది. దీన్ని గురించి నేను తరువాత వివరిస్తాను. ఇది కనీసంగానైనా విజయవంతం కావాలంటే దీనికి అందరినీ కలుపుకుపోయే ప్రజాతంత్ర జాతీయవాద లక్షణం ఉండాలి. వలస పాలన అంతం అయినప్పటికీ జాతీయవాదానికి సంబంధించిన ఈ ప్రతిపాదన ఏవిధంగానూ మారదు.

వేలాది ప్రజల హననానికి దారితీసిన దేశ విభజన నేపథ్యంలో గాంధీ తన చివరి రోజుల్లో కాంగ్రెసు నాయకుల సంశయాలకు వ్యతిరేకంగా పాకిస్తాన్‌కు ఇవ్వవలసిన మొత్తాన్ని పూర్తిగా భారతదేశం చెల్లించవలసిందేనని చెప్పినప్పుడు ఆయన 'జాతి వ్యతిరేకి' కాదు. వలస వ్యతిరేక పోరాటానికి చెందిన ప్రజాస్వామిక 'జాతీయవాదం' విలువలకు అనుగుణంగానే ఆయన అలా చేశాడు. ఈ జాతీయవాదానికి సహనం, సర్దుబాటు, విభేదాలున్నప్పుడు సంప్రదింపులు జరపటం వంటి లక్షణాలు కేంద్రకంగా ఉంటాయి. అంతేగాని ప్రజావాణిని అణచటం, ఆధిపత్యం చెలాయించటానికి క్రూరమైన బలప్రయోగం చేయటం దీని లక్షణం కాదు. దేశంలో ఏదో ఒక ప్రాంతంలో భారతదేశానికి వ్యతిరేకంగా నినాదాలు చేసినప్పుడు, ఆ నినాదాలు ఉగ్రవాదాన్ని, హింసను ప్రేరేపించనప్పుడు కాలంచెల్లిన వలస పాలన నాటి దేశద్రోహ చట్టాలను ప్రయోగించి అణచివేతకు పాల్పడకుండా వైరుధ్యాన్ని అధిగమించాలనే లక్ష్యంతో అలాంటి సందర్భాన్ని ఆత్మవిమర్శకు, విశ్లేషణకు ఉపయోగించాలని ఈ

> వలస వ్యతిరేక పోరాటానికి చెందిన ప్రజాతంత్ర జాతీయ వాదం వాస్తవ రూపం దాల్చటం అంత సులభం కాదు. అసమానతలను పెంపొందిస్తూ పేదరికాన్ని సృష్టించే అడ్డూ అదుపూలేని పెట్టుబడిదారీ వ్యవస్థ వల్ల ప్రజాతంత్ర జాతీయవాదం వాస్తవ రూపం దాల్చడానికి కావలసిన ఆర్థిక చట్రం ఏర్పాటు కాజాలదు.

జాతీయవాదం డిమాండ్ చేస్తుంది.

వలస పాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటానికి నాయకత్వం వహించిన, భారత రాజ్యానికి పునాదిగా ఉన్న ప్రజాతంత్ర భారతీయ జాతీయవాదానికి ప్రత్యామ్నాయంగా మొదటగా వివరించిన విస్తరణను కోరే ఐరోపా జాతీయ వాదాన్ని బిజెపి అమలుచేసే ప్రయత్నం చేయటం ఆందోళన కరం. ఐరోపా జాతీయవాదానికి చెందిన 'జాతి', 'జాతి వ్యతిరేకత'లనే పదజాలాన్ని ఉపయోగిస్తూ భారత జాతీయ వాద అస్తిత్వాన్నే బిజెపి తిరస్కరించటం మరీ దారుణం. వలస వ్యతిరేక పోరాటానికి చెందిన ప్రజాతంత్ర జాతీయ వాదం వాస్తవ రూపం దాల్చటం అంత సులభం కాదు. అసమానతలను పెంపొందిస్తూ పేదరికాన్ని సృష్టించే అడ్డూ అదుపూలేని పెట్టుబడిదారీ వ్యవస్థ వల్ల ప్రజాతంత్ర జాతీయవాదం వాస్తవ రూపం దాల్చడానికి కావలసిన ఆర్థిక చట్రం ఏర్పాటు కాజాలదు. ఈ వాస్తవాన్ని గాంధీ, నెహ్రూ, అంబేద్కర్ వంటి ప్రధాన నాయకులు(ఇందుకు సంబంధించి వీరి అవగాహన వేరువేరుగా ఉన్నప్పటికీ) గుర్తించారు. అయితే ప్రభుత్వ నియమనిబంధనలు, బలమైన ప్రభుత్వ రంగం ఉన్నప్పటికీ పెట్టుబడిదారీ వ్యవస్థ దేశంలో వేళ్ళూనింది. ప్రపంచీకరింపబడిన ద్రవ్య పెట్టుబడి ఆధిపత్య స్థానం లోకి రావటంతో నయా ఉదారవాద విధానాలను అవలంభించటం వల్ల అచిరకాలంలోనే ఈ పరిమితులు కూడా తొలిగాయి. విస్తరణను కోరే జాతీయవాదాన్ని అనుసరించ టానికీ, దేశంలో నయా ఉదారవాద పెట్టుబడిదారీ వ్యవస్థ ఆవిర్భవించటానికీ మధ్య స్పష్టమైన సంబంధం ఉన్నది. వీటిలో మొదటి దాన్ని ప్రోత్సహిస్తూ రెండవ దానికి బిజెపి దాసోహమంటోంది. ఏమైనప్పటికీ విస్తరణను కోరే జాతీయ వాదాన్ని అనుసరించే పార్టీ అధికారంలోకి రావటానికి ఎలాంటి కుట్రపూరితమైన పరిస్థితులైనా కారణం కావచ్చు గాక అలాంటి జాతీయవాదం భారత జాతి నిర్మాణానికి చేటు తెస్తుంది.

**అత్యుత్తమ సంస్థల వినాశనం**

ముందుగా ఒక స్పష్టమైన విషయాన్ని పరిశీలిద్దాం. పూణే ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం, బరోడాలోని ఎమ్ఎస్ విశ్వవిద్యాలయంలోని ఫైన్ ఆర్ట్స్ విభాగం విద్యార్థులను ఈ ప్రభుత్వం బెదిరిస్తున్నది. దేశంలోని అత్యుత్తమ విద్యా సంస్థలలో ఈ విశ్వవిద్యాలయా లున్నాయి. వీటిని నాశనం చేస్తే అభివృద్ధి చెందిన దేశాలలోని విద్యాలయాలపై ఆధారపడే దుస్థితికి దేశం దిగజారుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే 'జాతీయవాదం' పేరుతో మన దేశాన్ని అభివృద్ధిచెందిన దేశాలపై ఆధారపడేలా చేస్తున్నాము. సహనానికి బదులుగా అణచివేతకు ప్రాధాన్యతనిచ్చే విస్తరణ కాంక్ష గల జాతీయవాదాన్ని బిజెపి అనుసరిస్తున్నది.

విస్తరణ కాంక్ష గల జాతీయవాదం ప్రజాస్వామ్యాన్ని, వాక్ స్వాతంత్ర్యాన్ని పరిమితం చేయటమే కాకుండా అల్లరి మూకలు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకునేలా చేస్తుంది. ఆదర్శ భావాలున్న విద్యార్థులపై దేశద్రోహ నేరారోపణలు చేయటం జరుగుతుంది. వారిపై అభూత కల్పనలతో కూడిన ఆరోపణలుచేసి ప్రజల దృష్టిలో వారి పరువుప్రతిష్టలను దిగజార్చటం జరుగుతుంది. దీనికి ప్రతిగా అనివార్యంగా అదే స్థాయిలో ప్రతిస్పందనలు వస్తాయి. క్లుప్తంగా చెప్పాలంటే అలాంటి విస్తరణ కాంక్ష గల జాతీయవాదం అణచివేత-తీవ్ర ప్రతిఘటన-మరింత అణచివేత అనే విషవలయాన్ని సృష్టిస్తుంది. మనలాంటి వర్ధమాన దేశంలోని 'జాతి నిర్మాణం' ఈ సంక్షోభాన్ని అధిగమించగలదనుకోవటం భ్రమే అవుతుంది. నిజానికి వర్ధమాన ప్రపంచమంతా 'విఫల రాజ్యాల'తో నిండి ఉన్నది. ఈ 'విఫల రాజ్యాల' వెనుక అభివృద్ధి చెందిన దేశాల హస్తం ఉందని అందరికీ తెలుసు. అయితే అంతర్గత ఘర్షణలను ప్రోత్సహించే రూపంలో ఈ దేశాల జోక్యం ఉంటుంది. విస్తరణ కాంక్ష గల జాతీయవాదం సరిగ్గా దీనినే ఉత్పన్నమయ్యేలా చేస్తుంది.

ఐరోపాకు చెందిన విస్తరణ కాంక్ష గల జాతీయ వాదానికి, మన దేశంలో అమలవుతున్న దాని నకలుకు ఒక ప్రధానమైన తేడా ఉన్నది. విస్తరణను కాంక్షించే ఐరోపా జాతీయవాదం గుర్తించిన 'అంతర్గత శత్రువు' అత్యంత అల్ప సంఖ్యాకులు(నాజీ జర్మనీ విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది. జర్మన్ జనాభాలో యూదులు కేవలం 0.7 శాతమే ఉన్నారు). అదే భారతదేశంలో అత్యంత విశాల ప్రజానీకాన్ని విస్తరణను కాంక్షించే జాతీయవాదం 'అంతర్గత శత్రువు'గా గుర్తించింది. అలాంటి 'జాతీయవాదం' వల్ల సామాజిక విచ్ఛిత్తి చాలా పెద్ద ఎత్తున జరుగుతుంది. భారతదేశం 'విఫల రాజ్యం'గా మారే దుస్థితిని తప్పించుకోవాలంటే అలాంటి 'జాతీయవాదాన్ని' ఆదిలోనే అదుపు చేయాలి. ◆

# భావ ప్రకటనా స్వేచ్ఛ నాగరికతకు పునాది



జస్టిస్ ఓ.చిన్నపరెడ్డి

భావ ప్రకటనా స్వేచ్ఛ రాజ్యాంగం హామీనిచ్చిన అత్యంత విలువైన అకాంక్షితమైన హక్కుల్లో ఒకటి. ఈ హక్కు కింద సమాచారం తెలుసుకోవడానికి, అందించడానికి కూడా అవకాశం వుంది. అంటే తెలుసుకోవడానికి తెలియజేయడానికి అన్నమాట. ఈ హక్కే లేకపోతే మానవ జాతి పురోగమనమే లేదు. జాన్ మిల్టన్ ప్రసిద్ధమైన తన ఏరియోపగాటికాలో గట్టిగా ప్రకటించినదిదే' నా అంతరాత్మానుసారం స్వేచ్ఛగా తెలుసుకోవడానికి, ప్రకటించడానికి, వాదించడానికి నాకు స్వేచ్ఛ నివ్వండి. అదే అన్ని స్వేచ్ఛల కన్నా మిన్న' *(1643 లో పార్లమెంటు ఆమోదించిన లైసెన్సింగు ఉత్తర్వును వెనక్కు తీసుకోవలసిందిగా కోరుతూ జాన్ మిల్టన్ ప్రచురించిన విజ్ఞప్తి)*

రాజ్యాంగ పరిషత్తులో చర్చల సందర్భంగా కొంతమంది సభ్యులు పత్రికా స్వాతంత్రం గురించి ప్రత్యేకంగా పొందుపర్చాలని అభిప్రాయపడ్డారు. కాని బిఎన్‌రావు, బిఆర్.అంబేద్కర్‌లు అది కూడా భావ ప్రకటనా స్వేచ్ఛలో భాగమే గనక ప్రత్యేకంగా ప్రస్తావించాల్సిన అవసరం లేదని భావించారు. ఐక్యరాజ్యసమితి ప్రకటనలో సూటిగా వున్న భావ ప్రకటనా స్వేచ్ఛ అన్ని స్వేచ్ఛలకూ గీటురాయి వంటిది. మానవ హక్కులకు సంబంధించి యూరోపియన్ కోర్టులో విచారణకు వచ్చిన ప్రసిద్ధమైన తలిడొమైడ్ కేసులో భావ ప్రకటనా స్వేచ్ఛకు అత్యధిక ప్రాధాన్యత లభించింది. కోర్టు ముందు విచారణలో వున్న గొప్ప ప్రజా ప్రయోజన కేసుకు సంబంధించి కూడా పత్రికలకు మంచి చెడ్డలు చర్చించే హక్కు వుంటుందని పేర్కొనబడింది.

అమెరికాలో రాజ్యాంగానికి మొదటి సవరణే ' వాక్‌స్వాతంత్రానికి, లేదా పత్రికా స్వేచ్ఛకు భంగం కలిగించే ఎలాటి చట్టాన్ని కాంగ్రెస్ చేయకూడదు' అని పేర్కొన్నారు. మార్క్సిజం, సోషలిజం, కమ్యూనిజం వంటి భావాలు వ్యాపించడానికి ఇది దోహదం చేయొచ్చని కొందరు జడ్జిలు సందేహాలు వ్యక్తం చేసినప్పుడు జస్టిస్‌బ్రాండిస్,హొమ్స్‌లు విట్నీ వర్సెస్ క్యాలిఫోర్నియా కేసులో దృఢంగా దాన్ని పునరుద్ఘాటించారు.

"మనుషులు తమ సమర్థతలు స్వేచ్ఛగా పెంపొందించుకోనివ్వడమే రాజ్యం పరమార్థమని మన స్వాతంత్రం సాధించిన వారు విశ్వసించారు. ప్రభుత్వం నిరంకుశాధికారంపై గాక బాహాటంగా పనిచేసే శక్తులవైపు వుండాలని తలచారు. స్వేచ్ఛ అనేది ఒక మార్గమని లక్ష్యమని కూడా వారు భావించారు. సంతోషానికి రహస్యం స్వేచ్ఛ అనీ, స్వేచ్ఛ వెనక రహస్యం ధైర్యమని వారు విశ్వసించారు. రాజకీయ సత్యం అన్వేషించాలంటే విస్తరించాలంటే మీరు కోరుకున్న విధంగా ఆలోచించడం, ఆలోచనకు అనుగుణంగా మాట్లాడ్డం తప్పనిసరిగా వుండాలని భావించారు.... . దానివల్ల ఏదో తీవ్రమైన నష్టం కలుగుతుందన్న భయం ఒక్కటే వాక్స్వాతం త్రాన్ని సమావేశ స్వేచ్ఛను నిరోధించడానికి సమర్థనగా వుండ జాలదు. మనుషులు మంత్రగత్తెలకు భయపడి మహిళలను సజీవదహనం చేశారు. అహేతుకమైన భయాల నుంచి మనుషులను విముక్తి చేయడం వాక్స్వాతంత్రం

యొక్క ఒక విధి. వాక్‌స్వాతంత్ర్యాన్ని నిరాకరించాలంటే దాన్ని అమలుచేయడం వల్ల చాలా తీవ్రమైన చెడు జరుగుతుందనే సహేతుకమైన కారణం వుండాలి. ఆ ప్రమాదం అనివార్యంగా సంభవిస్తుందన దానికి సరైన ఆధారం వుండాలి.." తర్వాత మరో కేసులో జస్టిస్ బ్లాక్ దీన్నే మరింత నొక్కి చెప్పారు.

భారత దేశానికి సంబంధించి 19(1)(ఎ) అధికరణం కింద భావ ప్రకటనా స్వేచ్ఛను చర్చించే కేసు తొలికేసు క్రాస్‌రోడ్స్ పత్రిక విషయంలో వచ్చింది. దానికోసం రాజ్యాంగానికి ఒక సవరణ చేయవలసి వచ్చింది. విదేశాలతో స్నేహ సంబంధాలు, ప్రజా జీవిత వ్యవస్థ, సభ్యత, నైతికత లేదా కోర్టు ధిక్కారం, పరువు నష్టం, కవ్వింపు ప్రచారం వంటివాటిని చట్టవిరుద్ధమైనవిగా నిర్ధారించింది. ముందస్తు సెన్సార్ షిప్ పత్రికా స్వేచ్ఛకు భంగకరమని 1950లో బ్రిజ్‌భూషణ్ వర్సెస్ ఢిల్లీ ప్రభుత్వం కేసులో కోర్టు తీర్పు నిచ్చింది. అయితే అడ్వర్టయిజ్‌మెంట్ అనేది ఈ పరిధిలోకి రాదని హమ్‌దర్ద్ దవఖానా వర్సెస్ కేంద్రం కేసులో సుప్రీం కోర్టు చెప్పింది. అయితే 1995లో టాటా ప్రెస్ లిమిటెడ్ వర్సెస్ మహానగర్ టెలిఫోన్ నిగమ్ లిమిటెడ్ కేసులో ఇందుకు భిన్నమైన తీర్పువచ్చింది. న్యూస్ ప్రింట్ సరఫరాకు సంబంధించి 1962లో నడిచిన సకాల్ పేపర్స్ వర్సెస్ కేంద్రం కేసులో మాత్రం పెద్ద చిన్న పత్రికలకు న్యూస్‌ప్రింట్ సరఫరాలో పాటించవలసిన సమసూత్రాలను వివరించింది. అదే 1988లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలకు సంబంధించి కూడా న్యూస్‌ప్రింట్ దిగుమతిపై కస్టమ్స్ విషయంలో పాటించదగిన సూత్రాలను పేర్కొన్నది. అయితే పత్రికా స్వేచ్ఛ కూడా సహేతుకమైన ఆంక్షలకు లోబడివుంటుందే గాని నిర్నిబంధమైనది కాదని సుప్రీం కోర్టు 1986లో చెప్పింది. ఆ సందర్భంగా జస్టిస్ ఎ.పి. సేన్ ఇలా అన్నారు:

భావ ప్రకటనా స్వేచ్ఛ పత్రికా స్వాతంత్రం వాటికవే విలువైనవి. అంతేగాక ఒక ప్రజాస్వామిక ప్రభుత్వానికి అవి మౌలిక పునాదులు. ప్రభుత్వానికి సంబంధించిన సమస్యలు దేశం ముందున్న వివిధ విషయాలు కేవలం బహిరంగ చర్చద్వారా ఆలోచనలు కలబోసుకోవడం ద్వారా మాత్రమే పరిష్కారమవుతాయి. ప్రజాస్వామ్యానికి పత్రికా స్వేచ్ఛ ప్రాతిపదిక అవుతుంది. ప్రజా ప్రాధాన్యత గల ఏ విషయం పైనైనా స్వేచ్ఛగా మాట్లాడే హక్కును ఎవరి నుంచి లాక్కోవడానికి అవకాశం వుండదు. ఈ హక్కు వ్యక్తి స్వాతంత్రానికి మూల స్తంభం. దీన్ని కోర్టులు ఎప్పుడూ కంటికిరెప్పలా కాపాడుతున్నాయి...." ఇలా చెప్పిన తర్వాత జస్టిస్ సేన్ కొన్ని ప్రత్యేక పరిస్థితులలో దానిపై పరిమితులు విధించే అంశాన్ని కూడా ప్రస్తావించారు. అమెరికా సుప్రీం కోర్టు కూడా వాక్ సభా స్వాతంత్రాలు ప్రాథమికమైనవే గాని అఖండమైనవి కావని పేర్కొన్న సంగతి ఇక్కడ గుర్తు చేయాలి.

ఇక్కడ ప్రస్తావించినవన్నీ పత్రికాధిపతులు వేసినవే. వారు పత్రికా స్వేచ్ఛను తమ వ్యాపార ప్రయోజనాల కోసం వాడుకుంటారు. అదే సమయంలో పాత్రికేయుల భావ స్వేచ్ఛను నియంత్రిస్తారనడంలో సందేహం లేదు. ఇంతవరకూ ఒక జర్నలిస్టు తనకు ఆ హక్కు లేకుండా చేశారంటూ కేసు వేసిన ఉదంతం లేదు. 1972లోనే జస్టిస్ మాథ్యూ దేశ ప్రజలు ప్రభుత్వ విషయాలు తెలుసుకోవడానికి తెలియజేయడానికి హక్కు కలిగి వున్నారని చెప్పారు(అప్పటికి సమాచార హక్కు చట్టం రాలేదు) 1975లో ఇందిరాగాంధీ ఎమర్జన్సీ కాలంలో సెన్సార్ షిప్ అమలు జరిగింది. ఆ సమయంలో కూడా సుప్రీం కోర్టు దానిపై భిన్నాభిప్రాయం వెలిబుచ్చింది. కేవలం వ్యతిరేకతో అసమ్మతో వున్నంత మాత్రాన ప్రచురణను నిషేధించే హక్కు లేదని చెప్పింది.

ప్రముఖ రచయిత బొల్లింగర్ చెప్పినట్టుగా భావ ప్రకటనా స్వేచ్ఛకు మూల స్తంభాల్లో ఒకటి ఇతర విశ్వాసాలు నమ్మకాల పట్ల సహనం. భారత దేశం వంటి సువిశాలమైన సంక్లిష్టతా భరితమైన దేశంలో ఇది మరింత అవసరం. జెహోవా సాక్షులు కేసును చూస్తే ఇతరుల విశ్వాసాలకు సంబంధించిన సహనం భారతీయ సంస్కృతికి ఒక పునాది అని అర్థమవుతుంది. ఒక పాఠశాలలో జాతీయ గీతం పాడటం తప్పని సరి కావచ్చు. కాని తాము దేవుడి ప్రార్థనా గీతం తప్ప మరేదీ పాడబోమని జెహోవా సాక్షులు అనే తెగకు చెందిన వారి పిల్లవాడు చెప్పాడు గనక తనను బహిష్కరిస్తా మంటే చెల్లదు. ఎస్. రంగరాజన్ వర్సెస్ పిజెరాం అనే కేసులో రిజర్వేషన్లను వ్యతిరేకమైన భావాలు వున్నాయి గనక ప్రదర్శించరాదని కొందరు అభ్యంతరం తెలిపారు. హైకోర్టు వారి వాదనను ఆమోదించగా సుప్రీంకోర్టు కొట్టివేసింది. ఒక అభిప్రాయాన్నివ్యక్తం చేసినంత మాత్రాన ప్రదర్శన నిలిపివేయనవసరం లేదని భావ ప్రకటనా స్వేచ్ఛకు రాజ్యాంగం రక్షణ కల్పించిందని పేర్కొంది.

కాబట్టి భావ ప్రకటనా స్వేచ్ఛ మన సమాజంలోని మౌలిక స్వాతంత్రాల్లో ఒకటిగా వుంటుందనడం నిర్వివాదాంశం. ఈ స్వేచ్ఛకు రక్షణ కల్పించనిదే ఏ సమాజం కూడా నాగరిక సమాజం అనిపించుకోదు. ఇతరుల దృక్పథాలపై విమర్శ అనేది ప్రజాస్వామ్య సారాంశం, దానికి ఒక ప్రధాన పునాది. అందుకే దాన్ని ఐక్య రాజ్యసమితి మౌలిక స్వాతంత్రాల్లో ఒకటిగా గుర్తించింది.

***(సంక్షిప్త స్వేచ్ఛానుసరణ, ప్రచురణ 2008)***

# శ్రమ పట్ల గౌరవమే విముక్తి మార్గం

దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ

భారతీయ తాత్విక సంప్రదాయం అంటే ఇప్పుడు కొంతమంది ఛాందసులు చెప్పే మూఢ నమ్మకాలు, వర్ణవ్యవస్థ మాత్రమే కాదు. ప్రాచీన కాలంలోనే చార్వాకులు లోకాయతుల వంటి వారు అందుకు ఎదురు తిరిగి పోరాడారు. హేతుబద్ధమైన ప్రశ్నలు లేవనెత్తారు. న్యాయ వైశేషికులు కూడా ఆ కోవకు చెందిన వారే. అయితే ఆధిపత్యాన్ని అసమానతలను ప్రశ్నించడం నూతనంగా ఆలోచించడం వరకూ బాగానే వున్నా మనిషికి నిజమైన విముక్తి ఎలా లభిస్తుందని చెప్పడంలో ఆ వాదాలు పెద్దగా ముందుకుపోలేదంటాడు మహా పరిశోధకుడు తత్వవేత్త దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ. వారు పాత నమ్మకాలను ప్రశ్నించారు గాని మానవ విముక్తి మార్గం లేదా లక్ష్యం తెలుసుకోలేకపోయారు. ఫలితంగా వారి వూహాత్మక పరిష్కారాలు చెబుతూ ఆచరణలో అప్పుడున్న సామాజిక వ్యవస్థకు సమర్థకులుగానే తయారైనారు.



ముక్తిపట్ల భావవాద దృక్పథం ఇంకా ఇంకా బలపడింది. తర్కాన్ని, అణువాదాన్ని సమర్థించేవారి చైతన్యంలో అది లోతుగా పాతుకుపోయింది. స్మృతికారుల ఆదేశాలు వారికి పవిత్ర ప్రమాణాలుగా తయారయ్యాయి. వీటన్నింటితో మలిదశ న్యాయ వైశేషికుల బూటకత్వం ఎంతగా బలపడిందంటే వారు తమ ద్వంద్వ ప్రయోజనాన్ని అంటే శాస్త్రం, శాస్త్ర వ్యతిరేకం అనే రెండు అంశాలను ఇముడ్చుకోవాలన్న స్పృహను కోల్పోయారు. ఈ రెంటిని ఊహాజనితంగా కలిపివుంచవచ్చునని ఆత్మవంచన చేసుకున్నారు. దాన్ని నిరూపించేందు కోసం తమ పాండిత్యాన్నంతా ఉపయోగించారు.

మలిదశ న్యాయ వైశేషికుల వలెనే భావవాద వ్యతిరేకులైన ఇంకా అనేక మందికి కూడా ఈ పరిస్థితి ఎదురైంది. భారతీయ తత్వశాస్త్రంలో భావవాద ప్రభావాన్ని తొలగించేందుకు వారెంత కృషి చేసినప్పటికీ విముక్తి భావన విషయంలో మాత్రం వారు దానిలోనే ఉండిపోయారు. గట్టి భౌతికవాదులు లేక లోకాయతులు మాత్రమే ఇందుకు మినహాయింపులు. వారు మోక్షం అన్న మాటే బూటకమని కొట్టిపారేశారు. ముక్తిపట్ల ప్రతికూల దృక్పథాన్ని వారు త్రోసిపుచ్చినప్పటికీ తమదైన ఒక సానుకూల దృక్పథాన్ని పెంపొందించడంలో మాత్రం చాలా వెనకే వుండిపోయారు. సాంప్రదాయక భారతీయ తత్వశాస్త్రం

నిజంగా విఫలమైంది విముక్తి సమస్యకు పరిష్కారం చూపడంలోనే. అయితే ఈ వైఫల్యానికి కారణం తెలుసుకోవచ్చు. ఆ విధంగా ఈనాటి భారతీయులు తమ తాత్విక సాంప్రదాయాల్లోగల ఈ తీవ్రమైన పరిమితి అధిగమించవచ్చు. మధ్యయుగాల భారతదేశంలోని మహాలోచనాపరులు తమ కాలాన్ని అది రూపొందించే సామాజిక సంబంధాలను దాటి ఆనాటి యూరప్‌లోని వారి సహచరులకన్నా ముందుకు పోగలరని ఊహించలేము. అలాంటపుడు ఈ సమస్యకు పరిష్కారం ఇంకా పరిపక్వం కాని ఆర్థిక రాజకీయ పరిస్థితులలో దాగి వుండగా వారెంత సమర్థులైనప్పటికీ కేవలం ఆ తాత్వికుల బుర్రలలో నుండి - ఎలా ఉద్భవిస్తుంది?

ప్రపంచ తాత్విక చరిత్రలో ముక్తిపట్ల సానుకూల దృక్పథం ఇద్దరు ప్రవక్తలలోనూ, ఇద్దరు ఆధునిక శాస్త్ర ప్రచారకులలోనూ కనిపిస్తుంది. వారే బేకన్, డెస్కార్ట్‌స్‌లు. ఈ నూతన దృక్పథం వారిలో ప్రేరేపించబడటానికి కారణం ఏమిటి? సమాజ పరివర్తనలో శాస్త్రం చేపట్టిన నూతన పాత్ర అందుకు కారణం. సమాజం అప్పటికి వర్తకులు, నావికులు, ఉత్పత్తిదారులు, రాజకీయ వేత్తల నాయకత్వంలో ఉంది. క్లుప్తంగా చెప్పాలంటే తొలి ప్రగతిశీల బూర్జువా వర్గం క్రింద వుంది.

"అంతేగాక మధ్యతరగతి పెరుగుదలతోపాటు విజ్ఞాన శాస్త్రం, ఖగోళ శాస్త్రం, యంత్ర విజ్ఞానం, భౌతిక శాస్త్రం, శరీర శాస్త్రం, వాస్తు శాస్త్రం గొప్పగా పునరుద్ధరణ చెందాయి. పారిశ్రామిక ఉత్పత్తి విస్తరణతో బూర్జువా వర్గానికి ప్రకృతిలోని వస్తువుల, ప్రకృతి శక్తుల శక్తి చలన రూపాల భౌతిక ధర్మాలను గురించి తెలుసుకొనవలసిన అవసరం ఏర్పడింది. అప్పటి వరకు విజ్ఞాన శాస్త్రం చర్చి చేతి పనిముట్టుగా వుండేది. విశ్వాసం గీచిన గీత దాటేందుకు అనుమతి వుండేది కాదు. అందుకే శాస్త్రంలో హేతువుకు చోటు లేకుండా పోయింది. ఇంకా ఇపుడు శాస్త్రం చర్చిపై తిరుగుబాటు చేసింది. అది లేకుండా బూర్జువాలకు పని జరగదు గనుక వారు కూడా తిరుగుబాటులో చేరారు".

శాస్త్ర విజ్ఞానవేత్తలను ఉత్తేజపరచిన ఈ నూతన విముక్తి భావనను అర్థం చేసుకోవాలంటే బూర్జువా విప్లవానికి అవసరమైన పోరాట దళంగా వున్న శ్రామిక బాహుళ్యం పాత్రను కూడా గమనించాలి. అయితే మిగిలిన సమాజ మంతటికీ ప్రతినిధులుగా చెప్పుకుంటున్న ఫ్యూడల్ కులీనుల పట్ల గల

> బహుశా శ్రమించే చేతులు వెనక్కు నెట్టివేయబడిన తర్వాత నాగరికత అభివృద్ధికి సంబంధించిన అంశాలన్నీ మెదడుకు మాత్రమే వదలివేయబడి తర్వాత విముక్తికి సంబంధించిన నూతన దృక్పథంలో సరైన స్థానం సంపాదించుకున్నాయి.

వ్యతిరేకత ఏమిటి? దోచుకునేవారికి, దోచుకోబడిన వారికి సంపన్నులైన సోమరులకు, నిరుపేదలైన కార్మికులకు మధ్య మామూలుగా వుండే వైరుధ్యం అలాగే వుండేది. ఈ పరిస్థితులే బూర్జువా ప్రతినిధులను ఏదో ఒక ప్రత్యేక వర్గ ప్రతినిధులుగా గాక మొత్తం బాధిత మానవాళి కంతటికీ ప్రతినిధులుగా ముందుకొచ్చేందుకు అవకాశం కల్పించాయి. మొదటి నుండీ కూడా బూర్జువా వర్గం తన విరుద్ధాంశంతో ముడిపడే వున్నది. వేతన కార్మికులు లేనిదే పెట్టుబడిదారుడు వుండడు. అలాగే మధ్యయుగాల గిల్డు వ్యాపారులు ఆధునిక బూర్జువా వర్గంగా పెంపొందగా, గిల్డులలోని శ్రామికులు, బయట పనిచేసే రోజు కూలీలు శ్రామికవర్గంగా తయారయ్యారు. ఈ మొత్తం ప్రజలను కలుపుకొని బూర్జువా వర్గం కులీనవర్గంపై పోరాడింది. ఆ దశలోని వివిధ శ్రామికవర్గాలకు తాను ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చెప్పుకున్నది. అయినప్పటికీ ప్రతి గొప్ప బూర్జువా ఉద్యమంలోనూ ఆధునిక శ్రామిక వర్గ స్వతంత్ర వెల్లువలు కూడా స్వల్పంగానో, అధికంగానో కానవచ్చాయి.

మధ్యయుగ ప్రపంచాన్ని మార్చడంలో పీడిత ప్రజలు నిర్వహించిన పాత్రను గురించిన ఈ విశ్లేషణ ద్వారా మనం శాస్త్ర ప్రవక్తలు విముక్తి పట్ల నూతన దృక్పథాన్ని పెంపొందించుకోవడానికి దోహదం చేసిన అంశమేమిటో గ్రహించవచ్చు. ప్రకృతి పట్ల కలిగిన నూతన అవగాహన అంటే ప్రకృతిపై ఆధిపత్యం అని వారు అర్థం చేసుకున్నారు. నూతన విజ్ఞానమంటే నూతన శక్తి. అయితే ఉపనిషత్తు ఆలోచనాపరులు ఊహించినట్లుగా విజ్ఞానంలో ఎలాంటి మహత్యం లేదు. విజ్ఞానం అన్నది శక్తిగా మారేందుకు చురుగ్గా కృషిచేయాలి. ఈ మార్పు సాధించగలిగిన ఒకే ఒక వర్గం కార్మికవర్గమే.

ఈ నూతన దృక్పథం క్లుప్తంగా చెప్పాలంటే విజ్ఞానంపట్ల నూతన అవగాహన. దీన్ని జె.డి. బర్నాల్ ఇలా వివరిస్తాడు.

"మనిషి ప్రపంచంతో యధాతథంగా రాజీ పడేందుకు సాధనంగా వుండే స్థితి మారింది. ప్రపంచం ఎప్పుడూ అలాగే

వుంటుందని, ప్రళయం వస్తుందని అనుకునే బదులు ప్రకృతి శాశ్వత సూత్రాలను గురించిన జ్ఞానంతో దాన్ని అదుపు చేయవచ్చుననే ఆలోచనను మార్చివేసింది. ఈ నూతన దృక్పథం పాదార్థిక సంపద ఫలితమే.....

ఏదో ఒక పరిశోధన ఎంత ప్రయోజనకరమైనదైనప్పటికీ అలాంటిది ప్రకృతి అవగాహనకు సంబంధించి కొత్త విలువలు ప్రసరింప చేయగలిగితే అవి సరిహద్దులు, ప్రాంతాలు, ప్రస్తుత జ్ఞానపు పరిధులు దాటి విస్తరిస్తుంది. మరింతగా దాన్ని విస్తరింపచేసి ఇప్పటివరకు గుప్తంగా, రహస్యంగా ఉన్నదాన్ని వెలుగులోకి తెస్తుంది.

బహుశా శ్రమించే చేతులు వెనక్కు నెట్టివేయబడిన తర్వాత నాగరికత అభివృద్ధికి సంబంధించిన అంశాలన్నీ మెదడుకు మాత్రమే వదలివేయబడి తర్వాత విముక్తికి సంబంధించిన నూతన దృక్పథంలో సరైన స్థానం సంపాదించుకున్నాయి.

బేకన్ ఈ దృక్పథాన్ని ఇలా వివరిస్తాడు.

"మానవాళికి అందిన ప్రయోజనాలలో ఈ కొత్త కళలు, నిర్మాణాలు, సరుకుల పరిశోధనకన్నా గొప్పదేమీ లేదు. మానవ జీవితాన్ని మెరుగుపరుస్తాయి. పురాతన కాలంలోని ఆది మానవులలో పరిశోధనలు, సృజన చేసేవారిని ఎంతో గౌరవించి దేవతల సరసన కూర్చోపెట్టేవారు. నగరాల స్థాపనలు, శాసనకర్తలు, ప్రజా పీడిత నియంతలపై తిరుగుబాటు దార్లు, ఆ వర్గాల యోధులు తెచ్చిన మంచి మార్పులు చాలా స్వల్పమని పరిమితుల్లోనే, కొద్దికాలమే అమల్లో వుండేవి. కాని ఒక పరిశీలనకు కృషి, అంత ఆర్భాటం లేకపోయినా దీర్ఘకాలంపాటు ప్రతిచోటా ప్రభావం చూపేది.

ఆనాటి నుండి ఏదో ఒక పరిశోధన ఎంత ప్రయోజనకరమైనదైనప్పటికీ అలాంటిది ప్రకృతి అవగాహనకు సంబంధించి కొత్త విలువలు ప్రసరింప చేయగలిగితే అవి సరిహద్దులు, ప్రాంతాలు, ప్రస్తుత జ్ఞానపు పరిధులు దాటి విస్తరిస్తుంది. మరింతగా దాన్ని విస్తరింపచేసి ఇప్పటివరకు గుప్తంగా, రహస్యంగా ఉన్నదాన్ని వెలుగులోకి తెస్తుంది. అలాంటి కృషి చేయగలిగిన వ్యక్తి (నా దృష్టిలో) మొత్తం మానవ జాతికి మేలు చేసినవాడవుతాడు. విశ్వంలో మానవ సామ్రాజ్యాన్ని విస్తరింపచేస్తాడు. విముక్తి పొందుతాడు. అవసరాలపై ఆధిపత్యం సాధించి లొంగదీసుకుంటాడు."

తన స్వీయ పరిశోధనల గురించి డెస్కార్టిస్ ఇలా అంటాడు.

"జీవితానికి చాలా మేలు చేసే విజ్ఞానాన్ని అవి అందజేశాయి. విద్యాలయాల్లో బోధించే ఊహాజనితమైన ఈ తాత్విక చింతనకన్నా నిప్పు, నీరు, గాలి, తారా మండలం వగైరాలకుగల శక్తి, చలనం తెలియజెప్పే వాస్తవిక తత్వశాస్త్రం కనుగొనడానికి స్పర్శలు మన చుట్టూ వుండే ఇతర పదార్థాల గురించి తెలుసుకోవచ్చు. మన చేతి పని వారి గురించి తెలుసుకున్నట్లే ఈ విషయంలో మనం తెలుసుకోగలుగుతాము. మన అవసరాలకు వాటిని వినియోగించుకుంటూ ప్రకృతికి అధినేతలం, భోక్తలం కావచ్చు."

మనిషి ప్రపంచంపై "మానవ సామ్రాజ్య ప్రకటన కర్త అవుతాడు. విముక్తి సాధించే మొనగాడుగా, విజేతగా, పరిసరాలను లొంగదీసుకునేవాడుగా తయారవుతాడు. మనిషి ప్రకృతికి అధినేతగా, భోక్తగా తయారవుతాడు". 17వ శతాబ్దం ద్వితీయ భాగంలో ఇలాంటి మాటలు చెప్పడం ఎంత సాహసం? అయినా ఈ మాటలు ఎంత దూరదృష్టితో చెప్పినవో ఇప్పటికే రుజువైపోయింది. అధినేతలుగా, భోక్తలుగా మానవులు ఈనాడు భౌతిక ప్రకృతిని అదుపు చేస్తున్నారు. దీన్ని మరింత విస్తరించుకునే అభివృద్ధి వేగం పెరుగుతున్నది. దాన్ని ఇపుడు అంచనా కట్టడం కూడా కష్టమే. మన దృష్టి పథంలోనే ఒక నూతన యుగం విస్తరించే అవగాహన లభించనున్నాయి. క్లుప్తంగా చెప్పాలంటే విముక్తి సానుకూల అర్థం సంతరించుకొన్నది.

అయితే ఇదంతా బొమ్మకు ఒకవైపు మాత్రమే. అలాంటి యుగం మన ముందు ఆవిష్కృతం అవుతున్నప్పటికీ మనిషి ఇప్పటికీ వర్గాలుగా విభజించబడిన ప్రపంచంలోనే జీవిస్తున్నాడు. దారిద్ర్యం, అజ్ఞానం, క్రౌర్యం ఇదివరకటికన్నా ఎక్కువగా కానవస్తున్నాయి. మొత్తం మానవాళి తుడిచిపెట్టబడే ప్రమాదం కూడా ఉన్నది. ఆధునిక తత్వశాస్త్ర పితామహులు ఎంతో సాహసంతో ఊహించి చెప్పినట్లు భౌతిక ప్రకృతిపై లభ్యమైన ఆధిపత్యం వల్లనే ఇది కూడా జరుగుతున్నది. అలాంటపుడు ఈ నూతన దృక్పథంలోనే ఏమైనా పొరపాటు ఉన్నదా?

ఇటీవలి చరిత్ర ఈ ప్రశ్నకు అంతకంతకూ స్పష్టంగా సమాధానం ఇస్తుంది. అలాగే చరిత్రపట్ల సరైన అవగాహనగల తాత్వికులు, శాస్త్రజ్ఞులు దీనికి స్పష్టంగా జవాబు చెప్తున్నారు.

> ప్రకృతి శాస్త్రాలకు, సామాజిక శాస్త్రాలను ఎలా సంధానపరచాలో మార్క్సిజం బోధిస్తుంది. భౌతిక ప్రకృతిపై అదుపును సామాజిక వాస్తవ పరిస్థితిపై అదుపుతో అనుసంధానం చేస్తుంది. ఆ విధంగా మాత్రమే విముక్తికి సంబంధించిన ఒక నూతన దృక్పథం ఉద్భవిస్తుంది.

పెట్టుబడిదారీ యుగం ప్రారంభమౌతున్న దశలో తత్వవేత్తలకు విముక్తిపట్ల ఈ నూతన దృక్పథం ఏర్పడింది. ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని ఉనికిలోకి తెచ్చిన యుగమది. ఆ కాలానికి చెందిన ప్రగతి శీల బూర్జువాలకు ఉత్పత్తి విధానంలో మహత్తరమైన విప్లవం తెచ్చేందుకు అది అవసరమైంది. ఒక ప్రత్యేక తరగతికి గాక మొత్తం బాధిత మానవాళికి ప్రతినిధులుగా వారు ముందుకొచ్చారు. బ్రహ్మాండమైన సామాజిక మార్పుకోసం పోరాడే దళంగా వుండదగింది. ఆ కాలంలోని పీడిత ప్రజలు మాత్రమే గనుక బూర్జువాలు ఇలా అందరితరపునా పోరాడేవారుగా కనిపించేందుకు ప్రయత్నించారు. ఆ విధంగా ఆధునిక శాస్త్రంతోపాటు ఆధునిక కార్మికవర్గం కూడా ఉనికిలోకి వచ్చింది. చారిత్రకంగా పెట్టుబడిదారీ యుగాన్ని తెరమరుగు చేయడంతోపాటు దాన్ని కూలద్రోయడం ఆ రెండింటికీ కూడా కర్తవ్యమైంది.

పెట్టుబడిదారీ విధానం మొదట విజ్ఞాన శాస్త్రానికి అవకాశం కల్పిస్తే ఆ తర్వాత విజ్ఞాన శాస్త్రం పెట్టుబడిదారీ విధానాన్ని అవసరమైనదిగా చేసిందని మన కాలంలోని ఒక గొప్ప శాస్త్రజ్ఞుడు రూపొందించిన అద్భుతమైన సూత్రీకరణ. వివరాలలోకి వెళ్ళేందుకు మనకిపుడు అవకాశంలేదు. కాని ఒక విషయాన్ని గుర్తించడం అవసరం. ఇది వరకెన్నడూ లేనంత తీవ్ర దారిద్ర్యం, అజ్ఞానం, క్రౌర్యాలతో విభజితమైన సమాజం ప్రపంచం ఈనాడు మనముందున్నది. శాస్త్ర విజ్ఞానం పెట్టుబడిదారీ విధానాన్ని అనవసరమైనదిగా ప్రకటించడానికి ఇది చాలు. ఇప్పటివరకు ఎరగనంత సమృద్ధిని సాధించే అవకాశాలు పెరుగుతున్నపుడు పెట్టుబడిదారీ విధానం అత్యాధునిక దశకు చేరాక ఉత్పాదక శక్తుల పెరుగుదలకు ఆటంకం అవుతుంది. తయారైన ఉత్పత్తిలో కూడా అంతకంతకూ అధికభాగం ప్రజల నిజమైన అవసరాలను తీర్చే బదులు నిరర్థకమైన దండగమారి కార్యక్రమాలవైపు మరల్చేందుకు ప్రయత్నిస్తుంది, విధ్వంస కార్యక్రమాలకు మరలుస్తుంది.

క్లుప్తంగా చెప్పాలంటే అది ఇంటా, బయటా నిరుద్యోగులు పనిలేని యంత్రాలు దుర్భర పరిస్థితులతో సహజీవనం చేసే దశను సృష్టిస్తుంది. సంపదలతోపాటే దారిద్ర్యం పెరుగుతుంది. అస్థిరమైన, హానికరమైన రీతుల్లో అపారమైన ఆర్థిక వనరులు వృథా చేయబడతాయి. దేశంలోనూ, వెలుపలా వేలాది మంది నోర్లు నొక్కివేయబడతాయి. విదేశాలలోని కోటానుకోట్ల మందిపై మారణహోమం సాగించడానికి పథకాలు అమలుజరుగుతాయి. ఇంతకన్నా ఎక్కువ చెప్పాల్సిన అవసరంలేదు. ఏమైనప్పటికీ పెట్టుబడిదారీ విధానమన్నది అత్యంత అసమర్థమైన వ్యవస్థగా మారిపోయింది. అది ప్రకృతిపై మానవుడు సాధించిన ఆధిపత్యాన్ని అత్యంత దారుణంగా దుర్వినియోగపరచేదిగా తయారైంది. పెట్టుబడిదారీ విధానంవల్లనే శ్రామిక జనబాహుళ్యం సంఘటిత కార్మికవర్గంగా రూపొందింది. ఆ వర్గమే శాస్త్ర విజ్ఞానాన్ని సోషలిస్టు వ్యవస్థ అనే హేతుబద్ధ ప్రాతిపదికపై పునరావాసం కల్పించేందుకు పూనుకుంటుంది. కార్మికవర్గం పెరుగుదలతోపాటే ఒక నూతన తత్వశాస్త్రం కూడా పెంపొందుతుంది. అదే మార్క్సిజం. ప్రకృతి శాస్త్రాలకు, సామాజిక శాస్త్రాలను ఎలా సంధానపరచాలో మార్క్సిజం బోధిస్తుంది. భౌతిక ప్రకృతిపై అదుపును సామాజిక వాస్తవ పరిస్థితిపై అదుపుతో అనుసంధానం చేస్తుంది. ఆ విధంగా మాత్రమే విముక్తికి సంబంధించిన ఒక నూతన దృక్పథం ఉద్భవిస్తుంది. బేకన్, డెస్కార్టస్ తదితరులలో అంకురించిన నూతన స్వాతంత్ర్య దృక్పథం సంపూర్ణ ప్రాధాన్యత సంతరించుకుంది. ఈ నూతన తాత్విక చింతన వెలుగులో కార్మికవర్గం ప్రపంచంలోని అత్యధిక భాగంలో ఇప్పటికే పెట్టుబడిదారీ విధాన శృంఖలాలను బద్దలు కొట్టింది. ప్రకృతిపై మనిషి ఆధిపత్యం నిజమైన మనిషి నిజమైన సౌభాగ్యానికి స్త్రీ, పురుషులు, పిల్లల సంక్షేమానికి ఎలా దోహదపడుతుందో నిరూపించింది. కేవలం 50 ఏళ్ళ స్వల్ప వ్యవధిలో అదంతా జరిగింది. ప్రపంచ యుద్ధంలో అంతులేని విధ్వంసం

మహోపాధ్యాయులు మానవ సంబంధాలతో సహా ప్రకృతిని అర్థం చేసుకోవడానికి, అదుపు సాధించడానికి చూపించిన మార్గం శ్రామిక ప్రజలకు అమూల్యమైనది. వారి ప్రయోజనాలు, ఆకాంక్షలు దానితో ఏకీభవిస్తాయి. ఈ దృష్టితోనే ఎంగెల్స్ జర్మన్ కార్మికవర్గం జర్మన్ సాంప్రదాయక తత్వశాస్త్ర వారసురాలు" అని ప్రకటించాడు.

సంభవించినప్పటికీ పెట్టుబడిదారీ ప్రపంచం నుండి అర్థంలేని ఆయుధ పోటీ వ్యయం రుద్దబడినప్పటికీ యుద్ధ ప్రమాదం పొంచివున్నప్పటికీ ఇదంతా సాధించబడింది.

అయితే నూతన వ్యవస్థగా వచ్చిన సోషలిజం సాధించిన విశిష్టత పెట్టుబడిదారీ దేశాల్లోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాల్లోనూగల శ్రామిక ప్రజానీకానికి తెలియకుండా చేసేందుకు అతి విస్తారమైన ప్రచార యంత్రాంగం వినియోగించుకున్నారు. పైగా అక్కడి లోపాలనే భూతద్దంలో చూపుతూ వ్యతిరేక ప్రచారం చేశారు. (ఈ వ్యాసం సోవియట్ విచ్ఛిన్నానికి ముందు రాసింది) . విద్యను, చరిత్ర గమనాన్ని వెనక్కు మళ్ళించేందుకు లేదా వక్రీకరించేందుకు శాస్త్ర విజ్ఞాన పద్ధతులను ముఖ్యంగా ప్రసార సాధనాలను దుర్వినియోగపరచడం జరుగుతున్నది. అన్నిరకాలైన గందరగోళాలను సృష్టించేందుకు శ్రామిక ప్రజానీకాన్ని విముక్తికి సంబంధించిన నూతన దృక్పథాన్నుండి, దాన్ని అమలు జరిపే ఆచారణాత్మక కార్యక్రమాన్నుండి దారి మళ్ళించేందుకు కొత్త కొత్త తత్వశాస్త్రాలు ముందుకు కొనిరాబడుతున్నాయి. ఇవన్నీ ఉన్నప్పటికీ శాస్త్ర విజ్ఞానంవల్ల కలిగిన నూతన సాంకేతిక అవకాశాలు ప్రయివేటు ప్రయోజనాలకు, దోపిడీకి సంబంధించిన ఛిద్ర సాంఘిక చట్రంలో ఇమిడి వుండేందుకు నిరాకరిస్తున్నాయి. అందువల్లనే ఈ సాంకేతిక అవకాశాలను కూడా దెబ్బతీసే కుట్రలు జరుగుతున్నాయి. శాస్త్ర విజ్ఞానాన్ని దానికే వ్యతిరేకంగా ఉపయోగించుకోవడం జరుగుతున్నది. అయితే తక్షణ దశలోని ప్రమాదాలను మనిషి తట్టుకోగలగడం సాధ్యమా?

ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వవలసింది అధి భౌతిక మేథస్సు కాదు. ప్రపంచంలోని కోటానుకోట్ల మందిని కొల్లగొట్టే వంచనను వారు అనుమతించబోతున్నారా? ఆ మోసం మీదనే ఆధారపడి ప్రస్తుత సామాజిక వ్యవస్థ ఉనికిలోకి వచ్చింది. అది అసంబద్ధమైనదిగా నిర్హేతుకమైనదిగా తయారైంది. ఈ వ్యవస్థను సమాజ పరిణామంలో కేవలం ఒక తాత్కాలిక ఘట్టంగానే వారు పరిగణిస్తున్నారా? స్వాతంత్ర్యానికి సంబంధించి నూతన దృక్పథాన్ని దోపిడీకి గురయ్యే శ్రామిక ప్రజల ఆచరణ ద్వారా నిజం చేసేందుకు పూనుకుంటారా?

చరిత్ర ఈ రోజు మన ముందుకు తెచ్చిన అతి కీలకమైన ఈ ప్రశ్న మన స్మృతికారులు శూద్రులుగా ఎవరినైతే పేర్కొన్నారో ఆ అసంఖ్యాక శ్రామిక స్త్రీ పురుషుల దగ్గరకు మనలను తీసుకువెళుతుంది. ఈ శూద్రులు ముక్తికి అర్హులు కారని మన తాత్వికులు నొక్కి చెప్పారు. చరిత్ర దాన్ని పరిహసించింది. మనిషి నిజంగా విముక్తి సాధించాలంటే ఈ జనబాహుళ్యం లేక శూద్రులు మాత్రమే అందుకు నిర్ణయాత్మక నిర్మాతలౌతారు. ఇది ప్రపంచం నుండి ఊహాజనితమైన పలాయనంగా లభించే ముక్తికాదు. ప్రపంచాన్ని మార్చడం ద్వారా లభ్యమయ్యే నిజమైన విముక్తి దృక్పథం.

సాంప్రదాయక భారతీయ ఆలోచనా స్రవంతిలో సజీవమైన దాన్ని వారసత్వంగా, ధైర్యంగా స్వీకరించి సృజనాత్మకంగా అభివృద్ధి చేయాలంటే అది ఈ దేశంలోని పీడిత ప్రజలకు మాత్రమే సాధ్యమౌతుంది. అదేవిధంగా వారే దానిలోని నిర్జీవ భాగాన్ని తుడిచిపెడతారు. దేశాన్ని మార్చే చారిత్రక కర్తవ్యంలో ఇది నిజంగా భాగమే. ఇందుకోసం సత్యంపట్ల నిర్భయ జిజ్ఞాస అవసరమౌతుంది. అది శ్రామికవర్గ ఉద్యమానికి వెలుపల వుండడం జరగని పని. శ్రామికేతర ఉద్యమాలలో ఇతరేతర అంశాలపట్ల ప్రాకులాట వుంటుంది కనుక రాజీపడే ధోరణి కూడా వుంటుంది. ఇందుకు భిన్నంగా మన మహోపాధ్యాయులు మానవ సంబంధాలతో సహా ప్రకృతిని అర్థం చేసుకోవడానికి, అదుపు సాధించడానికి చూపించిన మార్గం శ్రామిక ప్రజలకు అమూల్యమైనది. వారి ప్రయోజనాలు, ఆకాంక్షలు దానితో ఏకీభవిస్తాయి.

**(దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ 40 ఏళ్ల కిందట అంటే 1976లో రాసిన భారతీయ తత్వశాస్త్రంలో భావవాదం, భౌతిక వాదం పుస్తకం ఆధారంగా)**

# భారతదేశం: విశాలమూ, సంకుచితమూ





అమర్త్యసేన్

ఇది ఎలాటి దేశం అని అడగాల్సిన బాధ్యత భారతీయులమైన మనపైన వుంది. దాంతోపాటే ఈ సమయంలో అది మననుంచి ఏమి కోరుతుంది అనే ప్రశ్న కూడా వుత్పన్నమవుతుంది. అమాయకంగా ధ్వనించే ఇలాటి బృహత్ ప్రశ్నలు సంధించడం ఒక విధంగా నిర్లక్ష్యమేనని నాకు తెలుసు. అయితే నేను ఇతర రకాలైన ప్రమాదకర కార్యకలాపాలలో పాల్గొనే వాణ్నికాదు- అంటే సింహాలను మచ్చిక చేయడం, కత్తి మీద సాము, పార్లమెంటరీ ఎన్నికలలో పోటీ వగైరా పనులేమీ చేయను. అందువల్ల ఈ విషయంలో నేను కాస్త సాహసం, మూర్ఖత్వం చూపించవచ్చునను కుంటాను.

జాతీయత వంటి అనుబంధాలు కేవలం హక్కులకు సంబంధించిన సమస్యలు కావు. వాటిలో బంధాలు, బాధ్యతలు కూడా వుంటాయి. ఇండియా కూడా త్వరితమైన మార్పులకు లోనవుతున్న దేశం. ఇది ఎలాటి దేశం అని అడగాల్సిన బాధ్యత భారతీయులమైన మనపైన వుంది. దాంతోపాటే ఈ సమయంలో అది మననుంచి ఏమి కోరుతుంది అనే ప్రశ్న కూడా వుత్పన్నమవుతుంది. .

నిజంగానే ఇండియా ఒక పెద్ద దేశం. జనాభా అధికం. ఈనాడు సాధారణంగా అందరూ అనుకునేట్లుగా భారతదేశంలో జనాభా అధికంగా వుండటం కొత్త విషయమేమీ కాదు. దానివల్ల ఇండియా పెద్దది కాలేదు. నిజంగా చూస్తే 18 వ శతాబ్దికి ముందు ప్రపంచంలో ఇండియా జనాభా నిష్పత్తి ఈనాడున్న దానికన్నా చాలా ఎక్కువగా వుండేది. 18,19 శతాబ్దాలలో ఇండియా, చైనాల కన్నా ముఖ్యంగా ఐరోపాలో జనాభా చాలా వేగంగా పెరిగింది. పాశ్చాత్య దేశాలనబడే వాటి జనాభా శాతం ఆనాడు గణనీయంగా పెరిగింది. 20 వ శతాబ్దంలో ఆ పెరుగుదల నియంత్రించబడింది. ఆ దశలో ఇండియాతో సహా కొన్ని పాశ్చాత్యాతేర దేశాలలో జనాభా పెరిగింది. ఈ శతాబ్ది ప్రథమార్థంలో జనాభా స్థితి సమతుల్యం కావచ్చునని ఐరాస నివేదిక చెబుతున్నది. అయితే అంత మాత్రాన భారతదేశంలో జననాలరేటు తగ్గించాల్సిన అవసరాన్ని తక్కువ చేయడం లేదు. (పైగా సామాజిక పర్యవసనాలను బట్టి చూస్తే అది చాలా తక్షణావసరం కూడా) ఇండియా జనాభా కొత్త లక్షణం కాదని గుర్తించడమే ముఖ్యమని మాత్రమే నేను చెప్పదలుచుకున్నది.

ఇండియా పెద్దది అనడానికి కారణం కేవలం దాని జనాభా మానవాళిలో అధికశాతంగా వుండటం ఒక్కటే కాదు. దాని భిన్నత్వం కూడా కారణమే.

అనేక భాషలు, సంస్కృతులు,మతాలు, పూర్తి విభిన్నమైన పద్ధతులు, అపార వైవిధ్య భరితమైన విశ్వాసాలు, అత్యంత విభిన్నమైన ఆచారాలు అన్ని వున్నాయి. ఇంతటి భిన్నత్వం కనిపించడం వల్లనే చాలామంది ఇండియాను ఒక దేశంగా భావించగలమా అని ఆశ్చర్యపోతుంటారు. విన్‌స్టన్ చర్చిల్ ఇండియా ఈక్వెడార్ కన్నా పెద్ద చెప్పుకోదగిన దేశమేమీకాదని ప్రకటించాడు. ఒక దేశమనే భావనలో ఎంతటి వైవిధ్యం ఇమిడివుండొచ్చనేది వూహించడంలో ఆయన వూహాశక్తి దెబ్బతినడమే ఇందుకు కారణం. ఇండియాను బ్రిటిష్ పాలనే సృష్టించిందని అప్పట్లో వారు నమ్మేవారు. ఆ భావన ఇప్పటికి ఏదో మేరకు వుంటూనే వుంది. ఇందులో తాము సృష్టికర్తలమనే భావనే కాదు. ఒక ఏకీకృత దేశపు హద్దులలో అంత వైవిధ్యం ఇముడుతుందా అని ఆశ్చర్యపోయే లక్షణం కూడా వుంది.

2

భారత దేశ గతాన్ని, ప్రస్తుతాన్ని అనేక కోణాలనుంచి చూడొచ్చు. కాని ప్రధానంగా ఇక్కడి సంవాద సంప్రదాయంపై కేంద్రీకరించవలసిన అవసరం వుందని నేను భావిస్తాను. నేటికీ వర్తించే విషయం అది. భారత దేశపు మేధాపరమైన ఔన్నత్యం ఈ సంప్రదాయంతో ముడిపడివుందని నేను అనుకుంటాను. దాని గురించి 'సంవాదశీల భారతీయుడు' అనే పుస్తకంలో వివరంగా చర్చించాను. ఇక్కడ క్లుప్తంగా పేర్కొంటాను.

భారత దేశంలో చాలా కఠోరమైన వాదనా సంప్రదాయం వుందనేది నిర్వివాదాంశం. 19 వ శతాబ్దంలో రాజా రామ్ మోహన్‌రాయ్ రాసిన ఒక తీవ్రమైన కవిత వింత గొల్పుతూ నాకు గుర్తు వస్తుంది.

నీ మృత్యువు సంభవించే రోజు ఎంత భయానకంగా వుంటుందో వూహించు

అందరూ మాట్లాడుతూనే వుంటారు- నీవు మాత్రం తిరిగి వాదించలేవు

మన వాదనా సంప్రదాయం మనకు ఒక విధంగా విచిత్రమైన పేరు తెచ్చింది. మనకు మాట్లాడ్డం, వాదించడం ఇష్టం. అల్‌బెరూనీ 11 వ శతాబ్దిలో రాసిన పుస్తకంలో భారతదేశంలో గణితం, ఖగోళం వంటి ప్రశంసనీయమైన అంశాలు చాలా వున్నాయని , కాని తమకు ఏ మాత్రం తెలియని విషయాల గురించి కూడా అనంతంగా వాదించే

**నిజంగానే ఇండియా ఒక పెద్ద దేశం. జనాభా అధికం. ఈనాడు సాధారణంగా అందరూ అనుకునేట్టుగా భారతదేశంలో జనాభా అధికంగా వుండటం కొత్త విషయమేమీ కాదు. దానివల్లనే ఇండియా పెద్దది కాలేదు. నిజంగా చూస్తే 18 వ శతాబ్దికి ముందు ప్రపంచంలో ఇండియా జనాభా నిష్పత్తి ఈనాడున్న దానికన్నా చాలా ఎక్కువగా వుండేది.**

భారతీయుల సామర్థ్యమే తనకు అన్నిటికన్నా ఎక్కువగా నచ్చిందని అన్నాడు.

బాగా ఎక్కువగా మాట్లాడ్డం భారత దేశంలో కొత్తగా వచ్చిన అలవాటేమీకాదు. రామాయణ, మహాభారతాలను ఇలియాడ్, ఒడిస్సీ(అనే గ్రీకుపురాణాల)తో తరచూ పోల్చుతుంటారు .కాని ఆ రెండు కలిసి ఎంత వుంటాయో అంతకంటే కూడా ఒక్క భారతమే ఏడురెట్లు ఎక్కువగా వుంటుంది. ఒక కథలోంచి మరో కథలోకి వెళ్తూ ఎడతెగని సంభాషణలతో సంవాదాలతో అది సాగిపోతుంటుంది. మహాభారతంలో భాగమైన భగవద్గీత హిందూతాత్వికతలో అతి ముఖ్యమైన భాగం. వాస్తవానికి అది ఒక పొడుగాటి వాదనే.

మొదట్లో కేవలం వాదించుకోవడానికే ఇండియాలో కొన్ని సార్వత్రిక సమ్మేళనాలు జరిగేవి. బౌద్ధ "మండలులు" అనేవాటిలో వేర్వేరు దృక్కోణాలు కలిగిన వారు తమ విభేదాలపై వాదించుకునేవారు. బుద్ధుడి మరణానంతరం రాజగృహలో 2500 ఏళ్ల కిందట ఇలాటి ఒక పెద్ద గోష్టి మొదటిసారిగా జరిగింది. ఇందులో అతి పెద్దది, మూడవది క్రీ.పూ. మూడవ శతాబ్దిలో అశోక చక్రవర్తి హయాంలో రాజధాని పాటలీపుత్రం(నేటి పాట్నా)లో జరిగింది. ఇలాటి బహిరంగ చర్చల్లో అనుసరించాల్సిన నియమనిబంధనలపై అశోకుడు ఒక నియమావళిని కూడా ప్రకటించాడు. సంయమనం వుండాలని, మన వర్గాన్ని కీర్తించుకోవడం ఎదుటివారి భావనను కించపర్చడం తగదని ఇంకా ఇలాటి అంశాలు దానిలో పొందుపరచాడు. వాద వివాదాలతో నిమిత్తం లేకుండా అన్ని వర్గాలు పరస్పర గౌరవం కలిగివుండాలని ఆయన పేర్కొన్నాడు. తర్వాత చాలా కాలనికి 1590 లలో అక్బర్ కూడా ఇలాగే ప్రకటించాడు.

ఇండియాలో సహనం చాలా కీలకమని చెప్పాడు. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, పార్శీలు, జైనులు, ఆఖరుకు నాస్తికులు కూడా పద్ధతి ప్రకారం పరస్పరం చర్చించుకునే ఏర్పాటు చేశాడు. మరోవైపున చూస్తే ఆనాటికి ఐరోపాలో దైవదూషణపై విచారణకాండలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. గియార్దినా బ్రూనోను సజీవ దహనం చేస్తున్నారు. అదే సమయంలో అక్బర్ ఆగ్రాలో మతాంతర చర్చ జరిపిస్తున్నాడు.

ఇలాటి బహిరంగ చర్చా పద్ధతి ప్రజాస్వామ్య వికాసంలో కీలకపాత్ర వహిస్తుంది. ప్రపంచమంతటా ఇలాటి తర్క పద్ధతి వుంది. కాని ఇండియాలో ఇది చాలా నాణ్యమైన పద్ధతిలో అభివృద్ధి చెందడం ఒక అదృష్టం. ఈ వాదనా పద్ధతిని అన్ని తరగతుల ప్రజలూ ఒకే విధంగా ఉపయోగించుకోలేదన్నది వాస్తవమే. కాని అన్ని తరగతుల వారూ బాగా ఉపయోగించుకోవడానికి ఎంతో అవకాశముండింది. గార్గి, మైత్రేయ వంటి మహిళా సంవాదకుల నుంచి అత్యంత నిశితమైన ప్రశ్నలు రావడం ఆసక్తికరమైన విషయం. కుల వ్యవస్థను ప్రశ్నించిన స్వరాలూ వున్నాయి. మహాభారతంలో భృగువు కులవిభజన అనేది రంగు వంటి శారీరక అంశాలకు సంబంధించినదని చెబుతాడు.. అయితే ఒకే కులంలో వేర్వేరు రంగుల వారుండడాన్ని భరద్వాజుడు ఎత్తిచూపుతాడు. (రంగును బట్టి కులమే నిజమైతే అన్ని కులాలు సంకర కులాలేనని వ్యాఖ్యానిస్తాడు). దానికి తోడు మరో గట్టి ప్రశ్న వేస్తాడు: కోర్కెలు, కోపాలు, భయాలు, ఆకలి, శ్రమ వంటి లక్షణాలు మనందరిలో కనిపిస్తాయి. మరి అలాటప్పుడు మనం కులపరమైన విభజన ఎలా చేస్తాం అని అడుగుతాడు. నాలుగు వర్ణాలకు చెందిన వారూ దేవుని పిల్లలే కనక వారిలో వారి మధ్య కుల తేడాలుండకూడదని భవిష్య పురాణం చెబుతుంది. ఈ సందేహాలు ఆనాడు విజయం సాధించి వుండకపోవచ్చు. కాని సంప్రదాయ సంవాదాల మధ్య అవి పూర్తిగా అదృశ్యమై పోలేదని కూడా గుర్తించాలి.

ఆ తర్వాతి దశకు వస్తే 15 శతాబ్దిలో హిందూ భక్తి కవులు,ముస్లిం సూఫీ కవులు కుల వర్గ పరమైన తేడాలను ఎలుగెత్తి నిరసించారు. ఈ కవులలో చాలామంది సామాజికంగా ఆర్థికంగా దిగువ స్థాయి నుంచి వచ్చినవారే. ఈ కృత్రిమమైన విభజనలకు విలువలేదని చెప్పేందుకు వారు ప్రయత్నించారు. ఈ ధిక్కార స్వరాల్లో చాలా భాగం శ్రామికవర్గం నుంచే రావడం ప్రాధాన్యత గల విషయం. వారందరిలో గొప్పవాడైన కబీర్

**ఇండియాలో సహనం చాలా కీలకమని చెప్పాడు. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, పార్శీలు, జైనులు, ఆఖరుకు నాస్తికులు కూడా పద్ధతి ప్రకారం పరస్పరం చర్చించుకునే ఏర్పాటు చేశాడు. మరోవైపున చూస్తే ఆనాటికి ఐరోపాలో దైవదూషణపై విచారణకాండలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. గియార్దినా బ్రూనోను సజీవదహనం చేస్తున్నారు. అదే సమయంలో అక్బర్ ఆగ్రాలో మతాంతర చర్చ జరిపిస్తున్నాడు.**

చేనేత కుటుంబం నుంచి వచ్చాడు. దాదూ ఒక పత్తి కూలీ. రవిదాస్ చెప్పులు కుట్టేవాడు. సేనా ఒక మంగలి. ఇలాగే మిగిలినవారూనూ. ఈ ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహించిన వారిలో అనేకమంది మహిళలు. పసిద్ధి గాంచిన మీరాబాయి మాత్రమే కాదు- అండాళ్ దయా బాయి, సహజాబో బాయ్, క్షేమ తదితరలు కూడా.

### 3

సంవాద సంప్రదాయం పట్ల తగినంత శ్రద్ధ పెట్టకపోవడం గతాన్ని వక్రీకరించి వ్యాఖ్యానించడానికి దారితీస్తుంది. నేటి భారతదేశాన్ని అర్థం చేసుకోవడానికి ప్రాచీన భారతం తెలియాలనే వాదననే తీసుకోండి. ఇది రాజకీయంగా చాలా ఉద్రిక్తమైన సమస్య. సమకాలీన రాజకీయాలను చూస్తే ప్రాచీన భారతం పట్ల అత్యుత్సాహం హిందుత్వ ఉద్యమం నుంచి వస్తుంది. భారతీయ సంస్కృతికి సంకుచితమైన భాష్యం చెప్పే ప్రయత్నమిది. ఇండియాపై ముస్లింలు దాడి చేయకముందు చరిత్రను విడదీయడానికి వీరు ప్రయత్నించారు (అంటే క్రీపూ 3000 సం. నుంచి 2000 సం వరకూ) మరోవైపున సమకాలీన భారతం పట్ల సమైక్యతావైఖరి తీసుకోవాలనుకునే వారు ప్రాచీన కాలంలోకి తొంగిచూడడం పట్ల అంతులేని అపనమ్మకం పెంచుకున్నారు. ఉదాహరణకు హిందుత్వ కార్యకర్తలు క్రీపూ2000 నాటి వేదాలను భారత దేశపు నిజమైన వారసత్వమని వర్ణిస్తారు. వారు వేర్వేరు అవసరాలకు రామాయణాన్ని ఉపయోగించుకుంటారు. పవిత్రుడైన రాముడు ఫలనా చోటే పుట్టాడంటూ బలవంతంగా మసీదును కూలగొట్టడం లాటి చర్యలకు మద్దతుగానూ, హిందూ విశ్వాసాలు, నమ్మకాలకు ఆధారభూతంగానూ దాన్ని ప్రయోగిస్తారు. మరో వైపున సమైక్యతా వాదులేమో వేదాలు, రామాయణం లౌకిక భారతపు సమకాలీన జీవితంలో హిందూ చొరబాట్లుగా పరిగణిస్తారు.

భారతదేశపు సుదీర్ఘ వైవిధ్యభరిత చరిత్ర అందించిన ఫలాల కన్నా హిందూ పురాణాలకు పెద్దపీట వేయడం లోని పాక్షికత్వాన్ని సమైక్యతా వాదులు ప్రశ్నించడంలో తప్పేమీ లేదు. నేటి భారతదేశపు బహుమత, లౌకిక జీవితంలో అలాటి పాక్షికమైన ఎంపికల వల్ల కలిగే ప్రతికూల ఫలితాలను వారు ఎత్తిచూపడం కూడా సరైందే. దేశ జనాభాలో ఎనభై శాతం పైగా హిందువులైనప్పటికీ గణనీయమైన ముస్లిం జనాభా కూడా ఇక్కడుంది.( ప్రపంచంలోనే మూడవ పెద్ద ముస్లిం జనాభా. బ్రిటిష్ ఫ్రెంచి జనాభాలు రెంటినీ కలిపిన దానికన్నా ఇదే ఎక్కువ) అలాగే క్రైస్తవ, సిక్కు, జైన, పార్శీ తదితరులున్నారు. ఇప్పుడు ఇండియాకు ముస్లిం రాష్ట్రపతి, సిక్కు ప్రధాని, క్రైస్తవ నేత నాయకత్వాతన బలమైన పాలకపార్టీ వుండటాన్ని చూస్తే ప్రపంచంలో మరే దేశంలోనూ ఇలాటి పరిస్థితి వుండటం సాధ్యం కాదనిపిస్తుంది. అయితే ఇది ఇండియాకే ప్రత్యేకమైన పరిస్థితి అనుకోవడానికి లేదు.

ఏమైనా ఒక విషయం గమనించాలి. దేశ సమైక్యత, బహుళత్వ సంస్కృతీ దృష్టి గురించి నొక్కి చెప్పవచ్చు. కాని నేటి భారతానికి ప్రాచీన భారతం కూడా చాలా ముఖ్యమేనని గుర్తించాలి. భారతదేశ సంస్కృతిపైన సాహిత్యంపైన ఆలోచనా విధానంపైన పాత కాలపు కావ్యాలు, కథనాలకు చాలా ప్రభావం వుంది. అటు మేధాసంబంధమైన తాత్విక రచనలను, ఇటు జానపదాలను కూడా అవి ఎంతగానో ప్రభావితం చేశాయి. వేదాలు గాని రామాయణం గాని ప్రధానమైనవని భావించడంలో సమస్యేమీ లేదు. అవి ప్రధానమైనవే. అయితే అవి ఎలాటి గ్రంధాలు అనేది అర్థం చేసుకోవడం, వాటిలోనూ విభిన్నమైన వాదోపవాదాలు వున్నాయని తెలుసుకోవడమే అసలు సమస్య.

వేదాలలో శ్లోకాలుంటాయి. మతపరమైన స్తోత్రాలుంటాయి. అయితే వాటితో పాటే కథలూ వుంటాయి. (ఉదాహరణకు జూదగాడి పాట్ల గురించిన అద్భుత కథ వంటివి) అవి ప్రపంచాన్ని గురించి జోస్యాలు చెబుతాయి. ఇంతకుముందే చెప్పుకున్న సంవాద సంప్రదాయం ప్రకారం అవి అనేక క్లిష్టమైన ప్రశ్నలూ వేస్తాయి. అసలు విశ్వం ఎలా సృష్టించబడింది వంటి మౌలిక ప్రశ్నలూ వుంటాయి. ఎవరైనా సృష్టించారా? లేక దానికదే ఏర్పడిందా? అన్నీ తెలిసిన దేవుడంటూ ఎవరైనా వున్నాడా? ఇలాటి శ్లోకాలు ఋగ్వేదంలో వున్నాయి.

నిజంగా ఎవరికి తెలుసు? తెలుసని చెప్పగలవారెవరు? ఈ సృష్టి ఎక్కడి నుంచి వచ్చింది? బహుశా అది తనకు తనే ఏర్పడివుండొచ్చు. అలా జరిగివుండకపోవచ్చు కూడా. అత్యున్నతమైన స్వర్గంలో కూచుని ఇదంతా చూసే వాడికి-వాడికి మాత్రమే తెలుసు. బహుశా వాడికీ తెలియదేమో.

**భారతదేశపు సుదీర్ఘ వైవిధ్య భరిత చరిత్ర అందించిన ఫలాల కన్నా హిందూ పురాణాలకు పెద్దపీట వేయడం లోని పాక్షికత్వాన్ని సమైక్యతా వాదులు ప్రశ్నించడంలో తప్పేమీ లేదు. నేటి భారతదేశపు బహుమత, లౌకిక జీవితంలో అలాటి పాక్షికమైన ఎంపికల వల్ల కలిగే ప్రతికూల ఫలితాలను వారు ఎత్తిచూపడం కూడా సరైందే.**

క్రీపూ 2000 సం. నాటి ఈ ప్రశ్నలూ బలమైన వాదనలూ కూడా భారతదేశపు సుదీర్ఘ సంవాద చరిత్రలో భాగమే. భారతదేశానికి సుసంపన్నమైన నాస్తికత్వ, నిరీశ్వరవాద వారసత్వమూ వున్నాయి. దీనికి దాదాపు 2000 సంవత్సరాల చరిత్ర వుంది. (క్రీపూ600 నాటికి అంటే బుద్ధుని జీవితకాలంలోనే అవి చాలా బలంగా వినిపించాయి) అవి భారతీయ సంస్కృతిలో భాగాలు కూడా. నేను మరోసందర్భం లో చర్చించినట్లుగా అవి అనేక సంప్రదాయ విరుద్ధ ప్రశ్నలను సత్తావాద నైతిక సంబంధమైన ప్రశ్నలను లేవనెత్తాయి.

అలాగే హిందూత్వ రాజకీయ అనుయాయుల సంగతి. మరీ ముఖ్యంగా ఇతర మతాల ప్రార్థనా స్థలాలలో దౌర్జన్యానికి పాల్పడే వారి సంగతి. వారు రాముడు అంటే పవిత్రుడు అన్నట్లు మాట్లాడవచ్చు గాక. కాని రామాయణంలో చాలా వరకూ రాముడు గొప్ప ఇతిహాస నాయకుడుగా వున్నాడు. అనేక గొప్ప లక్షణాలు, కొన్ని బలహీనతలు కూడా వున్నాయి. భార్య సీత విశ్వసనీయతను ప్రశ్నించే ధోరణి కూడా ఆయనలో వుంది. రామాయణంలో జాబాలి ఆయనను దేవుడుగా పరిగణించకపోగా రాముని పనులు బుద్ధిమాలినవని విమర్శిస్తాడు.(మీరు తెలివైన ప్రతిభాశాలి గనక ఈ విమర్శ మరింతగా వర్తిస్తుంది అంటాడు)ఈ ఆరోపణలను ఉపసంహరించుకోవలసిందిగా జాబాలిపై ఒత్తిడి చేసే ముందు వాటిని వివరంగా చెప్పే అవకాశమిస్తారు. దైవారాధన, బలులు, దక్షిణలు ముక్తి వంటి అంశాలను గురించి శాస్త్రాలలో ప్రతిభాశాలులు రాసివుంచారని ,ఇతరులపై పాలన సాగించడానికే అవి రాయబడ్డాయని చెబుతారు. రవీంద్రనాథటాగూరు రామాయణం అద్భుతమైన కథ అని అంటాడు. భారతీయ సాంస్కృతిక వారసత్వంలో అది ఘనమైన

> **భారతదేశపు సుదీర్ఘ వైవిధ్య భరిత చరిత్ర అందించిన ఫలాల కన్నా హిందూ పురాణాలకు పెద్దపీట వేయడం లోని పాక్షికత్వాన్ని సమైక్యతా వాదులు ప్రశ్నించడంలో తప్పేమీ లేదు. నేటి భారతదేశపు బహుమత, లౌకిక జీవితంలో అలాటి పాక్షికమైన ఎంపికల వల్ల కలిగే ప్రతికూల ఫలితాలను వారు ఎత్తిచూపడం కూడా సరైందే. దేశ జనాభాలో ఎనభై శాతం పైగా హిందువులైనప్పటికీ గణనీయమైన ముస్లిం జనాభా కూడా ఇక్కడుంది.**

స్థానం కలిగివుంది. ఆ విధంగా చూడకుండా పాక్షికమైన హిందూ దృక్పథాన్ని నొక్కి చెప్పడం కోసం రామాయణాన్ని వాడుకుంటే, దాన్ని అసాధారణమైన అతీతగాథగా పరిగణిస్తే అప్పుడు దాని సారాంశమే మారిపోతుంది.

భారతదేశంలో అనుమాన ప్రమాణం అనేది వందల ఏళ్ల కిందనుంచి వుంది. దాన్ని పరిత్యజిస్తే గనక భారత దేశ సాంసృతిక చరిత్రను అర్థం చేసుకోవడం చాలా కష్టమవుతుంది. ఘర్షణలు, యుద్ధాలు అపారమైన హింసాకాండకు దారితీసిన నేపథ్యంలోనూ ఇండియాలో తర్క పద్ధతులు చరిత్ర పొడుగునా కనిపిస్తాయి. ఈ విధంగా ఏకకాలంలో ఒకవైపున తార్కిక ఘర్షణలూ మరో వైపున హింసాత్మక సంగ్రామాలు సాగడం వాస్తవం. ఇందులో రెండవ అంశంపైనే కేంద్రీకరించడమంటే నిజమైన ప్రాధాన్యత గల మొదటి దాన్ని విస్మరించడమే అవుతుంది.

భారతదేశంలో ధిక్కార ధోరణిని ఆమోదించడమనేది చిరకాలం సంప్రదాయంగా వున్నదని గుర్తించడం నిజంగా ప్రాధాన్యత గల విషయం. హిందుత్వ వాదులు ప్రాచీనభారతం తమ స్వంతసొమ్ముగా హస్తగతం చేసుకోవడం (దాన్ని భారతీయ సంసృతికి తిరుగులేని పునాదిగా చెప్పడం) కోసం చేసే ప్రయత్నాలను ప్రతిఘటించవలసిందే. అయితే అందుకోసం ఈ దేశంలో ఇంకా అనేక సంసృతులు కూడా వున్నాయని చెప్పడం ఒక్కటే సరిపోదు. ప్రారంభదశ నుంచి కూడా ఇండియాలో రకరకాల భావాలు, విశ్వాసాలతో ఎంతో వైవిధ్యం వుందని చూపించగలగాలి. బౌద్ధులు, జైనులు, నిరీశ్వరవాదులు, నాస్తికులు మాత్రమే కాదు- ఇప్పుడు హిందూయిజంగా చలామణి అవుతున్న దానిలోనూ క్రీపూ 1000 నాటికి వెళ్తే భిన్న పద్ధతులు పాటించేవారు ఉండేవారు. దాదాపు వెయ్యేళ్లు ఈ దేశంలో బౌద్ధం ప్రధాన మతంగా వుండేది. క్రీపూ1000 నాటి చైనా గ్రంథాలు ఇండియాను బౌద్ధ రాజ్యంగా వర్ణిస్తున్నాయి. కనక ఏది ఏమైనా హిందుత్వ శక్తులు కోరుకుంటున్న అవతారంలో ప్రాచీన భారతాన్ని బంధించగం సాధ్యమయ్యే పనికాదు.

## 4

ఒక దేశ సంస్కృతి గురించి లేదా దాని గత చరిత్రను గురించి మాట్లాడాలంటే ఏ అంశాలను ఎంపిక చేసుకోవాలనేది తప్పని సరిగా నిర్ణయించుకోవలసి వుంటుంది. సంవాద సంప్రదాయంతోపాటు ఇతర మార్గాలు కూడా వున్నాయని నాకు తెలుసు. నేను మూడు విలక్షణ కారణాల రీత్యా ఈ పద్ధతిని ఎంపిక చేసుకున్నాను. మొదటిది సంవాద సంప్రదాయానికి గల సుదీర్ఘ చరిత్ర, ప్రస్తుతం సాగుతున్న సంస్కృతీ చర్చల్లో దాన్ని ఒక విధంగా నిర్లక్ష్యం చేయడం నా ఎంపికకు మొదటి కారణం. అంతేకాదు- భిన్నత్వం, చర్చ వంటి పద్ధతులు ప్రత్యక్షంగానో పరోక్షంగానో చాలా వరకు ఆమోదం పొందుతున్నాయి. భారత దేశంలో భిన్నత్వ సంప్రదాయం చెప్పుకోదగినంత విస్తారంగావుంది. అది ప్రజాస్వామ్యం లౌకిక తత్వాల పాత్రను కాపాడ్డంలోనూ సమకాలీన ఆర్థిక చర్చలలోనూ కూడా నేరుగా ప్రభావం చూపుతున్నది.

బహిరంగ వివాదాల పద్ధతి భారతదేశంలో ప్రజాస్వామ్యం ప్రవర్థిల్లడానికి సాపేక్షంగా బాగా దోహదం చేసింది. భారత దేశంలో ప్రజాస్వామ్యానికి గల చారిత్రిక మూలాలను ప్రత్యేకించి పరిశీలించవలసి వుంటుంది. దాన్ని కొనసాగింపుగా గుర్తించడంలో తరచూ లోపం జరుగుతుంటుంది. కేవలం బ్రిటిష్ వారి ప్రభావం వల్లనే ప్రజాస్వామ్యం వచ్చిందనే రీతిలో చెప్పే లక్షణం చాలా మందిలో కనిపిస్తుంటుంది. (అదే నిజమైతే బ్రిటన్ పాలననుంచి విముక్తమైన మరో వంద దేశాలలో కూడా అలాగే జరిగివుండాలి అని తెలిసి కూడా) పాశ్చాత్యేతర దేశాలలో శక్తివంతమైన సజీవమైన ప్రజాస్వామ్యంగా భారతదేశం అసాధారణ చరిత్ర సృష్టించుకుంది. బ్రిటిష్‌పాలన నుంచి స్వాతంత్ర్యం పొందిన వెనువెంటనే దాన్ని నిలుపుకోవడం ఒక్కటే కాదు. ఆ ప్రజాస్వామ్య వ్యవస్థ నిరంతరాయంగా కొనసాగుతూనే వుంది. ప్రజాస్వామ్యం అపహాస్యానికి గురైన చాలా దేశాల అనుభవాలతో పోలిస్తే ఇదెంతో భిన్నమైన ఉదాహరణ.

ఇండియాలో ప్రజాస్వామ్య వికాసానికి అస్తిత్వానికి

ధిక్కార సంప్రదాయం ఎంతో దోహదపడింది. లౌకికతత్వం పెంపొందడంలోనూ, భిన్న మతాల మధ్య రాజ్యం తటస్థత రూపంలో అది స్థిరపడడంలోనూ కూడా ఈ సంప్రదాయం పాత్ర వుంది. అశోకుడు, అక్బర్ చెప్పిన మత సహన సంప్రదాయాలను అనుసరించని రాజులు, చక్రవర్తులు లేరని కాదు. అయినా ఇలాటి నియమాలు ఏర్పడటానికి వెనక వున్న అసాధారణ పరిస్థితులను మనం గుర్తించాలి. ఇటీవలి కాలాల వరకూ కూడా ఐరోపాలో ఇలాటి ప్రకటనలు కనిపించవు.

ప్రజాస్వామ్యాన్ని , లౌకికతత్వాన్ని అమలు పరచడంలో ప్రజా విచక్షణ పాత్ర గురించి సమకాలీన తాత్వికతలో చాలా చర్చ జరిగింది. ప్రత్యేకంగా జాన్ రావల్స్, జర్గెన్ హాబెర్మాస్ ఇందుకు నాయకత్వం వహించారు. రాజకీయ సిద్ధాంత కర్తల్లా గాక ప్రజాస్వామ్య చరిత్ర కారులు ఎక్కువగా బ్యాలెట్లు ఓటింగుపై కేంద్రీకరిస్తారు. కాని భారతదేశంలో సంవాద సంప్రదాయం చేసిన మేలును మరింతగా గుర్తించవలసి వుంది.

ఉదాహరణకు 2300 ఏళ్ల కిందట విజేత అలెగ్జాండర్‌కు, దిగంబర జైన సన్యాసులకు మధ్య సంవాదం నడిచింది. అరియన్ దాన్ని గ్రంధస్తం చేశాడు. చాలా మంది దాన్ని విపరీత సంప్రదాయాలకు, వూహాత్మక దృక్పథాలకు ఉదాహరణగా పరిగణించారు. కాని అది ఏ సందర్భంలో చోటు చేసుకుందనేది అర్థం చేసుకోవాల్సి వుంది

మీరెందుకు నా పట్ల ఇంత నిర్లక్ష్యంగా వున్నారని అలెగ్జాండర్ జైన తాత్వికులను ప్రశ్నించినపుడు ఆయనకు ఇలాటి సామ్రాజ్యవాద వ్యతిరేకమైన సమాధానం లభించింది:

అలెగ్జాండర్ మహారాజా, ఏ మనిషైనా సరే తాను నిలబడగలిగినంత నేల మాత్రమే పొందగలుగుతాడు. మీరూ మా లాటి మానవ మాత్రులే. మీరెప్పుడూ తీరిక లేకుండా గడిపారు. మీ స్వదేశం నుంచి ఇన్ని యోజనాలు తరలి వచ్చారు. ఇది మీకు ఇతరులకూ కూడా చికాకు కలిగించే విషయం. మీరు త్వరలోనే చనిపోతారు. అప్పుడు మిమ్ములను సమాధి చేయడానికి అవసరమైనంత నేల మాత్రమే మీకు చెందుతుంది

అలెగ్జాండర్ ఈ సమానతా బోధనకు ప్రశంసా పూర్వకంగానే ప్రతిస్పందించాడని అరియన్‌మనకు చెబుతాడు. దయాగ్నొస్‌తో తన చర్చ సందర్భంలో వలెనే ఆయన ఇప్పుడూ ప్రవర్తించాడు. కాని ఆయన ప్రవర్తన మాత్రం ఏమీ మారలేదు అంటాడు అరియన్.

మరీ తేలిగ్గా కనిపించినా సరే, సంవాదం అనేది ఒక

**భారత దేశ గతాన్ని, ప్రస్తుతాన్ని అనేక కోణాలనుంచి చూడొచ్చు. కానిప్రధానంగా ఇక్కడి సంవాద సంప్రదాయంపై కేంద్రీకరించవలసిన అవసరం వుందని నేను భావిస్తాను. నేటికీ వర్తించే విషయం అది. భారత దేశపు మేధాపరమైన ఔన్నత్యం ఈ సంప్రదాయంతో ముడిపడివుందని నేను అనుకుంటాను. దాని గురించి 'సంవాదశీల భారతీయుడు' అనే పుస్తకంలో వివరంగా చర్చించాను.ఇక్కడ క్లుప్తంగా పేర్కొంటాను.**

సమాజంలో నిర్వహించే రెండు రకాల పనుల మధ్య అంటే 1. వక్కాణింపు 2.విమర్శన అనే వాటిమధ్య వున్నతేడాను చూపించడానికి ప్రయత్నిస్తాను. వక్కాణింపు అనేది ధ్వనితో ముడిపడివుంటుంది. ఒక వాదనను సృష్టించడం, దానికి సంబంధించిన సూత్రాలను రూపొందించడం ఇందులో జరుగుతుంది. విమర్శన అనేది దానికన్నా ముందుకు పోయి చెప్పినదాన్ని నిశితంగా పరిశీలించడంపై కేంద్రీకరిస్తుంది. ప్రజాస్వామ్యం పనిచేయాలంటే ఈ రెండూ అవసరమే.

ఉదాహరణకు కరువులు ప్రజాస్వామ్య దేశాలలో రావనే అభిప్రాయం ఒకటి బలంగావుంది. సామ్రాజ్యవాద వలసలలో(బ్రిటిష్ పాలనా కాలపు ఇండియాలోవలె) లేదా సైనిక నియంతృత్వాలలో (సూడాన్, ఇథియోపియా, సోమాలియాలలో ఇటీవలి దశాబ్దాలలలో జరిగినట్టుగా) లేదా ఏకపార్టీ పాలన వున్న చోట్ల (అంటే1930లలో సోవియట్‌లోనూ, 1958-61లో చైనాలోనూ లేదా 1970లలో కంబోడియాలోనూ, సమీప గతంలో ఉత్తర కొరియాలోనూ జరిగినట్లుగా) మాత్రమే కరువులు వస్తాయని చెప్పడం కద్దు. ప్రభుత్వాలు కరువులను నివారించాలి. బహిరంగ భావ ప్రకటనా స్వేచ్ఛపై నిషేధం లేనప్పుడు బాధితులయ్యేవారి వేదనలు నమోదు చేయడం బాధ్యతగల ప్రభుత్వ విధి. ఈ విషయాన్ని సామాజికంగా కనిపించేట్టు చెప్పొచ్చు. కరువు సంభవించినపుడు విధాన వైఫల్యంపై వచ్చే విమర్శలను తట్టుకోవడం ఒక ప్రభుత్వానికి కష్టమైన విషయమే. ఇది కేవలం ఎన్నికలలో జయాపజయాలకు సంబంధించిన

సమస్య మాత్రమే కాదు. వార్తాపత్రికలు మీడియా స్వతంత్రం కలిగివున్న చోట, సెన్సారింగ్ అమలు కాని చోట , అధికారంలో వున్నవారిపై ప్రతిపక్షాలు విమర్శలు సంధించే వీలున్న చోట్ల ఇలాటి విమర్శలు రావడమంటే బహిరంగ అభిశంసనను ఎదుర్కోవడమే అవుతుంది. నిజంగానే కరువుల వాతపడే జనాభా ఎప్పుడూ చాలా తక్కువే వుంటుంది (మొత్తం జనాభాలో పదిశాతం కంటే ఎప్పుడూ ఎక్కువ వుండదు) కాని కరువు గురించి సమాచారాన్ని అందజేయడం, ప్రజలలో చర్చ ద్వారా సానుభూతిని పంచుకోవడం చాలా కీలకమైనవి. అదే ప్రభుత్వానికి ఎన్నికలలో పీడకల అవుతుంది. ఈ కోణం నుంచి చూసినపుడే ఇప్పుడు చెప్పుకుంటున్న సమాచార హక్కు, వంటివి ఆర్థిక రాజకీయ సామాజిక ప్రాధాన్యత సంతరించుకుంటాయి.

ఇండియా చాలా పెద్దది కనక మామూలుగా సమాజంలో అడుగుపొరలలో వుండేవారు మైనారిటీలతో సహా అన్ని అంశాలనూ అనుసంధానం చేసుకోగలిగిన సత్తా దానికి వుంది. నిర్భాగ్య భారతం వర్గంతో సముదాయంతో సంధానించబడి వున్నా గుర్తింపు నోచుకునే విషయంలో అది తరచూ నిర్లక్ష్యానికి గురవుతుంటుంది. ఇలాటి చోటా ప్రజల విచక్షణ అనేది మంచి సాధనమవుతుంది. చాలా చక్కనైన మహాయానం అనే పదానికి అర్థం ఇదే.

### 5

చివరగా నేను మైనారిటీల హక్కులు, లౌకిక తత్వం సమస్యలకు వస్తాను. ఇటీవలి సంవత్సరాలలో ఈ అంశాలకు సంబంధించి అనేక ఆటుపోట్లు సంభవించాయి. గోద్రా ఘటన తర్వాత గుజరాత్‌లో జరిగిన 2002 మత పరమైన అల్లర్లలో 2000 మంది ముస్లిములు చనిపోయివుంటారు. వాటిని రాష్ట్ర ప్రభుత్వం అరికట్టలేదు. బిజెపి నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వమూ మైనారిటీలకు రక్షణ కల్పించడంలో విఫలమైంది. తర్వాత జరిగిన డిసెంబర్ ఎన్నికలలో ఆ రాష్ట్ర ప్రభుత్వం తిరిగి ఎన్నికైంది. మరోవైపున బిజెపి నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వం మాత్రం 2004 మే ఎన్నికల్లో ఓడిపోయింది. బిజెపితో కలసివున్న లౌకికపార్టీలు దాదాపుగా ఆ ఎన్నికల్లో దెబ్బతినిపోయాయి. హిందూత్వ అజెండాకు లాంఛనంగా కట్టుబడని పార్టీలు కూడా లౌకిక సూత్రాలను నిర్లక్ష్యం చేశాయనే సాధారణ ఆక్షేపణ ఈ ఎన్నికల తీర్పులలో ఇమిడి

**బహిరంగ భావ ప్రకటనా స్వేచ్ఛపై నిషేధం లేనపుడు బాధితులయ్యేవారి వేదనలు నమోదు చేయడం బాధ్యతగల ప్రభుత్వ విధి. ఈ విషయాన్ని సామాజికంగా కనిపించేట్టు చెప్పొచ్చు. కరువు సంభవించినపుడు విధాన వైఫల్యంపై వచ్చే విమర్శలను తట్టుకోవడం ఒక ప్రభుత్వానికి కష్టమైన విషయమే.**

వుందనే విషయాన్ని గమనించకుండా వుండడం సాధ్యమయ్యేపనికాదు.(ఈ వ్యాసం 2014 ఎన్నికలలో మోడీ విజయానికి చాలా ముందుగా ప్రచురితమైంది)

భారత దేశంలో మత కలహాల రక్తసిక్త చరిత్ర వున్నా భిన్నమతాల సహనం, మత విశ్వాసాలలో ఆచారాలలో విభిన్నతను ఆమోదించడం అనేవి బాగా లోతుగా వేళ్లూనుకున్నాయి. ఎనిమిది దశాబ్దాల కిందట 1921లోనే రవీంద్రనాథ టాగోర్ ఈ విషయం స్పష్టంగా చెప్పాడు. అసలు భారత దేశమనే భావనే ప్రజల మధ్య విభజనలు తెచ్చే సంకుచితతత్వానికి విరుద్ధంగా పనిచేస్తుంటుందని ఆయన చెప్పారు. ఇదే నిజమనుకుంటే ఒక మాట చెప్పొచ్చు. హిందూత్వ ఉద్యమంలో తీవ్రవాద వర్గాలు మత పరమైన అనుబంధాలను ముందుకు తెచ్చి చీలికలు సృష్టించడం ద్వారా అసలు భారతదేశమనే భావనతోనే ఘర్షణ పడుతున్నారని చెప్పాల్సి వుంటుంది. ఇది మరో విధంగా చెప్పాలంటే పెద్ద భారతదేశమనే విశాలమైన భావననే కుదించి వేసే ప్రయత్నం. విభిన్న మతాల గతంతో బహుళత్వ సంప్రదాయాల పట్ల గర్వంతో కూడిన భారతదేశాన్ని చిన్నదైనదిగా చేసే ప్రయత్నం. దానితో పాటే హిందూత్వానికి అత్యంత మొరటైన నిర్వచనం ఇవ్వటం అన్నమాట.

విశాల భారతానికి సంకుచిత భారతానికి మధ్య జరిగే ఘర్షణలో విశాలమైన అవగాహనే విజయం సాధించడం తథ్యం. అయితే విశాలమైన భావన కోసం పోరాడే వారు తాము దేనికోసం పోరాడుతున్నామో సవ్యంగా అర్థం చేసుకుంటే తప్ప వారి విజయం సుస్థిరంగా వుండదు. భిన్నత్వంతో సహా భారతదేశపు సంప్రదాయాలు, బహుళత్వం సందేహ సంప్రదాయాల విస్తృతి సమగ్రంగా అర్థం చేసుకోవాలి. సమర్థమైన భారతదేశం గురించి తగినంతగా అర్థం కావాలంటే ఈ దేశపు సంభాషణా సంప్రదాయాలు గుర్తించాలి. ◆

# కళ, సత్యం, రచయితలు





## హెరాల్డ్ పింటర్

యథార్థము, అవాస్తవమూ మధ్య కానీ, సత్యము, అసత్యము నడుమ కానీ అభేద్యమైన తేడాలేవీ లేవు. ఏదైనా విషయం తప్పనిసరిగా సత్యమో, అసత్యమో కావాలని లేదు. అది యథార్థమూ, మిధ్యా రెండూ కావచ్చు.' ఇది నేను *1958*లో రాశాను. ఈ వక్కాణింపు ఇప్పుడూ అర్ధవంతమైనదేనని, కళ ద్వారా వాస్తవాన్వేషణకు ఇప్పటికీ వర్తిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. నలభై ఏడు సంవత్సరాల క్రితం చేసిన ఈ ఉద్ఘాటనకు ఒక రచయితగా నేను నిబద్ధమై ఉన్నాను, ఒక పౌరుడుగా మాత్రం కాదు. ఒక పౌరుడుగా నేను అడిగి తీరాలి. ఏది సత్యం? ఏది అసత్యం?

యథార్థము, అవాస్తవమూ మధ్య కానీ, సత్యము, అసత్యము నడుమ కానీ అభేద్యమైన తేడాలేవీ లేవు. ఏదైనా విషయం తప్పనిసరిగా సత్యమో, అసత్యమో కావాలని లేదు. అది యథార్థమూ, మిధ్యా రెండూ కావచ్చు.' ఇది నేను 1958లో రాశాను. ఈ వక్కాణింపు ఇప్పుడూ అర్ధవంతమైనదేనని, కళ ద్వారా వాస్తవాన్వేషణకు ఇప్పటికీ వర్తిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. నలభై ఏడు సంవత్సరాల క్రితం చేసిన ఈ ఉద్ఘాటనకు ఒక రచయితగా నేను నిబద్ధమై ఉన్నాను, ఒక పౌరుడుగా మాత్రం కాదు. ఒక పౌరుడుగా నేను అడిగి తీరాలి. ఏది సత్యం? ఏది అసత్యం?

నాటకంలో సత్యం ఎప్పటికీ అంతు చిక్కదు. నీవు దానిని కనుగొనలేవు. అయితే సత్యాన్వేషణ విధిగా చేయాలి. సత్యశోధన నీ కర్తవ్యం. అంధకారంలో అస్తుబిస్తుగా సత్యం నీకు తారస పడుతుంది. నీవు దానిని ఢీకొంటావు లేదా సత్యాన్ని పోలిన ఒక ప్రతి కృతిని, ఒక రూపును కాంచుతావు - నీవు చేసినదేమిటో గ్రహించకుండానే. అయితే అసలు నిజం ఏమిటంటే నాటక కళలో ఒక సత్యంగా కనుగొనబడే విషయమేదీ లేదు. చాలా సత్యాలు ఉన్నాయి. ఆ సత్యాలు పరస్పరం సవాళ్ళు విసురుకుంటాయి, వివర్తనం చెందుతాయి, ప్రతిబింబిస్తాయి. అలక్ష్యానికి పాల్పడుతాయి, వేధించుకుంటాయి.

సద్దాం హుస్సేన్ పెద్ద ఎత్తున భారీ విధ్వంసక మారణాయుధాలను సమకూర్చుకున్నాడనే సాకుతో ఇరాక్‌ను ఆక్రమించు కోవడం జరిగిందన్న విషయం ఈ సమావేశంలోని ప్రతి ఒక్కరికి తెలుసు. సద్దాం వద్ద అణ్వస్త్రాలు, రసాయన, క్రిమి ఆయుధాలున్నాయని మనకు చెప్పారు. అది నిజం కాదు.

అవి పరస్పరం గుర్తుంచుకోవు. కొన్నిసార్లు ఒక మహత్వపు సత్యం నీ చేతుల్లోకి వచ్చిందని భావిస్తావు. అంతలోనే అది నీ హస్తాల్లోంచి జారిపోతుంది. నీ నుంచి నిష్క్రమిస్తుంది. నా రూపకాలు ఎలా వచ్చాయని నన్ను తరచు అడుగుతుంటారు. నేను చెప్పలేను. నా నాటకాలను సంక్షేపించలేను - జరిగింది ఇది, అదీ వారు (పాత్రలు) చెప్పిందీ, అదీ వారు చేసింది అని చెప్పడం మినహా.

అప్పటి వరకు ఉనికే లేని పాత్రలను సృష్టించిన క్షణం ఒక అసాధారణ భ్రామకం. ఆ తరువాత సంభవించేది ఔచిత్యపూర్వకమే. అనిశ్చితమే. భ్రాంతికరం కూడా. అయినప్పటికీ కొన్నిసార్లు పాత్రల సృష్టి ఆపలేని ప్రవాహ సదృశ్యమే. రచయిత స్థితి విచిత్రమైనది. ఒక విధంగా పాత్రలు అతన్ని హర్షించవు. ఆహ్వానించవు. అవి ప్రతిఘటిస్తాయి. రచయితతో సహజీవనం చేయలేవు. నిర్వచించడానికి అసాధ్యంగా పాత్రలు పరిణమిస్తాయి. ఖచ్చితంగా నీవు వాటిని ఆదేశించలేవు. కొంతవరకు వాటితో నీవు ఎప్పటికీ పూర్తికాని ఆటకు దిగుతావు. దాగుడు మూతలు ఆడతావు. అంతిమంగా నిలువెత్తు సజీవమూర్తులు - సంకల్పమూ, వ్యక్తిగత అనుభూతులు ఉన్న వ్యక్తులు - నీ ఎదుట ఉన్నట్లు కనుగొంటావు. నీవు మార్చలేని, విరూపం చేయలేని, లొంగదీసు కోలేని మనుష్యులు వారు!

కనుక కళలో భాష పూర్తిగా సందిగ్ధ వ్యవహారంగా మిగిలిపోతుంది. అది ఒక ఊబి. ఘనీభవించిన సరస్సులాంటిది. అది ఏ క్షణమైనా నీ (రచయిత) కాళ్ళ కింద నుంచి తొలగిపోతుంది. అయితే నేను చెప్పినట్టు సత్యాన్వేషణ నిలిచిపోదు. అది ముగియ కూడదు. దాన్ని వాయిదా వేయకూడదు. సత్యంతో తలపడాలి - అక్కడికక్కడే, ఆ క్షణాన్నే.

రాజకీయ యవనిక పూర్తిగా భిన్నమైన సమస్యలను ప్రదర్శిస్తుంది. ఎట్టి పరిస్థితులలోను ధర్మోపదేశాలు చేయకూడదు. నిష్పాక్షికత ముఖ్యం. పాత్రలు స్వంత ఉచ్ఛ్వాసనిశ్వాసలు తీసేలా పాత్రలకు అనుమతి ఇచ్చి తీరాలి. తన సొంత అభిరుచులు, దృక్పథం, దురభిప్రాయాలకు అనుగుణంగా వాటిని పరిమితం చేయడానికి, మలచడానికి రచయిత ప్రయత్నించకూడదు. వివిధ కోణాల నుంచి వాటిని సృజించడానికి అతడు సిద్ధం కావాలి. అవి రూపుదిద్దుకుంటున్న తీరు కొంచెంగానైనా ఆశ్చర్యపరచవచ్చు. అయినప్పటికీ అవి తమ సంకల్పానుసారం వెళ్ళేలా వాటికి స్వేచ్ఛనివ్వాలి. అన్ని సృజనల లోను ఇలా చేయడం కుదరదు. రాజకీయ ప్రహసనం ఈ సృజన సూత్రాలలో దేనికీ కట్టు బడదు. నిజం చెప్పాలంటే దానిది ఖచ్చితంగా భిన్న దృష్టి. ఏమంటే అదే దాని సరైన విధి.

'ది బర్త్‌డే పార్టీ' అనే నా నాటకంలో పాత్రలను అంతిమంగా లోబరచుకొనే ముందు వాటికి అవకాశాల చిట్టడవిలో అన్ని ప్రత్యామ్నాయ మార్గాలలోను ప్రవర్తించడానికి, స్వేచ్ఛనిచ్చానని భావిస్తున్నాను. 'మౌంటెన్ లాంగ్వేజ్'లో ప్రత్యామ్నాయ కార్యకలాపాలకు అవకాశమివ్వలేదు. దానిలోని పాత్రలు క్రూరంగా వ్యవహరిస్తాయి. ఆ నాటకంలోని సైనికులు తమ ప్రవర్తన ద్వారా వినోదం పొందుతారు. చిత్రవధలు పెట్టడమనేది తేలిగ్గా విసుగుపుట్టిస్తాయని కొన్నిసార్లు మరచి పోతుంటారు. తమ పైశాచికత్వానికి ఉత్తేజం పొందడానికి అవి నవ్వుకోవాల్సిన అవసర మెంతైనా ఉంది. బాగ్దాద్‌లోని అబూ గ్రయీబ్ జైలులోని పరిణామాలు ఈ విషయాన్ని ధ్రువీకరించాయి. 'మౌంటెన్ లాంగ్వేజ్' 20 నిమిషాల పాటు మాత్రమే కొనసాగే నాటకం. అయితే అది అలా అదే పద్ధతిలో మళ్ళీ మళ్ళీ కొనసాగుతూనే ఉంటుంది.

సద్దాం హుస్సేన్ పెద్ద ఎత్తున భారీ విధ్వంసక మారణాయుధాలను సమకూర్చు కున్నాడనే సాకు మనకు చెప్పారు. అది నిజం కాదు. అల్-ఖైదాతో ఇరాక్‌కు సంబంధాలు ఉన్నాయని, సెప్టెంబర్ 11 దాడులకు సహకరించిందని చెప్పారు. ఇది నిజమని మనకు నమ్మబలికారు. కాని ఇది నిజం కాదు. ప్రపంచ భద్రతకు ఇరాక్ ప్రమాదకారిగా పరిణమించిందని చెప్పారు. ఇది నిజం కాదు. సత్యం పూర్తిగా

> అంటే మీరు ఆ దేశాన్ని విషపూరితం చేస్తారు. ఒక కాన్సర్ వ్యాధి క్రిమిని సృష్టించి వదులుతారు. జనం లొంగిపోయాక లేదా చంపివేయబడ్డాక మీ స్నేహితులు అంటే సైనికాధికారులు, బడా కార్పొరేషన్లు రంగ ప్రవేశం చేసి సుఖంగా అధికార పీఠాలపై కూచుని కెమెరాల ముందుకెళ్లి ప్రజాస్వామ్యం పరిఢవిల్లిందంటూ ప్రకటనలు చేస్తారు

భిన్నమైనది. ప్రపంచ వ్యవహారాలలో తన పాత్రను అమెరికా ఏ విధంగా అర్థం చేసుకొంది. దానినే విధంగా నిర్వర్తించ డానికి నిర్ణయించుకుంది అనేదానితో సత్యం ముడిపడి ఉంది.

ప్రపంచ యుద్ధానంతరం సోవియట్ యూనియన్ తూర్పు యూరప్‌లలో ఏమి జరిగిందో అందరికీ తెలుసు. వ్యవస్థీకృత క్రూరత్వం, స్వతంత్ర ఆలోచన అణచివేత, ఈ విషాదాలకు సంపూర్ణ సాక్ష్యాధారాలు ఉన్నాయా? అవి ధ్రువీకరింపబడ్డాయి. నా వాదన ఏమిటంటే ఇదే కాలంలో అమెరికా పాల్పడిన నేరాలు సరిగా రికార్డు కాలేదు. అమెరికా నేరాలు చేసినట్టు అంగీకరించడం కాదు కదా, అసలు వాటిని నేరాలుగా గుర్తించడమే జరగలేదు! ఈ విషయంపై మనం దృష్టి నిలపాల్సిన అవసరమెంతైనా ఉందని నేను విశ్వసిస్తున్నాను.

ఒక సార్వభౌమదేశాన్ని ప్రత్యక్షంగా ఆక్రమించుకోవడం ఎప్పుడూ అమెరికాకు ఏమంత ఇష్టమైన విధానం కాదు. ప్రధానంగా అది తక్కువ స్థాయి ఘర్షణ అనేదాన్ని ఇష్టపడుతుంది. దీని అర్థం ఏమంటే ఒక కాన్సర్ వ్యాధి క్రిమిని సృష్టించి వదులుతారు. జనం లొంగిపోయాక లేదా చంపివేయబడ్డాక మీ స్నేహితులు అంటే సైనికాధికారులు, బడా కార్పొరేషన్లు రంగ ప్రవేశం చేసి సుఖంగా అధికార పీఠాలపై కూచుని కెమెరాల ముందుకెళ్లి ప్రజాస్వామ్యం పరిఢవిల్లిందంటూ ప్రకటనలు చేస్తారు.

నికరాగ్వాలో జరిగిన విషాదం ఈ విషయంలో ప్రత్యేకంగా చెప్పుకోదగినది.. 1980లో లండన్‌లోని అమెరికా రాయబార కార్యాలయంలో నేను వున్నాను. అక్కడి వామపక్ష ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న కాంట్రా విప్లవ ప్రతీఘాతకులకు మరింత డబ్బు ఇవ్వాలా అనే విషయమై అమెరికా కాంగ్రెస్ ఆలోచిస్తున్నది. నికరాగ్వా తరపున మాట్లాడేందుకు వెళ్లిన ప్రతినిధి వర్గంలో నేనూ వున్నాను. అయితే ఆ ప్రతినిధి వర్గంలో అత్యంత ముఖ్యుడు ఫాదర్ జాన్ మెట్కాఫ్. అమెరికా పక్షానికి నాయకుడు రేమాండ్ సిట్జ్. తాము నిర్వహించే పాఠశాలను, ఆరోగ్య కేంద్రాన్ని కాంట్రాలు ధ్వంసం చేశారని, నర్సులపై అత్యాచారాలు జరిపారని చెబుతూ వారికి మీ సహాయం నిలిపివేయండి అని ఫాదర్ మనవి చేశారు. చాలా మర్యాదస్తుడుగా, బాధ్యతాయుతమైన ఆధునికుడుగా పేరు పొందిన రేమాండ్ ఏమన్నాడంటే' ఫాదర్, మీకో మాట చెబుతాను. యుద్ధంలో అమాయకులు నష్ట పోవడం ఎప్పుడూ జరుగుతుంటుంది' అని. ఆ మాటలతో అక్కడ ఒక్కసారిగా మౌనం రాజ్యం చేసింది.

నిజమే, అమాయకులు ఎప్పుడూ బలవుతుంటారు.

నికరాగ్వాను పాలించిన వామపక్ష శాండినిస్టాలు లోపరహితులని నేను చెప్పడం లేదు. కాని వారు తెలివైన వారు, హేతుబద్ధమైన వారు. నాగరికులు. ఒక స్థిరమైన బహుళత్వం గల, హుందా అయిన వ్యవస్థను నెలకొల్పేందుకు ప్రయత్నించారు. గొప్ప అక్షరాస్యతా ఉద్యమం నడిపారు. లక్ష కుటుంబాలకు భూమిపై హక్కులిచ్చారు. ఇలాటి అనేక మంచి చర్యలు చేపట్టారు. కాని అమెరికా దానిని మార్క్సిస్టు లెనినిస్టు కుట్రగా ఖండించింది. వారి ఉద్దేశంలో నికరాగ్వా చూపుతున్న ఆదర్శం ప్రమాదకరమైంది!

గ్వాటిమాలాలో ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని అమెరికా 1954లో కూలదోసింది. ఆ తర్వాత వెంట వెంట వచ్చిన సైనిక నియంతల చేతుల్లో 2 లక్షల మంది బలయ్యారు. ప్రపంచంలో అత్యంత ప్రతిభా వంతులైన ఆరుగురు జెసూట్లను 1989లో అమెరికాలో శిక్షణ పొందిన సాయుధ దళాలు శాన్‌శాల్వడార్ విశ్వవిద్యాలయంలో దారుణంగా కాల్చిచంపారు. సాహసవంతుడైన ఆర్కిబిషప్ రోమిరోను సామూహిక ప్రార్థన చేస్తుండగానే చంపేశారు. వారినెందుకు చంపేశారు? ఎందుకంటే వారు మరింత మెరుగైన జీవితం సాధ్యమేనని,అందుకోసం కృషి చేయాలని చెప్పారు గనక. అలా అనుకున్న మరుక్షణం వారు కమ్యూనిస్టుల్లా

**గ్వాటిమాలాలో ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని అమెరికా 1954లో కూలదోసింది. ఆ తర్వాత వెంట వెంట వచ్చిన సైనిక నియంతల చేతుల్లో 2 లక్షల మంది బలయ్యారు. ప్రపంచంలో అత్యంత ప్రతిభా వంతులైన ఆరుగురు జెసూట్లను 1989లో అమెరికాలో శిక్షణ పొందిన సాయుధ దళాలు శాన్‌శాల్వదార్ విశ్వవిద్యాలయంలో దారుణంగా కాల్చిచంపారు.**

కనిపించడం మొదలెట్టారు... చివరకు ఎట్టకేలకు అమెరికా శాండినిస్టా ప్రభుత్వాన్ని గద్దెదించగలిగింది. దానిపై మొదట్లో కొంత ప్రతిఘటన వచ్చినా కొన్నేళ్ల తర్వాత ముప్పైవేల మందిని బలి,ఆర్థిక వేధింపులు సాగిన తర్వాత చివరకు నికరాగ్వా ప్రజల స్థైర్యం దెబ్బ తినింది... అలసిపోయి మరో సారి దారిద్ర్యం కోరల్లో చిక్కారు. ఆ వెంటనే కాసినోలు వచ్చేశాయి. ఉచిత విద్య వైద్యం అదృశ్యం. బడా వ్యాపారం మరింత కక్షగా పున:ప్రవేశం చేసింది. ప్రజాస్వామ్యం ప్రవర్థిల్లింది!

అయితే ఈ విధానం మధ్య అమెరికాకే పరిమితమైంది కాదు. ప్రపంచ మంతటా సాగుతున్న ఒక నిరంతర పోకడ.

ద్వితీయ ప్రపంచ యుద్ధమనంతరం ప్రపంచవ్యాప్తంగా మితవాద సైనిక నియంతృత్వాలన్నిటికీ అమెరికా మద్దతు నిచ్చింది. నియంతలు అధికారంలోకి రావడానికి తోడ్పడింది. ఇండోనేషియా, గ్రీస్, ఉరుగ్వే, బ్రెజిల్, పరాగ్వే, హైతీ, టర్కీ, ఫిలిప్పీన్స్, గ్వాటెమాల, ఎల్ సాల్వడార్, చిలీల గురించి నేను ప్రస్తావిస్తున్నాను. 1973లో చిలీ సైనిక నియంతల పాలు కావడంలో అమెరికా పాత్రను చరిత్ర ఎన్నటికీ క్షమించదు. ఈ దేశాలలో వేలాది ప్రజలు హతమారిపోయారు. మరెందరో మటుమాయమయ్యారు. ఇది వాస్తవం కాదా? అమెరికా విదేశాంగ విధానమే ఇందుకు కారణమా? అవును. అయితే ఈ విషయం మీకు తెలియకపోవచ్చు. అది సంభవించదు. ఏదీ ఎన్నడూ సంభవించదు. సంభవించినప్పుడు కూడా అది సంభవించడం జరగదు. ఇది చెప్పుకోదగిన విషయం కాదు. అమెరికా నేరాలు ఉద్దేశపూర్వకమైనవి. నిరంతరాయమైనవి. పశ్చాత్తాపం లేనివి. అయినప్పటికీ కొద్దిమంది మాత్రమే వాస్తవంగా వాటి గురించి మాట్లాడారు.

అమెరికన్ అధ్యక్షులు చేసే ప్రసంగాలు వినండి. 'అమెరికన్ ప్రజలు' గురించి వారి ఉద్ఘాటనలను నిశితంగా గమనించండి. 'అమెరికన్ ప్రజల హక్కులను రక్షించు కోవాల్సిన సమయం ఆసన్నమయిందని అమెరికన్ ప్రజలకు చెబుతున్నారు. మీ అధ్యక్షుడిని విశ్వసించండని అమెరికన్ ప్రజలను అడుగు తున్నాను. అమెరికన్ ప్రజల తరఫున ఆయన తీసుకొనే చర్యలను విశ్వసించండని అమెరికన్ ప్రజలను కోరుతున్నాను.' ఆలోచించే శక్తిని రూపుమాపడానికే వాస్తవంగా ఇటువంటి భాషను ఉపయోగించడం జరుగుతుంది. 'అమెరికన్ ప్రజలు' అనే పదాన్ని పదే పదే పునశ్చరణ చేయడం ద్వారా వారికొక భరోసా కల్పిస్తున్నారు. ఇక ఆలోచించనవసరమే లేదు. ఆ భరోసాతో హాయిగా ఉండవచ్చు. అయితే ఇది దారిద్ర్య రేఖకు దిగువన జీవిస్తున్న నాలుగు కోట్ల మంది ప్రజలకు, అమెరికా వ్యాప్తంగా వివిధ జైళ్ళలో ఉన్న ఇరవై లక్షల మంది ఖైదీలకు ఈ భరోసా వర్తించదు.

మనం నైతిక స్పృహను కోల్పోయామా? అసలు మనకు వివేకముందా? అంతరాత్మ అనేది ఉందా? మన స్వంత చర్యల గురించి కాక, ఇతరుల చర్యలలో మన పాలు గురించి కూడా అంతరాత్మ పట్టించుకోదేం? గ్వాంటెనామో బే జైలును చూడండి. వందలాది ఖైదీలు గత మూడేళ్ళుగా ఎటువంటి ఆరోపణలు లేకుండానే ఆ జైలులో మగ్గుతున్నారు. ఆ జైలు జెనీవా ఒప్పందానికి పూర్తిగా విరుద్ధం. అయినా దానిని సహిస్తున్నాము. 'అంతర్జాతీయ సమాజం' గురించి అమెరికా ఆలోచిస్తుందా? లేదు. 'స్వేచ్ఛా ప్రపంచానికి నేత'నని చెప్పుకొంటున్న దేశం పాల్పడుతున్న ఘోరమిది. గ్వాంటనామో బే వాసుల గురించి మనమెపుడైనా ఆలోచించామా? మీడియా వారి గురించి చెబుతున్నదేమైనా ఉందా?

ఇరాక్ ఆక్రమణ ఒక బందిపోటు చర్య. ఉగ్రవాద దాడి. అంతర్జాతీయ న్యాయాన్ని ఎటువంటి మినహాయింపులు లేకుండా ఉల్లంఘించడమే. సంపూర్ణ అబద్ధాలతో మీడియా ద్వారా ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసి నిర్హేతుకంగా ప్రదర్శించిన సైనిక ప్రతాపం. పశ్చిమాసియా, అరబ్ దేశాలపై సంపూర్ణ సైనిక, ఆర్థిక నియంత్రణను సాధించే లక్ష్యంతోనే ఇరాక్‌ను ఆక్రమించుకోవడం జరిగింది. అయితే ఒక నియంత పాలన నుంచి ప్రజలకు విముక్తి కలిగిస్తున్నామనే సాకు

ఒక నియంత పాలన నుంచి ప్రజలకు విముక్తి కలిగిస్తున్నామనే సాకు చూపారు. ఈ 'విముక్తి'లో వేలాది అమాయకులు హతమయ్యారు. లక్షలాది ఇరాకీలు క్షతగ్రాతులయ్యారు. ఇంకెందరో చిత్రవధలకు గురవుతున్నారు. ఇరాక్‌లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించామని, ఆ దేశ ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల్పించామని చెబుతున్నారు!

చూపారు. ఈ 'విముక్తి'లో వేలాది అమాయకులు హతమయ్యారు. లక్షలాది ఇరాకీలు క్షతగ్రాతులయ్యారు. ఇంకెందరో చిత్రవధలకు గురవుతున్నారు. ఇరాక్‌లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించామని, ఆ దేశ ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల్పించామని చెబుతున్నారు!

ఈ విషయంలో మృత్యువు అన్నదానికి ఏ విలువా లేదు. . కనీసం లక్ష మంది ఇరాకీలు అమెరికా బాంబులు, క్షిపణుల దాడిలో మరణించారు. వీరి ప్రాణాలకు ఏ విలువా లేదు. వారు చనిపోయినట్టు కూడా నమోదు కాదు. 'మేము శవాల లెక్కలు వేయం' అన్నాడు. రక్తం ఎంత అసహ్యకరమైంది? అది మీ చొక్కాను మురికి మురికిచేసి మీరు టెలివిజన్‌లో ఎంతో గొప్పగా ఇస్తున్న ప్రసంగాన్ని ఖరాబు చేస్తుంది.

ఇక 2000 అమెరికన్లు చనిపోవడం చికాకైన విషయం. వారిని చీకట్లో సమాధుల వద్దకు చేర్చాలి. చడీ చప్పుడు కాకుండా అంత్యక్రియలు జరిగిపోవాలి. క్షతగాత్రులైన వారు జీవిత పర్యంతం మంచాలపై మగ్గిపోవాలి. చనిపోయిన వారూ, గాయాలపాలైన వారూ మగ్గిపోవలసిందే. పద్ధతులే వేరు.

అమెరికా ఇప్పుడు తన విధానాన్ని బాహాటంగానే ప్రకటిస్తోంది. సర్వసంపూర్ణ ఆధిపత్యం తన లక్ష్యమంటోంది. సర్వ సంపూర్ణంగా. అది ఇప్పుడు ప్రపంచ వ్యాపితంగా132 దేశాలలో 702 సైనిక స్థావరాలను కలిగివుంది. స్వీడన్ ఒక్కటే ఇందుకు గౌరవనీయమైన మినహాయింపు. ఇన్ని చోట్లకు వారెలా చేరగలిగారన్నది ఆశ్చర్యమే. ఏమైనా వారు చేరారు. దాని దగ్గర గట్టిగా పనిచేసే అణుబాంబులు 8000 వున్నాయి. రెండు వేల బాంబులు పావుగంటలో ప్రయోగించేంత సర్వసిద్ధంగా వున్నాయి. ఇప్పుడది రక్షణ కందకాలను ధ్వంసం చేయగల సరికొత్త అణ్వాస్త్రాల తయారీలో నిమగ్నమై వుంది. వారికి సహకరించేందుకు సదా సంసిద్ధమనే బ్రిటిష్ వారు తమ అణ్వాస్త్రాలను కూడా మార్చి కొత్తవి పెట్టమని అడుగుతున్నారు. ఇంతకూ ఇవన్నీ ఎవరిపైకి ఎక్కుపెడుతున్నారని నాకు సందేహం కలుగుతుంటుంది. ఒసామా బిన్‌లాడెన్‌పైనా? మీ పైనా? నా పైనా? చైనాపైనా? పారిస్ పైనా? ఎవరికి తెలుసు? ఇదో బాల్యాంక విపరీతమని మాత్రం మనకు తెలుసు. అణ్వాస్త్రాలు కలిగివుండటం, వాటిని ఉపయోగిస్తామని బెదిరించడం.. ఇదే ఇప్పటి అమెరికా రాజకీయ తాత్వికతకు మూలసూత్రం...

ఒక రచయిత జీవితం దుర్బలమైనది. అది దాదాపుగా అనావృత కార్యకలాపం. దాని గురించి వేము రోదించనవసరం లేదు. రచయిత ఒక నిర్ణయం తీసుకుంటాడు. దానికి కట్టుబడి ఉంటాడు. అయితే అన్ని పవనాలు నిన్ను తాకుతాయనడం చెప్పడంలో సత్యం ఉంది. ఆ పవనాలలో కొన్ని శీతవాయువులు సుమా. నీవు నీ సొంతంగా వాటిని తట్టుకోవాలి. ఎలాంటి ఆశ్రయమూ నీకు దొరకదు. రక్షణ ఉండదు - అబద్ధాలాడితే తప్ప. అటువంటి పరిస్థితిలో నీవు నీ రక్షణ చేసుకోవాలి. ఇందుకై నీవు రాజకీయవేత్తవు కావచ్చు. అద్దంలోకి చూసినప్పుడు మన ఎదుట ఉన్న ప్రతిబింబం కచ్చితమైనదని భావిస్తాము. అయితే ఒక మిల్లీమీటరు కదలండి. ప్రతిబింబం మారి పోతుంది. వాస్తవంగా దరీదాపులేని ప్రతిబింబాల వైపు చూస్తున్నాము. అయితే కొన్నిసార్లు రచయిత అద్దాన్ని పగులగొట్టవలసి వస్తుంది. ఏమంటే అద్దానికి ఆవలివైపున ఉన్న సత్యం మనలను తేరిపార చూస్తుంటుంది. మన మేధో కట్టుబాటు ఎంత దృఢమైనదైనా, అచంచల మైనదైనా, నిష్కపటమైనదైనా, పౌరులుగా మన జీవితాలు, మన సమాజాల నిజమైన సత్యాన్ని నిర్వచించవలసి ఉన్నదని నేను విశ్వసిస్తున్నాను. ఇదెంతో బృహత్తర బాధ్యత. దీనిని నిర్వర్తించడం మన విధి. మన రాజకీయ దార్శనికతలో ఇటువంటి కర్తవ్యానికి తావు లేనప్పుడు, మనం దాదాపుగా కోల్పోయిన మానవ హుందాను పునరుద్ధరించ గలమని ఆశాభావానికి ఆస్కారమూ లేదు.

**(2007 నోబుల్ స్వీకార ప్రసంగం)**

# మానవ సమాజంలో స్వేచ్ఛ - నీతి - హేతువు

డా॥ కనుపర్తి విజయలక్ష్మి

విజ్ఞాన శాస్త్రం మానవ పురోగతికి అనేక రకాలుగ ఉపయోగపడుతున్నది. ఒకనాడు విజ్ఞానమంటే 'మతమ'ని అనుకొనేవారు. 'శాస్త్రం' దేశానికో రకంగా ఉండదు. అది విశ్వజనీనమై ఉండాలి. ప్రయోగం - పరిశీలన - నిర్ధారణ ద్వారా శాస్త్రజ్ఞుల ఆమోదం పొందాలి. అది మొత్తం మానవ ప్రపంచానికి చెందిన హక్కుగా, ఆస్తిగా రూపొందుతోంది.



శాస్త్రంలో అనుకరించే పద్ధతిని శాస్త్రీయ పద్ధతి అని, దృక్పథాన్ని శాస్త్రీయ దృక్పథమని, శాస్త్ర పరిశోధనలకు ప్రోద్బలంచేసే భావాన్ని శాస్త్రీయ భావన అని అంటారు. వ్యవస్థీకృతమైన మతంతో ప్రకృతిని గూర్చిన క్రమబద్ధ జ్ఞానమైన శాస్త్రం ఎప్పుడూ పోరాడుతూనే ఉంది. "శాస్త్రీయత అంటే హేతుబద్ధతే. హేతువాద మనేది శాస్త్రీయ వాదమే. హేతువాదాన్ని మూఢనమ్మక మనటమంటే సైన్సును ఇర్రేషనల్ అనటమే."

మానవ జీవితంలో శాస్త్రీయ పద్ధతి, దృక్పథం, భావనా ఎంతైనా అవసరం. అందుకు హేతుత్వం ముఖ్యాంశంగా పనిచేస్తుంది. "హేతువు అంతస్సూత్రంగ ప్రయాణం సల్పేదే హేతువాదం. విజ్ఞానంతోపాటు, శాస్త్రజ్ఞానంతోపాటు, అనుభవ జ్ఞానంతోపాటు నిర్ణయాలు మారిపోయే సజీవ ఆలోచనా విధానమే హేతువాదం." 7.

హేతువాదులు శాస్త్రీయ దృక్పథాన్ని ఆవశ్యంగా అనుసరిస్తారు. శాస్త్రజ్ఞానాన్ని వాస్తవ జ్ఞానంగా అంగీకరిస్తారు. శాస్త్రం వివృతం (open) మతం సంవృతం (closed) అదనపు సత్యాన్ని శాస్త్రం సంతోషంగా ఆహ్వానిస్తోంది. అదే సత్యానికి మతం గేట్లు మూసేస్తోంది.

"The most formidable weapon against errors of every

kind is Reason. I have never used any other and I trust I never shall".

ప్రతి కార్యానికి కారణంగా దేవుడ్నో, మరోకనిపించనిదాన్నో, మరో అతీంద్రియ శక్తినో కారణంగా చూపించే అశాస్త్రీయ పద్ధతిని హేతువాదం అంగీకరించదు. శాస్త్రీయాంశాలు కేవలం అనుభూతులు కావు – అవి వాస్తవాలు అంటోంది హేతువాదం. ఏ అంశాన్ని పరిశీలించటానికైనా శాస్త్రీయదృక్పథం అవసరం అని నమ్ముతోంది. అయితే శాస్త్రాన్ని ఆధారంగా తీసికొని అన్ని విషయాలను వివరించే హేతువాదాన్ని వ్యతిరేకవాదమనేవారు కూడ ఉన్నారు.

హేతువాదమంటే వ్యతిరేకవాదమనే అపోహ ఉంది చాలమందిలో. 'హేతువాదులు' అనగానే దేవుడ్ని లేడనేవారు కదా అంటారు. ఎంత చదువు కొన్నవారయినా హేతువాదమంటే కేవలం దేవుడ్ని, మతాన్ని, మూఢ నమ్మకాలను మాత్రమే వ్యతిరేకించే సిద్ధాంతం అని, దేవుడు దయ్యాలు లేవంటారని, మత గ్రంథాలను నిరసిస్తారని, ప్రతీదాన్ని వీరు తిరస్కరిస్తారనే నింద ప్రచారంలో ఉంది. అన్నింటినీ వ్యతిరేకించుకొంటూ పోవటాన్ని మాత్రమే హేతువాద మనుకోవడం సమంజసం కాదు.

మనుషులంతా సహేతుకంగా ఆలోచించగల శక్తి ఉన్నవారే. అయితే మతాలు మనిషిలోని హేతుత్వశక్తిని ఎదగనీయలేదు. ఒక తరంవారు ఆర్జించిపెట్టిన విజ్ఞానాన్నే పరమజ్ఞానంగ ఆమోదించినవారు ఆలోచించటం అనవసరం అనుకొన్నారు. పైగా ఏ మతము భిన్నాభిప్రాయాన్ని సహించదు. మతాలు అసహనాన్ని పెంచి పోషించినాయి. మతస్తులు ముందుగ నిర్ణయాలు చేసుకొని దానిమీద వాదం సాగిస్తారు. హేతువాదులు శాస్త్ర ప్రయోగాల ద్వారా నిర్ణయాలు చేసుకొంటారు. పరీక్షకు నిలబడనిదాన్ని దేన్నైన వ్యతిరేకిస్తారు. శాస్త్రీయ సత్యం ముందు నిలబడలేని ఏ విషయాన్నైనా ఆమోదించరు. ఆయా కాలాల్లో గొప్పవని కొనియాడబడిన మత గ్రంథాలను, విశ్వాసాలను, ఆచారాలను త్రోసిరాజనటం వల్లనే హేతువాదాన్ని వ్యతిరేకవాద మనటం. హేతువాదులు శాస్త్ర ప్రగతిని మాత్రమే విశ్వసిస్తారు. శాస్త్రం యొక్క ప్రగతి అంతా మానవుని వివేచనాశక్తికి నిదర్శనం. మతం ఒకప్పటికి వివేచనాశక్తి నుండి పుట్టిందైనా తర్వాత మార్పును అంగీకరించదు. ముందటి సత్యంకంటె గొప్ప సత్యం రంగంలోకి

ఏ మతము భిన్నాభిప్రాయాన్ని సహించదు. మతాలు అసహనాన్ని పెంచి పోషించినాయి. మతస్తులు ముందుగ నిర్ణయాలు చేసుకొని దానిమీద వాదం సాగిస్తారు. హేతువాదులు శాస్త్ర ప్రయోగాల ద్వారా నిర్ణయాలు చేసుకొంటారు. పరీక్షకు నిలబడనిదాన్ని దేన్నైన వ్యతిరేకిస్తారు.

దిగితే దానికి దారి ఇవ్వదు మతం – ఇస్తుంది శాస్త్రం. అందుకే మత విశ్వాసాలను పరీక్షకు పెట్టాలంటారు హేతువాదులు.

"The Principle that all questions relating to religion or religious creeds must be settled by reason or by the individual examinations or arguments or evidences not by revelation, authority, tradition, emotion, instinct or intution"

మతాలన్నింటిని హేతువాదం తిరస్కరిస్తుంది అనేదాన్లో సత్యం లేదు. మతాలు జరిపిన సాంఘిక దౌష్ట్యానికి వ్యతిరేకంగా హేతువాద చింతన ఉద్యమించడం మనకు చరిత్రలో కనబడుతోంది. దాన్నే 'వ్యతిరేకవాదం' అని పిలిచారు మతవాదులు. అయితే హేతువాదం నమ్మే విశ్వం – దైవం – మతం వగైరా విషయాలకు, సాంప్రదాయవాదులు చెప్పే విషయాల్లో తేడా ఉంది. అందుకే హేతువాదం వ్యతిరేక వాదమనే ముద్ర పడింది. హేతువాదం విశ్వం, దైవం, మతం, కులం,ఆత్మ, పునర్జన్మ, స్వేచ్ఛ నీతి మొదలైన విషయాల్లో ఎట్లా ఉంటుందో పరిశీలిద్దాం.

ఈ విశ్వం అంతా ఏదో పరమాత్మ సృష్టి అని మాత్రం హేతువాదం నమ్మదు. కర్త – భర్త – హర్త అనేవి సృష్టి – స్థితి – లయలనే పేరుతో కల్పించుకొన్న ఊహలు మాత్రమే అంటుంది. నిజానికి పదార్థం పరిణామంలో ఉన్న త్రిదశల్లో ప్రకటించే త్రివిధ ప్రవృత్తులే ఇవని విశ్వాతీత శక్తులేవి ఇందులో లేవని అంటోంది. విశ్వం, స్వయం సంపూర్ణం, స్వయం కారణం, స్వయం నియమబద్ధం, స్వయం పరిణామ శీలం, విశ్వం శాశ్వతం, పరిణామం నిరంతరాయం అని చెప్తోంది.

విశ్వం భౌతికాతీతమైనదికాదు. విశ్వం సర్వం భౌతికమైందే. విశ్వాన్ని జీవరాసుల నన్నింటినీ సృష్టించాడని చెప్పబడుతున్న దేవుడనే వాడు లేడు. మనిషి దేవుడ్ని, విశ్వాన్ని

సృష్టించకముందే విశ్వం ఉంది. అది నియమబద్ధమైంది (Law Governed) ఆ నియమాన్ని కనుక్కోవడం, అధ్యయనం చేయడం, వాటి మధ్య ఉండే సంబంధాలను అర్థంచేసుకోవడమే శాస్త్రజ్ఞానం అని నమ్ముతోంది హేతువాదం.

"Whatever happens in accordance with laws and these laws are such that we can discover them."

దైవం అభౌతికం. మానవులకు దృగ్గోచరం కాదు. మతం, దైవం పరస్పరం సమ్మిళితాలు. దైవభావాన్ని మతమే స్థిరీకరించింది. దేవుని పేరిట మతాలన్ని పరమ క్రౌర్యాన్ని ప్రదర్శించేయి. మానవ జీవితాలను రక్తసిక్తం చేసాయి అన్నది చరిత్ర చెబుతోన్న సత్యం.

ఒక రకంగా చూస్తే దైవం, మతం మానవజీవితానికి చేసిన మేలుకంటే కీడే ఎక్కువ అని చరిత్ర ఋజువు చేసింది. ఒకే మతంలోని భిన్న శాఖల మధ్య దైవం పేరుతో హత్యాకాండలు కొనసాగేయి. కాథలిక్కులు - ప్రొటస్టెంట్లు, షియాలు - సున్నీలు, శైవులు - వైష్ణవులు మధ్య జరిగింది మత పోరాటాలే. దైవం పేరిట మానవ జాతికి చెడు వారసత్వమే లభించిందని చెప్పవచ్చు.

దేవుడు మనిషిని సృష్టించాడా? లేక మనిషే దేవుడ్ని సృష్టించాడా? దేవుడు తన రూపంలో మనిషిని సృష్టించాడని మత గ్రంథాలు చెబుతున్నాయి. కానీ, శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తే జీవపరిణామ దశలో క్రమంగా మానవావిర్భావం జరిగిందని డార్విన్ సిద్ధాంతం చెబుతోంది. శాస్త్రజ్ఞులంతా అంగీకరించిన సత్యం ఇది. దీంతో దైవభావానికి గండి పడింది. కాబట్టి, మానవుడే దేవుడ్ని తన రూపంలో సృష్టించేడని హేతువాదం విశ్వసిస్తోంది.

"మతం అనే పదానికి సమ్మతమైంది అని, అనగా ఇచ్ఛ, బుద్ధి (జ్ఞానము) అనే అర్థాలు ఉన్నాయి. కాబట్టి మతమనగా ఇష్టమైనదని, తెలిసికోబడినదని, అభిప్రాయము అని చెప్పవచ్చును. అతీంద్రియ విషయములను గూర్చినట్టియు, మనుష్యుల శ్రేయస్సు. కర్తవ్యములను గూర్చినట్టియు ప్రతీతిని, శ్రద్ధ (విశ్వాసము)ను మతమనుట తెలుగులో రూఢి అయినది. కొన్ని భారతీయ భాషలలో దీనినే సంప్రదాయము అందురు."

మతం అనే పదానికి అభిప్రాయం అని అర్థం. రూఢ్యర్థంలో దేవునిపై విశ్వాసంగా మారింది. ఆదిమ మానవుడు

శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తే జీవపరిణామ దశలో క్రమంగా మానవావిర్భావం జరిగిందని డార్విన్ సిద్ధాంతం చెబుతోంది. శాస్త్రజ్ఞులంతా అంగీకరించిన సత్యం ఇది. దీంతో దైవభావానికి గండి పడింది. కాబట్టి, మానవుడే దేవుడ్ని తన రూపంలో సృష్టించేడని హేతువాదం విశ్వసిస్తోంది.

ప్రకృతిలో ఉన్న పరిణామాలు, భయోత్పాతాలు, ఉరుములు, మెరుపులు, తుఫానులు, వరదలు మొదలైనవన్ని చూచి భయపడి ప్రకృతి శక్తులమీద, ప్రకృతికి అతీతమైన శక్తులమీద కొన్ని నమ్మకాలు పెంచుకొన్నాడు.

"ప్రకృతిని గురించిన భయమే మతావిర్భావానికి దారి తీసింది. నిజానికి మతాలన్ని ప్రారంభంలో హేతుత్వం నుంచి పుట్టినవే." సమకాలీన సమాజంలోని అస్తవ్యస్తాలను సరి చేయటానికి ఆవిర్భవించినవే. కానీ కాలం గడిచేకొద్దీ వ్యవస్థీకరణ పొందడంవల్ల భిన్నాభిప్రాయాలను సహించలేకపోవడం వల్ల తిరిగి ఆ మతాలన్ని మూఢ విశ్వాసాలకు నెలవయ్యేయి. జ్ఞాన సోపానాలు ఎక్కే కొలది సూత్రాలను మార్చుకొంటూ ముందుకు సాగేది విజ్ఞాన శాస్త్రం - సైన్సు, తొలిమెట్టు మీదనే కూర్చొని జపం చేసేది మతం. అంటే మతం పరమ సూత్రాలను ప్రతిపాదిస్తుందికాని మార్పును సహించదు. అందువల్లనే మతగ్రంథాల్లో క్రోడీకరించిన సూత్రాల్లో మార్పును సహించలేరు మతవాదులు. పరిమిత జ్ఞానంతో చెప్పబడిన ఆ సూత్రాలనే గొప్ప సత్యమని నమ్ముతారు.

అన్ని మతాల్లోను ప్రధానమైంది దైవభావం, మతం దేవుడ్ని ప్రపంచానికి ఏలికను చేసింది. మానవుడ్ని బానిసగ చేసింది. మతం - దేవుడు ఈ రెండు పరస్పరాశ్రయాలు. మతం ఉంటే దేవుడుంటాడు. దేవుడు పోతే మతం పోతుంది.

"మతం మనిషిలోని స్వార్థాన్ని పోగొట్టి అతణ్ణి మంచి మనిషిగా చేస్తుంది. మతం మనిషి జీవితాన్ని సరిదిద్ది సాంఘిక కట్టుబాట్లను ఏర్పరుస్తుంది. శాంతియుత జీవితాన్ని ఇస్తుంది అంటారు మతవాదులు."

Religion is one of the earliest of Social institutions. It is a product of human ingenuity with

**ఆలోచించి చూచినట్లయితే వృత్తులనుబట్టి ఏర్పడ్డ విభాగాలనే స్వంత ప్రయోజనార్థం ఎపుడో ఎవరో కులాలుగా విభజించారు. తెలివైనవారు దాన్ని భగవంతుని సృష్టి అన్నారు. ఇక భగవద్ సృష్టి కాబట్టి ప్రశ్నించే ధైర్యం ఎవరికీ లేకపోయింది. ఈ రోజు ఈ కులవ్యవస్థే మన జాతి పురోగమనానికి పెద్ద అడ్డుగోడ అయిందని విజ్ఞులు భావిస్తున్నారు.**

the purpose of enabling man to be at peace with himself and with the suppose agency that guides and controls the Universe." అని, మతవాదులంటారు. అన్ని మతాలసారం ఒకటేనంటారు. పరస్పరం ద్వేషించుకోవటం తప్ప ఒకదాంతో మరొకటి కలసి మానవ శ్రేయస్సుకై పాటుపడిన సందర్భాలు లేవు. మతాలు ప్రేమను సౌభ్రాతృత్వాన్ని పెంచి పోషించటానికి నిర్దేశింపబడ్డాయి అంటారు. కాని అందుకు విరుద్ధంగా శత్రుత్వాన్ని పెంచి రక్తపాతానికి దారి తీసిన సంఘటనలే చరిత్రలో కోకొల్లలు.

అయితే మతాలవల్ల ప్రయోజనం లేదా? అవి మానవ బోధ చేస్తున్నాయి కదా అనేది ప్రశ్న. మానవ విలువలకు సంబంధించిన సత్యాలు అన్నిమతాల్లోను ఎంతో కొంత ఉంటాయి. అవి ఏ ఒక్క మతం యొక్క సొత్తుకాదు. తరతరాలుగా మానవుడు నిలబెట్టుకొంటు వచ్చిన విలువల వారసత్వం అది. మతాల్లో మంచి ఏదైనా ఉంటే దాన్ని స్వీకరించటానికి సిద్ధమే నంటుంది హేతువాదం, అదీ మానవాభ్యుదయానికి విజ్ఞానం, శాస్త్రం పునాదిగా ఉన్నపుడు మాత్రమే నంటోంది. లేనపుడు అటువంటి మతాలను స్వీకరించవలసిన అవసరం లేదంటోంది. మత నిరాకరణతో దైవభావం కూడ నిరాకరించబడుతోంది.

మతంలాగే కులం కూడ మనుషులను అరలు అరలుగ విభజించింది. ఎన్నో అసమానతలకు అరాచకాలకు కులం మూల కారణమైంది. అస్పృశ్యత పేరుతో సమాజంలో అంటరానివారిని సృష్టించింది. ధర్మశాస్త్రాలు అగ్ర, అధమ వర్ణాలుగ సమాజాన్ని చీల్చి విధి నిషేధాలను నిర్దేశించేయి.

హిందూదేశంలో వర్ణవ్యవస్థ ఈనాడు పెకలించటానికి వీలులేనట్లుగ వేళ్ళూని మహావృక్షమై కూర్చుంది. ఈ వర్ణవ్యవస్థకు బీజం మనకు ఋగ్వేదం పదవ మండలం పురుషసూక్తంలో కనిపిస్తోంది.

"బ్రాహ్మణో అస్యముఖ మాసీత్, బాహురాజన్య కృత్ణ
ఊరూత దస్యయద్ వైశ్య పదభ్యా శూద్రో అజాయత్ణ"

విరాట పురుషుని ముఖం నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదాల నుండి శూద్రులు పుట్టారని చెప్పబడుతుంది. ఇన్ని అసమానతలతో కూడిన ఈ కులవ్యవస్థను ఎవరు ఎప్పుడు ఎందుకు సృష్టించారు? వృత్తుల ననుసరించి బయలుదేరి కాలానుక్రమంగ కరడుగట్టి పోయిందని చారిత్రక పరిశోధకులు అంటుండగ, భగవంతుడే ఈ వ్యవస్థను సృజించాడని నమ్ముతున్నారు మతాన్ని విశ్వసించేవారు.

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశ్ణ
తస్య కర్తా రమపిమాం విద్ధ్య కర్తారమవ్యయమ్"

(భగవద్గీత 4-13)

ప్రపంచంలో మరే దేశంలోనూ లేని ఈ కులవ్యవస్థను భారతదేశపు దేవుడే సృజించాడు. తక్కిన దేశాల్లో మతాలున్నాయి, జాతులున్నాయి. వృత్తులను బట్టి, ఆర్థిక తారతమ్యాలనుబట్టి వర్గాలున్నాయికాని వర్ణాలు లేవు.

ఆలోచించి చూచినట్లయితే వృత్తులనుబట్టి ఏర్పడ్డ విభాగాలనే స్వంత ప్రయోజనార్థం ఎపుడో ఎవరో కులాలుగా విభజించారు. తెలివైనవారు దాన్ని భగవంతుని సృష్టి అన్నారు. ఇక భగవద్ సృష్టి కాబట్టి ప్రశ్నించే ధైర్యం ఎవరికీ లేకపోయింది. ఈ రోజు ఈ కులవ్యవస్థే మన జాతి పురోగమనానికి పెద్ద అడ్డుగోడ అయిందని విజ్ఞులు భావిస్తున్నారు.

"ఈ దేశంలో కులం జాతీయ జీవనంలో అంతర్భాగంగా కలిసిపోయింది. మానసిక రుగ్మతగా మిగిలిపోయింది. కులం ముద్ర లేని మనిషి భారతదేశంలో లేడని చెప్పవచ్చు. కులాలన్ని ప్రత్యేక జీవిత విధానాన్ని ఏర్పరచుకున్నాయి. ఈ వైవిధ్యం జాతీయతా దృక్పథాన్నుంచి కులపరిధి లోనికి భారతీయులను ఈడ్చు కొచ్చింది. అందువల్లనే అభ్యుదయ విప్లవోద్యమాలు కూడ ఈ కులం రంగు నుంచి బయట పడలేకపోతున్నాయి. దీన్నిబట్టి ఈ దేశంలోని సామాజిక వ్యవస్థ కులం పునాదులమీద నిలబడి వుందని తెలుస్తుంది."[14]. అభ్యుదయ నిరోధకమైన 'కులాన్ని'

హేతువాదం అంగీకరించదు.

హేతువాదం మతవాదులు చెప్పే 'ఆత్మ'ను 'పునర్జన్మ'ను కూడ వ్యతిరేకిస్తుంది.

వేదాంతం పేరుతో బోధించే మార్మికవాదాన్ని (mysticism) హేతువాదం తిరస్కరిస్తుంది. దీన్ని పలాయనవాదం అంటుంది. మతవాదులు ఆత్మ మరణంలేనిదని శాశ్వతమైనదని అంటారు. మనుషులు చిరిగిన బట్టలను విడిచి క్రొత్తవైన బట్టలను ధరించినట్లుగ ఆత్మ శిధిలమైన శరీరాన్ని విడచి నవీనమైన యితర శరీరాన్ని చేరుతుందని చెబుతారు.

"వాసాంసి జీర్ణాని యధావిహాయ
నవాని గృహ్ణాతి నరో పరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యణ్యాని సంయాతి నవాని దేహి"
"నైనం ఛిన్దన్తి శస్త్రాణి
నైనం దహతి పావక్ష
న చైనం క్లేదయన్త్యాపో
నశోషయతి మారుత్ణ" ॥ భగవద్గీత ॥

కాని ఆత్మ శాశ్వతంకాదని మనిషి మరణించడంతోనే అతని దేహధర్మాలన్నిటితోపాటు ఆత్మ, ఆత్మ చేస్తుందనుకొంటోన్న ఆలోచనలు కూడ ఆగిపోతాయి. 'ఆత్మ' వేరుగా మిగిలి ఉండదు. జీవితం ఐహికమైంది. పరం అనేది లేదు. 'ఆత్మ, పునర్జన్మ, స్వర్గం పుట్టుక చావుల మధ్యదే జీవితం. మృత్యువు మనిషిని నిర్జీవంగ, శవంగ చేయడం ఆ శవాన్ని కళ్ళారా చూడడం సహించలేని మనిషి మరణానంతరం అశరీరమైన ఆత్మ ఉంటుందని దాన్ని మరొక శరీరంలోనికి వెళ్ళటాన్నో (పునర్జన్మ) లేదా 'దయ్యం' (ghost or spirit) గానో ఊహించుకొన్నాడు. ఈ భావనకు ప్రతీకగానే 'ఆత్మ'కు చావు పుట్టుకలుండవని, అది రూపాలు మార్చుకుంటు పోతోందని ఊహించేడు. ప్రపంచంలోని కొన్ని దేశాల్లోను ఇటువంటి ఆలోచనా క్రమం కొనసాగుతుంది. ఈజిప్టులోని పిరమిడ్స్ ఇందుకు మంచి ఉదాహరణ.

పునర్జన్మను హిందువులు నమ్ముతారు. మనిషి తాను చేసుకొన్న పాప పుణ్యాలను బట్టి జన్మలెత్తుతుంటాడని విశ్వసిస్తారు. కాని హేతువాదం దీని నంగీకరించదు.

"చావు తర్వాత ఏమిటి? ఈ పుట్టుకముందు ఏమిటి?

**ఈ విశ్వం అంతా ఏదో పరమాత్మ సృష్టి అని మాత్రం హేతువాదం నమ్మదు. కర్త - భర్త - హర్త అనేవి సృష్టి - స్థితి - లయలనే పేటతో కల్పించుకొన్న ఊహలు మాత్రమే అంటుంది. నిజానికి పదార్థం పరిణామంలో ఉన్న త్రిదశల్లో ప్రకటించే త్రివిధ ప్రవృత్తులే ఇవని విశ్వాతీత శక్తులేవి ఇందులో లేవని అంటోంది.**

అన్న ప్రశ్నలు పెరుగుతూ వచ్చేయి. వాటికి సమాధానం కోసం ప్రకృతిలో సారూప్యం వెదుక్కుంటామని ఒక Link ఏర్పరచాలని భావించడం. పుట్టుక - చావులను ఒకే చట్రంలో బిగించి ఒకదాన్ని మరొకదాని వెంటకలపడం అతని మానసిక ఆలంబన (wish fulfilment) కు ప్రతీక. ఈ కోరిక బలపడి మనిషి చావును ఒక ముగింపుగా అంగీకరించలేక దానిని పొడిగించాలని చేసిన ప్రయత్నమే 'పునర్జన్మ'ను గూర్చిన ఊహాకల్పన. ఈ విధంగా పుట్టుకకు ముందు చావు. చావు తర్వాత మళ్ళీ పుట్టుక చేర్చి తనను తాను తృప్తి పరచుకున్నాడు. ఆదశలో మనిషికి అందుబాటులో ఉన్న విజ్ఞానం అంతమాత్రమే." తనకున్న అరకొర జ్ఞానంతో మనిషి ప్రతిపాదించిన 'పునర్జన్మ' సిద్ధాంతం శాస్త్రీయ దృష్టితో చూస్తే నిలవలేదని హేతువాదుల అభిప్రాయం.

నశించటం అనేది వస్తులక్షణం అని, పదార్థం సృష్టించబడదు నాశనమవదు అని అంటారు. ప్రకృతిలో మానవ జీవితమొక్కటే కాదు ఏదీ స్థిరం కాదు. స్థిరం కాకుండా వుండడమే 'ప్రకృతి ఉన్నది' అనడానికి నిదర్శనం. స్థిరం అయితే చచ్చిపోయినట్లే అంటారు. మనిషి నిరంతరం పెరుగుతూ, క్షీణిస్తూ, ఆలోచిస్తూ మార్పు చెందకపోతే మనిషి కూడా చచ్చిపోయినట్లే. "మనిషి కూడా పరిణామంలో వుండడమే జీవించి వున్నాడనడానికి చిహ్నం. కొంతగా ఆ పరిణామాన్ని తాను నడుపుకోగలిగినంత కాలం మనిషి మనిషిగా జీవించివుంటాడు. ఆ పరిణామం లక్షణాలను వ్యక్తీకరించడానికి అవకాశాలున్నంత కాలం మనం జీవించి వుంటాం. ఆలోచిస్తాం ఏమేమో చేస్తాం. ఒకానొకస్థితిలో యీ శరీరం జీవలక్షణాలను అభివ్యక్తి చేయలేని దశకు చేరుకొంటుంది. ఆ స్థితిని

మరణమంటాం" మరణాన్ని ఒక పరిణామంగా చెప్పే హేతువాదం పునర్జన్మ అనే అంశాన్నే అంగీకరించదు.

హేతువాదులు చెప్పే విషయాలనుబట్టి వీరు విశృంఖల వాదులు పరమ స్వేచ్ఛాపరులు భగవంతుడేలేడనే వీరు నీతివాదులుకారు అనే అపప్రధ ఉంది. కాని హేతువాదులకు నీతి, స్వేచ్ఛ పట్ల కూడ కొన్ని స్థిరమైన అభిప్రాయాలు ఉన్నాయి. హేతువాదులు కోరే స్వేచ్ఛను గూర్చి పరిశీలిద్దాం.

"హేతువాదమనేది కేవలం తర్కం కాదు. హేతువాద లక్ష్యం సాధనం రెండూ మానవుడే. అందువల్ల జ్ఞానం, స్వేచ్ఛ, సత్యం, నీతి, మానవతలకు స్థానమిచ్చే ఆలోచనా విధానమే హేతువాదం."

స్వేచ్ఛ అనేది మనిషిలోని భౌతిక మానసిక శక్తుల వికాసానికి దోహదం చేస్తుంది. కాని నాశనం చేయదు. హేతువాదం అన్ని రంగాలలోను స్వేచ్ఛను కోరుతోంది. స్వేచ్ఛగ జీవించాలనే వ్యక్తికి జ్ఞానం చాల అవసరం. అప్పుడే అది జీవితాన్ని సరైన బాటలో నడపగలదు. అటువంటి జ్ఞానమే స్వేచ్ఛగా ఉండడానికి అవసరమైన శక్తినిస్తోంది.

హేతువాదం భావరంగంలో కూడ నియంతృత్వాన్ని, నిర్బంధాన్ని వ్యతిరేకిస్తోంది. ఇదేదో కేవలం ప్రకృతి విషయాలకు మాత్రమే పరిమితమైంది అనుకోనవసరం లేదు. సామాజిక విషయాలకు అది పనికిరాదని కొందరు భ్రమపడితే మరికొంతమంది హేతువాదం మానవుడికి బాహ్యంగా వున్న అంశాలకే పరిమిత మైంది. మానవ అంతర్గత విలువలని అది పట్టించుకోదని అభిప్రాయపడ తారు. కాని హేతువాదం అన్ని రంగాల్లోను స్వేచ్ఛను కోరుకొంటోంది. ఒక రంగంలో స్వేచ్ఛకోసం మరో రంగంలోని స్వేచ్ఛను బలి యివ్వదు. నియంతృత్వాన్ని ఆహ్వానించదు.

స్వేచ్ఛ కూడ హేతుబద్ధమైనదే అంటారు హేతువాదులు. "అసంబద్ధ విశ్వాసాల నుంచీ, అసమంజసమైన నిర్ణయాలనుంచీ స్వేచ్ఛ సాధించడానికి మానవుడు వుపయోగించే సాధనం హేతువాదమొక్కటే."

అన్ని రంగాలలో స్వేచ్ఛను కాంక్షిస్తూ దైవభావాన్ని త్రోసిరాజనే హేతువాదులు 'నీతి'కి ఏం ప్రాముఖ్యమిస్తారని పూర్వపక్షం చేసేవారున్నారు. నీతిపట్ల కూడ హేతువాదులకు స్థిరమైన అభిప్రాయాలున్నాయి.

ఆత్మ – పరమాత్మలని – స్వర్గనరకాలని, పాపపుణ్యాలని ఆమోదించని హేతువాదంలో 'నీతి'కి తావెక్కడా అని ప్రశ్న, కాని దైవ వాదులందరూ నీతిమంతులా? అని హేతువాదం తిరిగి ప్రశ్నిస్తోంది. హేతుమంతుడుకానివాడు నీతిమంతుడు కాలేడు. అంటోంది హేతువాదం.

నీతి వ్యక్తి యొక్క సామాజిక ప్రవర్తనకు సంబంధించింది. ఒక అవినీతి కార్యంవల్ల సమాజంలో ఎట్లాంటి దుష్ప్రభావాలు కలుగుతాయో, అది వ్యక్తిమీద ఎలాటి 'మచ్చ' ఏర్పడు తుందో వివేచన చేయగలడు కాబట్టి నీతిమంతుడుగ ఎందుకు ప్రవర్తించాలో హేతువాదికి తెలిసినట్లు తక్కిన వారికి తెలియదు. హేతువాదమే మనిషిని నీతి మంతుణ్ణి చేస్తోంది అంటోంది హేతువాదం.

సామాజిక వ్యవస్థలో నీతి నిలదొక్కుకోవడానికి మత దైవభావాలకు ఎటువంటి సంబంధమూలేదు. ఎందుచేతనంటే ఈనాటి సమాజంలో ఆస్తికులే ఎక్కువ. దైవభీతితోనైనా మంచిపనులెక్కువే జరగాలి. కాని అందుకు విరుద్ధంగా జరుగుతోన్నాయి. అంటే దైవభీతి కూడ నైతికవిలువల్ని కాపాడలేక పోతోంది. వ్యక్తిలోని నైతిక ప్రవర్తనకు సామాజిక నీతి పునాది. అంతేకాని పాపపుణ్యాలు భయంవల్ల నీతి ఉత్పన్నమవదు.

మానవుడు నీతిమంతుడుగా ఉండాలంటే స్వేచ్ఛగా వుండాలి. స్వేచ్ఛగా వుండాలంటే హేతువాదిగా వుండాలి. అపుడు మాత్రమే హేతుమంతుడు నీతిమంతుడు అవుతాడు. మానవునిలోని హేతుస్థాయినిబట్టి నీతిస్థాయి ఉంటుంది. అందరిలోను హేతుస్థాయి ఒకలాగే ఉండదు కాబట్టి నీతి స్థాయి ఒకేలాగ ఉండటం సాధ్యంకాదు.

హేతువు (Reason) హేతుత్వం (Rationality) అనేవి క్రొత్తగ ఇపుడు పుట్టుకొచ్చినవి కాదు. హేతువాదం అనేది ఈ ఆధునిక యుగంలో ప్రబలిన సిద్ధాంతం కాదు. అనాదిగా మానవుడి ఆలోచనా సరళియే హేతువాదానికి దారి తీసింది. విశ్వాసం, అవిశ్వాసం అనేవి అనాదిగా సమాంతరరేఖలుగ ప్రయాణం చేస్తోనే ఉన్నాయి.

ఇంటర్వ్యూ

# 'అసహనం'పై తిరుగుబాటు అవార్డు వాపసీ



ఇంటర్వ్యూ: కెంగార మోహన్

కవులు, కళాకారులు, రచయితలు, మేధావులపై జరుగుతున్న హత్యాకాండలకు వ్యతిరేకంగా నరేంద్రమోడి ప్రభుత్వంపై ప్రజల్లో నెలకొన్న అసహనానికి కన్నెర్ర చేసిన కవులు, రచయితలు కేంద్రప్రభుత్వమిచ్చిన ప్రతిష్టాత్మక పురస్కారాలను తిరిగి ఇచ్చేశారు. దేశంలో *26* మంది రచయితలు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డులను వాపస్ చేశారు. ఇది కనివినీ ఎరుగని చరిత్ర. అంతర్జాతీయ మీడియా సైతం ఈ అంశంపై దృష్టి సారించి, ఇది ప్రజాస్వామ్యాన్ని కాపాడే ప్రభుత్వం కాదని, మతోన్మాదాన్ని పెంచిపోషించే ప్రభుత్వమని తూర్పార పట్టింది. అవార్డులు వాపస్ ఇవ్వకుండా నజరానాలు ఇస్తామని, ప్రభుత్వం పరువుపోతుందని అకాడమీ అధికారులతో ప్రభుత్వం పంపిన రాయబారాలు విఫలమయ్యాయి. రచయితల్లు తలొగ్గలేదు. *26* మంది కవులు కళాకారుల్లో కర్నూలు జిల్లా నుంచి కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం పొంది, అవార్డును వెనక్కిచ్చిన రచయిత వున్నారు. కర్నాటక సరిహద్దు ప్రాంతమైన ఆదోని పరిసరగ్రామాల్లో దళితులపై కొనసాగుతున్న వివక్ష, దమనకాండలకు నిరసనగా రాసిన 'అరమనె' నవలకు కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం *2008*లో లభించింది. కవిగా, రచయితగా, నవలాకారుడుగా, అనువాదకుడుగా, సినిమాలకు కథలందించిన సినీ కథకులుగా, అన్నిటికీ మించి కర్నూలు జిల్లా ప్రభుత్వ ఉపాధ్యాయుడుగా సుమారు *24* సంవత్సరాలు, అనంతపురం జిల్లాలో *11* సంవత్సరాలు మొత్తం *35* సంవత్సరాలు సేవలందించి, కర్నూలు జిల్లా ఉత్తమ ఉపాధ్యాయులుగా అవార్డు పొందిన కుం.వీరభద్రప్పతో జరిపిన ముఖాముఖీ...

**మీ జీవిత విశేషాలు చెప్పండి?**

కన్నడ సాహిత్యలోకం నన్ను **కుంవీ** అని పిలుస్తారు. 1 అక్టోబర్ 1953లో కర్నాటక రాష్ట్రంలోని బళ్ళారి జిల్లా కూడ్లిగి తాలూకా కొట్టూరులో వ్యవసాయ కుటుంబంలో కొట్రమ్మ హాలప్ప దంపతులకు జన్మించాను. యస్.యస్. ఎల్.సి వరకు స్వగ్రామం లోనూ, టిటిసి సిద్ధగంగ మఠలోనూ యంఏ మైసూరులోనూ చదివాను. చిన్నప్పటినుండి సాహిత్యంపై అభిలాష పెంచుకుని ప్రగతిశీల సాహిత్యాన్ని చదివాను **1975లో ఇందిరాగాంధీ విధించిన ఎమర్జెన్సీకి** వ్యతిరేకంగా ఉద్యమాలు చేశాను. అరెస్టు చేస్తారేమోనన్న బెంగతో మా నాన్న మా అక్కగారి ఊరైన కర్నూలు జిల్లా హొళగుందకు బలవంతంగా పంపారు. విప్లవభావజాలం పోలేదు. కర్నాటకలోని **బండాయ** అనే విప్లవసాహిత్యసంఘంలో కార్యకర్తగా పనిచేసేవాడిని.

**ఉపాధ్యాయులుగా ఎప్పుడు నియమితుల య్యారు. అక్కడ చేపట్టిన సామాజిక సంస్కరణలేంటి?**




1975 సెప్టెంబర్ 25 న కర్నూలు జిల్లాలో కన్నడ ప్రభుత్వ ఉపాధ్యాయుడుగా చేరాను. ఆదోని డివిజన్ **గూళ్యం, వందవాగిలిలలో** 24 సంవత్సరాలు, అనంతపురం జిల్లా హీరేహాళ్‌లో 11 సంవత్సరాలు పనిచేశాను. ఆనాడు దళితులు చదవుకునేందుకు గ్రామాల్లో పెత్తందార్లు ఆంక్షలు విధించారు. **వందవాగిలి** గ్రామంలో దళితులకు చదువుచెప్పేందుకు శ్రీకారం చుట్టాను. అక్కడి పెత్తందార్లు తీవ్రమైన వ్యతిరేకత, దాడికి సిద్దమయ్యారు. పాఠశాల కూడా గుడిలో కొనసాగేది. దాన్ని హరిజనవాడకు మార్చి దళితుల్లో చైతన్యం తీసుకొచ్చి 300 మంది దళితుల్ని విద్యా వంతులుగా తీర్చిదిద్దాను. బానిసలుగా ఉన్న దళితులకు విముక్తి కలిగించాను. నారాయణ అనే కిరాయి హంతకుడితో అక్కడి వారు ఐదువేల రూపాయలకు నన్ను హత్య చేసే ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆత్మరక్షణ కోసం నేను **కుంగ్‌ఫూ, కరాటే** నేర్చుకుని ఉండటం, స్వయంగా నేను **వెయిట్ లిఫ్టర్** కావడంతో కిరాయి హంతకుడి పాచికలు పారలేదు. దళితులకు చదువు చెప్తే హత్య చేస్తావా? అని ప్రశ్నించడంతో ఆ కిరాయి హంతకుడు నాకు పాదాభివందనం చేసి వెళ్ళిపోయాడు.

**మీరు అప్పుడు ఆశించిన ప్రయోజనాలు ఏమిటి?**

ఒక పక్క విద్యనందించడం మరొక పక్క రచనలు చేస్తూ, ప్రజల్ని చైతన్య పరిచే సమావేశాలు పెట్టడం చేశాను. కులరహిత సమాజం ఆవిర్భవించాలంటే, బానిసబతుకు అంతం కావాలంటే అక్షరమే ఆయుధమని బలంగా విశ్వసించి ఆ దిశగా చురుకైన పాత్ర పోషించాను. **బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు** వ్యతిరేకంగా పోరాడాను. తల్లిదండ్రులను చైతన్య పరిచి అక్షరంవైపు మళ్ళించాను. ఎందరో సంఘసంస్కర్తలను అధ్యయనం చేశాను. ఆస్తులుంటే ఇబ్బంది అవుతుంది అక్షరముంటే చాలనుకున్నాను. వ్యవస్థను ప్రశ్నించే యంత్రాంగం అవసరమని భావించాను. కులం పేరుతో ఉన్న దళితుల పిల్లల పేర్లను ఆధునిక పేర్లుగా మార్చాను. రమేష్, మహేష్, వీరేష్ అంటూ పిలిచాను. హాజరుపట్టికలో అలాగే నమోదు చేశాను.

**మీ మొదటి రచన?**

1974లో **కూడు** అనే కథ రాస్తే అది **మయూరలో** అచ్చయ్యింది. దానికి 25 రూపాయల బహుమతి వచ్చింది. **దివి సీమెయ హాడు, నీనిల్లద మనె** అనే కావ్యాలు రాశాను. కరెంటు లేని కారణంగా దీపం బుడ్డీ పెట్టుకుని రచనలు చేశాను.

**మీ కుటుంబం వివరాలు ? వారి సహకారం ఎంతవరకు?**

నేను చేసే ప్రతి పనిలో నా కుటుంబం సహకారం మరువలేనిది. నన్నెంతగానో ప్రోత్సహిస్తారు. ఆదర్శభావాలుగలిగిన పిల్లలుగా వారిని తయారు చేశాను. నాకు ముగురూ కుమారులే. **గౌతమబుద్ధుని కొడుకైన పురురవ** అని పెద్దకొడుకుకు, **శాలివాహన** అని రెండవ కొడుకుకు, **ప్రవర** అని మూడవ కొడుకుకు పేర్లు పెటాను. నా మూడవ కొడుకు ప్రవర నా అడుగు జాడల్లో నడుస్తూ కన్నడసాహిత్యంలో సంచలనమైన ఆధునిక కవిగా ఎన్నో సత్కారాలు, అవార్డులు పొందుతున్నాడు. ఇప్పటికీ నేను నా అర్ధాంగి అన్నపూర్ణమ్మను అమ్మా అని పిలుస్తాను. ఇలా పిలవడాన్ని నేను నాకున్న సంస్కారంగా భావిస్తాను.

**మీ రచనలు చెప్పండి?**

కన్నడ కథా సాహిత్యంలో నిగినిగి హగలు, మణ్ణేమొదలు, రాయలసీమ, కూళె, బరి కథెయల్లో అణ్ణా(సమగ్ర కథల సంకలనం), డోమ మత్తితర కథెగళు, బళావే విచిత్రం, ఇన్నాదరు సాయబేకు, కుం.వీ ఆయ్ద కథెగళు, భగవతి హాడు. నిజలింగ, అపూర్వచింతామణి కథ, సుశీలె ఎంబ నాయయూ వాగిలి ఎంబ గ్రామవూ, ఎంటర్ ది డ్రాగన్, కుం.వీ బరెద కథెగళు, నవలా సాహిత్యంలో హేమా రెడ్డి మల్లమ్మన కథెయు, ఏకాంబర, కప్పు, బేలి మత్తు హొల,ఆస్తి, కొట్రె హైస్కూలిగె సేరిద్దు, యాపిల్లు, శ్యామణ్ణ, కెండెద మళె, ప్రేమ వెంబ హొన్నుడి, బేటి, పక్షి గళు, ప్రతిధ్వని, ద్యావలాపుర, హనుమ, అరమనె,బేలియ హూగళు, అరోహణ, నిజలింగతో పాటు చాప్లిన్, రాహుల్ సాంకృత్యాయన్, నేతాజి సుభాష్ చంద్రబోస్, సుభద్రమ్మ మన్సూర్, శ్రీ కృష్ణదేవరాయ, **గాంధీ క్లాస్(కుం.వీ ఆత్మకథ)** మొదలైన జీవన చరిత్రలు రాశాను. కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందిన అనువాదాలు చిన్న దతేనె, ఒందు పీళిగెయ తెలుగు కథె గళు, ప్రముఖ తెలుగు రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి తన మార్గం కథలను తన మార్గ పేరుతో అనువదించాను. ఇతర భాషలనుండి **300** పైగా కథలను కన్నడభాషలోకి అనువదించాను. **జమిందారీ వ్యవస్థ మత్తు తెలుగు సాహిత్య** అనే అనే విమర్శ గ్రంథం రాశాను. కథగళు అనే కథ సంకలనానికి సంపాదకత్వం వహించాను. **2008లో అరమనె రచనకు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు** లభించింది.దాన్ని **14 సెప్టెంబర్ 2015న కేంద్రప్రభుత్వానికి వెనక్కిచ్చాను.** తుముకూరిన వీచి, రాణి చెన్నూరిన లద్వా, గౌరీశ కాయ్కిణె, రాజ్య సాహిత్య అకాడమీ, రాజసాహిత్య అకాడమీ యింద గౌరవ ప్రశస్తి, వర్ధమాన ప్రశస్తి, ప్రొ.కె.జి.కుందణ గార గడినాడ సాహిత్య ప్రశస్తి, నృపతుంగ మొదలైన ప్రసిద్ధమైన పురస్కారాలు వచ్చాయి. ఈ అవార్డుల ద్వారా వచ్చిన సొమ్మును బ్యాంకులో డిపాజిట్టు చేసి, దాని ద్వారా సంవత్సరానికి వచ్చే వడ్డీ 72 వేల




రూపాయలను **పేద పిల్లల విద్యాభివృద్ధికి** ఖర్చు చేస్తున్నాను. విద్యలో అత్యంత ప్రతిభ కనపరచి ప్రభుత్వ పాఠశాలల్లో చదివిన ఆరు మంది పిల్లలను ఎంపిక చేసి ఆర్థికసహాయం అందిస్తున్నాను. మనె మెచ్చిద హుడిగి(1987), దొరె(1995), కొట్రేశి కనసు, కెండద మళె(1998), బేలి మత్తు హొల(2010) కూర్మావతార(2013) భగవతికాడు మొదలైన కన్నడ సినిమాలకు కథలందించాను. ఈ చిత్రాలన్నీ అవార్డు పొందినవి.

**మన దేశంలో సాహిత్య కారుల పరిస్థితి ఎలా వుంది?**

మన కవులను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిరకం పార్కుల్లో సంచరించేవారు, రెండోరకం అడవిలో సంచరించేవారు. పార్కులో తిరిగే కవులకు ప్రజల కష్టాలు తెలియవు. వాళ్ళు ఎప్పుడూ ప్రభుత్వ విధేయులు. ప్రభుత్వ సన్మానాలు, సత్కారాలకోసం ప్రాకులాడుతారు. రెండోరకం కవులు అడవుల్లో సంచరించే వారు. వారికి ముళ్ళ బాధ, మృగాల దాడి, విష సర్పాల భయాలు అన్నీ తెలుసు. నేను రెండోరకానికి చెందిన వాడిని. నేను అన్నీ కష్టాలు తెలుసుకున్నవాడిని. రెండో రకం కవులే ప్రజాస్వామ్యాన్ని రక్షిస్తారు. ఎవరైతే ప్రభుత్వ తీరును ప్రశ్నిస్తారో అసలు సిసలైన ప్రజాస్వామ్యవాదులు,




ప్రశ్నించని వారు నా దృష్టిలో వేశ్యలతో సమానం. మహాకవి శ్రీశ్రీకి అవార్డు ప్రకటించినపుడు అతన్ని రెండు నెలలు కిడ్నాప్ చేశారు. మీరు ప్రజాస్వామ్యాన్ని ప్రశ్నించేవారని మిత్రులు అతనికి చెప్పారు. బ్రహ్మానందరెడ్డితో అవార్డు తీసుకోవద్దని వారించారు. ఆయనకూడా అర్థం చేసుకున్నారు. ఈ విషయం నాకు చెరబండరాజే చెప్పారు. అందుకే ప్రజల పక్షానే కవులుండాలి. నా పంథా అదే.

**ఈ దేశాన్ని పాలిస్తున్న మోడీ ప్రభుత్వ వైఖరి మేధావుల పట్ల, కవుల, కళాకారుల పట్ల ఎలా వుందంటారు.?**

ఈ ప్రభుత్వం పాలనలోకి రావడానికి 200లక్షలకోట్లు ఖర్చు చేసింది. ఎవరిచ్చారు. పెట్టుబడిదారులు ఇచ్చారు. పరోక్షంగా దేశాన్ని వారికి దోచిపెడతారనే కదా? ఈ దేశంలో అన్ని మతాల వారున్నారు.హిందూ అంటే ఏమిటి? దాని అర్థం స్వరూపం మార్చేశారు. 127కోట్ల జనాభా గూర్చి మాట్లాడాలి. అందరికీ బతికే హక్కుంది. అన్ని మతాలవారు ఈదేశంలో ఉన్నారు. ఈ ప్రభుత్వం బతికే హక్కునే కాలరాస్తున్నది. ఈ ప్రభుత్వం బ్రిటీష్ వారికంటే ప్రమాదకరమైంది. మొన్న నాగపూర్‌లో ఆరెస్సెస్ వారేంచేశారో తెలుసు కదా? గోమాంసంపై అంత రాద్ధాంతం ఎందుకు? ఎవరి ఇష్టాఇష్టాలు వారివి. ఎవరిచ్చారు హత్యలు చేసే అధికారం. చట్టాన్ని చేతుల్లోకి తీసుకున్నారు. మహామేధావి యం.యం కలబుర్గిని హత్య చేశారు. ఇంతవరకు పట్టుకున్నారా? ఇది ప్రభుత్వం చేసిన హత్యకాదా? హత్య ఎవరు చేశారో తెలుసు, ఎవరు చేయించారో తెలుసు? ఇలాగే ప్రజలు జీవించాలి అనే తాలిబాన్‌లాంటి కల్చర్ తీసుకురావాలనుకుంటున్నారు.

**అందుకే నా అవార్డు తిరిగిచ్చారు.?**

అవును. ఇంత జరిగినా సాహిత్య అకాడమీ ఎందుకు ప్రశ్నించలేదు. అంటే వారికి పదవులు కావాలి. ప్రజల బాగోగులు పట్టించుకునే వేధావులు, కవులు, కళాకారులు, రచయితలకు ఏం జరిగితేనేం. అసహనం కాదా? అందుకే నేను 2015 సెప్టెంబర్ 14 న బెంగళూరు వెళ్ళి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు తిరిగి ఇచ్చాను. 50వేలు డీడీ తీసి పంపాను. సాహిత్యఅకాడమీ కార్యదర్శి తెలుగువాడే శ్రీనివాసరావు. వద్దన్నాడు. అవార్డు ఇవ్వద్దండి ప్రభుత్వ పరువుపోతుందన్నారు. న్యాయవిరుద్ధమైన పనులు ప్రభుత్వం చేస్తున్నది, కవుల పక్షాన మీరు ప్రశ్నించరా? అని అడిగాను. నజరానాలెన్నో చెప్పాడు. నేను ఒకే మాట చెప్పా అవార్డు తిరగిస్తున్నాను అని. ఇప్పటి వరకు 26 మంది అవార్డు వాపస్ చేశారు. ఇది అంతర్జాతీయ వార్త అయ్యింది. వరల్డ్ ప్రొగ్రెసివ్ రైటర్స్ ఫోరం మద్దతు నిచ్చింది. కవులెప్పటికీ ప్రజల పక్షమే. అవార్డు వాపస్ చేయడం వల్ల పార్లమెంటు పునాదులు కదిలాయి. ఈరోజు సమాజం కోసం పోరాడేది కవులు లెఫ్టిస్టులే. సమాజం బాగుపడాలంటే లెఫ్ట్ పోరాటాలే ఏకైకమార్గం. నాకు కార్ల్ మార్క్స్ అంటే చాలా ఇష్టం. ఒక గొప్ప దార్శనికుడు. మా బండాయ సంస్థ సభ్యులందరూ మార్క్స్ ఆశయాల సాధన కోసం పోరాటం చేస్తుంటారు.

**కేంద్రప్రభుత్వం పెట్టుబడిదారులనెలా ప్రోత్సహిస్తుందంటారు.?**

మొదట ప్రవేటీకరణ చేస్తారు. ప్రయివేటు పరిశ్రమలను ప్రోత్సహిస్తారు. ఇపుడు టాటా అన్నీ ఉత్పత్తి చేస్తుంది. గుడ్డలు, చెడ్డీలు బనియన్లతో సహా..మన కాటేజీ ఇండస్ట్రీస్ వెళ్ళిపోయాయి. పరోక్షంగా రైతులకు ఆత్మహత్య చేసుకోమని సంకేతాలిచ్చినట్లే. ఇపుడు రైతుల పరిస్థితి ఘోరంగా వుంది. ఎవరిచేతుల్లోకి ఎవరు వెళ్ళపోయారో

తెలుస్తుంది కదా! అన్నీ పెట్టుబడిదారులే చేస్తారు. పాలనతో సహా. మనిషి ఉనికి, అస్తిత్వం లేని పరిస్థితి వుంది. అంతెందుకు మన దేశంలో ఇంతకు ముందు ప్రాణాంతకమైన వ్యాధులుండేవా? ఎయిడ్స్, డెంగీ, ఆంత్రాక్స్, రకరకాలైనవి. ఈ దేశం మీదికి వాటిని ప్రయోగిస్తారు. ప్రాణాలు తీస్తారు. వారు బతకాలంటే వాడి మందులు కొనాలి. వారికి మన ప్రభుత్వాలే అనుమతులిస్తుంది. ఇదంతా మన ప్రభుత్వ ప్రోత్సహమేకదా! వ్యాధులను కూడా పెట్టుబడిదారులే ఇంట్రడ్యూజ్ చేస్తారు. అమెరికాలో ఏది ఉత్పత్తి చేయరు. కంజూమరింగ్ చేస్తారు. వెపన్స్ మాత్రమే తయారు చేస్తారు. అది ప్రపంచాన్ని శాసిస్తుంది.

**ప్రభుత్వానికేం చెప్పదలచుకున్నారు.?**

మన పార్లమెంటులో 75% మిలీనియర్స్, 72% క్రిమినల్స్ వున్నారు. వాళ్ళపై ఎఫ్ఐఆర్‌లున్నాయి. వాళ్ళకు ఈ సువిశాల దేశాన్ని పాలించే హక్కేలేదు. వాళ్ళకేం చెప్పాలి ఇంతకంటే. వాళ్ళేం ప్రజలకు మంచిపాలన అందిస్తారు. పాలనంటే రైతులకు తక్కువ ధరకు ఎరువులివ్వడం, ఉచితంగా కరెంటు ఇవ్వడం, రైతులకు ట్యాక్స్ లేకుండా చేయడం. కనీసం 40కేజీల బియ్యం పేదలకు ఉచితంగా సరఫరా చేయడం, రైతు బాగుంటే దేశం బాగుంటుంది. త్రీజీ, ఫోర్జీలు కాదు. అన్నం కావాలి. పేదల కడుపులు నిండాలి. పేదల సంక్షేమం. రైతుల సంక్షేమం మరిస్తే అధోగతే. మోడీ పులిమీద కూర్చుని పాలిస్తున్నాడు. అది ప్రమాదం అని తెలుసుకుంటాడు.

**రచయితలకు కళాకారులకు మీరిచ్చే సందేశం ఏమిటి?**

సందేశం ఇచ్చేంతటి వాడినికాదు కాని, మనమంతా పోరాడదాం. ప్రభుత్వమిచ్చే నజరానాలు వద్దు. సన్మానాలు, సత్కారాలకోసం పాకులాడవద్దు. మనం ప్రజలపక్షాన నిలబడి పోరాడదాం. మన రచనలు ప్రభుత్వాలకు కళ్ళు తెరిపించాలి. ప్రజల సంక్షేమానికి సమాజ పురోభివృద్ధికి మార్గంచూపాలి. మతోన్మాదం, ప్రపంచీకరణ చాలా ప్రమాదకరం. ఇది మనం గమనించాలి. పత్రికలు, మీడియా కార్పోరేట్ల చేతుల్లో వున్నాయి. వారి కబంధహస్తాల నుంచి మనం మీడియాని, పత్రికలని రక్షించుకోవాలి. ఇది కవులు, కళాకారులు, రచయితల వల్లే సాధ్యమవుతుంది. ప్రజల్లో చైతన్యం తీసుకువచ్చేందుకు నిరంతరం పోరాడదాం.








*బ్రిటిష్ వలస వాదుల ఆగ్రహానికి గురైై నిషేధించబడి, జప్తు చేయబడి, తగులపెట్టబడిన నవాబ్‌రాయ్ (ప్రేమ్‌చంద్) ఉర్దూకథల సంపుటి 'సోజేవతన్'.*

*1909లో బ్రిటిష్ ప్రభుత్వం 'సోజేవతన్'ని నిషేధించి ప్రచురణ కర్త నుండి దొరికిన దాదాపు 500 కాపీలు జప్తుచేసి తీసుకెళ్ళిపోయి, తగులబెట్టించింది. అంతేకాదు 'ధనపత్‌రాయ్' తర్వాత రాసే ప్రతి రచన ప్రభుత్వానికి చూపించి వారి అనుమతితోనే ప్రచురించాలని బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశించింది. ఐతే ధనపత్‌రాయ్ ఈ ఉత్తర్వు ధిక్కరించి తన కలంపేరు ప్రేమ్‌చంద్‌గా మార్చుకొని ఉర్దూలోనూ, హిందీలోనూ పుంఖాను పుంఖాలుగా రచనలు చేయడం మొదలుపెట్టాడు.*

*ప్రేమ్‌చంద్‌కి తల్లిదండ్రులు పెట్టిన పేరు ధనపత్‌రాయ్. వీరు 1880 జులై 31న జన్మించారు. 1897లో మెట్రిక్ ప్యాసై, 1900 సంవత్సరంలో ప్రభుత్వ విద్యాశాఖలో ఉపాధ్యాయునిగా చేరారు. 1901 నుండి నవాబ్‌రాయ్ అనే కలం పేరుతో సాహిత్య వ్యాసంగం ప్రారంభించారు. వీరి తల్లి నవల 'అసారే మాబిద్' (దేవాలయ రహస్యము)లో మఠాలలోను, దేవాలయములలోను పూజారుల, పండాల మహంతుల, మోసాలను అమాయక స్త్రీలకు వారు చేస్తున్న అన్యాయాలను చిత్రించారు.*

నిషేధ చరిత్ర

# నిరసన నుండి స్వేచ్ఛా స్వరానికి - చిలకమర్తి





వకుళాభరణం రామకృష్ణ

ఇరవయ్యో శతాబ్దంలో, వ్యక్తిపర, సామాజిక స్వేచ్ఛ, రాజకీయ స్వేచ్ఛా పిపాసాలకు పరిణామం చెందడం గమనిస్తాం. దేశాన్ని ప్రేమించమనీ, దేశభక్తిని పెంచమనీ, గతాన్ని కీర్తిస్తూ, వర్తమాన, భవిష్యత్‌లను నిర్లక్ష్యం చేయ తగదనీ, సమాజంలో చిరకాలంగా పాతుకుపోయిన సమస్త మూఢాచారాలను, మత, సామాజిక రంగాల్లో స్వేచ్ఛకోసం - ప్రధానంగా స్త్రీలపరంగా - కవులు గళం విప్పారు.

సాహిత్యానికి ఎన్ని ప్రయోజనాలున్నా - వ్యష్టిపరంగా ప్రధానమైంది సామాజికమే! సాహిత్యాన్ని స్వార్థప్రయోజనాల గుపయోగించక, తిరస్కరించే సంప్రదాయం తెలుగు సాహిత్యానికి ముందునుండీ వున్నదే! "కూళలకిచ్చి యప్పుడుపు గూడు భుజించుట కంటె" సత్కవులు స్వశక్తిపై ఆధారపడి నేల దున్నుకొని హాలికులుగా బతకడమే మంచిదన్న, స్వేచ్ఛా, ధిక్కార స్వరాల్ని విన్నాం. మధ్యయుగాల్లో శతకకవులు, నీతి, శృంగార, వైరాగ్య శతకాలంతోపాటు, అప్పటి ప్రభువులపై వారి పీడనను ఖండించి, పరోక్షంగానైనా, ధిక్కార, స్వేచ్ఛా స్వరాలను వినిపించారు.

ఆధునిక యుగంలో, గురజాడ కాలం నాటికి, అంతకుముందు కొంచెం ముందు, వెనుకలుగా సాహితీవేత్తలెందరో (కవులే కానక్కరలేదు), అప్పటి సమాజపు కట్టుబాట్ల ను, నిషేధాలను, మూఢవిశ్వాసాలను తిరస్కరించి, ప్రధానంగా సాంఘిక ఆచార వ్యవహారాల్లో స్వేచ్ఛను కోరుతూ రచనలు చేసేవారు. "మంచియన్నది మాల అయితే మాలనే అగుదున్", అనడం లోనూ, అజ్ఞానంతో తోకచుక్కను ఆపదగా భావించక, ఆ ప్రకృతి అద్భుతాన్ని 'సంఘ సంస్కరణ పతాక'గా భావిస్తానని గురజాడ అనడంలో, కాలంచెల్లిన సమాజపు మూఢవిశ్వాసాలను ధిక్కరించి, సేచ్ఛాస్వరం వినిపించడమే!

సామాజికంగా గాక, వ్యక్తిగత జీవితాల్లోని ప్రేమ, వివాహం లాంటి అంశాల్లో స్వేచ్ఛా గానాన్ని వినిపించారు. స్వేచ్ఛాస్వరం సమాజ జీవితంలో ఆదరణను పొంది, సాహిత్యంలో 19వ శతాబ్ది అంతానికి బలంగా చోటుచేసుకొంది.

ఇరవయ్యో శతాబ్దంలో, వ్యక్తిపర, సామాజిక స్వేచ్ఛ, రాజకీయ స్వేచ్ఛా పిపాసాలకు పరిణామం చెందడం గమనిస్తాం. దేశాన్ని ప్రేమించమనీ, దేశభక్తిని పెంచమనీ, గతాన్ని కీర్తిస్తూ, వర్తమాన, భవిష్యత్‌లను నిర్లక్ష్యం చేయ తగదనీ, సమాజంలో చిరకాలంగా పాతుకుపోయిన సమస్త మూఢాచారాలను, మత, సామాజిక రంగాల్లో స్వేచ్ఛకోసం – ప్రధానంగా స్త్రీలపరంగా – కవులు గళం విప్పారు. కలాలకు పదును పెట్టారు. 20వ శతాబ్ది రెండో దశకానికి, స్వేచ్ఛా స్వరం చిక్కబడి, ఆర్థిక, రాజకీయ అంశాలపై స్పందించ నారంభించింది. ఈ పరిణామం దేశభక్తి గీతాల్లో ప్రస్ఫుటంగా, సామాజిక అంశాలతో పాటు, ఆర్థిక, రాజకీయాలపై ప్రసరించింది. కారణం, అప్పటికే దాదాభాయి నౌరోజీ గ్రంథం "Poverty and The Un-British Rule in India" ప్రాచుర్యం పొంది, ఆర్థిక జాతీయ వాదం (Economic Nationalism) పురుడు పోసుకొంది. భారతీయ సమాజం, రాజకీయ పీడనతోపాటు, ఆర్థిక దోపిడీకి గురవుతున్నదనీ, భారీ మొత్తాల్లో సంపద ఇంగ్లండ్‌కు తరలిపోతున్నదన్న స్పృహ (సంపద తరలింపు సిద్ధాంతం – Drain Theory), ప్రాచుర్యం పొందింది. జాతీయోద్యమంలో కీలక మలుపు. దేశ ప్రయోజనాలకు, సామ్రాజ్యవాద (England) ప్రయోజనాలకు వైరుధ్యాన్ని గుర్తించడంలో జాతీయోద్యమంలో గుణాత్మక మార్పు వచ్చింది. తెలుగు సాహిత్యంలో యీ గుర్తింపును ప్రజల్లోకి బలంగా తీసుకెళ్ళిన వారిలో గరిమెళ్ళ (మాకొద్దీ తెల్లదొరతనము గీతంలో ఆర్థిక దోపిడిని తేటతెల్లంగా వర్ణించారు) ప్రముఖంగా ముందుండి సాహిత్యపరంగా దేశద్రోహ నేరానికి, నిర్బంధానికి, దక్షిణ భారతంలో గురై కారాగారవాస శిక్షననుభవించిన ప్రథముడు గరిమెళ్ళ కావడం తెలుగు సాహిత్యానికి గర్వకారణమే! అదలా ఉంచండి.

మేము వివరింపబూనిన స్వేచ్ఛా స్వర అక్షరశిల్పి, చిలకమర్తి లక్ష్మీనరసింహం గూర్చి. సామాజికంగా, వీరేశలింగం అడుగుజాడల్లో నడచినా, చిలకమర్తి సంస్కరణ పరిధులు దాటి, జాతీయోద్యమంలో భాగంగా రచనలు చేశాడు. దళితోద్ధరణ కార్యక్రమం గాంధీ చేపట్టకముందే, 1909లోనే రామమోహన్ పాఠశాలను దళితుల కోసం, తన పరిమిత ఆదాయం నుండే ఖర్చుపెట్టి, నడిపాడు. అదేక్రమంలో జాతీయ పాఠశాల (Religious Institution) నొకదానిని స్థాపించి, అందులో మతవిద్య ప్రవేశపెట్టాలన్న ప్రతిపాదనను తిరస్కరించి, సెక్యులర్ రీతిలో, "మతవిద్య పరస్పర వైషమ్యాలు కలిగించునని", వాదించి కృతకృత్యుడయ్యాడు.

*వీరేశలింగం అడుగుజాడల్లో నడచినా, చిలకమర్తి సంస్కరణ పరిధులు దాటి, జాతీయోద్యమంలో భాగంగా రచనలు చేశాడు. దళితోద్ధరణ కార్యక్రమం గాంధీ చేపట్టకముందే, **1909**లోనే రామమోహన్ పాఠశాలను దళితుల కోసం, తన పరిమిత ఆదాయం నుండే ఖర్చుపెట్టి, నడిపాడు.*

'దేశమాత', 'మనోరమ' పత్రికల నిర్వహణకు, ప్రత్యేకంగా ముద్రాక్షరశాల నేర్పర్చుకొన్నాడు. మండల సభలు విరివిగా జరుగుతున్న సందర్భంలో అటు ఉత్తరాన గంజాం నుండి, ఇటు రాయలసీమ జిల్లా వరకు వాటిలో పాల్గొనడమే గాక, మద్రాసులో 1914లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సభల్లో పాల్గొని దక్షిణాఫ్రికాపై తీర్మానాన్ని బలపర్చారు. నిమ్న జాత్యుద్ధరణకు ఇతోధికంగా తోడ్పడ్డమేగాక, వారితో సహపంక్తి భోజనాలూ చేశారు.

ఇవన్నీ ఒక ఎత్తు. కాగా, స్వాతంత్ర సమరంలో భాగంగా బెంగాల్ విభజనను వ్యతిరేకిస్తూ సభలు నిర్వహించి, బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర ప్రాంతంలో పర్యటించినప్పుడు వారి ఉపన్యాసాలను తెలుగులోకి అనువదించి మాట్లాడారు. ఆ సందర్భంలో ఆంగ్ల పాలనలోని ఆర్థిక దోపిడిని అశువుగా పద్యరూపంలో – 'భరతఖండంబు చక్కని పాడియావు' చెప్పారు (ఈ పద్య కర్తృత్వం గూర్చి భిన్నభిప్రాయాలున్నాయి). కానీ, తానే ఆ పద్యం చెప్పానని స్వీయ చరిత్రలో రాశారు. అదే సందర్భంలో బిపిన్ చంద్రపాల్‌కు ఒక నిధిని గూడ సమర్పించారు. లాలాలజపతిరాయ్‌ని అరెస్టుచేసి ద్వీపాంతరవాస శిక్ష విధించినప్పుడు నిరసనగా 1907లో జరిగిన సభలో ఖండిస్తూ మాట్లాడాడు. దేశభక్తుల కారాగార వాస శిక్షల గూర్చి ప్రబోధకంగా, –

"చెరసాలలో పృథు చంద్రశాల లెయగాన్" అంటూ అరదండలను విరిదండలుగా చెప్పి,

"భారత ఖండంబె యొక గొప్ప బందిఖాన" అంటూ

ఆంగ్లపాలన దౌష్ట్యాన్ని తీవ్రంగా దుయ్యబట్టారు. 1895లో జరిగిన గోదావరి మండల సభకు హాజరయి, అందులో చదివిన పద్యాలందరి దృష్టినాకట్టుకొన్నాయి. ఇది ముఖ్యంగా ఆంగ్ల పాలనను, దోపిడిని, నిర్బంధాలను గూర్చి విపులంగా వివరించాడు. ఉదాహరణకు, ప్రజలపై పన్నుల రూపంలో మోపిన ఆర్థిక భారాన్ని కిందివిధంగా వర్ణించాడు.

సీ॥ నేల దున్నుదనున్న జాలతరము పన్ను
నీరుగావలెనన్న నీటిపన్ను
వాణిజ్య మొనరిపం వచ్చు బడికి పన్ను
సరుకులమ్ముదమన్న సంత పన్ను
కర్రలమ్ముదమన్న కలపగింకొక పన్ను
పట్టణంబుల మున్సిపాలు పన్ను
పారిపోవుదుమన్న బండిహాసీల్ పన్ను
కొంపమ్ముణన్నచో స్టాంపు పన్ను

తే.గీ. ఉన్నమట్టుకు తినకుండ నుప్పు పన్ను
ననెడు పన్నులె దిగదీసె జనులకెల్ల
కటకటా! యెట్టులున్నదో కాపులదశ
సుంగుణ ధనులార జనులారా చూడరయ్య.

ఈ పద్యంలోని ప్రాసంగి కత, నేటికీ మన సమాజంలో వుండడం గమనార్హం. ఈ 14 పద్యాలను ఆంగ్లంలోకి అనువదించమని, న్యాపతి సుబ్బారావు పంతులు, గురజాడకు పంపారని రాశాడు.

చిలకమర్తి, తన పత్రిక 'దేశమాత'లో ఆంగ్ల ప్రభుత్వాన్ని విమర్శించిన 'నేరానికి', జరిమానా కట్టాల్సి వచ్చింది. మాక్మిలన్ (ఇంగ్లండ్) కంపెనీ వారు తెలుగు వాచకాలు రాయమని, ధనాశ చూపినప్పుడు, విదేశీ ప్రచురణ సంస్థలకు తాను రాయనని తిరస్కరించాడు. సహాయ నిరాకరణ ఉద్యమంలో జాతీయవాదుల సత్యాగ్రహ సంఘానికి అధ్యక్షులుగా వ్యవహరించాడు. తెలుగునాట సాంఘికంగానే గాక, రాజకీయంగా, జాతీయోద్యం అప్పటికింకా మతవాద దశలో నున్నప్పుడు, తదనుగుణంగా స్వేచ్ఛాస్వరాన్ని వినిపించిన కవి, నవలాకర్త, నాటక రచయిత, దేశభక్తుడు చిలకమర్తి. ఆ స్ఫూర్తిదాత జీవితం భావి తరాలకు స్ఫూర్తిగా వుండాలన్న ధ్యేయంతో, ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం 1944లో చిలకమర్తి స్వీయ చరిత్రము'ను ముద్రించి, వారిని సన్మానించింది.



## 'దేశమాత' పత్రికపై ఆంక్షలు

ఆ దినములు వందేమాతరము దినములు. బంగాళా దేశ విభాగము చేత, దొరతనము వారికి జనులకు సరిపడని దినములు. పత్రికలన్నియు దాదాపుగా దొరతనము వారికి వ్యతిరేకముగానే వ్రాయబడుచుండెను. అందుచేత దొరతనము వారొక క్రొత్త ఫక్కి కనిపెట్టిరి. ఒక వారపత్రికకు సంవత్సరమునకు మూడు రూపాయలు చందా యనుకొనుడు. దొరతనమువారే మూడు వేల చందాదారుల వల్ల వచ్చెడి ధనము, తొమ్మిది వేల రూపాయలు పత్రికాధిపతికిచ్చి పత్రిక పంపించవలసిన వారి పేర్లు తామే యిచ్చెడివారు. ఈ పద్ధతి బంగాళా దేశములో విరుద్ధములైన విషయములు వ్రాయకూడదు. ఇట్టి పత్రికకు సబ్సిడైజ్డ్ పేపర్ యని పేరు. కనకరాజుగారు నా మీద దయచేత, తాము దొరతనమువారికి వ్రాసిన 'దేశమాత' పత్రిక గూడనటువంటి పత్రికగా జేయింపవలెనని సంకల్పించి, యది నా కిష్టమో లేదో కనుగొనుమని మోచర్ల సుందరరామయ్య గారితోను, కందుల శ్రీమన్నారాయణ గారితోను చెప్పిరట. ధనమునకై బానిసగ నుండుటకు ఇష్టములేక, నా కట్టిపని యిష్టములేదని వారితో చెప్పితిని. "దరిద్రుడవైన నీవు సంవత్సరమునకు కొన్ని వేల రూపాయలు వచ్చెడి యవకాశమును జెడగొట్టుకొనుచున్నా"వని నా మిత్రులు నన్ను చీవాట్లు పెట్టిరి. అయినను వారి యుపదేశములు నా తలకెక్కలేదు. పత్రికా విషయమున నేను స్వతంత్రుడనై కఠినముగా విమర్శింప వలసినప్పుడు విమర్శించుట, శ్లాఘించవలసినప్పుడు శ్లాఘించుట మొదలైన యధికారములు కలిగియుండవలెను. కాని యెల్లప్పుడు దొరతనము వారిని శ్లాఘించుట నీచమని తలంచి, నేనా లాభమును నిరాకరించితిని. రెండవ మంచిపని యేమనగా 'మాక్మిలన్ కంపెనీ' యనే పుస్తకముల వ్యాపారములు జేసెడి పెద్ద కంపెనీ గలదు. వారి యేజంటు దొరస్వామయ్యగారు కాబోలు నాకడకు వచ్చి నాలుగైదు ఫారములకు తెనుగు వాచకములు వ్రాసి, తమ కంపెనీ కీయవలసిందని నన్నడిగిరి. తగిన సొమ్ము నిప్పించెదనని గూడచెప్పిరి , వారికి నేనిట్లు నమాధానము చెప్పితిని, ''ఆంగ్లేయులు

మనదేశములోని గనుల వలనను, టీ, కాఫీల వల్లను, రైలుబండ్ల వల్లను, మరి యితర సాధనముల వల్లను, ధనమంతయు పట్టుకొని పోవుచున్నారు. తెనుగు దేశములో బుట్టి దెనుగు ముక్కలు నాలుగు వ్రాయనేర్చిన మనము, దెనుగు పుస్తకముల వల్ల వచ్చు లాభమనుభవించకుండా, నదిగూడ నాంగ్లేయులకే యీవలెనా? నేనెన్నడు నింగ్లీషు కంపెనీలకు గ్రంథములు వ్రాసి యివ్వను, స్వదేశీయులెవరేని జేరి, యొక కంపెనీ పెట్టిన పక్షమున వారికి వ్రాసి యిచ్చెదను, లేదా నాకు నేనే వ్రాసుకొనెదను."ఆ పలుకులు విని యేజంటు విస్మయపడి యిట్లనెనె – "అయ్యా! ఈవరకెందరినో పుస్తకములు వ్రాసి యిమ్మని యడగితిని. కాని వారు పత్రిఫల విషయమై షరతులు పెట్టిరిగాని, యీ విధముగా నెవ్వరు మాటలాడలేదు. మీ యభిప్రాయములు నాకు వ్యతిరేకమైనను మిక్కిలి మంచిదే"యని పలికి వెడలిపోయెను.

1917వ సంవత్సరమున దేశమాత పత్రికలో, నేను గ్రామములో లేనప్పుడు దొరతనము వారిని విమర్శించుచు, నొక యాక్షేపణీయమైన వ్యాసము ప్రకటింపబడెను. అందుచేత దొరతనము వారి యుత్తరువు ప్రకారము, కాకినాడ జిల్లా కలెక్టరుగారు, మా ముద్రాక్షరశాల మీద వేయి రూపాయలు ధరావతు నీయమని యాజ్ఞాపించిరి. అప్పుడు భాగస్వాములము ముగ్గురము కూడి యుమ్మడిమీద మారువాడి వద్ద యప్పుదెచ్చి, ధరావతు చెల్లించితిమి. మూడు నాలుగేండ్ల తరువాత దొరతనము వారు మా ధరావతు మాకిచ్చి వేసినందుకు మారువాడి యప్పు పూర్తిగ దీర్చివేసితిమి.

**(చిలకమర్తి లక్ష్మీనరసింహం జీవిత చరిత్ర నుంచి...)**

## సంఘర్షణలోనే సృజన



మత గ్రంథాల్లో కనపడితే చాలు ఏదైనా సంగతి! దాన్ని గురించి మంచి చెడ్డలు విచారించే శక్తి ప్రజలకు పూర్తిగా నశిస్తుంది. అదంతా సత్యమేననీ, ఎవరన్నా ప్రశ్నిస్తే వాళ్లు దుర్మార్గులనీ, అవును ఇట్లాంటి బాధలు సర్వసాధారణమే. నాకే గాక యిట్లాంటి బాధ అందరికీ వుందే అనే విచారం వల్ల నా విచారం ఎక్కువ కావాలి కాని తృప్తి పడాలా? ఇతరులకు కూడా ఇట్లాంటి బాధలతో ఇంతకన్నా తీవ్రమైన వ్యధలతో నశిస్తున్నారని గంతులేసి సంతోషించాలా? .. పురాణాలూ నీతులూ ఆదర్శాలూ అన్నీ ఇలానే వుంటాయి. ఇతరులకి కూడా ఆపదలు తప్పవు కదా అని ఓదార్పు పొందే బదులు మనకీ వాళ్లకీ ఎవరికీ బాధలు లేకుండా వుండే మార్గాలు చాతనైనంత వరకూ ప్రయత్నిద్దాము అనుకోవడం ఎంత సౌహార్దం.

జీవితమంటేనే స్ట్రగుల్. ప్రతి పదార్థమూ ఉన్నత దశని పొందాలని పెనుగులాడుతో వుంటుంది. అవు దగ్గరనుంచి అన్ని జీవులూ క్రమంగా ఇంద్రియాలలో బుద్ధిలో పరిణామాన్ని పొందుతున్నాయి. మానవజాతిలో కూడా మనుషులు అడవిమనిషి నుంచి వృద్ధి పొంది బుద్ధి ఆత్మ వికసించు కోవడానికి నిరంతర ప్రయత్నంలో వున్నారు.... కనుక వున్నతమైన కళ ఎప్పుడూ మానవ ఔన్నత్యాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాన్ని ప్రతిఫలిస్తుంది. అందువల్లనే జీవితంతో సంబంధం కలిగివుంటుంది. యెప్పుడూ మార్పును సూచిస్తుంది.ఎందుకంటే జీవితమంటే ప్రవాహం. మారే స్వభావం గలది గనక జీవన శక్తి అదే.

యేదో విధంగా వున్న పరిస్థితులకు ఎదురీదని వాడు ఎక్కడో సంఘంతోనే ప్రజలతోనో విరోధంకల్పించుకోని వాడు గొప్ప కళను సృష్టించలేడు. చాలామంది ఇది వరకు వున్న అభిప్రాయాలనేమళ్లీ మళ్లీ ఏకరువు పెడుతో వుంటారు. మన ప్రబంధ కవులూ ఇంకా ఈనాడు మళ్లీ భారతాలూ రామాయణాలూ రాసేవారు ఉదాహరణలు. అసలు లోకంలో మెళకువ చాలామందికి రాదు. వాళ్లకు వృద్ధి క్షయాలు లేవు. వాళ్ల కళా అంతే. ఒక సున్నాలో చెప్పిందే చెప్పిందిగా ఒక భావం అటూ ఇటూ తిప్పుతో వుంటారు. గొప్ప కావ్యం రాయాలంటే కావలసింది పదాలుకాదు, సమాసాలుకాదు, వ్యాకరణం కాదు. కావలసింది ఆత్మ ఔన్నత్యం. స్ట్రగుల్. రెబెలియన్.

**(చలం మ్యూజింగ్స్ నుంచి)**

# పాలకుల పీడనపై 16 శతాబ్దంలో 32 గ్రామాల శిల్పుల మూకుమ్మడిసమ్మె





ఈమని శివనాగిరెడ్డి

తూర్పుగాంగరాజైన మూడో నరసింహదేవుడు క్రీ.శ. 1250 ప్రాంతంలో నిర్మాణం చేపట్టిన కోణార్కాలయ ద్వారబంధాలను చెక్కటానికి పాండ్య దేశం నుంచి తమిళ శిల్పులు రాజు ఆహ్వానంపై వలసబోయారు. ఇలా చరిత్ర పేజీలు తిరగేస్తే శాసనాలు, శాసనాక్షరాలూ శిల్పులే కాదు, పండితులు, రైతులు, వర్తకులు, వ్యాపారులు ఎంతోమంది ఎన్నోసార్లు ఒక చోటు నుంచి మరోచోటుకు వలసబోయిన సంగతుల్ని మనముందుంచుతాయి. ఇదంతా ప్రోత్సాహానికి స్పందనగా జరిగిన వలసలు. పన్ను లెక్కువై నిరుత్సాహానకి గురై నిరసనతో తట్టుకోలేక కట్టుబట్టలతో శిల్పులు దూర ప్రాంతాలకు వలసబోయిన సంగతి ఆసక్తికరంగా ఉంటుంది.

పుష్కలంగా వనరులున్న చోటికి, ప్రోత్సాహాలు రారమ్మని కవ్విస్తున్నప్పుడు, పదోన్నతులు, పారితోషికాల కోసం, మెరుగైన జీవన ప్రమాణాల కోసం రైతుల దగ్గర నుంచి రాజోద్యోగుల వరకూ, ఉన్న చోటు నుంచి దూరాభారాల్ని లెక్కచేయకుండా వలసలుబోవడం చరిత్రకు కొత్తేమీ కాదు. ఆ మాటకొస్తే ఆహార సంపాదన కోసం కాలినడకన ఖండాంతరాలకు వలసబోయాడు ఆదిమానవుడు లక్షల ఏళ్ల కిందటే. వ్యాపార లావాదేవాల కోసం రోము నుంచి గంజాము దాకా వలసవచ్చారు. ఇటలీ వర్తకులు. జీవన భృతి కోసం అమరావతి నుంచి శ్రీలంకలోని అనురాధపురం వరకూ వందల కొద్దీ బౌద్ధ శిల్పులు క్రీస్తుశకారంభంలోనే వలసపోయారు. కన్నడ రాజశిల్పుల ఆహ్వానంపై ద్వారాబంధాలను తీర్చిదిద్దడంలో నిపుణుడైన వేంగినాటి వెలనాటిగుండయ అనే తెలుగు శిల్పి కర్నాటకలోని పట్టడకల్‌కు వలసబోయాడు. క్రీ.శ. 6వ శతాబ్దిలో. క్రీ.శ. 9వ శతాబ్దిలో కమ్మనాడుకు చెందిన కురవది ఆచార్లు తెలంగాణలోని కరీంనగర్ ప్రాంతానికి దేవాలయ నిర్మాణ పనులకు వలసబోయారు. కర్నాటక రాష్ట్రంలో సరస్వతీ-వీరనారాయణాలయాలకు ప్రసిద్ధిగాంచిన గదగ్ నుంచి క్రీ.శ. 1063వ సంవత్సరంలో 'సరస్వతీగణ' అనే శిల్పకారుల సంఘం సామర్లకోట దేవాలయ నిర్మాణంలో పాలుపంచుకోవటానికి తెలుగు నేలకు వలసవచ్చారు.

తూర్పుగాంగరాజైన మూడో నరసింహదేవుడు క్రీ.శ. 1250 ప్రాంతంలో నిర్మాణం చేపట్టిన కోణార్కాలయ ద్వారబంధాలను చెక్కటానికి పాండ్య దేశం నుంచి తమిళ శిల్పులు రాజు ఆహ్వానంపై వలసబోయారు. ఇలా చరిత్ర పేజీలు తిరగేస్తే శాసనాలు, శాసనాక్షరాలూ శిల్పులే కాదు, పండితులు, రైతులు, వర్తకులు, వ్యాపారులు ఎంతోమంది ఎన్నోసార్లు ఒక చోటు నుంచి మరోచోటుకు వలసబోయిన సంగతుల్ని మనముందుంచుతాయి. ఇదంతా ప్రోత్సాహానికి స్పందనగా జరిగిన వలసలు. పన్ను లెక్కువై నిరుత్సాహానకి గురై నిరసనతో

తట్టుకోలేక కట్టుబట్టలతో శిల్పులు దూర ప్రాంతాలకు వలసబోయిన సంగతి ఆసక్తికరంగా ఉంటుంది.

పన్నుపోటు ఎక్కువైనపుడు వృత్తి పని వాళ్లు కూడా పాలకుల ఆజ్ఞలను లెక్కచేయక, ఎదురు తిరిగిన సందర్భాలెన్నో ఉన్నాయి. అనంతపురం జిల్లా మునుపటి ధర్మవరం తాలూకా, కనగానపల్లి గ్రామంలో సరిగ్గా అదే జరిగింది. పైగా ఒక్క వూరు కాదు, ఏకంగా 32 ఊళ్లలోని కమ్మర్లు, ఇత్తడి పనివాళ్ల, వడ్రంగులు, బంగారం పనిచేసే వాళ్ళు, రాతి పనిచేసే శిల్పులు (పంచాణం వారు) ఒక్కటై, మూకుమ్మడిగా ఎక్కువ పన్నేసినందుకు ప్రభుత్వాన్ని నిలదీశారు. కాయకష్టం మీద, పనిముట్లను, చేతివృత్తుల్ని నమ్ముకున్న కళాకారుల నమ్మకాన్ని వమ్ముచేసిన స్థానిక పాలకుల దమననీతిని ఎండగట్టారు. కానిక, కడ్డాయం, వెట్టి, వేములనే పన్నులు లేకుండా వంశాను గతంగా వస్తున్న నేర్పరితనంతో రకరకాల వస్తువులుగా తీర్చిదిద్ది సమాజంలోని అన్ని వర్గాల వారి అవసరాలను తీరుస్తున్న ఐదు రకాల శిల్పులపై ఒక్కసారిగా అధిక మొత్తంలో ! పన్నులు విధించి, దండిగా దండుకున్న ద్రోహుల్ని ప్రశ్నించినా పట్టించుకోక ముక్కు పిండి మరీ వసూలు చేశారు. మొక్కినా వరమీయని వేల్పును గ్రక్కున విడువంగవలయునన్న సుమతీ శతకకారుని గుర్తుతెచ్చుకొని, వారంతా సమ్మెకు పూనుకున్నారు. విజయనగర ప్రభువైన శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప అచ్యుత రాయ మహారాయులు రాజ్యం చేసేప్పుడు, స్థానిక ప్రభువైన వాకిటి తిమ్మప్ప నాయని కాలంలో అన్యాయంగా వసూలు చేసిన కానికలు భరించలేక 32 గ్రామాలు పంచాణం వారు, ఆ సీమను వదిలిపెట్టి వెళ్లాలని నిశ్చయించుకున్నారు. అందరూ ఒక్కటై, ప్రతి ఊరి పంచాణం వారు, వారి వారి వృత్తులకు సంబంధించిన పనిముట్లను, వారి సామానులను, కుటుంబ సభ్యులను పనివాళ్లు, పశువులతో సహా బళ్లు గట్టుకొని ఒక్క తాటిపై నడిచి తాముంటున్న సీమ విడిచి, కుందృపి సీమ, (కళ్యాణదుర్గం తాలూకా కుందుర్పి)కు, చిత్తూరు జిల్లాలోని పాకాల సీమకు వలసబోయారు. పన్నులు విధించి ఖజానాలు నింపుకోవాలనుకున్న పాలకులు పంచాణం వారి నిర్ణయం పట్ల ముక్కున వేలేసుకున్నా, మొండిపట్టుదలకు పోయారే తప్ప సమస్యకు పరిష్కారాన్ని ఆలోచించలేకపోయారు. అధికార మదం అలాంటిది. ఏది ఏమైతేనేం, పాలకులు పట్టించుకుంటారులే అనుకుని ప్రజలు మిన్నకుండిపోయారు. పంచాణం వారేమో పయనమైపోయారు.

**గ్రామాధికారుల అధికార దర్పానికి అద్దంపట్టే చిన్నపాటి కత్తులు, కటార్లు తుప్పుపడుతున్నాయే తప్ప తళతళలాడే కొత్త కత్తులు చేసేవాడు లేడు. పెళ్ళిళ్ళకూ, పండుగలూ పబ్బాలకూ ఆడపిల్లలకి కావాల్సిన వెండి, బంగారు నగలు చేసే కంసాలి వాళ్లూ లేరాయే! ఒక్క మాటలో చెప్పాలంటే జనజీవనం అస్తవ్యస్తమైంది.**

పల్లెలూ పొలిమేరలు దాటారు. చివరికి సీమలే దాటిపోయారు. ప్రయాణంలో ఇబ్బందులెదురైనా అవమానాన్ని సహించలేక అన్యాయాన్ని భరించలేక బహుదూరపు ప్రయాణానికే మొగ్గుచూపారు. కళాకారులను గౌరవించలేని క్రూరుల దగ్గర బారులు తీరి నిలబడలేక ఆత్మ గౌరవాన్ని పోగొట్టుకోలేక చేతిలో పని తనమున్న వారు ఎక్కడైనా బతకగలరని దేశంకాని దేశానికి వెళ్లటానికే తీర్మానించుకున్నారు.

వారం గడిచింది. నెల గడిచింది. మూణ్ణెల్లు గడిచింది. పంచాణం వారు ఖాళీ చేసిపోయిన 32 గ్రామాల్లో మామూలు ప్రజల ఇళ్లల్లో అలజడి ప్రారంభమైంది. వంటింట్లో కత్తిపీట పనిచేయటం లేదనీ, పొయ్యి ఊదుకోవటానికి గొట్టం పాడైపోయిందనీ, పచ్చడి నూరుకునే రోకలి అరిగిపోయిందనీ, తలుపుకు చిలుకు రాలిపోయిందనీ, బండి చక్రం పట్టాజారిపోయిందనీ, బావిలో నుంచి నీరుతోడుకునే బొక్కెనకు బొక్క పడిందనీ, నీళ్లు తెచ్చుకునే ఇత్తడి బిందె కడెం ఊడిందనీ, చెవి కమ్మల రాళ్లు కదులుతున్నాయనీ ఇలా ఒక్కొక్కరు ఒక్కో ఇబ్బందిని ఎదుర్కొంటూ సమస్యలను ఏకరువు పెడుతున్నారు. కమ్మరి లేక, వడ్రంగి రాక, ఇత్తడి బిందెలను మాటేసేవారు కరువై, గొలుసులు తెగితే అతుకేసే కంసాలి కనబడక, నానా అగచాట్లు పడుతున్నారు. ఆ వూళ్లవాళ్లు. మరో మూణ్ణెళ్లూ ఇలాగే గడిచిపోయాయి. ఇళ్లకు తిరగళ్లు, గుళ్లకు విగ్రహాలు చేసే శిల్పులు దొరక్క పడరాని పాట్లు పడుతున్నారు. 32 గ్రామాల ప్రజలు. చెట్లు కొట్టడానికి గొడ్డళ్లు, కోతలు కోయడానికి కొడవళ్లు, కలుపు తీయటానికి దోకుడు పారలు, మట్టి తవ్వటానికి గునపాలు, తవ్వింది తట్టకెత్తటానికి చలికె పారలు లేక రైతులు వెతలు బడుతున్నారు. గ్రామాధికారుల అధికార దర్పానికి అద్దంపట్టే చిన్నపాటి కత్తులు, కటార్లు తుప్పుపడుతున్నాయే తప్ప తళతళలాడే కొత్త కత్తులు చేసేవాడు లేడు. పెళ్ళిళ్ళకూ, పండుగలూ, పబ్బాలకూ ఆడపిల్లలకి

కావాల్సిన వెండి, బంగారు నగలు చేసే కంసాలి వాళ్లూ లేరాయే! ఒక్క మాటలో చెప్పాలంటే జనజీవనం అస్తవ్యస్తమైంది. స్తంభించిపోయింది.

ఎన్నాళ్లీ అగచాట్లు పడాలి? అన్ని రకాల ప్రజలూ అసంతృప్తితో రగిలిపోతున్నారు. పొలం పనులు సాగక, దుక్కులు దున్నక పంటలు ఇంటికి రాక రైతులు బిక్కమొఖం వేసుకున్నారు. కుంటి మంచాలపై ఇమడలేక, కటిక నేలపై పడుకోలేక సతమతమవుతున్నారు. సామాన్య ప్రజలు. ఏమిటీ విపరీతమని అందరూ కలిసి ముప్పై రెండు గ్రామాల రెడ్లు, కరణాలను నిలదీశారు. ప్రజల బాగోగులు పట్టించుకోని మీరేం నాయకులని ఎదురుతిరిగారు. నివ్వెరపోయిన కాపుల్లో కదలిక, కరణాల్లో అలజడి మొదలైంది. ఇక లాభం లేదనుకున్న స్థానిక పాలకులు, **పంచాణం వారు** లేందే ఒక్కరోజు కూడా గడవదన్న నిజాన్ని తెలుసుకోవటమేకాక పై వారికి విన్నవించారు. ప్రభువులు నిజాన్ని గ్రహించి, అన్యాయంగా పెంచిన పన్నుల్ని పూర్తిగా ఎత్తేసి, వలసపోయిన 32గ్రామాల శిల్పుల్ని మళ్ళీ రప్పించి, ఊళ్లు కళకళలాడేట్లు చేయటానికి తగు ఆజ్ఞలనిచ్చారు.

**ప్రజల తిరుగుబాటుపై పేరుసోములలోని ఈ మూడు దేవస్థానాలకు చెల్లే మాన్యాలకు, ఇంతకు ముందు, ఏలిన రాజులు ఎక్కువ పన్నుల రూపంలో అన్యాయంగా వసూలు చేసిన రొఖధాన్యాలను రద్దు చేసి ఆ మాన్యాలను సర్వమాన్యాలుగా ప్రకటించాడని ఉంది.**

అచ్యుతరాయలి నాయకుడైన, వాకిటి తిమ్మప్ప నాయునికి ఈ విషయం తెలిసి, జరిగింది తప్పని ఒప్పుకున్నాడు. తన కార్యకర్తలైన **ఈశ్వరయ్య,** ఇంకా **కనగానపల్లిరెడ్డి, భూమిరెడ్డి, చెన్నమ్మరెడ్డి, కరణం హోంనయ్య, పర్వతరాజు బసవయ్య, అయ్యపరసు నాగయ్య** మొదలగు 32 గ్రామాల **రెడ్డి, కరణాలందరూ** కనగానపల్లికి వచ్చి, **పంచాణం వారిపై** విధించిన వృత్తి పన్నులు, **కట్నం, కాణిక, అరవాసి కాణిక, కడ్డాయాలు, వెట్టివేములను** బాగా తగ్గించినామని మూకుమ్మడిగా ప్రకటించటమే కాక క్రీ.శ. 1533వ సంవత్సరం, మే, 6వ తేదీ మంగళవారం నాడు ఒక ప్రమాణ పత్రాన్ని కూడా **పంచాణం** వారికి రాసి ఇచ్చారు. జరిగిన అవమానానికి **పంచాణం వారి** క్షమాపణ కోరి, కుందుర్పి, పాకాల సీమలకు వలసబోయిన వారిని మళ్లీ తమ తమ గ్రామాలకు తిరిగి వచ్చి వారి వారి వృత్తుల్ని యథాతథంగా కొనసాగించమని బతిమలాడుకున్నాడు. **లోకజ్ఞానంతోపాటు జగద్విత కారణకర్తలూ, విశ్వకర్మ వంశోద్భవులైన ఐదు రకాల శిల్పులు** అలకమాని మునుపటిలా ప్రజల అవసరాలకు తీర్చటానికి పూనుకున్నారు. సమ్మె దెబ్బకు దిమ్మదిరిగిన పాలకులు కిమ్మనకుండా ఆ తర్వాత మరెప్పుడూ శిల్పుల జోలికెళ్లలేకపోయారు.

కడప జిల్లా పులివిందలి సీమలో పన్ను పోటెక్కువై రైతులు (కాపులు) అందరూ పులివిందలి విడిచి మరోచోటికి వలసపోయిన శాసనాధారం దొరికింది. పొలాలు పండించే వారు లేక, తిండి గింజలు మార్కెటుకు రాక అనేక ఇబ్బందుల్ని ఎదుర్కొన్న పులివిందలి సీమకు చెందిన **సెట్టిపట్టణస్వామి, రెడ్లు, కరణాలు, అష్టాదశ ప్రజలు,** అందరికీ కలిపి, శ్రీమద్రాజాదిరాజ రాజ పరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీఅచ్యుతదేవ మహారాయలు ప్రిధివిరాజ్యం చేయుచుండగా తిమ్మరాజు సలకయ్య, దేవమహారాజుల అయ్యవారి కార్యకర్తలైన తులువయల్లప్ప నాయనింగారు, క్రీ.శ. 1535 సంవత్సరం, ఆగష్టు 29వ తేదీ ఆదివారం నాడు ఒక **నమ్మిక శాసనాన్నిచ్చాడు**. దాని ప్రకారం, పన్నులెక్కువైనాయని భరించలేక వూరు విడచిపోయిన కాపులకు, కొత్తగా ఆ వూరికి వచ్చే కాపులకు, వూర్లో ఉన్న కాపులకు, ఇంతకు మునుపు పన్నుకట్టలేక మిన్నకున్న కాపులకు, ఇంతకు మునుపున్న పన్నును బాగా తగ్గించినట్టునూ, ఒకవేళ ఎవరైనా కాపులపై ఎక్కువ పన్ను విధించినట్లయితే వారికి 12 రూకల జరిమానా (అపరాధం) విధించటం జరుగుతుందని, పులివిందలి సీమను ఏలే దొరలు ఎవరైనా ఈ మర్యాదను తప్పినట్లయితే వారు తమ తల్లిదండ్రులను కాశీలో గంగానది ఒడ్డున చంపినంత పాపాన పోవటమే కాక, మర్యాద తప్పిన వారు తులువ యల్లప్ప నాయని అయ్యవారి గుర్రాన్ని మేపేవానికి వారి పెళ్లాన్ని ఇచ్చినట్లవుతుందనే కఠిన నిబంధన విధించారు.

కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకాలోని పేరుసోముల గ్రామంలో మరో పన్నుపోటు సంఘటన చోటుచేసుకుంది. విజయనగర ప్రభువు అచ్యుతదేవ మహారాయలు రాజ్యం చేసేప్పుడు, సలుకరాజు రఘుపతి రాజయ్య దేవ మహారాజులు, మహామండలేశ్వర చింతకుంట శిద్దయదేవ మహారాజుల కుమారుడు హనమయదేవమహారాజులు పేరుసోముల మహాలింగానికి,

## అమ్మ నవల -
## అనువాదకుడు క్రొవ్విడి లింగరాజు పాట్లు

**అనువాదకుని మనవి (తృతీయ ముద్రణ)**

క్రొవ్విడి లింగరాజుగారు 'కాంగ్రెస్' అనే పత్రికలో "వీరబలి" అనే వ్యాసం రాసినందుకు ఆనాటి బ్రిటిషు ప్రభుత్వం వారికి 124 ఎ (ఐపిసి) క్రింద 2 1/2 సంవత్సరాల జైలుశిక్ష విధించారు. 1932లో కన్నునూరు జైలులో శిక్ష అనుభవి స్తుండగా వారికి గోర్కీ "అమ్మ" పుస్తకం ఇంగ్లీషులో లభ్య మైంది. దానిని అమెరికాలోని అప్లెటన్ కంపెనీవారు ప్రచురిం చారు. స్వాతంత్రోద్య మానికి ప్రేరణగా వుంటుందని ఆ పుస్తకాన్ని వారు అనువదించారు. మొదటి భాగం కన్ననూరు జైలులోనూ, రెండవ భాగం కోయంబత్తూరు జైలులోనూ పూర్తిచేశారు. 1933లో జైలు నుండి విడుదలయిన ఒక మిత్రుని ద్వారా ఆ అనువాదం బయటకు వచ్చింది. 1934లో ఆదర్శ గ్రంథ మండలి అధిపతి గద్దె లింగయ్య మొదటగా దానిని ప్రచురించారు. దీనిని 1935లో ప్రభుత్వం నిషేధించింది. 1938లో రాజాజీ ప్రభుత్వం ఈ నిషేధాన్ని తొలగించింది. 1939లో రెండవ ప్రచురణ రౌతు చంద్రయ్య (రౌతుబుక్ డిపో-రాజమండ్రి) గారు వేశారు. 1946లో దేశీ కవితామండలి వారు తృతీయ ముద్రణ ప్రచురించారు. ఆ తర్వాత "అమ్మ" నవల ఐదుసార్లు పునర్ముద్రించబడింది. 1964లో క్రొవ్విడి లింగరాజు రష్యావారి ప్రచురణకై తిరిగి అనువాదం చేసి ఇచ్చారు. నిషేధింపబడిన 1934 ప్రచురణలో చార్లెస్ యెడ్వర్డ్స్ రస్సెల్ రాసిన తొలిపలుకు అనువాదమూ, మాక్సిమ్ గోర్కీ జీవిత సంగ్రహమూ, అనువాదకుని విజ్ఞప్తి కార్మికులకూ, యువకులకూ ప్రచురణకర్త విజ్ఞప్తి వున్నాయి.

"అమ్మ" తృతీయ ముద్రణాన్ని ఆంధ్రలోకానికర్పింప గలిగినందుకు సంతోషిస్తున్నాను. ఆదర్శ గ్రంథమండలి వారిచే మొదటి ప్రచురణమైన కొద్ది దినాలకే "అమ్మ" నిర్బంధముపాలు కావలసి వచ్చింది. చిరకాలము చెరసాలలో నుండి కాంగ్రెసు మంత్రివర్గము పుణ్యమాయని బయటపడింది. "అమ్మ" చెరసాలలో నున్నను ఆంధ్రుల ఆదరణను అమితముగా అనుభవించింది. ఎందరో శ్రమజీవుల యందు ఆశాజ్యోతిని వెలిగించింది. చెరసాలయందున్నప్పటికీ ఇట్టి ఆదరణను పొందిన "అమ్మ" నేడు మరింత అప్యాయంగా ఆంధ్రలోకము ఆదరిస్తుందని నమ్ముతున్నాను.

**-క్రొవ్విడి లింగరాజు సమర్పణము**

---

చెన్నకేశ్వర పెరుమాలుకు, వీరయ్యకు నమస్కరిస్తూ జూలై, 24, 1538వ సంవత్సరం ఒక శాసనాన్ని వేయించాడు. అందులో ప్రజల తిరుగుబాటుపై పేరుసోములలోని ఈ మూడు దేవస్థానాలకు చెల్లే మాన్యాలకు, ఇంతకు ముందు, ఏలిన రాజులు ఎక్కువ పన్నుల రూపంలో అన్యాయంగా వసూలు చేసిన **రొఖధాన్యాలను** రద్దు చేసి ఆ మాన్యాలను సర్వమాన్యాలుగా ప్రకటించాడని ఉంది. తెలుగు నేలపైనే కాదు తమిళనాట కూడా పన్నుపోటుకు ప్రజలు ఎదురుతిరిగి, పాలకుల మెడలు వంచిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి.

దక్షిణ ఆర్కాటు జిల్లా వృద్ధాచలం ఎడమచేయి, కుడిచేయి శాఖల ప్రజలు మరింత ముందుకుపోయి పన్నులు ఎక్కువగా వసూలు చేస్తున్న రాజోద్యోగులకు సహాయ నిరాకరణ చేయటమే కాక, వారికి వసతి సదుపాయాలు కల్పించకూడదనీ, వారికి లెక్కలు రాసి పెట్టకూడదని, ఒక వేళ వారు మితిమీరి ప్రవర్తిస్తే **కత్తితో పొడిచి చంపాలని** కూడా తీర్మానించారు.

శిల్పులే కాదు చేనేత కళాకారులు సైతం ఎక్కువ పన్నులను ధిక్కరించి, ఉన్న ఊరు వదలిపోయిన సంఘటనలు న్నాయి. విరుపణ్ణ ఉడయారు పాలనా కాలంలో చెంగలపట్టు జిల్లాలోని పెరునగురుకు చెందిన **సాలెవారు,** పన్నుల భారం ఎక్కువగా ఉండటం వల్ల చెల్లించక, చెల్లించలేక జిల్లా దాటి దూర ప్రాంతాలకు వలసపోగా, పరిస్థితిని గమనించిన రాజు, పన్నుల్ని తగ్గించి, వారు తిరిగి తమ తమ స్థావరాలకు వచ్చేట్లు చేశాడని అక్కడి శాసనం తెలియజేస్తుంది.

తంజావూరును పాలిస్తున్న చిన్నప్పనాయకుని కాలంలో **పంచాణం వారిపై కాణిక, కట్టాయం, పాక్కు కట్టాయం, తలైయారిక్కాలనే** పన్నులను ఎక్కువగా విధించటం వల్ల వాళ్లు ఆ ప్రాంతం వదిలి మరో చోటుకు వలసబోవటానికి నిశ్చయించగా, చిన్నపనాయకుడు ఆ పన్నుల్ని పూర్తిగా రద్దుచేసి, వలసబోకుండా నిలువరించగలిగాడు. తెలుగునాట సమ్మె బాట పట్టిన 32 గ్రామాల శిల్పుల మూకుమ్మడి నిరసన రాజును సైతం కదిలించి పెంచిన పన్నుల్ని తగ్గించి, ఆదరిస్తామన్న హామీతో తిరిగి వాళ్ల వాళ్ల గ్రామాలకు వచ్చి మళ్లీ వాళ్ల వాళ్ల పనుల్లో నిమగ్నమైన విషయాన్ని తెలియజేస్తున్న కనగానపల్లి శాసనం చరిత్ర పరిశోధకుల్ని విస్మయానికి గురిచేసింది. ■

నిషేధ చరిత్ర

# జలియన్‌వాలాబాగ్-విశ్వకవి ఆగ్రహచర్య



## రవీంద్రనాథ్ టాగూర్

యుగయుగాలుగా తను భావనల ద్వారా బుద్ధిజీవులు సమాజ గమనాన్ని ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని దిశానిర్దేశం చేస్తున్నారు. చరిత్రలోని ప్రతి మూల మలుపులోనూ విజ్ఞులు ప్రజా సమూహాలకు తప్పొప్పులను వివరిస్తూ మార్గదర్శకులుగా ఉంటారు. ఫ్రెంచ్, అమెరికన్, రష్యన్ విప్లవాలలోనయినా మన దేశ స్వాతంత్రోద్యమంలో నయినా ఇదే జరిగింది. ఆనాడు మనకున్నది వరాయిపాలన. స్వాతంత్ర్యోద కాలంలో ప్రజావాణిని తన గళంలో వినిపించేందుకు టాగూర్ ఈ నిరసన ప్రక్రియ నెంచుకున్నారు. ఎంతో ప్రతిష్ఠాత్మకమైన 'నైట్‌హుడ్'ను పొందిన రవీంద్రనాథ్ టాగూర్ జలియన్ వాలాబాగ్ దురంతాలకు నిరసనగా బ్రిటిష్ ప్రభుత్వం తనకిచ్చిన ఆ బిరుదును తిరిగిచ్చేసారు. ఈ సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వానికి ఆయన వ్రాసిన లేఖ...

గౌరవనీయులైన ప్రభువులకు,

ఒక చిన్న స్థానిక అల్లర్లను అణిచేందుకు పంజాబ్ ప్రభుత్వం తీసుకున్న విపరీత చర్యలు మమ్మల్ని తీవ్ర దిగ్భ్రాంతికి గురిచేసి బ్రిటిష్ వారి అధీనంలో మేం నిస్సహాయులమని మీకు తెలియజేసింది. నిస్సహాయ ప్రజలపై ప్రయోగించబడిన దమనకాండ, అందుకనుసరించిన విధానాలు,ఎక్కడో చెదురు మదురుగా తప్పితే నాగరికత సమాజ చరిత్రలోనే మున్నెన్నడూ ఎరుగనిది.

నిస్సహాయ, నిరాయుధులైన మా ప్రజలపట్ల మానవ జీవితాలను ఛిద్రం చేయగల శక్తివంతమైన, సమర్థవంతమైన ప్రభుత్వం అనుసరించిన వైఖరి వలన దానికి ఇక్కడ రాజకీయంగా పరిపాలించే అర్హత లేదని, చట్టబద్ధంగా పాలించగల నైతిక అర్హత కూడా లేదని మేం దృఢంగా విశ్వసిస్తున్నాం. పంజాబ్‌లో మా సోదరుల వేదనలు, అవమానాలు నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ నిగూఢంగా భారతదేశంలోని అణువణువూ వ్యాపించాయి. ఈ విశ్వవ్యాప్త వేదన ప్రజల హృదయాలను రగిల్చిందన్న వాస్తవాన్ని పాలకులు పూర్తిగా విస్మరించారు - వారు బహుశ తగిన గుణపాఠం నేర్పామని సంబరపడుతూ ఉండి ఉండవచ్చు.

ఈ దారుణాన్ని దాదాపు అన్ని ఆంగ్లో-ఇండియన్ వార్తా పత్రికలు ప్రశంసలతో ముంచెత్తాయి. కొన్నయితే అమానవీయ ఛలోక్తులు సహితం ప్రచురించాయి. దీనిపై అధికారుల నుండీ ఏ రకమయిన అదుపూ లేదు. మా మొర వినే నాథుడే లేడు. హుందాగా వ్యవహరించాల్సిన ప్రభుత్వం, రాజనీతిజ్ఞతను ప్రదర్శించాల్సిన ప్రభుత్వం కక్షసాధింపుకు పాల్పడుతున్నది. దానికి భౌతికశక్తికి గాని, సాధారణ సాంప్రదాయాలకు గాని తగినవిధంగా ప్రవర్తించడం లేదు. అందువలన బాధతో మూగపోయిన లక్షలాదిగా దేశ పౌరుల గళమయిన నా చర్యల ప్రతిఫలాన్ని నేనే అనుభవించేందుకు సిద్ధపడడమే నేనిప్పుడు నా దేశానికి చేయగల కనీస కర్తవ్యం. గౌరవాన్ని ఇనుమడింపచేసే భుజకీర్తులు అవమానాన్ని ఎత్తిచూపే సమయం వచ్చింది. నేను, నావంతుగా, నా ప్రత్యేకతలన్నింటినీ వదులుకుని, ఏ ప్రత్యేకతలకు తగరని చెప్పబడుతున్న, మనుషులుగానే భరించలేని అవమానాలను దిగమింగుతున్న నా దేశ ప్రజలపక్షాన నిలవాలనుకుంటున్నాను.

ప్రభూ, పై కారణాల వలన వ్యాకులతతో మీ ముందు పాలించిన మహారాజుల చేతులమీదుగా గౌరవప్రదంగా తీసుకున్న ఈ నైట్‌హుడ్ నుండి నన్ను విముక్తుడిని చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను.

భవదీయుడు,

కలకత్తా మే 30, 1919

- రవీంద్రనాథ్ టాగూర్

# జాతీయ పోరాట కాలంలో నిషేధాలు



బంగోరె

పోలిశెట్టి ఆదినారాయణ గుప్తవంటి యువనటులు రాజకీయ చౌచౌ ప్రదర్శనలు, చిన్న చిన్న సెటైర్లు వేసి తద్వారా ప్రేక్షకుల్లో రాజకీయ, సామాజిక చైతన్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నించేవారు. అంటే ఆ రోజుల్లో కలం పట్టునేర్చిన ప్రతి రచయితా, గళం విప్పగల్గిన ప్రతి కళాకారుడూ ఏదో చారిత్రక కర్తవ్యంగా ఉద్యమ ఆవేశంతో రాజకీయ స్పృహను ప్రదర్శించిన తీరు ఆశ్చర్యం గొల్పుతుంది. (వివరాలు ఆనాటి ప్రభుత్వ సి.ఐ.డి. రిపోర్టుల్లో నుంచి లభించాయి) మన చరిత్ర తీరు యిట్లుంటే - రాజకీయాలకు అతీతంగా రచయితలు మెలగాలనీ, రచనలు చేయాలనీ యిప్పుడు కొందరు పనిగట్టుకొని నినాదంగా విన్పించడం ఆశ్చర్యంగా తోస్తున్నది. వీళ్ళది లోకం పట్టని వొకరకం రాజకీయమై వుండాలి

**1921**లో గుంటూరు తిలక్ నాటక సమాజం వారు గ్రామీణ జనం లో కొత్త కలకలాన్ని కలవరాన్ని రేపిన 'స్వరాజ్య సాహసం' అనే అముద్రిత నాటకం కృష్ణాజిల్లాకు కూడా వ్యాపించి అక్కడా దీని ప్రదర్శనలను సాగిస్తుంటే మధ్యలో ప్రభుత్వం కలుగజేసుకొని 'నాటక ప్రదర్శనల చట్టం' కింద నిషేధించింది. అట్లాగే 'అవతార పరివర్తనం లేక తిలక్ మహారాజ నాటకం' (కొడాలి ఆంజనేయులు అముద్రిత రచన), తిలక్ మహారాజ నాటకం' పేరుతోనే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మరో నాటకం - వీటినీ నిషేధించింది. ఈ నాటక ప్రదర్శన ల్లో మధ్య మధ్య విరామ సందర్భాల్లో బలిజేపల్లి లక్ష్మీకాంతం లాంటి పిల్లకవులు స్వరాజ్య పద్యాలు కవిగట్టి కంగున చదివేవారు. పోలిశెట్టి ఆదినారాయణ గుప్తవంటి యువనటులు రాజకీయ చౌచౌ ప్రదర్శనలు, చిన్న చిన్న సెటైర్లు వేసి తద్వారా ప్రేక్షకుల్లో రాజకీయ, సామాజిక చైతన్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నించేవారు. అంటే ఆ రోజుల్లో కలం పట్టునేర్చిన ప్రతి రచయితా, గళం విప్పగల్గిన ప్రతి కళాకారుడూ ఏదో చారిత్రక కర్తవ్యంగా ఉద్యమ ఆవేశంతో రాజకీయ స్పృహను ప్రదర్శించిన తీరు ఆశ్చర్యం గొల్పుతుంది. (వివరాలు ఆనాటి ప్రభుత్వ సి.ఐ.డి. రిపోర్టుల్లో నుంచి లభించాయి) మన చరిత్ర తీరు యిట్లుంటే - రాజకీయాలకు అతీతంగా రచయితలు మెలగాలనీ, రచనలు చేయాలనీ యిప్పుడు కొందరు పనిగట్టుకొని

నినాదంగా విన్పించడం ఆశ్చర్యంగా తోస్తున్నది. వీళ్ళది లోకం పట్టని వొకరకం రాజకీయమై వుండాలి 'లోకంతో మనకు పనేమిటి పద లోలాక్షీ' అనే బావతు కేవలం రసానుభూతి కవిగణం లేదా కవిసేన - లేదా వ్యాపార దృష్టులైన విస్మరణవాద రచకగణం లేదా వట్టి స్వక్షేమవాదుల బలగమైనా కావాలి లేదా యథాస్థితివాదులైనా కావాలి. అంటే పరోక్షంగా ప్రజాదృష్టిలేని పాలకవర్గాలు నడిపే రాజకీయంలో పాచికలుగా ఉపయోగపడ్తున్నట్టే కదా.

ఇంతకూ యీ నిషిద్ధ నాటకాల లిస్టు పరిసమాప్త మనుకుంటారేమో - కాదు. 'గాంధీ మహోదయం. వగైరా రాజకీయ నాటకాలను ప్రభుత్వం 1921లో నిషేధించిందంటే పాట ప్రచార శక్తిని అదీ యెంత సరిగా అంచనా వేసుకొన్నదా అని కూడా తోస్తుంది. ఒక్కో నాటక ప్రదర్శనను ప్రభుత్వం రద్దు పరుస్తుంటే, అవే పేర్లు కొంచెం అటుయిటు మార్చి కొత్త కొత్త పేర్లుపెట్టి ప్రభుత్వం కళ్ళల్లో దుమ్ము కొట్టడానికీ ప్రయత్నించేవారంటే అది వాళ్ళ రాజకీయ కమిట్ మెంట్‌కు నిదర్శనం. ప్రభుత్వం మళ్ళీ వాటిని ఆపుచేయించి దమననీతి ప్రయోగించేది.

1921లోనే ప్రభుత్వం నిషేధించిన ఇతర తెలుగు గ్రంథాలను పరికిస్తారా? 'భారత గీతములు' (గుంటూరు "జాతీయ కళాశాల" టీచర్ సుబ్రహ్మణ్య భాగవతులు రాసింది). "హిందూ దేశము - పూర్వ ప్రస్తుత స్థితులు", "పాంచాల పరాభవం", "స్వరాజ్య గీతామృతం" (బాలకవి వడ్డాది సీతారామాంజనేయులు, పూడి పెద్ది కాశీ విశ్వనాథం శాస్త్రి కవి రాసిన "దండాలు దండాలు భారతమాత" వగైరా గీతాలు, పద్యాలున్న గ్రంథం), "స్వరాజ్య కోలాటం", (గుంటూరు జిల్లా సిద్దపల్లి బాలకవి దంటు వీరరాఘవయ్య రాసింది), రామభజన ఫక్కీలో "రామదండు" పాట మొదలైనవి వున్నాయి.

ఇక్కడ "స్వారాజ్య గీతామృతం" గూర్చి వొక మాట. ప్రభుత్వం యీ గ్రంథాన్ని నిషేధించటంతో తృప్తిపడకుండా, ఆ గ్రంథకర్తలపై కేసు పెట్టేముందు గోదావరి జిల్లా కలెక్టర్ చేత క్షమాపణలు అడిగించాలని చూస్తే గ్రంథకర్తలిద్దరూ వొప్పుకోలేదు. కలెక్టర్ను యెదిరించారు కూడా. పూడి పెద్ది పిల్లనిచ్చిన మామ తర్వాత యేదో మాయమంత్రం చేసి అల్లుణ్ణి మాత్రం కలెక్టర్ వద్దకు తీసుకెళ్ళ చేసింది తప్పు అని క్షమాపణ చెప్పించాడు. ఇకముందు యిట్లాటి "పాడు" పాటలు రాయననీ, బుద్ధిగా వుంటాననీ హామీ యిప్పించాడు. ఇల్లా పూడిపెద్ది తప్పుకున్నాడు. క్షమాపణ నసేమిరా చెప్పనని మొరాయించడమే కాక, కలెక్టర్‌కు ఎదురు సవాల్ విసిరి, పోలీసులకు దొరక్కుండా కొన్ని నెల్లపాటు రహస్యంగా వుండి తప్పించు కోగల్గిన వడ్డాది కవి వొక్కడిపై కేసు పెట్టి యేడాది కఠినశిక్ష విధింపచేసింది ప్రభుత్వం. అప్పటికి వడ్డాది వయసు 21. (యీ రహస్యకాలం లో వడ్డాది అల్లూరి సీతారామరాజుతో సంబంధాలు పెట్టుకున్నట్టు అస్పష్ట దాఖలాలు) యింత ఉజ్వల చరిత్ర గల "దండాలు దండాలు భరతమాత" గీతానికి కర్తయెవరో తెలియదు - అని అఘోరించారు ఆం.ప్ర. ప్రభుత్వం ముద్రించిన 'దేశం పిలుపు' (1971) అనే జాతీయోద్యమ గీతాల సంపుటి సంకలనకర్తలు - డాక్టర్ సరోజినిరేగాని, దేవులపల్లి రామానుజరావు గారులు. ఆ గీతాన్ని పూర్తిగానైనా యివ్వలేకపోయారు.

1922లో "స్వరాజ్య గీతాలు" (గరిమెళ్ళ సత్యనారాయణ విరచితం), "భారతీయ విలాపం", "చీరాల పేరాల గాంధీ దీప నాటకం", "స్వరాజ్య రథ నాటకం", "సహాయ నిరాకరణం", వగైరా గ్రంథాలపై నిషేధాలు విధించింది. ప్రభుత్వం గరిమెళ్ళపై కేసుపెట్టి జైలుశిక్ష కూడా విధించింది. గరిమెళ్ళ "మాకొద్దీ తెల్లదొరతనం" అనే వొక్క గీతాన్నే అరటావు కాగితం మీద రెండుపక్కలా అచ్చొత్తించి అణా వెల బెట్టి అమ్మే ఏర్పాటు చేశారంటే దానికెంత ప్రచారం కల్గిందో వూహించుకోవచ్చు. ప్రభుత్వం ఆ అరఠావు కాగితంపై కూడా అఘాయిత్యం చేసింది. నెల్లూరు నుంచి రాళ్ళపల్లి రామసుబ్బయ్య సంకలన పరిచి ప్రకటించిన "సింహపురి స్వరాజ్య కోకిల ము", "జమీన్ రైతు" పత్రికా స్థాపకుడుగా తర్వాత ప్రసిద్ధికెక్కిన నెల్లూరు వెంకట్రామయ్య నాయుడు ప్రకటించిన "స్వప్న ప్రయాణం". యీ రెండింటి కాపీలని ప్రభుత్వం స్వాధీన పర్చుకోమని కలెక్టర్

'గాంధీ మహోదయం. వగైరా రాజకీయ నాటకాలను ప్రభుత్వం **1921**లో నిషేధించిందంటే పాట ప్రచార శక్తిని అంది యెంత సరిగా అంచనా వేసుకొన్నదా అని కూడా తోస్తుంది. ఒక్కో నాటక ప్రదర్శనను ప్రభుత్వం రద్దు పరుస్తుంటే, అవే పేర్లు కొంచెం అటుయిటు మార్చి కొత్త కొత్త పేర్లుపెట్టి ప్రభుత్వం కళ్ళల్లో దుమ్ము కొట్టడానికీ ప్రయత్నించేవారంటే అది వాళ్ళ రాజకీయ కమిట్ మెంట్‌కు నిదర్శనం. ప్రభుత్వం మళ్ళీ వాటిని ఆపుచేయించి దమననీతి ప్రయోగించేది.

రిపోర్ట్ పంపితే, మొదటి పుస్తకాల్ని మాత్రం వదిలేసి రెండో దాన్ని నిషేధించింది. యిట్లా 'లిస్టు'ని యెన్నని యిచ్చుకుంటూ పోవడం? (యీ రాజకీయ కోలాహలం మధ్య రామాయణంలో పిడకల వేటలాగా కడప జిల్లా వర్లపాడు చెవికల చెన్నారెడ్డి రాసిన "శాంత సారంగధర నాటకం"లో మితిమీరిన పచ్చి శృంగారాన్ని దట్టించాడని, ఆ నాటకాన్ని ప్రభుత్వం నిషేధించడమే కాక జమ్మలమడుగు కోర్టులో నాటక కర్త, పబ్లిషర్లు ప్రొద్దుటూరు శ్రేష్టి సోదరులపై కేసు పెట్టడం వేరే కోవకు చెందుతుందనుకోండి)

యిక మాలపల్లినీ మొదటిదఫా నిషేధించిన 1923లోనే "ఆత్మశిక్ష" "గాంధీ మహాత్ముడు లేక కలియుగ ప్రహ్లాద" (గుంటూరీయుడైన దామరాజు పుండరీకాక్షుడు రాసిన హరికథ; యితను రాసిందే "నవోదయం: గాంధీవిజయం" అనే మరో రచనను 1932లోను) గాంధీ మహాత్ముని నిర్బంధము. "గాంధీ విజయధ్వజ నాటకం" వగైరాలను కూడా నిషేధించడం ఫైళ్ళలో చూడవచ్చు. వీటన్నిటిపై సి.ఐ.డి. పోలీసుల రిపోర్టులు, తెలుగు ట్రాన్స్‌లేటర్ ఇంగ్లీష్ అనువాదాలు, నివేదికలు, అడ్వకేట్ జనరల్ లీగల్ (లేదా యిల్లీగల్ అభిప్రాయాలు, ప్రభుత్వాధికారుల నోట్స్ - యిట్లా యీ తతంగమంతా వున్న ఫైళ్ళు అనేకం వుండగా (వీటిల్లో కొన్ని శిథిలమైపోతున్నాయి కూడాను.) మన తెలుగు జాతీయ గీతాల సంగ్రాహకులు, పరిశోధకులు యింతదాకా పట్టించుకోలేదంటే యేమనాలి?

యిక 1936లో "మాలపల్లి"ని రెండోసారి నిషేధించడం తర్వాతి దశ. అంతకు రెండేళ్ళు ముందు (అంటే 1934) నుంచీ ప్రభుత్వం నిషేధించిన, నిషేధించ తలపెట్టిన తెలుగు గ్రంథాల జాబితాను బట్టీ తెలుగుజాతి పడ్తున్న పురిటి నెప్పులనూ, తెలుగు ప్రజ తాలూకు రాజకీయ చైతన్యస్థాయి పెరుగుదలనూ కొంతకు కొంతైనా అర్థం చేసుకోవచ్చు.

'రాజనీతి శాస్త్రము' (ముదిగంటి జగన్న శాస్త్రిది. యీయనదే "వినాయక సావర్కార్ జీవితము" కూడా) "మజినీ జీవితము" "మానవ ధర్మాలు", "నేటి రష్యా" (నార్లగారి రచన). కృష్ణాపత్రిక 1934 జులై 14వ, తేదీ సంచిక, "గారిబాల్డీ జీవితము", "సామ్యవాద సిద్ధాంతాలు" వ్యాసానికి తర్జుమా), "కమ్యూనిస్టు ప్రణాళిక" (మెనిఫెస్టో తర్జుమా - గద్దె లింగయ్య ఆదర్శ గ్రంథమండలి ప్రచురణలు) "ధన ప్రభావము" (గుంటూరు కూలి సంరక్షణ సంఘం వారి 7వ కరపత్రం నాటక కథాత్మకమైంది) "సర్దార్ భగత్‌సింగ్ చరిత్ర" (సి.కృష్ణస్వామి శర్మ). ట్రాట్‌స్కీ జీవితము (దింటకుర్తి భాస్కరరాజు అముద్రిత రచన, గద్దె లింగయ్య యింట్లో పోలీసులు 1935 డిశంబరు 19న జరిపిన సోదాలో దొరికింది). "కార్మిక భజనావళి" (నంద్యాలలో అచ్చయింది) - యీ లిస్టంతా యిచ్చుకొంటూ పోవాలంటే చాలా వుంది.



# నిజాం నిరంకుశత్వాన్ని నిలదీసిన కలాలు



అది నాజీ నైజాం రక్కసిపాలన. ఈ పాలనలో లక్షలాది ప్రజలు అజ్ఞానాంధకారంలో మ్రగ్గిపోతున్నారు. వారు వెలుగును చూడటానికి వీల్లేదు. అది నిజాం ఆజ్ఞ. ఎన్నోరకాల ఆంక్షలు, మరెన్నో నిషేధాలు.... పుస్తకాలు చదవకూడదు, రాయకూడదు! సభలు పెట్టకూడదు, వాటికి వెళ్ళకూడదు; గ్రంథాలయాలు నడపకూడదు. ఈ పరిస్థితికి వ్యతిరేకంగా, అజ్ఞానాంధకారం నుండి తెలుగుజాతిని బయటపడ వెయ్యడానికి ప్రయత్నించిన అనేకమందిపై నిర్బంధాలు, జైలుశిక్షలు.

రాజకీయ ప్రచారానికి సంబంధించిన సాహిత్యాన్ని కళారూపాలను బహిష్కరించటమే కాకుండా, ముస్లిమేతర మత సాహిత్యంపై కూడ ఎన్నో ఆంక్షలు, నిషేధాలు ఉండేవి. ముఖ్యంగా ఆర్య సమాజ్‌కి సంబంధించిన కార్యకర్తలను జైళ్ళలో కుక్కడం, వారి సాహిత్యాన్ని నిజాం రాష్ట్రంలో ప్రవేశింపనీయక పోవడం జరిగింది.

1930 నుండి ఆంధ్ర మహాసభ తన కార్యక్రమాలను ప్రధానంగా గ్రంథాలయోద్యమంపై కేంద్రీకరించింది. తదనుగుణంగా నైజాం ప్రభుత్వం కూడా దాన్ని అణగద్రొక్కడానికే తన శక్తి కేంద్రీకరించింది. ఆంధ్ర మహాసభ పిలుపుతో, శ్రీకృష్ణదేవారాయాంధ్ర భాషా నిలయం ప్రేరణతో ఊరూర గ్రంథాలయ స్థాపనకు అనేకమంది పూనుకున్నారు. అయితే వారికి అడుగడుగునా అవరోధాలే, అయినా ఉద్యమం ఏదో రూపంలో విస్తరించింది. ఈ విషయం ఆళ్వారు స్వామి 'ప్రజల మనిషి' నవల్లో వివరంగా ఉంది. తెలంగాణా ప్రాంతంలోని ఒక గ్రామంలో గ్రంథాలయ స్థాపనకు అనుమతి లభించకపోవడంతో ఆ గ్రామ ప్రజలు రాత్రికి రాత్రే గ్రంథాలయాన్ని నిర్మించి తమ పట్టుదలను ప్రదర్శించుకున్నారు.

**అణా గ్రంథమాల :-**

1942 ప్రాంతంలో తెలుగు భాషా సంస్కృతులను అభివృద్ధి చేసి తెలుగు ప్రజల విజ్ఞాన వికాసాలకు దోహదపడాలనే ఉద్దేశంతో అతిచవకగా పుస్తకాలందించడం కోసం శ్రీ వెల్దుర్తి మాణిక్యారావు, ఆంధ్ర పబ్లిషింగ్

*1930 నుండి ఆంధ్ర మహాసభ తన కార్యక్రమాలను ప్రధానంగా గ్రంథాలయోద్యమంపై కేంద్రీకరించింది. తదనుగుణంగా నైజాం ప్రభుత్వం కూడా దాన్ని అణగద్రొక్కడానికే తన శక్తి కేంద్రీకరించింది. ఆంధ్ర మహాసభ పిలుపుతో, శ్రీకృష్ణదేవారాయాంధ్ర భాషా నిలయం ప్రేరణతో ఊరూర గ్రంథాలయ స్థాపనకు అనేకమంది పూనుకున్నారు. అయితే వారికి అడుగడుగునా అవరోధాలే, అయినా ఉద్యమం ఏదో రూపంలో విస్తరించింది. ఈ విషయం ఆళ్వారు స్వామిగారు 'ప్రజల మనిషి' నవల్లో వివరంగా ఉంది. తెలంగాణా ప్రాంతంలోని ఒక గ్రామంలో గ్రంథాలయ స్థాపనకు అనుమతి లభించకపోవడంతో ఆ గ్రామ ప్రజలు రాత్రికి రాత్రే గ్రంథాలయాన్ని నిర్మించి తమ పట్టుదలను ప్రదర్శించుకున్నారు.*

కంపెనీకి సంబంధించిన శ్రీ కె.సి. గుప్త కలిసి ఈ ప్రచురణ సంస్థను స్థాపించి 40 పుస్తకాల వరకు ప్రచురించారు. వీటిలో ఏ పుస్తకమయినా అణా మాత్రమే. వాటిలో కొన్నిటిని నిజాం ప్రభుత్వం నిషేధించింది. అవి, 1. అల్లూరి సీతారామరాజు, 2. సుభాస్ చంద్రబోస్, 3. సావర్కర్, 4. యం.యన్.రాయ్, 5. రైతు (రచయిత, వెల్దుర్తి మాణిక్యారావు) పుస్తకాలు. నిషేధింపబడుతున్నా పుస్తక ప్రచురణ మానలేదు సరికదా, మరింత పట్టుదలతో ప్రచురించారు. ఒక సందర్భంలో పుస్తక నిషేధాన్ని సవాలు చేస్తూ కోర్టుకి కూడా వెళ్ళారు. వారి 24వ ప్రచురణ ''కాళోజీ కథలు''కు ముందుమాట :-

"అణా గ్రంథమాల 20వ ప్రచురణము 'సుభాస్ చంద్రబోస్' పక్రటించినందులకు ప్రభుత్వ నిర్బంధానికి గురై గ్రంథకర్తకు 18 మాసాలు కఠిన శిక్ష, నాకు ఒక మాసము శిక్ష, 250 రూపాయల జరిమానాతో పది మాసాలు కోర్టుకు తిరిగి వ్యవహారములు ముగించుకుని మీ సేవ చేయుటకు సిద్ధమయినాను.

కె.సి.గుప్త,

హైదరాబాద్, ప్రకాశకుడు.

1943 ఏప్రిల్

**'ప్రజాశక్తి' పత్రిక ఆంధ్రప్రాంతంలోని బెజవాడ నుండి వెలువడేది. తెలంగాణాలో జరుగుతున్న రైతాంగ పోరాటానికి బాసటగా నిలిచేది. ఆంధ్ర మహాసభ వార్తలను, అది ప్రజలను ఎలా సంఘటిత పరుస్తూ పోరాటం సాగిస్తోందీ వివరంగా తెలియజేస్తూ తెలంగాణా ప్రజానీకానికి ప్రతీకగా నిల్చింది. యిదంతా చూసి నైజాం ప్రభుత్వం తమ గుట్టు బహిరంగమవుతోందని, ఆంధ్ర మహాసభ బలపడి పోతోందని పత్రికపై నిషేధాజ్ఞను 1947 మే నెలలో జారీ చేసింది**

### 'ప్రజాశక్తి' పత్రికపై నిషేధం!

ఈ పత్రిక ఆంధ్రప్రాంతంలోని బెజవాడ నుండి వెలువడేది. తెలంగాణాలో జరుగుతున్న రైతాంగ పోరాటానికి బాసటగా నిలిచేది. ఆంధ్ర మహాసభ వార్తలను, అది ప్రజలను ఎలా సంఘటిత పరుస్తూ పోరాటం సాగిస్తోంది. వివరంగా తెలియజేస్తూ తెలంగాణా ప్రజానీకానికి ప్రతీకగా నిల్చింది. యిదంతా చూసి నైజాం ప్రభుత్వం తమ గుట్టు బహిరంగమవుతోందని, ఆంధ్ర మహాసభ బలపడి పోతోందని పత్రికపై నిషేధాజ్ఞను 1947 మే నెలలో జారీ చేసింది - అంటే ఈ పత్రిక నిజాం రాష్ట్రంలో ప్రవేశించడానికి వీల్లేదు. ఈ నిషేధాన్ని ఖండిస్తూ అనేకమంది ప్రకటనలు చేశారు. ఉత్తరాల రూపంలో తమ నిరసన తెలియజేశారు." ... దాస్యంతో ఆర్థిక బాధలలో క్రూర హింసాకాండలతో కుమిలిపోతున్న నైజాం ప్రజలను రెచ్చగొట్టవలదని మ.ఘ.వ. శ్రీ నిజాం ప్రభుత్వమును కోరుతూ " వావిలాల గోపాలకృష్ణయ్యగారు సత్తెనపల్లి నుండి రాసిన లేఖ: 14.6.46 మే, జూన్ సంచికలో ప్రచురించబడింది. ఆంధ్ర మహాసభ అన్ని జిల్లా, తాలూకా శాఖలు నిషేధాన్ని ఖండిస్తూ తీర్మానాలు చేశారు. అయినా నిషేధం పోలేదు. కానీ ఈ పత్రిక తెలంగాణా ప్రజలకు మాత్రం అందుతూనే ఉండేది. వెదురు బొంగులలో చుట్టి పెట్టి, వెదురు రవాణా ద్వారా తెలంగాణా ప్రజలకు అందుతూనే ఉండేది ... ఇటు ఆంధ్ర ప్రాంతంలో నెహ్రూ కాంగ్రెస్ ప్రభుత్వం ఈ పత్రికపై తీవ్ర నిర్బంధాలు విధించింది. ఒకదశలో పత్రిక ప్రెస్‌ని రహస్యంగా కూడ నడపవలసి వచ్చింది. పత్రిక బాధ్యతలు చూస్తున్న నాగులపల్లి కోటేశ్వరరావు గార్ని చిత్రహింసలు పెట్టారు.

### "పాయం" ఉర్దూ పత్రిక :

పోలీసు చర్య తర్వాత 'పాయం' పత్రిక 3 నెలలపాలు నిషేధానికి గురయింది. సంపాదకుడు అఖ్తర్ హుస్సేన్ ఆయన సోదరులు ముగ్గురు, స్త్రీల కళాశాల లెక్చరర్ అయిన సోదరి రజియాబేగం, ఆయన బావమరదీ, నిజాం కాలేజీ లెకర్చర్ ఒరకూ అరెస్టు చేయబడ్డారు. వీరిని రెండు చదరపు గజాలు మాత్రమే ఉన్న చిన్న కొట్లలో నిర్బంధించారు. వారు అటూ, ఇటూ కదలడానికి అవకాశం లేదు; కాలకృత్యాలు కూడా అందులోనే తీర్చుకోవాలి.

### బుర్రకథ కళారూపంపై నిషేధం

మొదటిసారిగా బుర్రకథను తయారుచేసి ప్రజల వద్దకు తీసుకుపోయాడు సుంకర. ఈ బుర్రకథలు ఆనాడు ఆంధ్ర ప్రాంత ప్రజలను ఉర్రూతలూపేవి. ఈ కళారూపం తెలంగాణా ప్రాంతంలో అంతగా ప్రచారంలో లేదు. బుర్రకథల వల్ల ప్రజలు పొందుతున్న చైతన్యం గురించి తెలుసుకున్న నిజాం, ఈ కళారూపం తెలంగాణా ప్రాంతానికి ఎక్కడ వ్యాపిస్తుందోనని భయపడి, తన రాజ్యంలో ఈ బుర్రకథని ప్రవేశించనియ్యకుండా అనేక ఆంక్షలు విధించాడు. ఒక ప్రత్యేక బుర్రకథనంటూ కాక, అసలు ఈ కళారూపాన్నే నిషేధించి సమూలంగా నాశనం చెయ్యడానికి ప్రయత్నించాడు. ఇది చరిత్రలోనే అత్యంత క్రూరమైన చర్యగా

ఆనాడు ప్రజలు గుర్తించి ప్రతిఘటించారు.

అనేకమంది రచయితలను నిర్బంధించింది నిజాం ప్రభుత్వం. రాత్రికిరాత్రే తీసుకుపోయి జైళ్ళలో కుక్కింది. వట్టికోట, కాళోజీ, పొట్లపల్లి రామారావు, దాశరథి మొ॥ రచయితలెందరో నిర్బంధింపబడ్డారు. వరంగల్ జిల్లాలో వుంటున్న ప్రముఖ రచయిత కాళోజీని అతని ఉనికి జిల్లా శాంతిభద్రతలకు ముప్పుగా వుంది కాబట్టి జిల్లా వదలి పోవలసిందిగా ఆదేశించారు జిల్లా అధికారులు

×××

ఇటు ఆంధ్ర ప్రాంతంలో పోలీసు చర్యకు ముందూ తర్వాత కూడా నైజాం ప్రభుత్వానికి ధీటైన పద్ధతుల్లో కాంగ్రెస్ నెహ్రూ ప్రభుత్వాలు ప్రజా రచయితలపై నిర్బంధకాండను జరపడం, పుస్తకాలను, నాటకాలను, బుర్రకథలను నిషేధించడం కొనసాగించారు.

ఆంధ్ర ప్రజానాట్యమండలి నూట ఇరవై అనుబంధ శాఖలు 980 ప్రదర్శ నల ద్వారా 18 లక్షల ప్రజానీకానికి "విశాలాంధ్ర", "దున్నేవానికే భూమి హక్కు" అనే సందేశాన్ని అందించారు.

విశ్వనాథ, పింగళి లక్ష్మీకాంతం లాంటి కవులు, లింగమూర్తి, గిడుగు సీతాపతి లాంటి నటకులు.

శాంతారాం, ప్రసాద్, బి.యన్. రెడ్డి లాంటి దర్శకులు, ఇంకా ఎందరో మేధావులు, చిత్రకారులు, విజ్ఞానవేత్తలు వేనోళ్ళ కొనియాడారు. అంతేగాక, ఆంధ్ర నాటక కళాపరిషత్ 14వ సమావేశంలో "మా భూమి" ప్రదర్శన రెండవ బహుమతిని, రచనలో ప్రథమ బహుమతిని పొంది మరోసారి ఈ కళాకాంతిని లోకానికి చాటింది.

మద్రాసు నగరంలో, అందులో బాంక్వెటింగ్ హాలులో కూడా ప్రదర్శింపబడింది. ప్రదర్శన చూసిన మంత్రులు గోపాలరెడ్డి "నిర్మాణమై వున్న జాతి నేడు నిద్ర మేల్కొంటున్నది" అని ప్రశంసించి, అర్ధనూట పదహార్లు బహూ కరించారు. అమాత్యులు కళావారు, కూర్మయ్యగారు వేనోళ్ళ కొనియాడి 'వాడవాడలా ప్రదర్శింపబ డాల'న్నారు.

ఆరునెలలు గడవలే దు. ఆ మంత్రుల పరిపాల నలోనే "మా భూమి" నాటకానికి కాలదోషం పట్టింది.

**నిషేధానికి సాకు:**

"మా భూమి" ప్రదర్శ న ప్రేక్షకుల మనస్సులు పాడుస్తుందని బాణం సంధించింది ప్రభుత్వం. 20 లక్షల మంది ప్రజానీకం, ఎంతోమంది కవులు, గాయకులు, నటకులు, దర్శకులు, విజ్ఞానవేత్తలు - అందరి మనస్సులూ పాడయ్యాయా?

మనస్సులు పాడుచేసుకొమ్మనే ఈ ప్రభుత్వ మంత్రులు "వాడవాడలా ప్రదిర్శంచండం"న్నారా! ప్రదర్శన చూచి ఆనందించి అభినందించే నేటి మద్రాసు మంత్రుల మనస్సులు ఏమయ్యాయి? (పాడయ్యాయా?)

**ప్రజాస్వామ్యవాదుల కర్తవ్యం:**

"మా భూమి" నాటక ప్రదర్శన నిషేధించటం ప్రజానాట్యమండలికే గాక అభ్యుదయ కళాకారులకు, నటకులకొక సవాల్. ప్రజాస్వామ్య రక్షణకొక పరీక్ష.

కాబట్టి కవులు, గాయకులు, చిత్ర కారులు, నటకులు, దర్శకులు, విజ్ఞాన వేత్తలు, ప్రజాసంఘాలు ఒకటేమిటి ఆంధ్ర ప్రజానీకమంతా "మా భూమి" ప్రదర్శనపై నిషేధం తొలగించే వరకు ఆందోళన చేయడం తన విధిగా భావించాలి. సభలు - సమావేశాలు జరిపి నిషేధాజ్ఞను ఖండించాలి. ఈ సందర్భంలో పత్రికా సంపాదకులు, ఆంధ్ర ప్రజానీకం చేయూతనిస్తారని ఆశిస్తున్నాం.

**డాక్టర్ రాజారావు, ప్రధాన కార్యదర్శి**
**ఆంధ్ర ప్రజానాట్య మండలి, బెజవాడ**

నాటకాలను ఈ విధంగా నిషేధిస్తూ రచయితలను ఎన్నో ఇబ్బందులు పెట్టారు. అరెస్టు చేశారు, చిత్రహింసల పాల్జేసారు. సుంకర సత్యనారాయణగారు అజ్ఞాతంలోకి వెళ్ళవలసి వచ్చింది. ఈ పరిస్థితిలోనే వాసిరెడ్డి భాస్కరరావు గారిని అరెస్టుచేసి హింసలు పెట్టారు. వారు రాసిన పద్యకావ్యం సాహిత్య విమర్శక గ్రంథాల వ్రాతప్రతులను నామరూపాలు లేకుండా నాశనం చేశారు. (వాటిని మళ్ళీ ఆయన వ్రాయలేకపోయారు) ఆయనను పెట్టిన ఇబ్బందుల గురించి 1948 ఆగస్ట్ విశాలాంధ్ర మాసపత్రికకు రాసిన ఉత్తరం:

జూన్ 1వ తేదీ నన్ను అరెస్టు చేశారు. తీవ్రంగా లాఠీఛార్జీ చేశారు. పద్దెనిమిది రోజులు జైల్లోపెట్టి బెయిలు మీద విడుదల చేశారు. 144వ సెక్షన్ ధిక్కరించామని మా మీద కేసుపెట్టారు.

**వీరులపాడు,**

**9. 8. 48.** **- వాసిరెడ్డి భాస్కరరావు**

ఇవేగాక లక్ష్మీకాంత మోహన్ రాసిన "సింహగర్జన" నవల. దానికి ఆయన ఆంగ్లానువాదం 'Telangana Thunders' నిజాం, మద్రాసు, మహారాష్ట్ర రాష్ట్రాలలో నిషేధింపబడ్డాయి.

# మత ఛాందసత్వం- సాహిత్యం ◆ సంస్కృతి





కొత్తపల్లి రవిబాబు

మనం 21వ శతాబ్దపు ముంగిట్లో వున్నాం. మనది సెక్యులర్ ప్రభుత్వమని గొప్పలు చెప్పుకోవడమేగానీ మతాతీత భావనలను ప్రజల్లో ప్రచారం చేయడంలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. పై పెచ్చు పరోక్ష, ప్రత్యక్ష చర్యల ద్వారా ఆయా మతాలవారిని రెచ్చగొట్టే చర్యలను ప్రభుత్వం చేపట్టింది. ఫలితంగా మధ్యయుగాల నాటి అంధ విశ్వాసాలు పునరుద్ధరింపబడుతున్నాయి. ఒకవైపు ఆధునిక టెక్నాలజీ-మరోవైపు అంధయుగపు లక్షణాలు దేశంలో చూస్తున్నాం. మత ఛాందసులు గతంలోనూ, ఈనాడు సాహిత్యంపైనా, సాంస్కృతిక కార్యక్రమాలపైనా ఆగ్రహం ప్రదర్శించి, ఆ కార్యక్రమాలనూ, సాహిత్యాన్నీ ఆంక్షలకూ, నిషేధాలకూ గురిచేసిన, గురిచేస్తున్న ఉదాహరణలు కోకొల్లలుగా వున్నాయి.

'అంగారే' అనే ఉర్దూ కథల సంకలనం 1932 నవంబరులో ప్రచురింపబడింది. అయితే అది ముస్లిం సమాజ పెద్దల, మతాధిపతుల ఆగ్రహానికి గురైంది. వారి మత సిద్ధాంతాలను ఆ కథలు కుదిపివేస్తాయని వారు భయభ్రాంతులయ్యారు. అంతిమంగా వారు ఈ కథలను మత వ్యతిరేకమైన రచనలు, అశ్లీలమైన రచనలు అని ముద్రవేసి వీటిని ప్రభుత్వం చేత నిషేధింపచేశారు. మసీదుల్లో మత సభల్లో ఈ పుస్తకం 'ధర్మ విరుద్ధ'మనీ, ఈ కథా రచయితలంతా 'మత ద్రోహు'లనీ, 'కాఫిర్ల'నీ తీర్పు యిచ్చారు మత గురువులు. ఫలితంగా రచయితలకు చీవాట్లు, చెప్పుదెబ్బలు లభించాయి. ప్రాణాపాయం నుంచి అతికష్టంపై తప్పించుకున్నారు. ఈ కథా సంకలనం మార్చి 1933లో నిషేధించబడింది.

'అంగారే' సంకలనంలో నలుగురు రచయితల కథలు వున్నాయి. దీని సంకలనకర్త సజ్జాద్ జహీర్. ఈయన అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ నిర్మాతలలో ఒకరు. ఆ సంఘ తొలి ప్రధాన కార్యదర్శి, పేరుమోసిన కమ్యూనిస్టు నాయకుడు. ఈయన రాసిన కథపేరు "నీంద్ నహీ అతీ" (నిద్ర రావడం లేదు); అహమద్ ఆలీ అనే రచయిత రాసిన కథ "ఏ ఔరతే" (ఈ ఆడవాళ్ళు); డా॥ రషీద్ జహాఁ అనే రచయిత్రి కథ 'ఢిల్లీకి షైర్' (ఢిల్లీకి షికారు); మహమూద్ దుజ్జఫర్ రాసిన కథ "జవాఁమర్ద్" (యువకుడు).

ఆనాటి సాంఘిక పరిస్థితులను పరిశీలిద్దాం. కాంగ్రెసు పార్టీ అనుసరిస్తూ వస్తున్న ప్రజావ్యతిరేక ఎత్తుగడలు ప్రజల్లో తీవ్రమైన వ్యతిరేకతనూ, అసంతృప్తిని కల్గిస్తున్నాయి. మరోవైపు ప్రపంచ వ్యాపితంగా వీస్తున్న సామ్యవాద భావాలు యువకులకు బలంగా తగిలి, వారిని ఆకర్షిస్తున్నాయి. ఆ భావాల ప్రేరణతో కరుడుగట్టిన ఛాందస భావాలన్నీ, కుళ్ళుకంపు కొడుతున్న ఆచార వ్యవహారాల్ని త్రోసిరాజని, నవ సమాజాన్ని నిర్మించాలని యువత ఉవ్విళూరుతోంది. ఆ భావాలన్నిటినీ పుణికిపుచ్చుకొని నిప్పులు కురిస్తూ 'అంగారే' సంకలనం

**ఆయుధాల్లాంటి తీవ్రమైన ఆలోచనలు, సమాజ పరిస్థితుల యెడల బద్దలవడానికి సిద్ధంగా వున్న ఆక్రోశం, కుండలు బద్దలు కొట్టినట్లుగా విషయాన్ని సూటిగా చెప్పేగుణం ఈ రచనల్లో దండిగా వున్నాయి.**

విడుదలైంది. ఆయుధాల్లాంటి తీవ్రమైన ఆలోచనలు, సమాజ పరిస్థితుల యెడల బద్దలవడానికి సిద్ధంగా వున్న ఆక్రోశం, కుండలు బద్దలు కొట్టినట్లుగా విషయాన్ని సూటిగా చెప్పేగుణం ఈ రచనల్లో దండిగా వున్నాయి.

పురుష ప్రధానమైన ఈ సమాజంలో స్త్రీలను క్రూరంగా హింసించడాన్ని చిత్రించిన రచయిత్రి డా॥ రషీద్ జహాఁ మీద మతాధిపతులు ధ్వజమెత్తారు. ఆమెని "అంగారేవాలీ" అంటూ మారుపెట్టి గేలిచేసారు. నిప్పుల్లో పడేసి కాల్చి చంపేస్తామని మొఖంమీద యాసిడ్‌పోసి కాల్చేస్తామని, ముక్కు కోసేస్తామని బెదిరింపు ఉత్తరాలు రాశారు. అయినా డా॥ జహాఁ అదరలేదు, బెదరలేదు. తర్వాత ఆమె కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకున్నారు. అభ్యుదయ రచయితల సంఘ సభ్యురాలయ్యారు. ఇదే పద్ధతిలో మిగిలిన ముగ్గురు రచయితలను మతాధికారులు హింసించారు.

ఆగస్టు 1986లో కేరళలో పి.ఎమ్. ఆంథోని రాసిన "క్రీస్తు ఆరవ పవిత్ర గాయం" అనే నాటక ప్రదర్శనను మత ఛాందసులు ఆపివేశారు. కేరళ పోలీసులు 1986 ఆగస్టు 5వ తేదీన ఈ నాటక వ్రాతప్రతిని రిహార్సల్స్ జరుగుతుండగా వశపరుచుకున్నారు. గ్రీకు రచయిత నికోస్ కంజాట్ జకిస్ రాసిన 'The Last Temptation of Christ' అనే నవలపై ఆధారపడి ఈ నాటకం రూపొందింది. ఈ నాటికలో ఒకచోట క్రీస్తుకు మేరీ మాగ్డొనాల్డ్‌తో అక్రమ సంబంధం వున్నట్టు స్ఫురింప చేశారన్నది మత ఛాందసుల వాదన. నిజానికి అటువంటి దృశ్యంకానీ, సంభాషణ కానీ ఆ నాటికలో లేదు. ఈ నాటిక ప్రదర్శనను ప్రభుత్వం ఒక జిల్లా తర్వాత, మరొక జిల్లాలో - ఇలా దాదాపు కేరళ అంతటా నిషేధించారు. ఇంతచేస్తే మతాధికారుల్లో కొందరు ఈ నాటక బృందాన్ని సమర్థిస్తున్నారు. ఈ నాటక బృందం వారు తమ నాటక ప్రదర్శనను నిషేధించడాన్ని నిరసిస్తూ, నాటకంలో వేషాలతో ఊరేగింపు చేయగా, పోలీసులు వారిని అరెస్టు చేశారు.

దీనికితోడు ఆ గ్రీకు రచయిత నవలను సమీక్షిస్తూ రాసిన ఒక వ్యాసం కాలికెట్ విశ్వవిద్యాలయంలో డిగ్రీ విద్యార్థులకు నిర్ణయింపబడిన పాఠ్యగ్రంథంలో వుంది. "ప్రజల ఆందోళన" (అంటే మత ఛాందసుల) దృష్ట్యా ఆ వ్యాసాన్ని పాఠ్య ప్రణాళిక నుండి తొలగించవలసిందిగా ప్రభుత్వం విశ్వవిద్యాలయాన్ని కోరింది. విద్యామంత్రి జాకబ్‌గారి ఆజ్ఞను బోర్డు ఆఫ్ స్టడీస్ మన్నించింది గాని - యూనివర్శిటీ వారి విద్యావిషయం ఉన్నత సంస్థ అకడమిక్ కౌన్సిల్ ఈ కోర్కెను తిరస్కరించింది. అది తొలగించకపోతే తీవ్రమైన పరిణామాలు ఏర్పడవచ్చని విద్యామంత్రి హెచ్చరించారు. తమ ఓట్ల కోసం మంత్రులు మత ఛాందసులకు లొంగిపోవడం ఇక్కడ గమనించాలి. దీని ఫలితంగా ఈనాడు కేరళ పోలీసులే సాహిత్య విమర్శకుల స్థానం ఆక్రమించారు. ప్రస్తుతం క్రీస్తు పేరు వున్న నాటికలన్నిటినీ కేరళ నాటక ప్రదర్శనల చట్టం క్రింద నిషేధిస్తున్నారు. ఉదాహరణకు త్రిచూర్‌లో పోలీసులు 'క్రీస్తు మార్గం' (The Path of Christ) అనే వీధినాటిక రిహార్సల్స్‌ను భగ్నం చేశారు. కాలికట్‌లో 'మరలా క్రీస్తు' (Christ Again) అనే వీధి నాటిక ప్రదర్శనకు అనుమతి ఇవ్వలేదు. పరూర్‌లో "బరబ్బాన్‌ను విడుదల చేయండి" అనే నాటిక రిహార్సల్స్ ప్రారంభించక ముందే వ్రాతప్రతిని పోలీసులు స్వాధీనపరుచుకున్నారు. ఇవన్నీ సమకాలీన సామాజిక విమర్శతో కూడినవే.

ఇటువంటి సంఘటనల పరంపరలో 1986 డిసెంబరు 86న కర్నాటకలో జరిగినది మరొకటి. పదేళ్ళ క్రితం మళయాళంలో ప్రచురింపబడిన ఒక కథ 'దక్కన్ హెరాల్డు'లో ఆంగ్లంలోకి అనువదింపబడి ప్రచురిపంబడింది. అయితే ఆ కథ శీర్షిక 'మహోమ్మద్, ది ఇడియట్'గా ఆంగ్లలో అనువదింపబడింది. ఇక మత ఛాందసులు తమ ప్రవక్తను అవమానించారని చెప్పి ప్రదర్శనలు చేసి, పోలీసు కాల్పులవరకు పరిస్థితిని దిగజార్చారు. ఆ పత్రిక సంపాదకుడు టి.వి.లో క్షమాపణ పదే పదే చెప్పినా, ఐదారు పట్టణాలలో మత కొట్లాటలు జరిగాయి. దాదాపు పదిమంది మరణించారు. ఇంతకీ మహమ్మద్ ప్రవక్తకీ, ఆ కథలో మహమ్మద్ పాత్రకూ ఏమీ సంబంధం లేదు. ఒక కుటుంబంలోని మందకొండి, తెలివితక్కువ బాలుడు ఈ కథలోని మహమ్మద్.

బొంబాయి పృథ్వీ థియేటర్‌లో జరగాల్సిన 'షేక్స్పియర్ కి రామ్ లీలా' అనే నాటక ప్రదర్శనను మత ఛాందసుల అల్లరిమూక నిలిపివేసింది. ఈ నాటిక రచయిత ఇక్బల్ ఖ్వాజా. విశ్వహిందూ పరిషత్తు ఆర్.ఎస్.ఎస్. ఆర్య ప్రతినిధి సమాజ్, హిందు మహాసభ, శివసేన మొదలగు సంస్థల వారందరూ 'సంయుక్త హిందూ మోర్చ' అనే సంస్థగా ఏర్పడి ఈ

***ఈ పరిషత్తు వారే 86 డిసెంబరులో 'ఇన్సాఫ్ కీ ఆవాజ్' ప్రదర్శనను ఆపుచేయడంలో విజయం సాధించారు. ఆ సినిమాలో అస్రానీ, కృష్ణ పాత్రలో గాగిల్స్ తగిలించుకొని అరుణా ఇరానీతో డాన్స్ చేయడం అభ్యంతరమని ప్రదర్శన ఆపగా, ఆ సినిమా పంపిణీదారులు కోర్టులో కేసు వేశారు.***

కార్యక్రమాన్ని నిర్వహించారు.

ఈ సంస్థ ఆర్గనైజర్ రియోరత్న ఆర్య ఈ నాటక ప్రదర్శనను నిషేధించాలని కోరుతూ పోలీసు కమీషనర్‌కూ, రచయితకూ, పృథ్వీ థియేటర్ యజమాని శశికపూర్‌కు టెలిగ్రాంలు పంపారు. ప్రదర్శన రద్దుచెయ్యకపోతే పికిటింగ్ చేస్తామని హెచ్చరించారు. విశ్వహిందూ పరిషత్తుకు చెందిన జె.సి.దేశాయ్ పృధ్వీ థియేటర్ మేనేజరును హాలు పాడుకాకూడదనుకుంటే ప్రదర్శన ఆపివేయమని బెదిరించాడు.

ఆ తర్వాత రచయిత క్వాజా, కునాల్ కపూర్ (థియేటర్ యజమాని)కూ; జె.సి.దేశాయ్, ఆర్.ఎస్.ఎస్.కు చెందిన రమేష్ మెహతాకు మధ్య జరిగిన సంప్రదింపులలో అభ్యంతరకమైన సంభాషణలు, దృశ్యాలు ఏవో చెబితే వాటిని తొలగిస్తామని చెప్పారు. కానీ మత ఛాందసులు అసలు రాముడు, సీతలను ఇంగ్లాండ్ తీసుకువెళ్ళటమూ, రోమియో జూలియట్లను ఇండియా తీసుకురావటమనే భావన అభ్యంతరకరమన్నారు. విశ్వహిందూ పరిషత్తుకు చెందిన మహేశ్ పరీబ్ సీత, రావణులుండే ఒక దృశ్యంలో సంభాషణలు అభ్యంతరకరంగా లేవుగాని వారి హావభావాలు చేష్టలు అభ్యంతరకర మన్నాడు. అయితే ఈ నాటకం ఏడు ప్రదర్శనలిప్పటికి ఇవ్వడం జరిగింది. ఈయన ఒక్క ప్రదర్శన కూడా చూడలేదు.

సంప్రదింపుల ఫలితంగా ఆ రోజు సాయంత్రం ప్రదర్శన చూచి, అభ్యంతరకరమైన వాటిని చెబితే తొలగించడం అనే ఒప్పందానికి దేశాయ్, మెహతా ఒప్పుకున్నారు. ఈ విషయాన్ని బయట గుమిగూడిన 200 మందికి చెప్పగా, ఒకడు గుంపులోంచి ఉద్రేకంగా ముందుకు వచ్చి "తుమ్ నే సీతా మాతాకో లండన్ కే ఫుట్‌పాత్ పర్ లాయా హై - హమ్ యే హో నా నహీ దేంగే" అన్నాడు. (నీవు సీతా మాతను లండన్ ఫుట్‌పాత్‌పైకి తీసుకువెళ్ళావు. ఇలా చేయడాన్ని మేం సహించం)

ఆ తర్వాత ఆ అల్లరిమూక రచయిత క్వాజాను ఎన్నివిధాల అవమానించాలో అన్నివిధాల అవమానించింది. 26 సంవత్సరాల క్వాజా తల్లి హిందువు. క్వాజాను ఆ గుంపులోని వారు "పాకిస్తాన్ గూఢచారి" అని నిందించారు. విక్రమ్ సావర్కర్ అనే ఆయన క్వాజాతో "తమ పాదాలను ముట్టి క్షమాపణ కోర"మన్నాడు. ఖురాన్‌పై ప్రమాణం చేసి "ఇటువంటి రచనలు ఎప్పుడూ చేయనని" చెప్పమన్నారు. పోలీసులు ఇదంతా చూస్తూ నిలబడ్డారు. వీరు డ్రామా స్క్రిప్టు, ప్రింట్లు, పోస్టర్లు బయటకు తెప్పించి వాటిని దహనం చేశారు. "విశ్వహిందూ పరిషత్‌కు చెందిన 26 మంది మాత్రమే వున్నాం. మిగిలిన వాళ్ళెవరో తనకు తెలియ"దని దేశాయ్ అన్నాడు.

దియోరత్నం ఆర్య అనే ఆయన ఆర్యసమాజ్ సంస్థకు చెందినవాడు. ఆర్యసమాజ్ సభ్యులు రాముడు, సీతలను దేవుళ్ళని నమ్ముతారు! "దేశంలో మైనారిటీలను ముఠాకట్టి హిందూ మతాన్ని అపహాస్యం చేస్తున్నారు" అని ఆయన అభిప్రాయం. 'అయారాం, గయారాం' అనే పదం వాడటంపై కూడా ఆర్యకు అభ్యంతరం వుంది.

ఈ పరిషత్తు వారే 86 డిసెంబరులో 'ఇన్సాఫ్ కీ ఆవాజ్' ప్రదర్శనను ఆపుచేయడంలో విజయం సాధించారు. ఆ సినిమాలో అస్రానీ, కృష్ణ పాత్రలో గాగిల్స్ తగిలించుకొని అరుణా ఇరానీతో డాన్స్ చేయడం అభ్యంతరమని ప్రదర్శన ఆపగా, ఆ సినిమా పంపిణీదారులు కోర్టులో కేసు వేశారు. మొత్తం సినిమాను నిషేధించాలని పరిషత్తు కోరుతోంది - కేసు కోర్టులో వుంది. ఈ సినిమా అంతకు మునుపే తెలుగులో వచ్చింది. దీని డైలాగ్ రచయిత కాదర్‌ఖాన్ మాత్రమే ముస్లిం. అలాగే 'షేక్స్పియర్ కీ రామ్‌లీలా'లో రచయిత తప్ప అందరూ హిందువులే.

1980లో విజయ్ టెండుల్కర్ నాటకం 'ఘాశీరాం కొత్వాల్' ప్రదర్శన విదేశాలకు వెళ్తుంటే శివసేన వారు స్థానిక ఇందిరా కాంగ్రెస్ వసంత సాథే (ఈనాడు కేంద్రమంత్రితో)తో కలసి వ్యతిరేక ప్రచారం చేశారు. టెండుల్కర్, అతని కుటుంబ సభ్యులు ఒక నెలరోజులపాటు బెదిరింపులకు లోనయ్యారు. అయితే ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ కమిటీవారు వివిధ నాటక బృందాల వారిని సమావేశపరచి, ఒక తాత్కాలిక కమిటీని ఏర్పరచి ఇటువంటి బెదిరింపులను భవిష్యత్తులో ఎలా ఎదుర్కోవాలో నిర్ణయించుకున్నారు. ◆

# గూండా సంస్కృతికి బలైపోయిన ప్రజా కళాకారుడు సఫ్దర్ హాష్మీ



**అది నూతన సంవత్సరం - మొదటిరోజు, ఢిల్లీ శివార్లలోని సహీదాబాద్ పారిశ్రామిక వాడలో జననాట్యమంచ్ 'హల్లాబోల్' వీధినాటికను ప్రదర్శిస్తోంది. పదేళ్ళ క్రితం స్థాపించిన ఈ రంగస్థల సంస్థ నిర్మాత సఫ్దర్ హాష్మీ. ఆయన నటుడు, దర్శకుడు, స్క్రిప్ట్ రచయిత, ప్రజా కళారంగంలో బహుముఖ ప్రజ్ఞావంతుడు.**

స్థానిక పురపాలక ఎన్నికల్లో సి.పి.ఎం. అభ్యర్థికి అనుకూలంగా జరుగుతున్న ప్రచారంలో కార్యక్రమంగా ఆ నాటికను హాష్మీ బృందం ప్రదర్శి స్తోంది. అయితే కాంగ్రెసు బలపరచిన ముఖేష్‌శర్మ అనే అభ్యర్థి మూతావారు వచ్చి నాటకం వేస్తున్న స్థలాన్ని ఖాళీ చేయమని ఆదేశించారు. ఆ తర్వాత లాఠీలు ఉపయోగించి నాటక బృందంపై విరుచుకుపడ్డారు. బలంగా గాయాలు తగిలిన హాష్మీ 2వ తేదీన హాస్పటల్లో మరణించారు. దేశవ్యాప్తంగా పెరిగిపోతున్న గూండా సంస్కృతి ఒక ఉత్తమ కళాకారుణ్ణి బలిగొంది.

ఢిల్లీలో ఇందిరాగాంధీ హత్యానంతరం సిక్కులకు వ్యతిరేకంగా సాగిన అరాచక కృత్యాలను ఖండిస్తూ మతసమైక్యత నినాదంతో ఢిల్లీలో జరిపిన బ్రహ్మాండమైన జాతీయ ప్రదర్శన నిర్వహించడంలో హాష్మీ కీలకమైన పాత్ర వహించారు. కనుకనే .... 'మన సమైక్యత, సదవగాహన సంస్థ' వారు ఇటీవల హాష్మీ నిర్వహిస్తున్న నాటక బృందం 'జననాట్యమంచ్'కు మత సమైక్యత బహుమతి ప్రకటించింది. అయితే ఈ బహుమతిని హెచ్.కె.యల్. భగత్ ప్రదానం చేస్తారని తెలిసి, ఆ బహుమతిని ఆయన చేతుల్లో నుండి తీసుకోడానికి జన నాట్యమంచ్ తిరస్కరించింది.

హాష్మీ కమ్యూనిస్టు కుటుంబంలో జన్మించారు. ప్రముఖ కళాకారుడు హబీబ్ తన్వీర్, హాష్మీ తండ్రి హనీఫ్ హాష్మీ 1960 ప్రారంభ సంవత్సరాలలో సోవియట్ సమాచార శాఖలో కలసి పనిచేశారు. 1954లో జన్మించిన సఫ్దర్ హాష్మి ఢిల్లీలోని

సెయింట్ స్టీఫెన్స్ కాలేజిలో ఇంగ్లీషు సాహిత్యంలో యం.ఏ. డిగ్రీ పొందారు. 1975 నుండి 78 వరకు శ్రీనగర్ (గద్వాల్) శ్రీనగర్ (కాశ్మీర్)లలో అధ్యాపకునిగా పనిచేశారు. 1978లో ఢిల్లీ జాకిర్ హుస్సేన్ కళాశాలలో పనిచేసి. ఆ తర్వాత ప్రెస్‌ట్రస్ట్ ఆఫ్ ఇండియాలో చేరారు. తర్వాత ఢిల్లీలోని పశ్చిమబెంగాల్ సమాచార కేంద్రంలో ప్రెస్ ఆఫీసర్‌గా పనిచేసి 1983లో ఆ ఉద్యోగాన్ని వదిలేశారు. ప్రారంభంలో ప్రజానాట్య మండలిని పునరుద్ధరించి కార్యక్రమాలు నడిపినా గత పదేళ్ళుగా ఒకవైపు ఉద్యోగాలు చేస్తూనే, మరోవైపు జననాట్య మంచ్‌ను స్థాపించి ప్రజా సాంస్కృతిక రంగంలో పనిచేస్తూ వచ్చారు. వీరి భార్య అయిన మలయశ్రీ కూడా నటి, రచయిత్రి - సర్దార్ పటేల్ కళాశాలలో అధ్యాపకురాలు. స్టేజినాటకాల నుంచి వీధినాటకాలపై హాష్మీ కేంద్రీకరించడం ఎమర్జన్సీ కాలంలో జరిగింది. ఎమర్జన్సీలో స్టేజినాటకాల ప్రదర్శన కష్టతరంకాగా, వీధుల్లో నాటికలు వేసుకొని ప్రజలను చైతన్యపరచే కార్యక్రమం చేపట్టారు. వీరి "ఔరత్", 'చక్కాజామ్' 'హల్లాబోల్' మొదలైన వీధినాటకలకు బహుళ ప్రజాదరణ లభించింది. ఇప్పటికి జననాట్యమంచ్ తరఫున 300 ప్రదర్శనలిచ్చారు.

గూండా సంస్కృతికి తలవొగ్గేది లేదని జననాట్యమంచ్ వారు, హాష్మీ హత్యవల్ల జనవరి 1న ఆగిపోయిన ప్రదర్శనను, మరల మూడురోజుల తరువాత 4వ తేదీ మధ్యాహ్నం అదే ప్రదేశంలో ప్రదర్శించడం జరిగింది. ఈ ప్రదర్శనలో మామూలుగానే హాష్మీ భార్య మలయశ్రీ తన పాత్ర ధరించారు. అదేరోజు ఢిల్లీలో రాజకీయ సైద్ధాంతిక విభేదాలు ప్రక్కనబెట్టి పదివేలమంది పైగా "కళాకారులు, రచయితలు, పాత్రికేయులు, ఉపాధ్యాయులు, రాజకీయ కార్యకర్తలు" హత్యా రాజకీయాలను నిరసిస్తూ - ప్రజాస్వామిక హక్కుల రక్షణ

శ్రమజీవులైన ప్రజానీకానికి సంబంధించిన ఉద్యమాలలో పని చేస్తున్నవారిపై కిరాయి గూండాలు, నేరస్తుల ద్వారా జరపబడుతున్న హత్యాకాండ గురించి ప్రజలను చైతన్యపరచడం ఈ కమిటీ ప్రధాన కర్తవ్యంగా నిర్దేశించుకున్నారు.

కోరుతూ శివాజీపార్క్ నుంచి హోంమినిస్టర్ బూటాసింగ్ ఇంటివరకు ఐదు కిలోమీటర్ల దూరం మౌనప్రదర్శన జరిపారు.

పూనేలో జనవరి 6న రంగస్థల కళాకారులు, మేధావులు, సాంఘిక సేవా కార్యకర్తలు సమావేశమై హాష్మీ హత్యను ఖండించి ఒక కమిటీని ఏర్పాటు చేశారు. శ్రమజీవులైన ప్రజానీకానికి సంబంధించిన ఉద్యమాలలో పని చేస్తున్నవారిపై కిరాయి గూండాలు, నేరస్తుల ద్వారా జరపబడుతున్న హత్యాకాండ గురించి ప్రజలను చైతన్యపరచడం ఈ కమిటీ ప్రధాన కర్తవ్యంగా నిర్దేశించుకున్నారు.

జనవరి 9న హాష్మీ హత్యకు నిరసనగా దేశవ్యాప్తంగా నటులు, చిత్రకారులు, నాట్యకళాకారులు సమ్మె చేశారు. ఆ రోజు దేశవ్యాప్తంగా సాంస్కృతిక బృందాలు ప్రదర్శనలు ఇవ్వలేదు. ఆ రోజు నల్లబ్యాడ్జీలు ధరించి "కళాకారుల స్వేచ్ఛ రక్షించాలి" అనే నినాదంతో ఊరేగింపులు జరిపారు. ఢిల్లీలో ఆ రోజు ప్రారంభం కావాల్సిన సాహిత్య కళా పరిషత్తు సంగీత నాటక ఆకాడమీల ఉత్సవాల ప్రారంభాన్ని వాయిదా వేసారు.

ఢిల్లీలో ప్రారంభమైన 12వ అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ప్రారంభ చిత్రప్రదర్శన ఆరంభంలో ఏర్పాటుచేసిన సమావేశంలో ప్రముఖ హిందీ నటి షబానా అజ్మి - కాంగ్రెస్ బలపరచిన గూండాల చేతిలో హాష్మీ హత్య చేయబడటాన్ని నిరసిస్తూ ఒక ప్రకటన చేశారు. ప్రముఖ బ్రిటిష్ చలనచిత్ర దర్శకుడు జాన్ ష్లెషింగర్ కూడా ఈ హత్యను ఖండించారు. అనేకమంది మేధావులు, ప్రఖ్యాత కళాకారులతో సఫ్దర్ హాష్మీకి పరిచయం వుండటం వల్లనూ, హత్య దేశరాజధానీ నగరమైన ఢిల్లీ పట్టణంలో జరగటం వల్లనూ విస్తృత ప్రచారంలోకి వచ్చి ఎక్కువమంది స్పందించి ఖండించటానికి సాధ్యపడింది. అయితే ప్రభుత్వ వేదికపై ప్రభుత్వాన్ని విమర్శించినందుకు గాను, చలన చిత్రోత్సవం వార్తలను, దృశ్యాలను చూపించే సందర్భాలలో దూరదర్శన్‌లో ఎక్కడా షబానాఅజ్మి కనబడకుండా జాగ్రత్తవహించమని ప్రభుత్వం ఆదేశించింది. ఉత్సవ నిర్వాహకుడు కబీర్ బేడిని, షబానా అజ్మి మరల వేదికపైకి రాకుండా జాగ్రత్తపడి కార్యక్రమాలను నిర్వహించమని ఆదేశించింది!

# నరహంతను ఆక్షేపించిన నటశిఖరం





ఎస్. వెంకట్రావ్

మానవ మేధస్సు సృష్టించిన అత్యంత మహత్తర కళారూపం సినిమా... అంటాడు ప్రముఖ మళయాళ దర్శకుడు అదూర్ గోపాలకృష్ణన్. ఆధునిక యుగంలో సర్వకళల సమాహారంగా, అటు మానవుడు సృష్టించిన కళలనూ, సైన్సునూ, పరిశ్రమనూ కలుపుకుని ఆవిర్భవించింది సినిమా. సినిమాను 'ఏడో కళ' అంటున్నారు. అటువంటి సినిమా గత వందేళ్లకు పైగా సాగిన తన ప్రయాణంలో అంతర్జాతీయంగా అనేక మంది గొప్ప కళాకారులను సృష్టించింది. అటువంటి గొప్ప కళాకారుల్లో అత్యంత ప్రతిభావంతుడైన, అత్యంత సృజనశీలుడైన కళాకారుడు చార్లీ చాప్లిన్.

1889 ఏప్రిల్ 16న లండన్‌లో ని ఒక పేద కార్మిక వాడలో, నాటకాలే వృత్తిగా బతికే ఒక పేద కుటుంబంలో పుట్టిన చాప్లిన్ బాల్యంలో కడు పేదరికాన్ని అనుభవించాడు. తలిదండ్రులకు దూరమై ఒంటరి జీవితాన్ని గడిపాడు. సమాజంలో సామాన్య మానవునికి ఎదురయ్యే సమస్యలన్నీ చాప్లిన్‌కి ఎదురయ్యాయి. సామాన్యుడు అనుభవించే కష్టాలు, అతని ఆశలూ, ఆకాంక్షలూ, భావోద్రేకాలూ - అన్నీ చాప్లిన్‌కి అనుభవమే. ఆ అనుభవాలనే ఆయన చలన చిత్రాల ద్వారా కళాత్మకంగా మలిచి మన ముందుంచాడు. సమాజం లోని అట్టడుగు నుండి వచ్చినందునే ఆయన చిత్రాలలో మనకు ఎప్పుడూ సామాన్యుడే కనపడతాడు. దేశదిమ్మరి పాత్ర ద్వారా ఒకవైపు తన జీవితాన్ని మనముందు ఆవిష్కరిస్తూనే మరోవంక సమాజంలోని కుళ్ళును ఎండగడతాడు. దోపిడీ సమాజాన్ని నిరసిస్తాడు. మానవత్వాన్ని ప్రబోధిస్తాడు.

చాప్లిన్ తీసిన చిత్రాలన్నిటిలోకీ గొప్ప కళాఖండం మోడరన్ టైమ్స్ (ఆధునిక కాలం). ఈ చిత్రం 1937లో విడుదలయింది. ఆనాడు అమెరికా లోనూ యితర పెట్టుబడిదారీ దేశాల లోనూ తీవ్రమైన ఆర్థిక మాంద్యం నెలకొని వుంది. ఉత్పత్తి విపరీతంగా సాగుతున్నా వాటిని కొనే నాధుడు లేడు. బజారులో అన్ని సరుకులూ వున్నా కార్మికులకు దారిద్ర్యం తప్ప మరొకటి లేదు.

నిరుద్యోగం, ఆకలి, దారిద్ర్యం ఎక్కడ చూసినా విలయతాండవం చేస్తున్నాయి. ఈ భౌతిక పరిస్థితిని చాప్లిన్ కళాత్మకంగా వెండితెరమీదకెక్కించాడు.

ఆధునిక కార్మికుడు యంత్రాల కోరల్లో ఎలా నలిగిపోతున్నాడో "మోడరన్ టైమ్స్" చిత్రంలో అత్యంత ప్రతిభావంతంగా చూపించాడు. పెట్టుబడిదారీ సమాజంలో ఆధునిక యంత్రాలు కార్మికుని సృజనాత్మకతను దెబ్బతీసి అతన్ని కూడా యంత్రంగా మార్చేస్తాయని, కార్మికుని రక్తం పీల్చు కోవడానికి యజమానులు ఆధునిక యంత్రాలను మరింత ఎక్కువగా ప్రవేశ పెడతారని, ఆ సమాజంలో చివరికి కార్మికునికి మిగిలేది ఆకలి, దారిద్ర్యం, మానసిక ఆందోళనలేనని ఎంతో వ్యంగ్యంగా వివరించాడు.

ప్రజా కళాకారుడిగా చాప్లిన్ నాటి భౌతిక పరిస్థితులకు స్పందించాడు. ఆ విధంగా తీసిన చిత్రమిది. కానీ దానికి ఆయన పెద్ద మూల్యం చెల్లించాల్సి వచ్చింది. మోడరన్ టైమ్స్ చిత్రం కమ్యూనిస్టు అభిప్రాయాలు వెల్లడిస్తోందని అమెరికన్ పాలకవర్గాలు ఆయన మీద కక్షగట్టాయి.

ప్రజా కళాకారుడిగా చాప్లిన్ నాటి భౌతిక పరిస్థితులకు స్పందించాడు. ఆ విధంగా తీసిన చిత్రమిది. కానీ దానికి ఆయన పెద్ద మూల్యం చెల్లించాల్సి వచ్చింది. మోడరన్ టైమ్స్ చిత్రం కమ్యూనిస్టు అభిప్రాయాలు వెల్లడిస్తోందని అమెరికన్ పాలకవర్గాలు ఆయన మీద కక్షగట్టాయి. అప్పటి వరకు చాప్లిన్‌ను ఆకాశానికి ఎత్తిన పత్రికలు సందుదొరికితే ఆయన్ని విమర్శించడం, చిన్న విషయాలకు చిలువలు పలువలు అల్లి విషప్రచారం చేయడం ప్రారంభించాయి. మోడరన్ టైమ్స్ చిత్రం తరువాత నాలుగేళ్ళపాటు ఆయన మరో చిత్రం గురించి ఆలోచించకుండా తిరిగాడు.

ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధమేఘాలు కమ్ముకున్నాయి. నాజీలు దండయాత్రకు సిద్ధమవుతున్నారు. మొదటి ప్రపంచ యుద్ధంలో జరిగిన విధ్వంసాన్ని చాప్లిన్ కళ్ళారా చూశాడు. యుద్ధంలో మరణించినవారు మరణిం చగా, కాళ్ళు చేతులు పోగొట్టుకున్న వాళ్ళు, కళ్ళుపోయి అంధులైన వాళ్ళు -వీధుల్లో తిరుగుతుంటే చూసి యుద్ధాన్ని అసహ్యించుకున్నాడు. ఆ జ్ఞాపకాలు స్మృతిపథం నుండి చెరిగిపోకముందే మళ్ళీ మరో యుద్ధానికి జరుగుతున్న సన్నాహాలు చూసి చాప్లిన్ హృదయం భరించలేకపోయింది. యుద్ధానికి కారకుడైన నరరూప రాక్షసుడు అడాల్ఫ్ హిట్లర్ పేరు వింటే చాప్లిన్ శరీరంపై తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయ్యేది. ఆ దుర్మార్గుణ్ణి ప్రపంచం ముందు అపహాస్యంపాలు చేయాలని భావించాడు. ఆ భావం నుండి పుట్టుకొచ్చిందే ది గ్రేట్ డిక్టేటర్ చిత్రం.

యుద్ధం అనేక విధాల లాభదాయకమని, దానివల్ల పరిశ్రమలు విస్తరిస్తాయని, లాభాలు పెరుగుతాయని అమెరికాలో వ్యాపారవేత్తలు ఆనందపడేవారు. అలాంటి వారిని చాప్లిన్ ఏవగించుకున్నాడు. చాప్లిన్ మూడవ భార్య పాలెట్టె గొడార్డ్ హీరోయిన్‌గా ఒక సినిమా కథ రాయడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని దాన్ని విరమించుకుని హిట్లర్ మీద సినిమా తీయడానికి పూనుకున్నాడు.

చాప్లిన్ దేశదిమ్మరి పాత్రకు వున్న ఫ్రెంచ్ కట్ మీసాలే హిట్లర్‌కు కూడా వున్నాయని, దేశదిమ్మరిని పొరపాటుగా హిట్లర్ అని భావించినట్లు ఒక సినిమా తీయాలని 1937లో ఆయనకు ఒక స్నేహితుడు సూచించాడు. రెండు పాత్రలూ ఆయనే ధరించవచ్చునన్నాడు. దాన్ని గురించి అప్పట్లో పెద్దగా ఆలోచించలేదు. కానీ అది యిప్పుడు చర్చనీయాంశమైంది. దాని మీద పని ప్రారంభించాడు. ఇంతలో అకస్మాత్తుగా ఆయనకొక ఆలోచన వచ్చింది. హిట్లర్ పాత్రలో అనర్గళమైన ప్రసంగాలతో ప్రజలకు చెప్పదలచుకున్నదంతా చెప్పొచ్చును. దేశదిమ్మరి పాత్రలో సాధ్యమైనంత నిశ్శబ్దంగా వుండనూ వచ్చు. హిట్లరు కథ ఒక వైపు అనర్గళ ప్రసంగానికీ, మరోవైపు పాంటో మైమింగ్ - మూగ నటనకీ అవకాశం కల్పిస్తోంది. ఈ ఉత్సాహంతో ఆయన హాలీవుడ్‌కి హడావిడిగా తిరిగి వచ్చాడు. స్క్రిప్ట్ రచనకు ఉపక్రమించాడు. కథ రాయడానికి రెండేళ్ళు పట్టింది.

ది గ్రేట్ డిక్టేటర్ సినిమా నిర్మాణం సాగుతుండగానే యునైటెడ్ ఆర్టిస్ట్ కంపెనీ నుండి భయంకరమైన వార్తలు రావడం ప్రారంభించాయి. చిత్రం సెన్సార్‌షిప్ ఇబ్బందుల నెదుర్కొంటుందని హెచ్చరించారు. ఇంగ్లండ్‌లోని వారి కంపెనీ కార్యాలయం, బ్రిటన్‌లో హిట్లరు వ్యతిరేక సినిమాకు అనుమతి లభించక పోవచ్చునని ప్రకటించింది. కానీ చాప్లిన్ ముందుకు పోవాలనే నిర్ణయించుకున్నాడు. హిట్లరును అపహాస్యం చేయాలనేది ఆయన ఉద్దేశం. కాని జర్మన్ చిత్రహింసా శిబిరాల

(కాన్ సెంట్రేషన్ క్యాంప్స్)లో జరిగిన దారుణ మారణకాండ గురించి తనకు ముందే తెలిసి వుంటే అలాంటి నరహంతకుడిపై హాస్య చిత్రం తీసేవా డినికాదని చాప్లిన్ తరువాత పేర్కొన్నాడు. అయితే స్వచ్ఛమైన జాతి అని నాజీలు ప్రచారం చేసిన సిద్ధాంతాన్ని నవ్వులపాలు చేయాలని మాత్రం ఆయన నిశ్చయించుకున్నాడు.

సినిమా ఇంకా పూర్తికాకముందే ఇంగ్లండు నాజీల మీద యుద్ధం ప్రకటించినట్లు రేడియో వార్త విన్నాడు. జర్మన్లు "మాగినాట్‌లైన్" ఎన్నటికీ దాటలేరని భావించారు. కాని ఇంతలో దిగ్భ్రాంతికరమైన వార్తలు ఒక్కొక్కటీ రావడం ప్రారంభించాయి. నాజీలు బెల్జియంలోకి చొచ్చుకు పోయారు. మాగినాట్ లైను కుప్పకూలిపోయింది. డాన్‌కిర్కు ఫ్రాన్సులను ఆక్రమించారు. రానురాను మరింత దారుణమైన వార్తలు వస్తున్నాయి.

ఇంతలో చాప్లిన్‌కి, న్యూయార్కు కార్యాలయం నుండి "వెంటనే చిత్రం పూర్తిచేయి, అందరూ దానికోసమే ఎదురు చూస్తున్నారు" అని టెలిగ్రామ్ వచ్చింది.

కానీ చిత్రం త్వరగా పూర్తి చేయడం చాప్లిన్‌కి చాలా కష్టమైంది. దానికి అనేక రకాలైన మీనియేచర్ మోడల్స్ కావల్సి వచ్చింది. చిత్రం షూటింగ్‌కు ముందే ఆయన దానిపై అయిదులక్షల డాలర్లు ఖర్చు చేశాడు. ఇంతలో హిట్లరు రష్యామీద దండెత్తాలని నిర్ణయించాడు. అతని అంతం దగ్గర పడిందని అనుకున్నాడు చాప్లిన్. కాని ఈ వార్త విన్న చాలా మంది అమెరికన్లు – హమ్మయ్య అని ఊపిరి పీల్చుకోవడం



చూసి చాప్లిన్ నిరసన వ్యక్తం చేశాడు.

'ది గ్రేట్ డిక్టేటర్' చిత్రం తీస్తున్నప్పుడే చాప్లిన్‌కి అనేక బెదిరింపులేఖలు రావడం ప్రారంభమైంది. చిత్రం పూర్తి కావడంతో ఉత్తరాల సంఖ్య పెరిగింది. థియేటర్లలో బాంబులు విసిరేస్తామని కొందరు, దాన్ని ఎక్కడ ప్రదర్శించినా తెర కాల్చేస్తామని యింకొందరు బెదిరించారు. మరికొందరు అల్లర్లు రేపుతామని భయపెట్టారు. దీనిపై పోలీసుల సహాయం తీసుకోవాలని మొదట్లో అనుకున్నాడు. కానీ ఇదంతా ప్రచారమైతే ప్రేక్షకులు భయపడి సినిమాకు రారనే ఉద్దేశంతో ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

ఏదేమైనా 'ది గ్రేట్ డిక్టేటర్' సినిమాను స్వయంగా రిలీజ్ చేయడానికి చాప్లిన్ పూనుకున్నాడు. న్యూయార్క్‌లోని అస్టర్, కాపిటల్ అనే రెండు థియేటర్లు అద్దెకు తీసుకుని వాటిలో సినిమా ప్రదర్శించాడు. సినిమాకి బ్రహ్మాండమైన ఆదరణ లభించింది. చాప్లిన్ తీసిన సినిమాలన్నింటిలోకీ 'ది గ్రేట్ డిక్టేటర్' ఎక్కువ డబ్బు సంపాదించి పెట్టింది. కానీ పత్రికలు మాత్రం చిత్రాన్నీ, చాప్లిన్‌నీ విమర్శించాయి. చాప్లిన్ ఈ చిత్రం ద్వారా ప్రేక్షకులకు కమ్యూనిజం బోధించాడని రాశాయి.

ఈ చిత్రంలో చాప్లిన్ ద్విపాత్రాభినయం చేశాడు. అందులో ఒకటి యూదు మంగలి పాత్ర. రెండవది హిట్లరును పోలిన నియంత పాత్ర. యూదు మంగలి యుద్ధంలో పాల్గొంటాడు. యుద్ధం ముగిశాక పట్టణం తిరిగి వచ్చి బతుకు తెరువుకు మంగలి షాపు పెట్టుకుంటాడు. కానీ దేశంలో నియంతృత్వం రాజ్యమేలుతుంది. నియంత ఇనుప పాదాల కింద ప్రజలు నలిగిపో తుంటారు. దాన్ని ఎదిరించడానికి రహస్యంగా ప్రయత్నిస్తుంటారు. ఒకవైపు హిట్లరు పాత్రలో నియంతృత్వ పీడనకు ప్రతిఘటనను చూపిస్తూనే మరో వైపు హిట్లరు పాత్రలో చాప్లిన్ నియంతలను అవహేళన చేశాడు. తమది శుద్ధ ఆర్యజాతి అని, బతికే హక్కు ప్రపంచాన్ని పరిపాలించే హక్కు తమకే ఉన్నదని నాజీలు చేసే ప్రచారాన్ని తూర్పారబట్టాడాయన.

ఒక సన్నివేశంలో హిట్లరు గ్లోబ్‌తో ఆడుకుంటాడు. దాన్ని ముద్దు పెట్టుకుంటాడు, కౌగిలించుకుంటాడు. దాన్ని పైకి

ఎగురవేసి, తాను కిందపడి కాళ్ళతో తంతాడు, ఇంతలోనే అది టప్పున గాలిలో పేలిపోతుంది. ఆ విధంగా ప్రపంచాధిపత్యం కోసం నియంతలు కనే కలలు కల్లలౌతాయని చాప్లిన్ వ్యంగ్యంగా చెప్పాడు.

చిత్రం చివరలో అనుకోని మలుపు తిరుగుతుంది. నియంత ఒక ప్రమాదం లో మరణిస్తాడు. హిట్లరులా వున్న యూదుమంగలికి హిట్లరు వేషం వేసి ఒక పెద్ద విజయోత్సవ సభలో ప్రసంగించమని కోరుతారు ఆంతరంగి కులు. అది చిత్రంలో తుది సన్నివేశం. అందులో చాప్లిన్ నియంతలాగా కాకుండా మానవత్వాన్ని ప్రబోధిస్తూ ప్రసంగిస్తాడు. ఆ ప్రసంగమే అమెరికా పాలకవర్గాలకు మింగుడు పడలేదు. మోడరన్ టైమ్స్ చిత్రంతో చాప్లిన్ మీద ప్రారంభమైన దుష్ప్రచారం ఈ చిత్రంతో మరింత పెరిగింది. వేధింపు కూడా ప్రారంభమైంది. కాని చిత్రంలోని చివరి ప్రసంగం ఎంతో మంది ప్రజలనూ, ప్రజాతంత్ర వాదులనూ ఉత్తేజపరిచింది. హాలీవుడ్‌లో నాడు ప్రముఖ దర్శకుడైన ఆర్కీ ఎల్‌మేయర్ ఆ ప్రసంగాన్ని అచ్చు వేయించాడు. అది ఆనాడే కాదు, నేటికీ ఉత్తేజమిస్తుంది. ఆ ప్రసంగం ఇలా సాగుతుంది :

"క్షమించండి, నేను నియంతను కాదలచుకోలేదు. అది నా పని కాదు. నేనెవరినీ జయించదలుచుకోలేదు. పరిపాలించదలచుకోలేదు. అవకాశము న్నంత వరకు అందరికీ – యూదులకూ, నల్లవారికీ, తెల్లవారికీ, అందరికీ – సహాయం చేయడమే నా అభిమతం.

"మనందరం ఒకరికొకరు సహాయ పడాలను కుంటాం. మానవనైజమే అంత. ఒకరి ఆనందం మరొకరు పంచుకోవాలనుకుంటాం. అంతేకాని ఒకరి దుఃఖాన్ని మరొకరు చూడాలను కోం. మనం ఒకరిపై మరొకరం పగ పెంచుకోవాలనుకోం. ఈ ప్రపంచంలో అందరికీ చోటుంది. ఈ భూమి సిరిసం పదల నిలయం. అందరికీ వాటిని అందిస్తుంది.

"జీవన మార్గం స్వేచ్ఛామయం. నిసర్గసుందరం. కాని మనం ఆ మార్గం విడిచిపెట్టేశాం. దురాశ మానవ హృద యాలను విషపూరితం చేసింది. పగ ప్రపంచంలో అడ్డుగోడలు సృష్టించింది. మనల్ని బాధల్లోకి, రక్తపాతంలోకి నెట్టింది. మనం వేగం పెంచుకున్నాం. కాని ఆ వేగంలో కొట్టుకుపోతున్నాం. అన్నీ సమకూర్చిన ఆధునిక యంత్రాలు మనల్ని ఏదీ దొరకని కరువుకు గురి చేశాయి. మన విజ్ఞానం మనల్ని అనుమానాల పుట్టలుగా మార్చింది. మన తెలివి తేటలు మనల్ని కఠిన హృదయాలుగా మార్చాయి. మనం ఎంత ఎక్కువగా ఆలోచిస్తున్నామో అంత తక్కువగా స్పందిస్తున్నాం. యంత్రాల కన్నా ఎక్కువగా మనకు మానవత్వం కావాలి. తెలివితేటలకన్నా ఎక్కువగా దయార్ధ్ర హృదయం, ఉ దాత్తభావాలు కావాలి. ఇవి లేకుంటే జీవితం హింసాపూరిత మవుతుంది. సర్వస్వం హరించుకుపోతుంది.

"విమానం, రేడియో మనల్ని సన్నిహితం చేశాయి. ఈ వస్తువులు మానవునిలో మంచితనాన్ని అభిలషిస్తు న్నాయి. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని వాంఛిస్తున్నాయి. అందరిలో ఐకమత్యాన్ని ఆశిస్తున్నాయి. ఇప్పటికిప్పుడు నా గొంతు ప్రపంచ వ్యాపితంగా లక్షలాది మందికి చేరుతోంది. లక్షలాది మంది అభాగ్యస్త్రీలు, పురుషులు, పిల్లలకు చేరుతోంది. ప్రజల్ని చిత్రహింసలకూ, పీడనకూ గురి చేసే వ్యవస్థకు బలి అయిపోయిన బాధాసర్పద్రష్టులకు చేరుతోంది. ఇది వింటున్న వారందరికీ నా మాట ఒక్కటే. "నిరాశ చెందకండి!" ఈ బాధలు, ఈ దురాశానీడలు, మానవ జాతి పురోగమనానికి భయపడిన కొందరు చేస్తున్న ఈ దౌష్ట్యం – అన్నీ తొలగిపోతాయి. మనుషులలో పగ నశిస్తుంది. నియంతలు చస్తారు. ప్రజల వద్ద నుండి వాళ్ళు లాక్కున్న అధికారం తిరిగి ప్రజలకు చేరుతుంది. మనుషుల ప్రాణత్యాగాలు వృధా కావు. స్వేచ్ఛ వర్ధిల్లుతుంది.

"సైనికులారా! ఈ దుర్మార్గులకు తలొగ్గకండి. వారు మిమ్మల్ని బానిసలు గా చూస్తున్నారు! మీ జీవితాలను శాసిస్తున్నారు! మీరు ఏం చేయాలో, ఏం ఆలోచించాలో, ఏం భావించాలో వారే చెబుతున్నారు. మీకు ఇంత తిండి పెట్టి, కవాతు చేయిస్తున్నారు. మిమ్మల్ని పశు వుల్లా పరిగణిస్తున్నారు. ఫిరంగి గుళ్ళుగా ఉపయోగించుకుంటున్నారు. మానవత్వంలేని ఈ మనుషులకు తలొగ్గకండి – వీళ్ళు యంత్రపు మెద ళ్ళు, యంత్రపు హృదయాలుగల యంత్రపు మనుషులు, కాని మీరు యంత్రాలు కారు, మనుషులు. మీ హృదయాలలో మానవత్వంపట్ల ప్రేమ నింపుకోండి! పగ వద్దు! ప్రేమించని వారే

పగపడతారు! మానవత్వంలేని వారు మాత్రమే ప్రేమించలేరు!!

"సైనికులారా! బానిసత్వం కోసం పోరాడకండి! స్వేచ్ఛ కోసం పోరాడండి! లూకా సువార్త 17వ అధ్యాయంలో "దేవుని రాజ్యం మనిషిలోనే ఉన్నది." అని రాసి వుంది. ఒక్క మనిషిలో కాదు, లేదా కొందరిలో కాదు, మనుషులం దరిలోనూ వుంది! మీలో వుంది! మీరే, ప్రజలే సర్వశక్తి సంపన్నులు! ఈ జీవితాన్ని స్వేచ్ఛగానూ, సుందరవంతం గానూ తీర్చిదిద్దగల శక్తి మీకే వుంది. ప్రజాస్వామ్యం కోసం మనం ఆ శక్తిని ఉపయోగిద్దాం. మనమంతా ఏకమవు దాం! నూతన ప్రపంచం కోసం పోరాడుదాం – మనుషులకు పని చేసే అవకాశం, యువకులకు భవిష్యత్తు, వృద్ధులకు భద్రత కల్పించే మహోన్నత ప్రపంచం కోసం పోరాడుదాం!

"ఈ సదుపాయాలు కల్పిస్తామనే వాగ్దానంతో దుర్మార్గులు అధికారంలోకి వచ్చారు. కాని వాళ్ళు అబద్దాలు చెబుతు న్నారు! వాళ్ళు వాగ్దానాలు నెరవేర్చరు. ఎన్నటికీ నెరవేర్చరు. నియంతలు తాము స్వేచ్ఛ సంపాదిస్తారు. కాని ప్రజలను బానిసలుగా మారుస్తారు. ఇప్పుడు మనం ప్రపంచ విముక్తి కోసం పోరాడు దాం – దేశాల మధ్య అడ్డుగోడలు తొలగించడం కోసం, దురాశ, పగ, అసహనాలు లేని మరో ప్రపంచం కోసం పోరాడుదాం. సహేతుకంగా ఆలోచించ గల ప్రపంచం కోసం, సైన్స్, అభివృద్ధి ఫలితాలు మానవులందరి ఆనందానికి ఉపయోగపడే ప్రపంచం కోసం పోరాడు దాం. సైనికులారా ప్రజాస్వామ్యం కోసం మనమంతా ఏకమవుదాం.

**యుద్ధంలో మరణించినవారు మరణించగా, కాళ్ళు చేతులు పోగొట్టుకున్నవాళ్ళు, కళ్ళుపోయి అంధులైనవాళ్ళు –వీధుల్లో తిరుగుతుంటే చూసి యుద్ధాన్ని అసహ్యించుకున్నాడు. ఆ జ్ఞాపకాలు స్మృతిపథం నుండి చెరిగిపోక ముందే మళ్ళీ మరో యుద్ధానికి జరుగుతున్న సన్నాహాలు చూసి చాప్లిన్ హృదయం భరించలేక పోయింది.**

"హన్నా, నా మాటలు వినపడుతు న్నాయా? నీ వెక్కడున్నా పైకి, పైకి చూడు హన్నా! మబ్బుతెరలు తొలగిపోతు న్నాయి. సూర్యకిరణాలు ప్రసరిస్తు న్నాయి. మనం చీకటి నుండి వెలుగు లోకి వస్తున్నాం. నూతన ప్రపంచంలోకి, దయా గుణం గల ప్రపంచలోకి, మను షులు దురాశ విడనాడిన ప్రపంచంలోకి, పగ, దుర్మార్గం తొలగిన ప్రపంచంలోకి వస్తున్నాం. పైకి చూడు హన్నా! మానవ హృదయానికి మొలిచిన రెక్కలు చూడు! మానవుడు స్వేచ్ఛావిహంగంలా విహరి స్తున్నాడు చూడు! రంగురంగుల ఇంద్ర ధనుస్సులోకి, ఆశావహ, కాంతిమయ జీవనంలోకి ఎగురుతున్నాడు చూడు హన్నా, పైకి చూడు!"

మానవత్వాన్ని, యుద్ధ వ్యతిరేకతను ప్రబోధించే ఈ ప్రసంగం కమ్యూనిస్టు ప్రచారమని అమెరికా పాలకవర్గాలు, పత్రికలు చాప్లిన్ మీద విరుచుకు పడ్డాయి. అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ కూడా "ఈ చిత్రం అర్జెంటీనాలో మాకు చాలా ఇబ్బందులు తెస్తోంది" అని చాప్లిన్‌ను నిష్టురమాడాడు. నాజీలు ఆయనను హిట్ లిస్టులోకి ఎక్కించారు. కాని చాప్లిన్ బెదిరిపోలేదు. సినిమాలో చివరి ప్రసంగాన్ని అమెరికా రేడియోలో వినిపించారు. కొందరు కరపత్రాల ద్వారా ప్రచారం చేశారు. ది గ్రేట్ డిక్టేటర్ సినిమా, అందులో చాప్లిన్ చివరి ప్రసంగం, అదే సమయంలో నాజీలతో యుద్ధం చేస్తున్న రష్యాకు సహాయంగా అమెరికా రెండో రంగం తెరవాలని కోరుతూ జరిగిన ఒక బహిరంగ సభలో చాప్లిన్ ఉపన్యాసం చేస్తూ రష్యన్లను 'కామ్రేడ్స్' అని సంబోధించడం... ఇవన్నీ అమెరికాలో చాప్లిన్‌పై వేధింపులను తీవ్రతరం చేశాయి. మెకార్థీయిజం ఆయనను దేశం విడిచిపెట్టి వెళ్లేట్లు చేసింది. దాంతో ఆయన నాల్గవ భార్య ఊనాతో కలిసి దేశం విడిచిపెట్టి వెళ్లిపోయి స్విట్జర్లాండులో నివాసం ఏర్పరుచుకున్నాడు. ది గ్రేట్ డిక్టేటర్ తరువాత ఆయన నిర్మించిన 'మన్స్యూ వెర్డో' చిత్రం పెట్టుబడిదారీ వ్యవస్థలోని కుళ్లును ఎండగడుతుంది. అమెరికాలో చాప్లిన్‌పై దుష్ప్రచారంతో ఈ చిత్రం విడుదలకు అనేక అడ్డంకులు ఎదుర్కొన్నాడు. అమెరికాను విడిచి యూరప్ వెళ్లిపోయాక ఆయన 'ఎ కింగ్ ఇన్ న్యూయార్క్' (1957), కౌంటిస్ ఫ్రమ్ హాంకాంగ్ (1967) చిత్రాలు నిర్మించాడు. .

# స్వేచ్ఛను కాలరాచిన కాలనాగు హిట్లర్ నాజీ జర్మనీ





## విలియం షీరర్

హిట్లర్ నిరాశానిస్పృహలతో కూడిన గతానికి సమాధికడుతున్నాడు. అంచెలంచెలుగా, త్వరితగతిన జర్మనీని వెర్సెలీ శృంఖలాల నుండి విముక్తి కల్గిస్తున్నాడు. జయోన్ము ఖులైనను ఢీ కొంటున్నాడు. జర్మనీని తిరిగి సైనికపరంగా శక్తిమంతంగావిస్తున్నాడు. జర్మన్లలో అధికులు కోరుకున్నదదే. అందువల్లనే నాయకుని కోసం ఏ త్యాగానికయినా సిద్ధపడటం. 1936 ఆకులురాలే కాలంనాటికి నిరుద్యోగసమస్య తుడిచిపెట్టుకు పోయింది. తమ కార్మిక సంఘపు హక్కుల్ని పోగొట్టుకున్న శ్రామికులు సైతం హిట్లర్ పాలనలో తనకు తిండిలేక మలమలమాడే హక్కును పోగొట్టుకున్నట్లు మేలమాడుకోవటం వినవస్తుంది.

**హిట్లర్** హయాం తొలిదశలో జర్మన్లలో అత్యధికులకు తాము వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని కోల్పోయామనిగానీ వాళ్ళ సంస్కృతి ఛిన్నా భిన్నమయిందనే చింతగానీ లేనేలేదు. వివేకాన్ని కోల్పోయిన ఆటవికత, వారి జీవన విధానంలోని మూసకట్టుతనం వాళ్ళను బాధించలేదు. అమానుష నియంతృత్వంలో అణచి వేయబడుతున్నారనే స్పృహ జర్మన్లకు లేక పోవటం ఆదేశానికి కొత్తగా వచ్చిన పరిశీలకుణ్ణి ఆశ్చర్య పరిచింది. పైగా వాళ్ళు ఆ నియంతృత్వాన్ని సహజోల్లాసంతో బలపర్చసాగారు. వాళ్ళ దేశభవిష్యత్తుకు సంబంధించి వాళ్ళలో ఆ నియంతృత్వం కొంగ్రొత్త ఆశను రేకెత్తించింది. నూతన విశ్వాసాన్ని పురికొల్పింది. అత్యద్భుతమైన నమ్మికను కలుగజేసింది.

హిట్లర్ నిరాశానిస్పృహలతో కూడిన గతానికి సమాధికడుతున్నాడు. అంచెలంచెలుగా, త్వరితగతిన జర్మనీని వెర్సెలీ శృంఖలాల నుండి విముక్తి కల్గిస్తున్నాడు. జయోన్ముఖులైనను ఢీ కొంటున్నాడు. జర్మనీని తిరిగి సైనికపరంగా శక్తిమంతంగావిస్తున్నాడు. జర్మన్లలో అధికులు కోరుకున్నదదే. అందువల్లనే నాయకుని కోసం ఏ త్యాగానికయినా సిద్ధపడటం. 1936 ఆకులురాలే కాలంనాటికి నిరుద్యోగసమస్య తుడిచిపెట్టుకు పోయింది. తమ కార్మిక సంఘపు హక్కుల్ని పోగొట్టుకున్న శ్రామికులు సైతం హిట్లర్ పాలనలో తనకు తిండిలేక మలమలమాడే హక్కును పోగొట్టుకున్నట్లు మేలమాడుకోవటం వినవస్తుంది. "వ్యక్తి సంక్షేమం కంటే సమిష్టి సంక్షేమం మిన్న" అనేది ఆనాటి ప్రజాదరణ పొందిన నాజీ నినాదం. చాలా మంది నాజీనాయకులు, మరీ ముఖ్యంగా గోరింగ్ రహస్యంగా కూడ బెట్టుకుంటున్నా, వ్యాపారంలో లాభాలు విపరీతంగా పెరుగుతున్నా జనం మాత్రం స్వార్థం కన్న సమాజక్షేమమే మిన్న అని చెప్పే నేషనల్ సోషలిజమ్ వైపే మొగ్గు చూపసాగారు.

జర్మన్ సమాజాన్నుండి యూదులను వెలివేసే చట్టాలు విదేశీ పరిశీలకుణ్ణి

దిగ్భ్రమకు గురిచేస్తాయి. అవి జర్మన్లను తిరిగి ఆదిమ దశకు చేరుస్తున్నాయా అన్పిస్తాయి. ఆ గడ్డపై జన్మించిన వాళ్లు తమదే గొప్పతెగ అనే భావనలో ఉగ్రూతలూగటంతో నాజీ తెగల సిద్ధాంతాలు ప్రజావ్యతిరేక చర్యలుగా వాళ్ళకు అన్పించలేదు. పాపం మాజీ సోషలిస్టులు, క్రైస్తవ భక్తులు మాత్రం ఏం చేయగలరు. ఆ ప్రశ్న వాళ్ళే మనల్ని అడిగితే దానికి సమాధానం చెప్పటం అంత సులభం కాదు. సెన్సారుకు గురయ్యే పత్రికలు, వార్తా ప్రసారాల ద్వారా విదేశాల్లో కొంత వ్యతిరేకత వున్నట్లు తెలిసీ తెలియనట్లు తెలిసేది కాని తండోపతండాలుగా నాజీ జర్మనీ ఆతిథ్యాన్ని పొందుతున్న విదేశీయుల మాటేమిటి ? . విదేశీయుడు ఎంతటినాజీ వ్యతిరేకి అయినా జర్మనీ రావచ్చు, తనకు నచ్చింది చూడవచ్చు, చదవవచ్చు - నిర్బంధ శిబిరాలు సైనిక స్థావరాలు తప్ప. తిరిగి వెళ్ళిన వాళ్ళు ఆదేశంలో వాళ్ళకు నిర్మాణాత్మక అభివృద్ధే కన్పించినట్లు చెప్పేవాళ్ళు.

1935 సెప్టెంబర్ 15 నాటి నూరెంబర్గ్ చట్టం యూదులకు పౌరసత్వాన్ని నిరాకరించింది. యూదులకు, ఆర్యులకు మధ్య వివాహాలను నిషేధించింది. 35 సంవత్సరాలలోపు ఆర్యస్త్రీల సేవలను యూదులు పొందరాదని ఆంక్షలు. తరువాత కొద్ది సంవత్సరాలలో 13 డిక్రీలద్వారా ఆ చట్టానికి చేర్చిన అనుబంధాల కారణంగా యూదులకు నిలువనీడ లేకుండా చేశారు. 1933లో యూదులు ప్రభుత్వ కార్యాలయాల్లో, సివిల్ సర్వీసుల్లో, రేడియో పత్రికా రంగాలలో వ్యవసాయ రంగంలో, ఉపాధ్యాయ వృత్తిలో, నాటకాలలో, సినిమాలలో ప్రవేశానికి అనర్హులు. 1934 నాటికి స్టాక్ ఎక్స్ఛేంజీల నుండి తన్ని తరిమి వేయబడ్డారు. నాజీ పాలనకు నాలుగేళ్ళు నిండే నాటికి న్యాయ వాదులుగా, వైద్యులుగా, వ్యాపార వేత్తలుగా యూదులు కొనసాగే అర్హతను కోల్పోయారు. నిత్యావసర వస్తువులు కూడా యూదులకు అందకుండా చూసారు. చిన్న పిల్లలకు పాలనుకూడ అమ్మేవాళ్ళు కాదు. మందుల షాపుల వాళ్ళు మందులు అమ్మేవాళ్ళు కాదు. లాడ్జింగులలో ప్రవేశం లేదు. ఎటు చూసినా “యూదులకు ప్రవేశం నిషిద్ధం” అన్న బోర్డులే,

పేరుకు హిట్లర్ కాథలిక్ అయినా రాజకీయ కాథలిజంపై తన ఆత్మకథలో విరుచుకుపడ్డాడు. రెండు క్రైస్తవ చర్చిలు తెగకు సంబంధించిన సమస్యను గుర్తించటంలో విఫలమయ్యాయని దుయ్యబట్టాడు. జర్మన్ తెగకు సంబంధించిన నైతిక అనుభూతులకు ప్రమాదం రానంత వరకు అన్ని విధాలైన మతాలకు దేశంలో స్వేచ్ఛ వుంటుందని నిర్మాణాత్మక క్రైస్తవాన్ని పార్టీ సమర్థిస్తుందని నాజీ పార్టీ కార్యక్రమంలోని 24వ ఆర్టికల్ స్పష్టం చేసింది. 1933 మార్చి 23 నాటి పార్లమెంట్ ప్రసంగంలో నియంతగా తనకు సర్వాధికారాలు చేజిక్కిన సమయంలో ప్రభుత్వానికీ చర్చికి మధ్య సుందర సమన్వయాన్ని సాధించుటమే తన లక్ష్యంగా పేర్కొన్నాడు. నాలుగుమాసాలు గడిచాయో లేదో చర్చి తన కార్యకలాపాలను తానే నియంత్రించుకొనవచ్చు అనే ఒడంబడికపై ప్రభుత్వ ప్రతినిధిగా పాపెన్, ‘హోలీసీ’ తరపున పోప్ పయస్ సంతకాలు పెట్టేందుకు సిద్ధంగా వున్న సందర్భంలో ప్రభుత్వం మాట తప్పింది. జూలై 25న ప్రకటించిన కుటుంబ నియంత్రణ చట్టం కాథలిక్ చర్చికి బాధాకరమే. మరో ఐదు రోజులకు కాథలిక్ యూత్ లీగ్‌ను రద్దు పర్చేందుకు తొలి చర్యలు గైకొన్నారు. తరువాత సంవత్సరాల్లో వేలాది కేథలిక్ స్వాములు, స్వామినులు, సాధారణ నాయకులు నీతి బాహ్యత ‘విదేశీ ద్రవ్య స్మగ్లింగ్ వంటి లేనిపోని నేరాలపై బంధీలుగా మారారు. పలుకేథలిక్ ప్రచురణలను

> ***1935 సెప్టెంబర్ 15 నాటి నూరెంబర్గ్ చట్టం యూదులకు పౌరసత్వాన్ని నిరాకరించింది. యూదులకు, ఆర్యులకు మధ్య వివాహాలను నిషేధించింది. 35 సంవత్సరాలలోపు ఆర్యస్త్రీల సేవలను యూదులు పొందరాదని ఆంక్షలు.***

నిషేధించారు. గెస్టెపో దళాలు పాప ప్రాయశ్చిత్తపు పద్ధతిలోని పవిత్రతను సైతం ఖాతరు చేయలేదు. అటు కేథలిక్కులు, ఇటు ప్రొటెస్టెంట్లు తొలి నుండి ప్రభుత్వానికి సహకారాన్నందిస్తున్నా 1937 నాటికి ఒక అయోమయ స్థితి నెలకొంది. 1937 మార్చి 14న పోప్ పయస్ జారీ చేసిన లేఖలో జర్మన్ గగన తలంపై విధ్వంసక మతయుద్ధాలు కారుమేఘాల భీకర గర్జనల వైపు క్రైస్తవుల దృష్టిని మళ్ళించారు. అది క్రైస్తవాన్ని అంతమొందించేందుకేనని హెచ్చరించారు.

చర్చిని పూర్తిగా ధ్వంసం చేయలేకపోయినా వంచగలిగారు. నాజీ టెర్రరిజానికి అత్యధిక ప్రొటెస్టంటు పాస్టర్లు తలలు వంచారు. 1938 నాటికి నియంత ఆదేశాలను చట్టబద్ధంగా, నీతి బద్ధంగా అనుసరిస్తామని ప్రతిజ్ఞలు చేసారు. 1941లో హిట్లర్‌కు అతి సన్నిహితుడైన బోర్‌మన్ బహిరంగంగా ప్రకటించాడు. “నేషనల్ సోషలిజం, క్రైస్తవాలను ఒకటిగా చెయ్యలేం” అంటూ. అయినా ముప్ఫై సూత్రాల ప్రణాళికను హిట్లర్ ప్రభుత్వం ప్రకటించింది. జాతీయ ప్రభుత్వచర్చి”కోసం. అందులోని చివరి సూత్రం ఈ చర్చి “స్థాపన నాటినుండి అన్ని

చర్చిలనుండి కాథెడ్రల్స్ నుండి, ఛాపెల్స్‌నుండి శిలువను తొలగించాలి... దానికి ప్రతిగా" స్వస్తికా" గుర్తును అక్కడ వుంచాలి".

మధ్య యుగాల తరువాత పాశ్చాత్య ప్రపంచంలో కనీవినీ ఎరుగని సంఘటన ఒకటి హిట్లర్ ఛాన్సలర్ అయిన నాలుగున్నర మాసాల పిమ్మట 1933 మే 10 నాటి రాత్రి జరిగింది. దాదాపు అర్థరాత్రి సమయం. వేలాదిమంది విద్యార్థుల కాగడాల ప్రదర్శనగా బెర్లిన్ విశ్వవిద్యాలయం ముందున్న స్క్వేర్ వద్దకు చేరుకున్నారు. అక్కడ కుప్పగా పోసిన పుస్తకాలకు నిప్పంటించారు. మంటలు ఎగసిన తరువాత మరికొన్ని పుస్తకాలను మంటల మీదికి విసిరారు. అలా ఓ ఇరవై వేలకు పైగా పుస్తకాలు అగ్నికి ఆహుతి అయ్యాయి. ఇటువంటి సంఘటనలు మరికొన్ని పట్టణాలలో చోటు చేసుకున్నాయి. అలా గ్రంథజ్వలనం మొదలయ్యింది.

ప్రపంచ ప్రఖ్యాత రచయితల పుస్తకాలెన్నో హిట్లర్ ప్రచార మంత్రి డాక్టర్ గోబెల్స్‌కనుసన్నల్లో, విద్యార్థులు వెర్రి ఆనందంలో బెర్లిన్‌లో మంటల్లోకి విసిరారు. (కళ అన్నమాట వింటే నా చేయి తుపాకి ట్రిగ్గర్‌పైకి పోతుంది అనే వాడు గోబెల్స్) ఆ అగ్గిలో బుగ్గయిన పుస్తకాలు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, ఆల్ఫ్రడ్‌కెలో వంటి జర్మన్లు రచించినవే కాదు జాక్‌లండన్, హెలన్‌కెల్లర్, హెచ్‌జివెల్స్, హేవలాక్ ఎల్లిస్, ఫ్రాయిడ్ వంటి వారివి కూడ వున్నాయి. వాళ్ళ భవిష్యత్తుకు ఆటంకంగా నిలిచేదిగాని జర్మన్ మౌలిక ఆలోచనా విధానానికి గొడ్డలిపెట్టుగా వుండే ఏ రచనయినా అగ్నికి ఆహుతిగావలసిందేనని విద్యార్థుల తీర్మానం. అక్కడ గుమిగూడిన విద్యార్థులనుద్దేశించి ప్రసంగిస్తూ గోబెల్స్ అన్నదేమంటే - జర్మన్ ప్రజల ఆత్మ తిరిగి అభివ్యక్తమవుతుంది. ఒక పాతయుగానికి ఈ మంటలు మంగళం పాడటమేకాదు, ఒక కొత్త యుగానికి అవి నూతన కాంతుల్ని వెలిగిస్తాయి.

నాజీ యుగపు కొంగ్రొత్త జర్మన్ సంస్కృతి ఓ వెలుగు వెలగటం ఈ పుస్తకాలు తగల బెట్టిన మంటల వల్లనే కాదు, వందలాది పుస్తకాల కొనుగోలును, చదవటాన్ని నిషేధించటంవల్లనూ, కొత్తవాటిని ప్రచురించటం వల్లనూ కాదు, ఏ ఆధునిక పాశ్చాత్య దేశంలోనూ అనుభవంలోకిరాని కఠోర రాజకీయ పెత్తనం ద్వారా సంభవించింది. డా॥ గోబెల్స్ సూచనల మేరకు 1933 సెప్టెంబరు 22న సాంస్కృతిక మండలి ఆవిర్భవించింది. సాంస్కృతిక జీవనంలో అన్ని రంగాలను నడిపేందుకు, పెత్తనం చెలాయించేందుకు ఏడు ఉపమండళ్ళు స్థాపించారు. అవి లలిత కళలను, సంగీతాన్ని, నాటకరంగాన్ని, సాహిత్యాన్ని, వార్తా సంస్థల్ని రేడియోను, చలన చిత్రసంస్థలను పర్యవేక్షిస్తాయి. ఆయా రంగాలకు చెందిన వారందరూ విధిగా ఆయా సంస్థలలో సభ్యులుగా చేరాల్సి వుంది. అయితే సభ్యులుగా చేర్చుకోవటం, తొలగించటం అనే అధికారం ఆయా ఉపమండళ్ళకు వుంది. నేషనల్ సోషలిజం పట్ల కొంచెం గూడ విశ్వాసం కలిగివుండని వాళ్ళకు అందులో సభ్యత్వం లభించదు. అలా ఆయా వృత్తుల వాళ్ళు వాళ్ళ వృత్తుల్ని కొనసాగించే అవకాశం లభించక జీవనోపాధిని కోల్పోతారు.

ఎప్పుడయితే నాజీ నాయకులు కళలు, సాహిత్యం, పత్రికలు, రేడియో, సినిమాలు కేవలం కొత్త ప్రభుత్వానికి ప్రచార సాధనాలుగా వుండాలని నిర్ణయించారో అప్పుడే సాంస్కృతిక పతనం ప్రారంభమయ్యింది. 20వ శతాబ్దపు మూడవ దశకంలో సామాజిక స్పృహ కోల్పోని ఎవరికయినా అదియిట్టే అర్థమైపోతుంది. ప్రచురించదలచిన ప్రతి పుస్తకం వ్రాతప్రతిని

> **మంటలు ఎగసిన తరువాత మరికొన్ని పుస్తకాలను మంటల మీదికి విసిరారు. అలా ఓ ఇరవై వేలకు పైగా పుస్తకాలు అగ్నికి ఆహుతి అయ్యాయి. ఇటువంటి సంఘటనలు మరికొన్ని పట్టణాలలో చోటు చేసుకున్నాయి. అలా గ్రంథజ్వలనం మొదలయ్యింది.**

ప్రచార మంత్రిత్వ శాఖలో దాఖలు చేస్తే దాన్ని ఆ శాఖ పరిశీలించి ప్రచురణకు అనుమతి నివ్వాల్సివుంది. సంగీతం బాగానే వృద్ధి చెందింది. అయితే ఆ రంగం నుండి యూదులు ఏరివేయబడ్డారు. రచయితలవలె సంగీత విద్వాంసులు దేశాన్ని విడిచి వలసపోక కొత్త ప్రభుత్వ విధానాలకు అనుగుణంగా నడుచుకుంటూ తమ ఖ్యాతిని, తమ కళాకౌశలాన్ని దేశానికి ధారాదత్తం చేసారు. అత్యద్భుతమైన గాన సుధలో మునిగి తేలిన జర్మన్ ప్రజలు మిగతా కళలు పతనం చెందటమేగాకుండా నాజీ హయాంలో జీవన విధానమే పతనం చెందుతూందనే విషయాన్నే మరచిపోయారు.

సంప్రదాయరీతిని విడనాడనంతవరకు నాటకరంగం తన ఔన్నత్యాన్ని నిలబెట్టుకుంది. అయితే నాజీ నాటకకర్తలు నవ్వులపాలయ్యారు. వాళ్ళ నాలుగు ప్రదర్శనలు ప్రజల్ని ఆకట్టుకోలేకపోయాయి. అందువల్ల ఎక్కువ రోజులు ప్రదర్శింపబడేవికావు.

గొప్పగొప్ప కళాకారులనందించిన జర్మనీలో, ఇంప్రెషనిజమ్, క్యూబిజమ్, డాడాయిజమ్ వంటి ఇరవయ్యవ శతాబ్దపు కళారీతులన్నింటిలో జర్మన్ చిత్రకారులు కృషి సల్పినా

ఆధునిక యుగంలో జర్మనీ ముందు వరసలో లేదు. హిట్లర్ దృష్టిలో ఆధునిక చిత్రకళలో అంతా దిగజారుడుతనమే. దానికి అర్థంపర్థంలేదు. అధికారంలోకిరాగానే అతను కళారంగాన్ని ప్రక్షాళనగావించి జర్మన్ కళను ప్రతిష్టించాడు. జర్మన్ మ్యూజియంల నుండి దాదాపు ఓ 6500ల ఆధునిక చిత్రకళకు చెందిన ప్రముఖుల చిత్రాలను తొలగించారు. వాటి స్థానంలో పనికిమాలిన చిత్రాలను తగిలించారు.

బెర్లిన్‌లోని దినపత్రికల సంపాదకులకు ఇతర ప్రాంతాలనుండి ప్రచురించబడేవాటి విలేఖరులకూ రోజూ ప్రచార మంత్రిత్వ శాఖ కార్యాలయం ముంగిట పడిగాపులే. అక్కడ గోబెల్స్‌గానీ, అతని సహాయకులుగానీ ఆ పత్రికా ప్రతినిధులకు ఏ వార్తలను ప్రచురించాలో, వేటిని నిలిపివేయలో, ఏ వార్తలను ఎలా వ్రాయాలో, శీర్షికలను ఎలా పెట్టాలో, ఏ కార్యకలాపాలను సమర్థించాలో వేటిని తిరస్కరించాలో, ఆ రోజు ఏ విషయంపై సంపాదకత్వం వెలువడాలో వివరించే వాళ్ళు నాజీ పాలనలో పత్రికా సంపాదకులుగా వుండదలచిన వాళ్ళు . చివరకు పరిస్థితి ఏ దశకు చేరిందంటే నాజీలు కానివారు, కాదల్చుకోనివారు సంపాదకులుగా వుండరు. వాళ్ళ పత్రికలూ వుండవు.

నాజీ ప్రభుత్వపు మొదటి నాలుగు సంవత్సరాల కాలంలో దినపత్రికల సంఖ్య 3607 నుండి 2671కి పడిపోయింది. స్వేచ్ఛ వైవిధ్యాల విషయంలో పత్రికలకు వాటిల్లిన నష్టం నాజీ పార్టీకి లాభదాయకమయ్యింది- కనీసం ఆర్థికంగా నయినా. పార్టీ ప్రచురణ సంస్థ "ఎర్‌వెర్‌లాగ్" జర్మన్ వార్తా సంస్థలకు ఆర్థిక నియంతగా మారింది.

రేడియో, చలన చిత్రాలు కూడా త్వరితగతిన నాజీ ప్రభుత్వ ప్రచారానికి అనుగుణంగా మలచబడినాయి. 1933లో జర్మన్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ నాజీ ప్రభుత్వ పరమయ్యింది. చలనచిత్రపరిశ్రమ ప్రయివేటు సంస్థల ఆధీనంలో వున్నా దానిపై తిరుగులేని ప్రభుత్వ పెత్తనం కొనసాగింది. 'నేషనల్ సోషలిస్టు రాజ్య అభివృద్ధి లక్ష్యంగా అది కృషిచేసేందుకు సకల చర్యలు గైకొనబడ్డాయి. వార్తా పత్రికల మాదిరిగానే రేడియో, చలన చిత్రాలు కూడ ప్రజలలో విసుగును పెంచాయి. రేడియో శ్రోతలు వేరే స్టేషన్లనుండి ప్రసారాలను వినాలనుకుంటే వాళ్ళు వాళ్ళ శిరస్సుల్ని పణంగా పెట్టాల్సిందే. హిట్లర్ ఆశయాలకు అనుగుణంగా జర్మన్ ప్రజలను తీర్చిదిద్దటంలో రేడియో పాత్ర అద్వితీయం.

. హిట్లర్ భావనలో నాజీ జర్మనీలో విద్య అంటే కేవలం తరగతి గదులకు పరిమితమైంది కాదు. అది ఆడంబరాలకు దూరంగా జీవితంలోని ఆటుపోట్లను తట్టుకునే శక్తినిచ్చేదిగా,



రాజకీయ పరిజ్ఞానాన్ని పెంచేదిగా, సైనిక శిక్షణను అందించేదిగా తరతరాల యువతకు అందుబాటులోకి రావాలి. అటువంటి విద్యయొక్క పరిపక్వత కొద్దిమందికే ప్రవేశం లభించే విశ్వవిద్యాలయాల్లోనూ, ఇంజనీరింగ్ కళాశాలల్లోనూ సిద్ధించదు. పద్దెనిమిది సంవత్సరాల ప్రాయంలో నిర్బంధ శ్రామిక సేవలోనూ, అది ప్రతిఫలిస్తుంది.

ప్రొఫెసర్లన్నా, మేథో సంపదతో కూడిన జ్ఞాన సముపార్జనా రీతులన్నా హిట్లర్‌కు ఎంతటి కంటగింపో అతని స్వీయచరిత్ర తిరగేస్తే తెలుస్తుంది.

మొదటి తరగతి నుండి విశ్వవిద్యాలయ స్థాయివరకు విద్యత్వరితగతిన నాజీకరించబడింది. పాఠ్యాంశాలు హడావిడిగా తిరగరాసారు. నాజీ వెలుగులు చూడలేని ఉపాధ్యాయులకు ఉద్వాసనే. పార్టీ సభ్యులు కాకున్నా ఉపాధ్యాయులంతా నాజీ సానుభూతి పరులు కావాల్సిందే. హిట్లర్ తెగలవాదంపై వక్కాణించేందుకు ప్రత్యేక పాఠశాలల్లో ఉపాధ్యాయులకు పునశ్చరణతరగతులు ఏర్పాటు చేశారు.

విశ్వవిద్యాలయాలలో బోధించటానికి నియమింపబడిన వాళ్ళు ముందుగా ఆరువారాలపాటు పరిశీలనా శిబిరాలలో గడపవలసివుంది. అటువంటి నాజీకరణం జర్మన్ విద్యాభివృద్ధికి, విజ్ఞానాభి వృద్ధికి పెనువిఘాత మయ్యింది. కొత్త పాఠ్యగ్రంథాలలో చరిత్రను అపహాస్యం పాలయ్యేంతగా తారుమారు చేసారు.

తరతరాలుగా జర్మనీలో ప్రఖ్యాతిగాంచిన పదార్థావిజ్ఞాన బోధన ఒక్క దెబ్బన క్షీణించింది. భౌతిక శాస్త్రంలో ఐన్‌స్టీన్, ఫ్రాంక్ వంటి వాళ్ళను, రసాయన శాస్త్రంలో హెబర్, వార్‌బర్గ్ వంటి వాళ్ళను ఉద్యోగం నుండి తొలగించటమో లేక నిర్బంధ ఉద్యోగ విరమణకు గురిచేయటమో జరిగింది. మిగిలిన వాళ్ళలో పలువురు నాజీ పంథాలో పడిపోయి ఆ సిద్ధాంతాలను విజ్ఞాన శాస్త్రాలకు అంట్లు గట్టసాగారు.



## కృష్ణశాస్త్రి

క్రౌర్య  కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తనంతనే చెదిరిపోవ
గగనతలము మార్మోగ కంఠమెత్తి
జగమునిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు



శిథిలాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
దివ్య శంఖము గొంతు తెరవలేదోయి
పూజారి గుడి నుండి పోవ లేడోయి



ఆకాశము నొసట పొడుచు
అరుణారుణ తార
ఏకాకి నిశీధి నొడుచు
తరుణకాంతి ధార

జయపతాక యువ పతాక
వియదాపగ వెడలు నౌక
యుగయుగాల పీడకలలు
సొగయజేయు సంకెలలు
తెగనివి కావోయి మ్రోల
ధగధగా స్వతంత్ర
విభాతాకాశము నొసట
పొడుచు అరుణారుణ తార

అంతులేని ద్వేషము
ఏ రోషము స్వార్థము మోసము
అవంతయేని నిలవవు
అవంత యేని శాంత విభాత

ఆకాశము నొసట పొడుచు
అరుణారుణ తార

ముందు కలదు మనజాతికి
ముక్తి అమరజీవ రక్తి
క్రిందు వెనక గనక
నడువుడందరు అభ్యుదయ
విభాతాకాశము నొసట పొడుచు
అరుణారుణ తార                    ***(1941)***



పీతలాటిభూతం మన
తాతలదీ తండ్రులదీ
రోత రోత రోత మనది

ప్రాతరుజ్వలాకాశం
భావి మందిరాకాశం
ప్రాతరున్నతావాసం                    **(1945)**



వాళ్ళు జర్మన్ భౌతిక శాస్త్రం, జర్మన్ రసాయన శాస్త్రం, జర్మన్ గణితం బోధించసాగారు. జర్మన్ శాస్త్రజ్ఞుల ఈ పిచ్చి ఊహల్ని సామాన్యులు సైతం నమ్మనిస్థితి ఏర్పడింది. శాస్త్రజ్ఞానం అంతర్జాతీయమైంది. అది అలాగే నిలిచివుంటుంది" అనేదాన్ని నాజీ శాస్త్రజ్ఞులు అవాస్తవమని కొట్టిపారేస్తున్నారు. వాళ్ళ దృష్టిలో శాస్త్రజ్ఞానం కూడ మిగతా అన్ని మానవ ఉత్పత్తుల మాదిరి జాతి ప్రధానమైనది కనుక రక్త నిష్టమయ్యింది. అసలు సిసలైన భౌతిక శాస్త్రం జర్మన్ స్ఫూర్తితో ఆవిర్భవించిందే. యూరప్‌లోని శాస్త్రజ్ఞానమంతా ఆర్యులు ప్రసాదించిందే, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే జర్మన్ భావధారే

1936 డిసెంబరు 1వ తేదీన హిట్లర్ ఒక చట్టం అమలులోకి తెచ్చాడు. దాని ప్రకారం నాజీ జర్మనీలోని యువకులంతా హిట్లర్ యూత్‌లో చేరిపోవాల్సిందే.

నాజీ జర్మనీ యువజన నాయకుడు విద్యామంత్రిత్వ శాఖ చెప్పుచేతల్లో పనిచేయవలసిన అవసరంలేదు. అతడు సరాసరి హిట్లర్ కనుసన్నల్లోనే తన బాధ్యతల్ని నిర్వర్తిస్తాడు. అలా 29 ఏళ్ళ వయసున్న అపరిపక్వ బాల్దర్‌వాన్ స్కిరాక్ అనే యువజన నాయకుడు నాజీ జర్మనీలోని యువకులకు నియంతగా మారాడు. తమ పిల్లలు యువజన సంఘాలలో చేరేందుకు అభ్యంతరపెట్టే తల్లిదండ్రులకు జైలు శిక్షే. ఒక వేళ ఆడపిల్లలు ఆ సంఘాలలో కాలుజారుతున్నా చూస్తూండిపోవల్సిందే. కాకుంటే కఠిన కారాగారవాసమే.

ఆరేళ్ళ వయస్సు నుండి పదేళ్ళ వరకూ ప్రతి బాలుడూ హిట్లర్ యూత్‌లో "పింఫ్"గా తర్ఫీదు పొందవలసి వుంది. పరీక్షల్లో నెగ్గితే అప్పుడు బాలల సంఘంలో చేర్చుకోగానే ఈ క్రింది విధంగా ప్రతిన బూనాల్సివుంటుంది.

"నా సర్వశక్తుల్ని మన దేశరక్షకుడైన అడాల్ఫ్ హిట్లర్‌కు సమర్పించుకుంటానని మన పితృదేశానికి ప్రాతినిధ్యం వహించే ఈ రుధిరజెండా సాక్షిగా ప్రతినబూనుతున్నాను. ఆయన కోసం నా ప్రాణాన్నిసైతం త్యాగంచేసేందుకు సంసిద్ధతను ప్రకటించుచున్నాను. కనుక ఓ భగవంతుడా ! నాకు అండగావుండు".



# నిర్బంధాల విషాద నిషాద సినీ స్వరం



డా॥ రెంటాల జయదేవ

సినీ వివాదాలు... నిషేధాలు...

మతం, రాజకీయాలు, సెక్స్ - లాంటి వివిధ అంశాల కారణంగా మన సినిమాల్లో భావప్రకటన స్వేచ్ఛకు చాలాసార్లు సంకెళ్ళు పడ్డాయి. తెలుగునాట పెద్ద ఎన్టీఆర్ 'బొబ్బిలి పులి', 'శ్రీమద్విరాజ్ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర' మొదలు కృష్ణ 'అంతం కాదిది ఆరంభం' సహా పలు చిత్రాలు సెన్సార్ నుంచి చిక్కులు ఎదుర్కొన్నాయి. విప్లవ చిత్రాల మాదాల రంగారావు 'విప్లవశంఖం', 'ప్రజాశక్తి', 'ఎర్రమట్టి' లాంటి చిత్రాల రిలీజ్ కోసం సెన్సార్‌బోర్డ్‌తో, ప్రభుత్వంతో పోరాటాలు, నిరాహార దీక్షలు, కోర్టును ఆశ్రయించడం చేయాల్సి వచ్చింది. మూకీల కాలం నుంచి మన భారతీయ సినిమాకు సెన్సార్ కష్టాలు కొత్తేమీ కాదు. గత నాలుగు దశాబ్దాల్లో వచ్చిన వివాదాల్లో కొన్ని...




**హృదయంతో తీస్తున్న సినిమాలను..**

**మైండ్‌తో కోస్తున్న సెన్సార్‌బోర్డ్ వైఖరికి...**

**అప్పటి బ్రిటీష్ కాలం నుంచి ఇప్పటి మోడీ కాలం దాకా బోలెడన్ని ఉదాహరణలు.**

**గద్దెనెక్కిన పార్టీ భావజాలాన్ని బట్టీ... భావప్రకటన స్వేచ్ఛకు మీనింగ్ మారిపోతోంది...**

**అదే... ఇవాళ్టి నిర్బంధాల... విషాద నిషాద సినీ స్వరం!!**

◆

"ఇది నాకూ, అక్కడ (సెన్సార్ బోర్డ్‌లో) అధికారంలో కూర్చొని- కొద్దిమంది గొప్పవాళ్ళ చేతిలోని రాజ్యంలా వ్యవహరిస్తున్న ఒక నిరంకుశుడికీ మధ్య జరుగుతున్న పోరాటం. ఈ వ్యవహారమంతా చూస్తుంటే, నేను నిరంకుశ, నియంతృత్వ పాలనలోనో ఉన్నట్లుంది."

**- 'ఉడ్తా పంజాబ్' చిత్ర సహ-నిర్మాత, ప్రముఖ హిందీ సినీ రచయిత, దర్శకుడు అనురాగ్ కశ్యప్**

ఒక సృజనశీలి కడుపు చించుకొని వచ్చిన ఆవేశం ఇది. భావవ్యక్తీకరణ స్వేచ్ఛకు పడుతున్న సంకెళ్లపై సమాజంలోని అనేక మంది సినీ కళాకారుల

ఆక్రందనకు అద్దం ఇది. అవును. సమాజానికి దర్పణం పట్టాల్సిన సినిమాలో, సృజనాత్మక భావ వ్యక్తీకరణకు వేదిక అయిన సినిమాలో... మన చుట్టూ కళ్లెదురుగా జరుగుతున్నది చూపిస్తే తప్పు అంటే ఆవేదన, ఆవేశం కాక ఏమొస్తాయి? భారతీయ సినీ ప్రపంచమంతా హిందీ సినిమా 'ఉడ్తా పంజాబ్' (కొత్త హుషారుతో ఎగసిపడుతున్న పంజాబ్ అని స్థూలంగా అర్థం) గురించి ఆ మధ్య ఆసక్తిగా మాట్లాడుకున్నది అందుకే!

ఒక్కసారి చరిత్రలోకి తొంగిచూస్తే - తెరపై కదిలే బొమ్మలతో కథ చెప్పే సినిమాల నిర్మాణం మన దేశంలో మొదలెట్టి, ఇప్పటికి 103 ఏళ్ళు నిండింది. తొలి కథాకథనాత్మక చిత్రమైన దాదాసాహెబ్ ఫాల్కే 'రాజా హరిశ్చంద్ర' (1913) నుంచి లెక్క తీసుకొంటే, మొదటి అయిదారేళ్ళు మినహా, ఆ తరువాత నుంచి మన దేశంలో సినిమా మాధ్యమంపై రాజ్యవ్యవస్థ ఆంక్షలు, నిషేధాలు, అణచివేతలు ఉంటూనే వస్తున్నాయి. ప్రభుత్వాలు, పాలకులు మారారే తప్ప, స్వేచ్ఛా స్వరం వినిపించకుండా గొంతు నొక్కే ప్రక్రియ ఇప్పటికీ కొనసాగుతోంది.

అసలు 'సెన్సార్ బోర్డ్' అనే ఆలోచనలోనే గొంతును స్వేచ్ఛగా పెగలనివ్వని ఒక నిర్బంధం ఉంది. చలనచిత్రాలకు సంబంధించి ప్రపంచంలో మొట్టమొదటిసారిగా ఒక నిర్ణీత చట్టమంటూ చేసింది - ఇంగ్లండ్. అది - 'సినిమాటోగ్రాఫ్ చట్టం 1909'. సినిమా హాళ్ళలో అగ్నిప్రమాదాల నుంచి భద్రత కోసం బ్రిటీషు ప్రభుత్వం ఆ చట్టం చేసింది. అయితే, క్రమంగా ఆ పరిధి దాటి సినిమాల్లోని కథాంశంలో జోక్యం చేసుకోవడం దాకా వెళ్ళింది.

మొట్టమొదట 'నాటకీయ ప్రదర్శనల చట్టం-1876'లోనే సవరణలు చేసి, సినిమాటోగ్రాఫిక్ ప్రదర్శనలపై నియంత్రణకు నిబంధనలు పెట్టాలని ప్రయత్నించారు. కానీ, సినిమా మీడియమ్ మిగిలినాటి కన్నా ప్రత్యేకమైనదని గుర్తించి, కొత్త చట్టం వైపు బ్రిటీషు పాలకులు మొగ్గారు. ప్రేక్షకుల భద్రత కోసం, అభ్యంతరకరమైన సినిమాల ప్రదర్శనను భారతదేశపు గడ్డపై నిరోధించడం కోసం - అనే సాకులతో బ్రిటీష్ ఇండియా ప్రభుత్వం 1917 సెప్టెంబర్‌లో 'ఇండియన్ సినిమాటోగ్రాఫ్ బిల్లు'ను రెండు సభల 'ఇంపీరియల్ లెజిస్లేచర్'లో ప్రవేశపెట్టింది.

**కమ్యూనిస్టుల భయంతోనే... సెన్సార్!**

ఒక రకంగా బ్రిటీషు పాలకులు ఇండియాలో సినిమా


***అసలు 'సెన్సార్ బోర్డ్' అనే ఆలోచనలోనే గొంతును స్వేచ్ఛగా పెగలనివ్వని ఒక నిర్బంధం ఉంది. చలనచిత్రాలకు సంబంధించి ప్రపంచంలో మొట్టమొదటిసారిగా ఒక నిర్ణీత చట్టమంటూ చేసింది - ఇంగ్లండ్. అది - 'సినిమాటోగ్రాఫ్ చట్టం 1909'. సినిమా హాళ్ళలో అగ్నిప్రమాదాల నుంచి భద్రత కోసం బ్రిటీషు ప్రభుత్వం ఆ చట్టం చేసింది.***


మాధ్యమంపై యుద్ధం ప్రకటించడానికి కమ్యూనిస్టులంటే భయం కూడా కారణమని చెప్పాలి. అప్పటికి కొత్తగా ఏర్పడిన సోవియట్ యూనియన్‌లోని కమ్యూనిస్టు పాలన సినిమా మాధ్యమాన్ని "అచ్చమైన అద్భుత కళ" (ఇది కమ్యూనిస్టు నేత వి.ఐ. లెనిన్ సినిమాకు ఇచ్చిన నిర్వచనం)గా భుజానికెత్తుకుంది. దాదాపు అదే సమయంలోనే భారత్‌లోని సూరత్ లాంటి చోట్ల 'ది మ్యూటినీ' (తిరుగుబాటు) లాంటి చిత్రాలు సంచార సినిమా ప్రదర్శన సంస్థల ద్వారా జనం చూస్తున్నారు. ఇవన్నీ గమనించిన బ్రిటీషు ప్రభుత్వం సినిమాలపై నిర్బంధానికి దిగింది. వెరసి, మొదటి ప్రపంచ యుద్ధం సందర్భంగా అలా రష్యాలో కమ్యూనిస్టు పాలన రావడం కూడా బ్రిటీషు పాలకులు మన దేశంలో సినిమాలను 'ప్రీ-సెన్సార్‌షిప్' (ప్రదర్శన కన్నా ముందే సెన్సారింగ్) చేయడానికి ప్రధాన కారణంగా నిలిచిందని పరిశోధకులు తేల్చారు.

**మన దేశంలో సెన్సార్ మొదలైందిలా!**

చివరకు, ఇందాక చెప్పుకున్న బిల్లు నుంచి 'ఇండియన్ సినిమాటోగ్రాఫ్ యాక్ట్ (ఐ.సి.ఎ) - 1918' వచ్చింది. భారతదేశంలో సినిమా సెన్సార్‌షిప్ విధానానికి బాట వేసింది. 1920 ఆగస్టు 1వ తేదీ నుంచి ఈ చట్టం, తద్వారా మన దేశంలో సినిమాల సెన్సార్‌షిప్ అమలులోకి వచ్చింది.

గమనిస్తే, దాదాపు వందేళ్ళ తరువాత ఇప్పటికీ మన సెన్సారింగ్‌లో ఈ లక్షణాలు కనిపిస్తాయి. స్వాతంత్ర్యం వచ్చాక 1951లో 'ఇండియన్ సినిమాటోగ్రాఫ్ యాక్ట్ -1918'కి సవరణ చేసి, సెన్సార్‌షిప్‌ను కేంద్ర ప్రభుత్వ బాధ్యతగా మార్చారు. అలా 1952 నుంచి కేంద్ర సెన్సార్ బోర్డ్ వ్యవస్థ అమలులోకి వచ్చింది. ఆ తరువాత కూడా కాలక్రమంలో మన సినిమాటోగ్రాఫ్ చట్టం పలు మార్పులు చేర్పులకు గురైందన్న మాటే కానీ, ఇప్పటికీ పరాయి పాలకుల కాలం నాటి ప్రాథమిక అంశాలు, లక్షణాలేవీ మారలేదు. సినిమా

**సమకాలీన రాజకీయ సంఘటనల గురించి పెద్దగా తెలియని చదువురాని హిందువుకు సైతం సూక్ష్మంగా అర్థమయ్యేలా తీసిన ఈ సినిమా బ్రిటీషు ప్రభుత్వానికి తీవ్రమైన నష్టం కలిగించే ప్రమాదం ఉంద'ని తమిళనాడులోని మదురై కలెక్టర్ ఈ సినిమా నిషేధానికి చర్య తీసుకున్నారు.**

మీడియమ్‌పై తన నిర్బంధపు పట్టును రాజ్యవ్యవస్థ వదులుకోనూ లేదు.

నిషేధానికి గురైన తొలి భారతీయ సినిమా – 'భక్త విదుర్' (1921). మహాభారతంలోని విదురుడి పాత్రను తీసుకొని, మహాత్మా గాంధీ రాజకీయ కార్యకలాపాలను సూచిస్తూ కోహినూర్ ఫిల్మ్స్ వారు అప్పట్లో తీసిన మూకీ సినిమా ఇది. భారతదేశ పటం, దాని నుంచి భారతమాత రావడంతో మొదలయ్యే ఈ మూగ సినిమాలో "విదుర్‌జీ" (సినిమాలోని సబ్-టైటిల్స్‌లో అలానే పేర్కొన్నారు) ఖద్దరు దుస్తుల్లో, గాంధీ టోపీ ధరించి, చరఖా తిప్పుతూ కనిపిస్తాడు. ఇవన్నీ అప్పుడు ఉధృతంగా సాగుతున్న మన జాతీయోద్యమంలో అతి శక్తిమంతమైన చిహ్నాలు. అలాగే, 1918లో కైరాలో గ్రామీణ ప్రజలు పన్నులు కట్టడానికి నిరాకరించడం, ప్రభుత్వాన్ని నిరసిస్తూ 1921లో చీరాల పట్టణాన్ని జనం ఖాళీ చేయడం లాంటి సమకాలీన రాజకీయ సంఘటనల్ని ఆ సినిమాలోని సన్నివేశాలు స్ఫురణకు తెచ్చాయి.

అలాగే, ధృతరాష్ట్రుడి కొలువులోని విశ్వాసపాత్రులైన అధికారులకు 'డాంకీ - బహదూర్' బిరుదులు ఇస్తున్నట్లు చూపించడం ద్వారా బ్రిటీషు వారిచ్చే 'దివాన్ - బహదూర్' బిరుదును పరోక్షంగా ఎగతాళి చేసిందీ సినిమా. 'పురాణాల్లోని కథలు మాత్రం తెలిసి, సమకాలీన రాజకీయ సంఘటనల గురించి పెద్దగా తెలియని చదువురాని హిందువుకు సైతం సూక్ష్మంగా అర్థమయ్యేలా తీసిన ఈ సినిమా బ్రిటీషు ప్రభుత్వానికి తీవ్రమైన నష్టం కలిగించే ప్రమాదం ఉంద'ని తమిళనాడులోని మదురై కలెక్టర్ ఈ సినిమా నిషేధానికి చర్య తీసుకున్నారు.

బోల్షివిక్ విప్లవం, భారతదేశంలో బ్రిటీషు వారి పాలనపై కమ్యూనిస్టుల స్పష్టమైన వ్యతిరేకత నేపథ్యంలో సినిమాల ద్వారా కమ్యూనిస్టు భావజాల ప్రచారం జరుగుతుందనే భయం బ్రిటీషు పాలకులకు మొదటి నుంచీ ఉండేది. అందుకే, 'ప్రచారధోరణి చిత్రాల (ప్రాపగండా ఫిల్మ్స్)పై ఓ కన్నేసి ఉండాలి' అంటూ ప్రభుత్వ పక్షాన సెన్సార్ వారిని అప్రమత్తం చేసింది. 1903లో రష్యన్ ఓడ పొటెమ్‌కిన్‌లో నావికులు తిరుగుబాటు చేసి, తప్పించుకొన్న ఘటన ఆధారంగా ప్రముఖ దర్శకుడు సెర్గీ ఐజెన్‌స్టీన్ రూపొందించిన రష్యన్ సినీ ఆణిముత్యం – 'బ్యాటిల్‌షిప్ పొటెమ్‌కిన్' (1925). అయితే, ప్రచార ధోరణిలో ఉన్న ఈ చిత్రం రష్యాలోని బోల్షివిక్ విప్లవాన్ని సమర్థిస్తోందనీ, అంతేకాకుండా పాలకులపై తిరుగుబాటును ప్రోత్సహించే పద్ధతిలో ఉందనీ పేర్కొంటూ, ఈ విదేశీ దిగుమతి చిత్రాన్ని సెన్సార్ వారు 1929లో మనదేశంలో నిషేధించారు. అదే దర్శకుడు తీసిన మరో రష్యన్ చిత్రం 'ఇవాన్... ది టెర్రిబుల్' చిత్రంపై కూడా 1930లో నిషేధం విధించారు.

స్వాతంత్ర్యం వచ్చాక, మన స్వదేశీయుల పాలనలో కూడా కమ్యూనిస్టు భావజాల చిత్రాల పట్ల పాలక వ్యవస్థకు కంటగింపే కొనసాగింది. ప్రముఖ వీణా వాద్యకారుడు ఎస్. బాలచందర్ సినిమా దర్శకుడుగా ఉజ్జ్వలంగా వెలుగుతున్న రోజుల్లో వామపక్ష భావాలపై తీసిన తమిళ చిత్రం 'అవన్ అమరన్' (అతను అమరుడు అని అర్థం– 1955లో రిలీజ్) కూడా సెన్సార్ కత్తెరకు గురైంది. కమ్యూనిస్ట్ సిద్ధాంతవేత్త ఎస్. నాగరాజన్ ఈ చిత్రానికి స్క్రిప్ట్ రచయిత. 'కార్మికులారా ఏకం కండి' అన్న నినాదాన్ని ప్రతిఫలిస్తూ, మద్రాసులో సెయింట్ జార్జ్ కోట దగ్గర బ్రిడ్జిపై కార్మికుల భారీ ప్రదర్శన దృశ్యాలతో ఈ సినిమాను రూపొందించారు. అసలు ఈ చిత్ర నిర్మాణ సంస్థ 'పీపుల్స్ ఫిల్మ్స్' చిహ్నం కూడా కర్మాగారంలో కార్మికులైన స్త్రీ పురుషులిద్దరు పిడికిలి బిగించి, చేతులెత్తిన బొమ్మ. రష్యాలోని మాస్కోలో రెడ్ స్క్వేర్ ప్రాంతంలో ఉన్న ప్రసిద్ధ విగ్రహం ఈ లోగోకు స్ఫూర్తి. వర్గ పోరాటం, ఆర్థిక అసమానత్వం, భూమి లేని కౌలు రైతుల లాంటి అనేక అంశాలతో అభ్యుదయ రాజకీయ ధోరణిని చూపెట్టిన ఈ చిత్రం పైనా సెన్సార్ కత్తెర పడింది. కోర్టులో హీరో చెప్పే ఇలాంటి డైలాగ్స్‌తో సహా సినిమాకు అనేక 'కట్స్' పడ్డాయి.

ఇక, తెలుగునాట కూడా కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని సమర్థిస్తూ వచ్చిన సినిమాల్లో అధిక భాగం పాలకుల చేతిలో పగ్గాలున్న సెన్సార్ బోర్డు ఇబ్బందుల్ని ఎదుర్కొన్నవే. కమ్యూనిస్టు సానుభూతిపరులైన నట – నిర్మాత మాదాల

రంగారావు 1970ల చివర నుంచి 1980ల దాకా చేసిన 'విప్లవ' సినిమాలు, ఆ తరువాత నట - దర్శకుడు ఆర్. నారాయణమూర్తి ఇప్పటి దాకా కొనసాగిస్తూ వస్తున్న 'అడవి బిడ్డల' అర్ధరాత్రి స్వతంత్ర పోరాట సినిమాలు స్వేచ్ఛగా గొంతు విప్పడానికి చాలా కష్టాలు పడ్డవే! సినిమాను జనం ముందు తెరపైకి తేవడానికి సెన్సార్ సర్టిఫికెట్ కోసం వీరంతా చాలాసార్లు వీధికెక్కి పోరాటం చేసినవారే!

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 1937 నుంచి 1939 వరకు రెండేళ్ళ పాటు కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలో ఉన్నప్పుడు సినిమాలపై రాజకీయ సెన్సార్‌షిప్‌ను దాదాపుగా ఆపేశారనే చెప్పాలి. అందుకే, మద్రాసులో ఆ సమయంలో దేశభక్తి ప్రధానమైన 'మాతృభూమి', 'విమోచనం', 'దేశభక్తి', 'త్యాగభూమి' లాంటి పలు తమిళ చిత్రాలు వచ్చాయి. తెలుగులో కూడా సమకాలీన సామాజిక, రాజకీయ వాతావరణాన్ని ప్రతిఫలించే 'మాలపిల్ల', 'రైతుబిడ్డ' లాంటి సినిమాలు వచ్చాయి. తీరా రెండో ప్రపంచ యుద్ధంలో భారతదేశాన్ని కూడా భాగం చేయడాన్ని నిరసిస్తూ, మద్రాసులో సి. రాజగోపాలాచారి నేతృత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం సహా దేశంలోని అనేకచోట్ల గద్దెపై ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వాలు రాజీనామా చేశాయి. కాంగ్రెస్ ప్రభుత్వం పోగానే, పోలీస్ కమిషనర్ చైర్మన్‌గా మద్రాసులో సినిమాలపై మళ్ళీ సెన్సార్‌షిప్ విధించారు.

రెండో ప్రపంచ యుద్ధ సమయంలోనే సినిమాలకు వాడే ముడి ఫిల్ము (రా స్టాక్)పై షరతులు పెట్టారు. సినిమాల నిడివి 11 వేల అడుగులకు మించకూడదని చలనచిత్ర రూపకర్తలకు ఆదేశాలిచ్చారు. అంతటితో ఆగలేదు... ముడి ఫిల్ము కోటాకు అర్హత పొందాలంటే, దర్శక, నిర్మాతలు తమ వ్యక్తిగత అభిప్రాయాల్ని పక్కనపెట్టి, యుద్ధాన్ని సమర్థిస్తూ సినిమా తీయాల్సిందేనని బ్రిటీషు ప్రభుత్వం తెల్చిచెప్పింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన దేశ సినిమాటోగ్రాఫ్ చట్టంలో మార్పులు వచ్చినా, రాజకీయ సెన్సార్‌షిప్ ధోరణి మాత్రం బ్రిటీషు కాలం నాటి అవశేషంగా మనల్ని అంటిపెట్టుకొనే వస్తోంది. రంగస్థలం నుంచి కెమేరా ముందుకు వచ్చిన ప్రముఖ తమిళ నటుడు శివాజీ గణేశన్ తొలి చిత్రం తమిళ 'పరాశక్తి' (1952). దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన అయిదేళ్ళకు వచ్చిన ఈ చిత్రం తమిళ సినిమా చరిత్రలో అత్యంత వివాదాస్పద చిత్రాల్లో ఒకటిగా నిలిచింది.

**సినిమాల నిడివి 11 వేల అడుగులకు మించకూడదని చలనచిత్ర రూపకర్తలకు ఆదేశాలిచ్చారు. అంతటితో ఆగలేదు... ముడి ఫిల్ము కోటాకు అర్హత పొందాలంటే, దర్శక, నిర్మాతలు తమ వ్యక్తిగత అభిప్రాయాల్ని పక్కనపెట్టి, యుద్ధాన్ని సమర్థిస్తూ సినిమా తీయాల్సిందేనని బ్రిటీషు ప్రభుత్వం తేల్చిచెప్పింది.**

పావలర్ బాలసుందరం రాసిన ప్రసిద్ధ నాటకం ఆధారంగా రూపొందిన ఈ సినిమా రెండో ప్రపంచ యుద్ధ నేపథ్యంలో రంగూన్‌లో ఉన్న ముగ్గురు అన్నదమ్ములు, మద్రాసులో ఉన్న వారి వితంతు సోదరి మధ్య నడిచే కథ. బ్లాక్‌మార్కెటింగ్, కొందరు పూజారుల ప్రవర్తన లాంటి అంశాల్ని హేతువాద దృక్పథంతో చర్చించిన ఈ సినిమాకు తరువాతి కాలంలో తమిళనాడు ముఖ్యమంత్రి స్థాయికి ఎదిగిన రచయిత ఎం. కరుణానిధి మాటలు రాశారు. చివరకు సెన్సార్ బోర్డ్ వారు ప్రత్యేక కమిటీ వేసి, ఆ కమిటీ చూశాక ఇచ్చిన సిఫార్సు మేరకు 'పరాశక్తి' రిలీజ్‌కు అనుమతించారు.

ఏకంగా ప్రభుత్వం నియమించిన సెన్సార్ బోర్డు సర్టిఫికెట్ ఇచ్చిన సినిమాయే ఆనక ప్రభుత్వ రాజకీయాలు, కోర్టుల జోక్యంతో నిషేధానికి గురైన ఉదాహరణలూ అనేకం ఉన్నాయి. తెలుగులో గూడవల్లి రామబ్రహ్మం దర్శకత్వంలో అస్పృశ్యత అంశంపై వచ్చిన 'మాలపిల్ల' (రిలీజ్ 1938 సెప్టెంబర్ 25) చిత్రం సెన్సారై, హాళ్ళలో రిలీజయ్యాక అగ్రవర్ణాల విమర్శలకూ, బహిష్కరణ ఒత్తిడికీ గురైంది. ఆ తరువాత రామబ్రహ్మమే తీసిన 'రైతుబిడ్డ' (రిలీజ్ 1939 ఆగస్టు 27) చిత్రమైతే, రిలీజయ్యాక కొన్ని ప్రాంతాల్లో నిషేధం బారిన పడింది. తెలుగులో నిషేధానికి గురైన తొలి చిత్రం ఈ 'రైతుబిడ్డే'!

ఇందిరా గాంధీ నేతృత్వంలోని కేంద్ర ప్రభుత్వం 1975 జూన్ 25న దేశంలో 'అంతర్గత ఎమర్జెన్సీ' విధించింది. సినిమాలతో పాటు పత్రికలూ ప్రచురణకు ముందే ప్రభుత్వంతో సెన్సార్ చేయించుకోవాల్సిన దురవస్థ వచ్చింది. తెరపై హింసాకాండ చూపినా తప్పు లేదు కానీ, రాజకీయ అంశాలు చూపించరాదన్నది ప్రభుత్వ ఆలోచన అయింది. వయొలెన్స్ చాలా ఉన్న హిందీ చిత్రం 'షోలే' (1975)ను 'యూనివర్సల్'గా అందరూ చూడవచ్చని 'యు' సర్టిఫికెట్ ఇచ్చారు. కానీ, కథానాయిక పాత్ర ఇందిరా గాంధీని పోలి ఉందంటూ,

పూనాలోని ప్రసిద్ధ ప్రభాత్ స్టూడియో తీసిన ఆ చిత్రం సెన్సార్ కత్తెరకు ముక్కలు ముక్కలైంది. చివరకు పేరు 'ధర్మాత్మ'గా మార్పించి, సెన్సార్ సర్టిఫికెట్ ఇచ్చారు. హీరో, హీరోయిన్ల ముద్దు సన్నివేశాల లాంటి వాటికి మాత్రం మూకీల కాలంలో సెన్సార్ సమస్య ఉండేది కాదు.

రాజకీయ కారణాలతో 'ఆంధీ' (1974) చిత్రం సెన్సార్ సర్టిఫికెట్‌ను సస్పెండ్ చేసి, సినిమాను కొంతకాలం నిషేధించారు.

ఆ కాలంలోనే 'ప్రత్యేక తెలంగాణ', 'జై ఆంధ్రా' ఉద్యమాల వేడిలో తీసిన 'తెలుగునాడు' (1975) చిత్రం అయితే, అసలు విడుదలకే నోచుకోలేదు.

**అప్పుడో రకం... ఇప్పుడో రకం!**

ఇలాంటి బోలెడు ఉదాహరణలు చూశాక- అర్థమయ్యేది ఒక్కటే... మన దేశంలో సినిమాలకున్న స్వేచ్ఛ కేవలం సాపేక్షమే అని! పాలక వర్గాలను బట్టి ఆ కొద్దిపాటి స్వేచ్ఛ తాలూకు స్వరూప స్వభావాలు మారిపోతూనే ఉన్నాయి. బ్రిటీషు పాలనా కాలంలో సినిమా సెన్సారింగ్ ప్రధానంగా రాజకీయపరమైనది. అప్పట్లో అంటరానితనం లాంటి అంశాలపై మహాత్మా గాంధీ ప్రబోధాల్ని తలపించేలా 16వ శతాబ్దానికి చెందిన సంత్ ఏక్‌నాథ్ జీవితకథతో 'మహాత్మ' (1935) అనే మరాఠీ సినిమా తీశారు. పూనాలోని ప్రసిద్ధ ప్రభాత్ స్టూడియో తీసిన ఆ చిత్రం సెన్సార్ కత్తెరకు ముక్కలు ముక్కలైంది. చివరకు పేరు 'ధర్మాత్మ'గా మార్పించి, సెన్సార్ సర్టిఫికెట్ ఇచ్చారు. హీరో, హీరోయిన్ల ముద్దు సన్నివేశాల లాంటి వాటికి మాత్రం మూకీల కాలంలో సెన్సార్ సమస్య ఉండేది కాదు.

కానీ, స్వాతంత్ర్యం వచ్చాక మొత్తం మారిపోయింది. జాతీయ స్ఫూర్తి హెచ్చి, పాశ్చాత్య సంస్కృతిని నిరాదరించాలనే భావం కలగడంతో, తెరపై ముద్దు సన్నివేశాలకు 'కట్' పడింది. 1980ల దాకా దాన్ని 'బూతు' అన్నారు. మరో పాతికేళ్ళ తరువాత పోస్ట్ లిబరలైజ్డ్ కాలంలో క్రమక్రమంగా ముద్దుకు తెరపై పర్మిషన్ వచ్చింది. కానీ, ఈ 2016 నాటికి పరిస్థితి మళ్ళీ మారింది. ఆ మధ్య కొన్ని చుంబన సన్నివేశాలు కట్ చేస్తే కానీ, ఇండియాలో ప్రదర్శించరాదంటూ దర్శక - నిర్మాత పంకజ్ నిహ్లానీ సారథ్యంలోని కేంద్ర ఫిల్మ్ సెన్సార్ బోర్డు ఒక హాలీవుడ్ చిత్రానికి అడ్డుకట్ట వేసింది. రాజకీయ అంశాలుంటే, సినిమాను బ్యాన్ చేయడం లాంటివి ఎమర్జెన్సీ రోజుల నుంచి ఇప్పటి దాకా కొనసాగుతూనే ఉంది. ఇలా దాదాపు నూరేళ్ళ కాలంలో సెన్సారింగ్ దృష్టి కోణం ఎన్ని రకాలుగా పిల్లిమొగ్గలు వేస్తూ వచ్చిందో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

**నిజం చూపిస్తే... నేరమే!**

మీడియా విస్తృతమై, సమాచార విస్ఫోటనం ఇంత జరుగుతున్న ఈ రోజుల్లో కూడా... దేశంలో ఉన్న పరిస్థితుల్ని తెరపై చూపెడితే, అదీ తప్పేనంటున్నారు. తాజాగా 2016లో విడుదలకు ముందు సెన్సార్ వివాదంతో సంచలనం రేపిన పంజాబీ చిత్రం 'ఉడ్తా పంజాబ్' అందుకు తాజా ఉదాహరణ. వాస్తవాలు గమనిస్తే, ఇవాళ దేశం మొత్తం మీద మాదక ద్రవ్యాలకు రాజధాని అంటే - పంజాబ్ రాష్ట్రమే. గతంలో పాకిస్తాన్ నుంచి డ్రగ్స్‌ను అక్రమ రవాణా చేసి పంజాబ్‌కు తెచ్చేవారు. అక్కడ నుంచి ఢిల్లీ, ముంబయ్ లాంటి నగరాలకు పంపేవారు. ఈ డ్రగ్స్‌లో అత్యధిక భాగాన్ని ఆ నగరాల నుంచి విదేశాలకు ఎగుమతి చేసేవారు. ఎందుకంటే, స్థానిక మార్కెట్ రేట్లతో పోలిస్తే, అంతర్జాతీయంగా దాదాపు వంద రెట్లు ఎక్కువ రేటు పలుకుతాయి. అయితే, ఇప్పుడు వచ్చిన పెద్ద సమస్య ఏమిటంటే, ఈ మాదక ద్రవ్యాల్లో అధిక భాగాన్ని స్థానిక ప్రజలే తీసుకుంటున్నారు. పంజాబ్, ఆ రాష్ట్ర సరిహద్దుల్లోని యువతీ యువకుల్లో కనీసం నూటికి 50 మంది ఏదో ఒక రకమైన మాదక ద్రవ్యాలకూ, మద్యానికీ బానిసలని ఆ మధ్య ఒక సర్వేలో వెల్లడైంది. ఇలాంటి వాస్తవ పరిస్థితులకూ, పంజాబ్‌లో తప్పుదోవ పడుతున్న యువతరానికీ అద్దం పడుతూ 'ఉడ్తా పంజాబ్' సినిమా తీశారు. అది అధికారపక్షానికి ఆగ్రహం తెప్పించింది.

**మొదట 40... తర్వాత 89... కట్స్!**

పంజాబ్‌లో కేవలం మరి కొద్ది నెలల్లో రాష్ట్ర శాసనసభ ఎన్నికలున్నాయి. ఈ నేపథ్యంలో పంజాబ్‌లోని డ్రగ్స్ ఉపద్రవంపై అభిషేక్ చౌబే దర్శకత్వంలో రూపొందిన 'ఉడ్తా పంజాబ్' సినిమా అధికారంలో ఉన్నవారికి ఇబ్బందికరమైంది. ఈ సినిమా గనక కట్స్ లేకుండా అలాగే రిలీజైతే తమకు కష్టమని రాష్ట్రంలో అధికారంలో ఉన్న శిరోమణి అకాలీదళ్ (కేంద్రంలో గద్దెపై ఉన్న బి.జె.పి. నేతృత్వంలోని నేషనల్ డెమోక్రాటిక్ ఎలయన్స్ (ఎన్.డి.ఎ)లో భాగస్వామ్య పక్షం)

భావించింది.

నిజానికి, మొదట ఈ సినిమాను సెన్సార్‌కు పంపినప్పుడు 'కేంద్ర చలనచిత్ర ధ్రువీకరణ సంస్థ' (సి.బి.ఎఫ్.సి. – దీన్నే జనసామాన్యంలో 'సెన్సార్ బోర్డ్' అని పిలుస్తుంటారు) 40 కట్స్ చేయాలంది. సినిమాలో వాడుతున్న భాష, పదజాలం, డ్రగ్స్ వినియోగానికి సంబంధించి ఈ కట్స్ ఇచ్చింది. అయితే, చిత్ర నిర్మాతలు దీనిపై అప్పీలు చేసుకున్నారు. కట్స్ లేకుండా, సినిమాకు 'ఏ' సర్టిఫికెట్ ఇస్తారని ఆశించారు. కానీ, సినిమా చూసిన కొత్త 'రివైజింగ్ కమిటీ' (ఆర్.సి) మరో అడుగు ముందుకు వేసి, ఏకంగా సినిమా పేరులో ఉన్న 'పంజాబ్' అనే పదాన్నే తొలగించమంది. మొత్తం 89 కట్స్ చేయాలని పేర్కొంది. అలాగే, పంజాబ్ రాష్ట్రం పేరు, రాజకీయాలు, ఎన్నికల ప్రస్తావన ఎక్కడ వచ్చినా వాటిని తొలగించాలని తెలిపింది., ఈ లోగా సెన్సార్ కోసమని సబ్మిట్ చేసిన సినిమా ప్రింట్ పైరసీ కాపీ చిత్రం రిలీజ్ కన్నా ముందే ఇంటర్‌నెట్‌లో వచ్చేసింది. ప్రభుత్వంతో తగాదా పడుతున్న సమయంలోనే, ప్రభుత్వానికి సెన్సార్‌కని ఇచ్చిన ప్రింట్ ఎలా పైరసీ అయి, ఎలా బయటకొచ్చిందన్న దానిపై నిజం ఎవరైనా ఎలాగైనా ఊహించుకోవచ్చు.

విచిత్రం ఏమిటంటే, ధూమపానం, మద్యపానం లాంటి వ్యసనాలపై పోరాటం దగ్గర నుంచి దేశ సరిహద్దుల్లో పాక్ తీవ్రవాదులపై పోరాటం దాకా ఏది జరిగినా – దాని ప్రభావం మన దేశంలో సినిమాలపై కనిపిస్తోంది. 2016 సెప్టెంబర్‌లో దేశ సరిహద్దులోని 'ఉడీ' ప్రాంతంలో నిద్రపోతున్న 18 మంది భారతీయ సైనికుల్ని దారుణంగా కాల్చిన పాక్ తీవ్రవాదుల చర్య కలకలం రేపింది. ఆ తరువాత మన సైన్యం పాక్ ఆక్రమిత కాశ్మీర్‌లోని ఉగ్రవాద స్థావరాలపై 'సర్జికల్ స్ట్రైక్స్' చేసింది. ఆ నేపథ్యంలో దేశం పట్ల ప్రేమ కాస్తా తీవ్రమైన భక్తిరూపం దాల్చింది. విచిత్రంగా సినీ రంగంలో పాకిస్తాన్‌ని తిరస్కరించని పక్షంలో దేశం పట్ల మన ప్రేమ ప్రశ్నార్థకం అవుతుందనే పరిస్థితి తలెత్తింది. స్నేహితుల లాగా నటించి, శత్రువులలా ప్రవర్తించిన పాకిస్తాన్ నుంచి నటనా సామర్థ్యం మనం నేర్చుకోవాలా? ఆ నటులు మనకు కావాలా? అన్న చర్చ మొదలైంది. భారతీయ సినిమాల్లో పాకిస్తానీ నటుల నిషేధమనే వాదన పైకి వచ్చింది.

**పాకిస్తాన్ కళాకారులు నటించిన సినిమాల నిర్మాతలు ఆర్మీ ఫండ్‌కు అంటూ కొన్ని కోట్లు చెల్లిస్తే కానీ, రాజకీయ నాయకులు ఆ సినిమాల విడుదలకు తల ఊపకపోవడం విచిత్రం! ఎలాంటి సినిమాలు తీయాలో, ఎవర్ని నటీనటులుగా పెట్టుకోవాలో నిర్దేశించడం ప్రజాస్వామ్య దేశంలో అత్యంత విషాదం!!**

మహారాష్ట్రలోని 'మహారాష్ట్ర నవనిర్మాణ సేన' (ఎం.ఎన్.ఎస్) మొట్టమొదట ఈ వాదన లేవదీసింది. హిందీ చిత్రసీమలో పనిచేస్తున్న పాకిస్తానీ కళాకారులు 48 గంటల్లో భారతదేశాన్ని విడిచిపెట్టి పోవాలంటూ, అల్టిమేటమ్ ఇచ్చింది. లేదంటే, బలవంతాన బయటకు నెడతామని హెచ్చరించింది. పాకిస్తానీ కళాకారులు నటించిన హిందీ ఫిల్మ్స్ కరణ్‌జోహార్ 'యే దిల్ హై ముష్కిల్', షారుఖ్‌ఖాన్ నటించిన 'రాయీస్'ల రిలీజ్‌లను కూడా అడ్డుకుంటామని కూడా బెదిరించింది. దీంతో, ఒక్కసారిగా కలకలం రేగింది. దేశభక్తిని ఎవరూ కాదనలేం కానీ, ఇలా కళారంగంలో స్వేచ్ఛపైఆంక్షలు విధించే మాటలు మాట్లాడడం విచిత్రమే.

దేశంలో సుదీర్ఘకాలంగా నడుస్తున్న నిర్మాతల సంఘం 'ఇండియన్ మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ అసోసియేషన్' (ఐ.ఎం.పి.పి.ఎ) సైతం ఆ భావాన్నీ, భాషనీ అందిపుచ్చుకుంది. ఇరుదేశాల మధ్య సంబంధాలు సాధారణ స్థితికి వచ్చేదాకా సరిహద్దు అవలి నటీనటుల్ని మన సినిమాల్లో పనిచేయనివ్వకుండా నిషేధిస్తూ, ఏకంగా తీర్మానమే చేసింది. పాక్ నటీనటులున్న సినిమాల్ని తాము రిలీజ్ చేయబోమంటూ కొన్ని రాష్ట్రాల్లో థియేటర్లు బ్యాన్ ప్రకటించాయి. చివరకు పాకిస్తాన్ కళాకారులు నటించిన సినిమాల నిర్మాతలు ఆర్మీ ఫండ్‌కు అంటూ కొన్ని కోట్లు చెల్లిస్తే కానీ, రాజకీయ నాయకులు ఆ సినిమాల విడుదలకు తల ఊపకపోవడం విచిత్రం! ఎలాంటి సినిమాలు తీయాలో, ఎవర్ని నటీనటులుగా పెట్టుకోవాలో నిర్దేశించడం ప్రజాస్వామ్య దేశంలో అత్యంత విషాదం!!

ప్రముఖ సినీ దర్శక – నిర్మాత ముఖేశ్‌భట్ చెప్పినట్లు, "ఈ దేశంలో అత్యంత విలువైన ఆస్తి – భావ ప్రకటన స్వేచ్ఛ. దాని గొంతు నులిమేస్తూ, దేశ పురోగతి గురించి ఎంత డబ్బా

కొట్టుకొన్నా అది అర్థం లేని పని" అన్నది నిజం. అయితే, స్వేచ్ఛాస్వరానికి అడ్డం పడాలని ప్రయత్నం జరిగినప్పుడల్లా, వాస్తవం అంతకు రెట్టించిన ఉత్సాహంతో మరో రూపంలో జనం ముందుకు వస్తూనే ఉంది. మేధావులైన దర్శక, రచయితలు ముందుకు తెస్తూనే ఉన్నారు. ఇది చరిత్ర చెప్పిన సత్యం! మన సినిమా చరిత్ర సాక్షిగా వెండితెరపై మనం తరచూ చూస్తున్న నిత్యసత్యం!! అదే మన దేశంలో ప్రజాస్వామ్యాన్ని నమ్మే స్వేచ్ఛాపిపాసులకు శ్వాస, ఆశ!!



**1972 'సిద్ధార్థ'**

పంపిణీ నుంచి నిషేధించిన తొలి చిత్రం. నటి సిమీ గరేవాల్ నగ్న సన్నివేశం కారణం. చివరకు 1996లో టీవీలో రిలీజ్ చేశారు.

**1975 'ఆంధీ'**

ఇందిరా గాంధీ జీవితంతో పోలికలున్నాయంటూ 'ఎమర్జెన్సీ' సమయంలో నిషేధించారు. ఆ తరువాత గద్దెనెక్కిన జనతా పార్టీ ప్రభుత్వం రిలీజ్‌కు అనుమతించింది.

**1978 'కిస్సా కుర్సీ కా'**

'ఎమర్జెన్సీ' సందర్భంగా సంజయ్ గాంధీ అనుసరించిన విధానాలపై రాజకీయ వ్యంగ్య చిత్రం. సినిమా మాస్టర్ ప్రింట్‌నూ, కాపీలనూ సెన్సార్ బోర్డు నుంచి బలవంతాన తీసుకెళ్ళి, కాల్చేశారు. తర్వాత కొంత కాలానికి సినిమా రిలీజైంది.

**1994 'బ్యాండిట్ క్వీన్'**

ఈ సినిమా వాస్తవానికి దగ్గరగా లేదంటూ మాజీ బందిపోటు రాణి ఫూలన్‌దేవి వాదన. దాంతో, ఢిల్లీ హైకోర్టు ఈ చిత్రాన్ని తాత్కాలికంగా నిషేధించింది.

**1996 'ఫైర్'**

హిందూ కుటుంబంలోని ఆడవారి మధ్య స్వలింగ సంపర్క సంబంధాల గురించి చూపారు. దాంతో దర్శకురాలు దీపా మెహతాను చంపుతామంటూ బెదిరింపులు వచ్చాయి. దాంతో, సెన్సార్ బోర్డ్ తలొగ్గింది. తర్వాత కొంతకాలానికి కట్స్ ఏమీ లేకుండానే సినిమా రిలీజైంది.

**1996 'కామసూత్ర... ఎ టేల్ ఆఫ్ లవ్'**

మీరా నాయర్ తీసిన సినిమా. దృశ్యాలు మరీ 'బాహాటంగా' ఉన్నాయని వాదన. చివరకు అవన్నీ బాగా తగ్గించేసిన వెర్షన్‌ను ఇండియాలో రిలీజ్ చేశారు.

**2003 'పాంచ్'**

1976 -77 ప్రాంతంలో జరిగిన జోషీ - అభ్యంకర్ వరుస హత్యల ఆధారంగా అనురాగ్ కశ్యప్ తీసిన సినిమా. సెన్సార్‌బోర్డ్ చాలా కట్స్ చేసి, చివరకు అనుమతించింది. చివరకు ప్రివ్యూ కాపీ ఆన్‌లైన్‌లో లీక్ అయిన తర్వాత కానీ, జనం సినిమాను చూడలేకపోయారు.

**2004 'బ్లాక్ ఫ్రైడే'**

1993 నాటి బొంబాయి పేలుళ్లపై తీసిన సినిమా. తీర్పుపై ప్రభావం చూపుతుందంటూ, నిందితులపై తీర్పు వెలువడే వరకు సినిమా రిలీజ్ ఆపేశారు. ఆనక 2007లో రిలీజ్‌కు అనుమతించారు.

**2005 'పర్జానియా'**

గుజరాత్ అల్లర్లపై తీసిన సినిమా. నేషనల్ అవార్డ్ వచ్చింది. కానీ, గుజరాత్‌లో నిషేధించారు.

**2005 'వాటర్'**

వారణాసిలోని వితంతువుల దీనావస్థపై దీపా మెహతా తీసిన సినిమా. ఉత్తరప్రదేశ్‌లో షూటింగ్ జరుగుతుంటే, ఛాందసవాదులు వచ్చి, సెట్స్ నాశనం చేశారు. చివరకు శ్రీలంకలో సినిమా తీయాల్సి వచ్చింది. 2007లో ఇండియాలో రీ-రిలీజ్ చేశారు.

**2013 'మద్రాస్ కేఫ్'**

రాజీవ్ గాంధీ హత్య, శ్రీలంక అంతర్యుద్ధంలో భారత జోక్యం చుట్టూ తిరిగిన సినిమా. పలు తమిళ గ్రూప్‌లు సినిమాను నిషేధించాలని పట్టుబట్టాయి. తమిళనాట ఈ సినిమాను ప్రదర్శించనివ్వలేదు.

**2015 'ఎం.ఎస్.జి - ది మెసెంజర్ ఆఫ్ గాడ్'**

పంజాబ్‌లోని 'దేరా సచ్చా సౌదా' అధినేత గుర్మీత్ రామ్ రహీమ్ సింగ్‌ను దేవుడిగా అభివర్ణిస్తూ, ప్రచారం చేసిన సినిమా. సెంటిమెంట్లను దెబ్బ తీస్తోందంటూ పలు సిక్కు వర్గాలు ఆందోళన చేసి, సినిమాను నిషేధించాలన్నాయి. 2015 జనవరిలో సెన్సార్ బోర్డ్ సర్టిఫికెట్ ఇవ్వలేదు. తర్వాత కొంతకాలానికి కట్స్‌తో ఓకే చెప్పింది.



ఇతర దర్శక, నిర్మాతలు కూడా కొన్నేళ్ళు ఇలాంటి సామాజిక సమస్యల ఇతివృత్తాలను పక్కనబెట్టి, నాటకీయమైన కుటుంబ, ప్రేమకథలనే ఎంచుకోవాల్సి వచ్చింది. ఏమైనా, నిషేధానికి గురైన తొలి తెలుగు సినిమాగా 'రైతుబిడ్డ' చరిత్రలో నిలిచిపోయింది.

### తెలుగు తెరపై తొలి నిషేధపు వేటు

తెలుగు సినిమాల్లో నిషేధానికి గురైన మొట్టమొదటి సినిమా – 'రైతుబిడ్డ'. సినిమా రిలీజ్‌కు ముందు అభ్యంతరాలేవీ లేవని సెన్సార్ బోర్డు ఈ సినిమాకు సర్టిఫికెట్ కూడా ఇచ్చింది. తీరా 1939 ఆగస్టు 27న 'రైతుబిడ్డ' రిలీజయ్యాక గొడవ మొదలైంది. ఈ చిత్రంపై వివాదం వెనుక రాజకీయ కారణాలు చాలానే ఉన్నట్లనిపిస్తుంది. అప్పట్లో చల్లపల్లి జమీందార్, మీర్జాపురం జమీందార్ల మధ్య వైరం ఉంది. మొదట్లో ఇద్దరూ 'జస్టిస్ పార్టీ'లోనే ఉన్నా, వైరుధ్యాలతో చల్లపల్లి రాజా బయటకొచ్చారు. 'ప్రజామిత్ర పక్షము' అనే పార్టీ పెట్టుకున్నారు. 'ప్రజామిత్ర' పత్రికకూ అండ అయ్యారు. ఆయన అండదండలతో వెలసిన 'సారథీ ఫిలిమ్స్' సంస్థ 'రైతుబిడ్డ' సినిమా తీసింది. అహంకారి అయిన జమీందారుకూ, రైతు ఉద్యమనేత అయిన మధ్యతరగతి రైతుకూ మధ్య సంఘర్షణ, ప్రజా ఉద్యమం చుట్టూ ఈ సినిమా నడుస్తుంది. నిజజీవితంలోని మీర్జాపురం జమీందారును దృష్టిలో పెట్టుకొని, 'రైతుబిడ్డ'లోని జమీందారు పాత్రను అల్లుకున్నారంటారు. అప్పట్లో వెంకటగిరి, బొబ్బిలి, పిఠాపురం జమీందార్లు జరీ టోపీలు పెట్టుకొనేవారు. కుక్కల్ని పెంచుకుంటూ, ముద్దు చేసేవారు. సరిగ్గా, ఈ సినిమాలో జమీందారు పాత్ర అలాగే ఉంటుంది.

### నిషేధానికి ముందు ఘర్షణలు:

సినిమా రిలీజ్ సందర్భంలో బొబ్బిలి, వెంకటగిరి జమీందార్లు వకీళ్లతో 'సారథీ' వారికి నోటీసులిచ్చారు. దాంతో, ఆ వకీళ్లకు సినిమా చూపెట్టారు. అభ్యంతరపెట్టదగినవేమీ లేవని వారు అభిప్రాయపడ్డారు. మద్రాస్ ప్రెసిడెన్సీలోని కాంగ్రెస్ సర్కార్ సినిమాపై జోక్యం చేసుకోలేదు. ఈలోగా 1939 సెప్టెంబర్‌లో రెండో ప్రపంచ యుద్ధం వచ్చింది. రాజాజీ నేతృత్వంలోని కాంగ్రెస్ సర్కార్ రాజీనామా చేసింది. అదే అదనుగా జమీందార్లు మళ్ళీ రెచ్చిపోయారు. రిలీజైన కొన్ని నెలలకు 'చక్కోసన్స్ టూరింగ్ టాకీస్' వారు నెల్లూరు జిల్లా వెంకటగిరిలో 'రైతుబిడ్డ'ను ప్రదర్శించబోయినప్పుడు జమీందార్ మనుషులు ఫిలిమ్ పెట్టెను ఎత్తుకుపోబోయారు. కుదరపోయేసరికి, లంచమిచ్చి, ప్రదర్శన మాన్పించాలని చూశారు. అదీ ఫలించక టూరింగ్ టాకీస్ డేరాకు నిప్పెట్టారు.

### ఎక్కడెక్కడ నిషేధం?:

జమీందార్ల ఒత్తిడి పుణ్యమా అని నెల్లూరు జిల్లా మేజిస్ట్రేట్ కాస్తా వెంకటగిరి జమీందారీ ఏరియాలో 'రైతుబిడ్డ' ప్రదర్శనపై నిషేధం విధించారు. తర్వాత బొబ్బిలి, మందసా, తర్ల జమీందారీలలో కూడా 'చూపరాని చిత్రం' అంటూ మద్రాసు ప్రెసిడెన్సీ సర్కార్ నిర్ణయించింది. వెరసి, విశాఖపట్నం జిల్లాలో, రామ్‌నాడ్ జిల్లాలోని సాతూర్ తాలూకాలో 1940, '41ల్లో నిషేధపుటుత్తర్వులు వచ్చాయి. సాక్షాత్తూ, 'రైతుబిడ్డ' చిత్రాన్ని నిర్మించిన చల్లపల్లి రాజా వారి సొంత జిల్లా అయిన కృష్ణాజిల్లాలో సైతం నిషేధం వేటు పడింది. ప్రభుత్వం ఆనాటి మద్రాస్ ప్రావిన్స్ మొత్తంలో ఈ చిత్రాన్ని నిషేధించినట్లు చాలామంది పొరపడుతుంటారు. కానీ, నిషేధం పెట్టింది పైన పేర్కొన్న జిల్లాల్లో మాత్రమేనని ఈ వ్యాస రచయిత పరిశోధనలో తేలింది.

స్వాతంత్ర్యం రాక ముందు 1947లో మళ్లీ 'రైతుబిడ్డ' వార్తల్లోకి వచ్చింది. చిత్రంపై బ్యాన్ ఎత్తివేయాలని సారథీ సంస్థ, సౌతిండియన్ ఫిల్మ్ ఛాంబర్‌లు అభ్యర్థన పంపాయి. అప్పటి నుంచి 1951 ప్రథమార్థం వరకు ప్రభుత్వశాఖలు నిషేధం ఎత్తివేతపై పదే పదే చర్చిస్తూ వచ్చాయి. జమీందారీ వ్యవస్థ పూర్తిగా లిక్విడేట్ అయ్యేదాకా నిషేధం ఎత్తివేయరాదని మద్రాస్ ప్రభుత్వం నిర్ణయించినట్లు అన్వేషణలో తేలింది. తర్వాత ఎప్పటికో నిషేధాన్ని స్వతంత్ర భారత సర్కార్ ఎత్తివేంది. నిషేధంతో వచ్చిన నష్టం, ఎదుర్కొన్న పరిణామాల తర్వాత రామబ్రహ్మం తన దూకుడు కొంత తగ్గించుకోవాల్సి వచ్చింది. ఇతర దర్శక, నిర్మాతలు కూడా కొన్నేళ్ళు ఇలాంటి సామాజిక సమస్యల ఇతివృత్తాలను పక్కనబెట్టి, నాటకీయమైన కుటుంబ, ప్రేమకథలనే ఎంచుకోవాల్సి వచ్చింది. ఏమైనా, నిషేధానికి గురైన తొలి తెలుగు సినిమాగా 'రైతుబిడ్డ' చరిత్రలో నిలిచిపోయింది. ◆

*With Best compliments from :*



# వెంకటాద్రి హాస్పిటల్

పువ్వాడ స్కూల్ ప్రక్కన, రింగ్‌రోడ్, విజయనగరం.

ఫోన్ : 08922-231688, 231588, సెల్ : 94400 18606



డా॥ ఎ.వి.ఎస్. ఉషారాణి M.D.

ప్రసూతి మరియు స్త్రీ వైద్య నిపుణులు



**Our Facilities :**

- Operation Theatre
- Infant Warmer
- Photo - Therapay
- Labour Room
- Generator Facility
- Lift Facility








డా॥ వై.వి. శివశంకరమూర్తి, M.D.

చిన్న పిల్లల వైద్యనిపుణులు



ఎ. రాములు, డైరెక్టర్,

వెంకటాద్రి హాస్పిటల్, విజయనగరం.

